శ్రీః

# అచ్చతెలుఁగుకోశము

## ప్రథమ సంపుటము



వ్యాకరణవిద్యాప్రవీణ ఉభయభాషాప్రవీణ
సాహిత్యాలఙ్కార సం[illegible]ప్రాప

**పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి**

తెనాలి



కృతిపతి

శ్రీ ఆవుల సాంబశివరావు

ప్రధాన న్యాయమూర్తి

(ఆంధ్రప్రదేశ్ - హైకోర్టు)

# కృతి ప్రదానము

కం శ్రీయును నాయువు శ్రేయము
పాయక వర్ధిల్లఁ దోన వర్ధిలుమయ్యా
శ్రీయావులసాంబశివ
న్యాయాధిపతిప్రధాన న్యాయ్యవిధానా

ఉ పుణ్యవధూమతల్లికలపూర్వచరిత్రలు తథ్య మంచు నే
పుణ్యచరిత్రనైజపరిపూతచరిత్రము చాటి చెప్ప నా
పుణ్యవధూమతల్లికకుఁ బుత్త్రుఁడ వైతివి బాపమాంబ కే
పుణ్యము చేసితో యెఱుఁగఁ బోలునె? యావులవంశరత్నమా

తే ధర్మకార్యంబు లెన్నియో తరతరాలు
నిలుచునట్లుగఁ జేసి తా వెలసినాఁడు
కీర్తికాయంబుతోడ నీక్షితిని నీదు
జనకుఁ డాదెన్న నీవంశ మనఘ మయ్య

తే ఆదినారాయణుం డన్నయట్టినామ
మాంధ్రమున నాయె నాదెన్న యనఁగ నిజము
సుప్రతిష్ఠితుఁ డయి దేవతాప్రతిష్ఠ
సలుపు టది సాక్షి నీతండ్రిసాటి యేరు?

మ తెలుఁగుందల్లి స్వతంత్ర యై వెలసి యాదేశంబు లీదేశముల్
కొలువంగా దొరసాని యై వెలయుకోర్కుల్ దీర్ప నీనాఁటి కీ
తెలుఁగుంగోశము నాంది యై వెలసె నీదే సూత్రధారత్వ మిం
దుల కోమిత్త్రిమ నీదుభాగ్య మది యెంతో పల్కఁగా నేర్తుమే?

గీ  ఆంధ్రభాషార్ణవంబు సత్యమలబుద్ధి
మందరంబున మథియించి మనఁగ జగము
చంద్రిక సృజించె నీకవిస్రష్ట దీని
నౌదలను దాల్పు సాంబశివయ్య నీవు

కం  ఈకృతి యాంధ్రావని కగు
నాకృతి సరి దిద్దితీర్చుననఘకృతీంద్రం
బోకృతి నాకృతి దీనిం
జేకొని సుకవీంద్రనుతులఁ జేకొనుమయ్యా

కం  కలకాల్ల మీనిఘంటువు
నిలయం బై కీర్తిరమకు నిత్యశ్రీతో
వెలయుచు జ్ఞానజ్యోతి
ర్విలసితముం జేయు గాత విశ్వము నెల్లన్

ఇట్లు
కృతికర్త
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

# తొలిపలుకు

## ఉపక్రమము

తెలుఁగువారము మనము తెలుఁగుదేశము మనది తెలుఁగునుడికారములు మనకుఁ గ్రొంగ్రొత్తలు అచ్చతెలుఁ గనిన మనకు సింహస్వప్నము మనము వ్యవహరించు తెలుఁగు సంస్కృతమయము ఏండ్లు పూండ్లు గడచినను నిజమగు తెలుఁగు తెలియుటకు వ్యవహరించుటకు మనము నోఁచికొన లేదు తెలుఁగువారికి వ్యవహారమునకుఁ జాలినంత తెలుఁగుబాస (అచ్చమైనది) లేదు పరభాషాదాస్యమే వారికి శరణ్యము అను వార్తలు గూడఁ దిన్నతిన్నఁగా నలుమూలలకుఁ బ్రాఁకుచున్నవి ఇది చాల శోచనీయము ఇట్టి దుస్థితినుండి తెలుఁగువారు విముక్తులగుట తెలుఁగుతల్లి యందచందములతో ముద్దులొలుకు మురిపెపుమాటలాడుచు నిజరూపమునఁ దెలుఁగునాట నింటింట సాక్షాత్కరించుట యేనాఁడా యని చిన్ననాఁటినుండి నేనుబలాటపడుచుందును అందులకైనదే యీకోశనిర్మాణము తెలుఁగువారికిఁ జాలినంత తెలుఁగుబాస కలదు వారు పరభాషాదాస్యమునకుఁ జేతులొగ్గవలసినది లేదు అని నిరూపించుకొనుట నాయుబలాటమునకుఁ బ్రథమ కర్తవ్యమైనది ఈకుతూహలము నాకీనాఁటిది గాదు అది ఫలరూపము తాల్చుట కింతకాలము గడవవలసి వచ్చినది తప్పినది గాదు కడచినది ఏనాఁడో నాయం దంకురించిన యాసంకల్పమునకైన పర్యవసానమే నేఁటి యీకోశావతరణము

## ప్రోత్సాహము

ఇందులకైన నాంది యిది స్వస్థానవేషా ఖలు నిజధర్మమేమని న్యాయమూర్తులు విజ్ఞులు సహ నగు శ్రీ ఆవుల సాంబ

శివరావుగారు మామిత్త్రులు వారిసవిధమున నే నొకప్పుడు ప్రసంగానుప్రసంగముగాఁ బై విషయమునుగూర్చి ప్రసంగించితిని వారు తమకును నట్టిసంకల్ప మేనాఁటినుండియో కలదనిరి అది తప్పక జరగవలసినపని యనిరి గాఢముగా న న్నిందులకుఁ బ్రేరేఁచిరి ప్రేరేఁచుటయే కాదు వారు నాకొక ప్రౌఢ్యనిఘంటువు నిందులకు బహూకరించి మోయరానిమోపొకటి నాతల కెత్తిరి నాకు వారకృత్రిమమిత్త్రులు కేవలము మిత్త్రులే కారు పరమాదరపాత్త్రులు వారివచన మనుల్లంఘనీయము కేవలము వారియభిలషితమే కాదు ఉగ్గుఁబాలతో నేర్పడిననాయభిప్సితము గూడ నిది అన్నియుఁ గలిసివచ్చినవి దేనికైనఁ గాలము గలసి రావలయు నందురు కలిసివచ్చినదికాఁబోలు మహాభార మిది మోయఁ జాలుదునా? దుర్బలుఁడనే యను శంకాతంకము లప్పుడు నాకు గోచరించినవి కావు ఆ మిత్త్రవత్సలతముల ప్రోత్సాహ మట్టిది వారినాజ్ఞాయథానువర్తనము నా కొక నూతనశక్తినిఁ జేకూర్చి యిచ్చినదేమో యా దనుటకు నో రాడ లేదు స్వల్పశక్తినైనఁ గొంటిని ఆరంభమైనది నా యత్నము

## గ్రంథనామకరణము

ఇది యొకనిఘంటువు అచ్చతెలుఁగుకోశ మనునది దీనికిఁ బేరు ఇది రెండుసంపుటములుగా విభక్తమైనది మొదటిసంపుట మిది రెండవసంపుట మిఁక రావలసి యున్నది ఇది పర్యాయపదకోశము అది పదకోశము

ఆంధ్రనామసంగ్రహాదులు గొన్ని (పర్యాయపదకోశములు) తెలుఁగున నున్నను జాలవఱకవి యసమగ్రములు లక్ష్మీనారాయణీయము వంటి పదకోశములు కొన్ని పదబాహుల్యముతో నిండి యున్నను బరిశోధితము గాని ఆంధ్రభాషార్ణవము మీఁదఁ జాలవఱ కాధారపడి మితి మీఱినయపభ్రంశములతో రూపొంది యున్నవవి అందులకే యీకోశము

ఆంధ్రభాషార్ణవమునకు వ్యాఖ్యగానే చాలవఱ కీ ప్రథమసంపుటము వెలసి యున్నది ఐనను దీనిని నేను ఆంధ్రభాషార్ణవ మన లేదు అచ్చ తెలుఁగుకోశ మనియే యంటిని ఇందులకుఁ గారణ మిది గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి అనున్యాయమున నేతద్వ్యాఖ్యాన మన్వాచయము గా (ఆనుషంగికము గా) నేను జరపినపని తెలుఁగువారికి భాషాదారిద్ర్యము లేదు వారిబాస వారికిఁ జాలినంత గలదు అని నిరూపించుటకై కర్తవ్య మన్వేషించునెడ నాకార్యనిర్వహణమున కిది చాలఁ జేదోడు వాదోడు గా నుండు ననిపించినది ప్రాచీనకావ్యోద్ధరణము మహాభాగ్య మనుకొనెడి నా కేతద్వ్యాఖ్యాకృత్యము స్వధర్మము గా స్ఫురించి తీర్థము స్వార్థము గలసివచ్చిన దన్నట్లిది రూపొందినది 'దీనికిఁ దో డేనాఁడో కాశీఖండ వ్యాఖ్యానము వ్రాయుచు నేను గొన్ని యచ్చతెలుఁగులకై యూష్మాంధ్ర భాషార్ణవమును బరిశీలించుట యిది యొక దారి తెన్ను లేనిది గా నుండి యసంగతము లగుపాఠములతో స్వరూపప్రదర్శనమునఁ జాల వెనుకపడి వికృతాకారముఁ దాల్చి యుండుట యావికృతరూపముతోనే నిఘంటువుల్లం దవతరించి నన్నుఁ జాలఁ గలవరపెట్టుట నాకు జ్ఞప్తికి వచ్చినది ఏతద్వ్యాఖ్యానిర్వహణమున నాంధ్రభాషాజనని శాణోల్లీఢ మగుమణియట్లు లోకయుజ్జ్వలాకారము ధరించి తనతేజఃప్రసారమున దశదిశలఁ దేజరిల్లఁ జేయు ననెడిదృఢవిశ్వాస మొకటి నా కేర్పడినది ఏతత్కార్యనిర్వహణమునఁ దెలుఁగుకృతు లన్నియు సులభము గాఁ దెలుఁగువారి కాస్వాద్యము లై తెలుఁగుదేశ మానందడోలిక ల నుఱ్ఱూఁత లూఁగు నని తెలుఁగుదన ముట్టిపడుజాతీయవ్యవహారము తెలుఁగువారికిఁ గరతలామలక మగు నని నేను భావించితిని అందులకే ఆమ్రాశ్చ సిక్తాః పితరశ్చ తృప్తాః అని నే నిందుఁ బ్రవర్తించితిని ఇఁక ఆంధ్రభాషార్ణవమును గూర్చి కొంత ముచ్చటించెదను

# ఆంధ్రభాషార్ణవము

ఆంధ్రభాషార్ణవ మను పేరు కవియే దీని కేర్పఱచినాడు అచ్చాం
ధ్రపదకోశము గా దీని నీతఁడు సంతరించినను ఆంధ్రభాషార్ణవ మిది
యనుట దోసఁగు కాదు లాక్షణికశిరోమణి యగు నప్పకవి ఆంధ్రభూమి
భవం త్వాంధ్ర మయ్యో శౌరి అని సాధారణము గా ఆంధ్రజనవ్యవహృత
మగు భాష యెల్ల ఆంధ్ర మని కేవలాంధ్రములు అచ్చతెలుఁగు లని
నాఁడు- నెలకొను సంస్కృతతత్సమ ములు దొంలక తజ్జ దేశ్యముల
మాఁటను సంధిలి కేవలాంధ్రములు నా నలరుకృతుల నచ్చతెలుఁగు
లంద్రు తెలుఁగునన్ (1 ఆ 110ప) ఈ కేవలాంధ్రమే యీకవిచే నిట ఆంధ్ర
మని వ్యవహరింపఁబడినది ఈ కేవలాంధ్రము నే సంస్కృతసమేతరం బలునయీా
భాష యచ్చ యనంబడు (బాల అచ్చ 1సూ) అని సూత్రించినాఁడు చిన్నయ
సూరి నన్నయ ఆంధ్రశబ్దచిన్తామణి యని తనవ్యాకృతికిఁ బేరిడి తత్స
మము తోడి తెలుఁగు ఆంధ్ర మనినను కేవలాంధ్రము న కాంధ్ర
శబ్దవ్యవహార మాతఁడు గా దన లేదు సంస్కృతపదేన పరిమిత మాంధ్రప
దం కర్మధారయో భవతి (ఆంధ్ర చి 70శ్లో) ఇట స్వల్పం కేవల వికృతి
పదం సంస్కృతపదేన సమస్య కర్మధారయసమాసో భవతి అనినాఁ డహో
బలపతి అథర్వణుఁడును దా నిచ్చటి పరిమితపదమును వివరించుచు ఆంధ్రం
షడ్వర్ణపర్యన్తం పదం స్యాత్కర్మధారయః అనినాఁడు సంస్కృతాంధ్రపదా
న్యత్ర సమస్యన్తే అనియు నాతఁ డను చున్నాఁడు మన యచ్చతెలుఁగుకృ
తులు గూడఁ జాలవఱకుఁ గేవలాంధ్రలక్షణము ననుసరించియే సాగినవి
ఇవి యన్నియుఁ దత్సమములతోడినామములనే తా ముంచుకొనినవి ఇది
యొకవిశేషము యయాతిచరిత్ర మీసందర్భమున నిట్లను చున్నది తెనుఁగు
నను మాఱుపేళ్ళిడి పెనఁచిన వినఁ గూడ దనుచు బిరుదులుఁ బేళ్లుఁ గా
మును వేల్పుబాసవెంబడి నునిచెదఁ గా దనకుఁ డయ్య యుల్లములందున్

(1 14) వేంకనార్యుఁడును దీనిఁ గా దనక తన యీకృతిని ఆంధ్ర భాషార్ణవ మనినాఁడు దీనినిఁ జూచి దీనికిఁ దరువాత వెలసిన మఱికొన్ని యచ్చతెలుఁగుకోశములు గూడ ఆంధ్రనామసంగ్రహము ఆంధ్రనామ శేషము వేంకటేశాంధ్రము ఆంధ్రపదపారిజాతము ఆంధ్రపదాకరము అనురీతినామములనే తాము ధరించినవి

ఆంధ్ర భాషార్ణవ మనునది దీని కన్వర్థనామము ఇంత సమగ్రమగు నిఘంటువు తెలుఁగునకు మఱి లేదు తెలుఁగుకోశముల కెల్ల నొజ్జబంతి యగు మహాకోశ మిది ఏకోశము లైనను దెలుఁగులయెడఁ జాలవఱకు దీనిపై నాధారపడియే తెలుఁగున సాగినవి సాగుచున్నవి పాఠకజనకంఠపాఠసౌలభ్యమునకై పర్యాయపదకోశములు గాఁ బద్యరూపమున మునుముం దవతరించినవి కోశములు సంస్కృతమున నమరాదు లిట్టివియే తెలుఁగున ని ట్లవతరించినవానిలోఁ బ్రథమగణనీయ మిదే దీనినిఁగూర్చి సూర్యరాయాంధ్రనిఘంటుసంపాదకులు (కీ శే) శ్రీ జయన్తి రామయ్యపంతులుగా రి ట్లనుచున్నారు తెలుఁగు నిఘంటువుల నుదాహరించి వా రను చున్నమాట లివి వీనిలో నెల్ల నాంధ్రభాషార్ణవ ముత్తమ మైనది ఇది సంస్కృతములోని యమరమురీతినిఁ గూర్పఁబడినది చాలవఱకు సమగ్ర మైన దని చెప్పవచ్చును (అని)

## అమరము-ఆంధ్రభాషార్ణవము

అమరము ననుసరించి యిది వ్రాయఁబడినను భాషాధోరణినిఁబట్టి దేశవ్యవహారాదులనుబట్టి యందు లేని వెన్నో యిం దుండుట యిందు లేని వెన్నో యం దుండుట జరగినది కేవలము దాని కిది ఛాయాధోరణిలో సాగినది గా లేదు లింగాదిసంగ్రహవర్గ మం దున్నది ఇందు లేదు క్రియావర్గ మిం దున్నది అందు లేదు తెలుఁగునకు లింగము సహజము కాదు ఆరోపి

తము విక్పృతా సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమా శ్చ నా ఽన్యే పుంస్యాః క్లీబ షణ్ఢా అమహద్వ్రత్ స్త్రీవత్సుస్త్రీ స్త్రీసమా స్సమా స్తు సమాః (ఆం చి అజ 22శ్లో) అందులకే యది యిందు విడువఁబడి యుండును సంస్కృతము నకు సమగ్ర మగు ధాతుపాఠము కావలసినంత యున్నది తెలుఁగునకది లేదు భాష కాయువుపట్టు క్రియ అందులకే క్రియావర్గ మిందుఁ జేరి యుండును దేశస్వభావాదులు గూడఁ గొంత కారణ మై వీనిని వేఱుపఱచినవి (చూ ఆయుధనాణకాదివ్యవహారవములు) ఐనను సామ్యము చాలఁ గలదు అమరమునకువలెనే దీనికిని మూఁడు కాండములు కాండమునకుఁ గొన్ని వర్గములు ఆవర్గములే యీవర్గములు పద్ధతి యంతయు నదియే చాల వఱకు దానినే యనుసరింపఁ జూచిన దిది

## సంస్కృతకోశము (ఆంధ్రభాషార్ణవము)

ఈయాంధ్రభాషార్ణవ మచ్చతెలుఁగుకోశమే యైనను నర్థనిర్దేశము నకై యీకవి యొసఁగినసంస్కృతపదము లిందుఁ జాలఁ గలవు ఇందువలన సంస్కృతకోశము గాఁ గూడ నిది రూ పొందినది ఎంతటిమహాపండితులకేని యెఱుఁగ శాలీమహౌషధుల కైనయెన్నోనామములు కృషి వాణిజ్యాదిపరికరముల కగునెన్నోయభిధానములు దైనందినవ్యవహారమున కైనయెన్నోభోజ్యపదార్థాదుల విశేషనామములు అవి యివి యన నేల? గీర్వాణవాణీ సర్వతోముఖ మగునొకవిశేషాకారముతో నిం దవతరించిన దనవచ్చును సందేహము లేదు దీనివలన సంస్కృతపాండిత్యము తలపూ వాడకుండ నాంధ్రుల కలవడు ననుట ముమ్మాటికి నిజము

ఈవేంకనార్యునినిఘంటుపాండిత్య మనితరసాధారణము (చూ తూపరాణము) ఈతఁ డుదాహరించిన అర్బుదఫలి మున్నగునవి యెంత పరిశోధిం

---

*తూపరము- చిల్లీ రరధ్రము (శ ర బ్రౌ) 2 కందరము- గుహ (సీ తూము ఘా ళిన గను దూపర మనఁగను కందరంబు (ఆం భా 45) అని సూ ని అనినది.

చినను నేఁటినిఘంటువులందుఁ గానరా కున్నవి ఇట్లని వేంకనార్యునిపాండిత్యము శంకింప వీలు కాదు సూ ని మొద లగునవి సం నిఘంటువులలోఁ గానరావన్న పదములు బృహన్నిఘంటురత్నాకరాదులందుఁ గాన వచ్చినవి (చూ 2 62 నాగిని మొ )

## కవి-గ్రంథారంభము

ఈ గ్రంథకర్తనుగూర్చి అశ్వాసాంతగద్యము అం భా పీఠిక దాని కగునావ్యాఖ్యానము వచించును ఐనను లాంఛనము గా నొకింత నుడువక తప్పదు నుడివెదను ఈ యాంధ్రభాషార్ణవకర్త ఉద్దండకవి సీతారామార్యుని తనూజుఁడు నామమున వేంకనార్యుఁడు వెలనాటిబ్రాహ్మణుఁడు రాయ రఘునాథరాయల యాస్థానకవి తండ్రియ ట్లితఁడును ఉద్దండకవి బిరుదాంకితుఁడు ఈతనిప్రభు వగురాయలు రాజకవి కవిజనోజ్జీవనియం దీతనిఁగూర్చి యాతఁ డి ట్లను చున్నాఁడు వేంకనకవీంద్రుఁ డుద్దండ బిరుదశాలి మమ్ముఁ గొలిచియుఁ గఠినసమస్య లొసఁగ నొప్పుకొని యేము పద్యముల్ సెప్పినంత నందఱును విని కృతి కిది యర్హ మనిన - అని అం భా గ్రంథావతరణసందర్భమున రాయ లితని కవితనుగూర్చి యిట్లు ప్రశంసించినాఁడు ఖచరీక చకుచవిచల ద్విచికిలహారప్రసన్నవీనమరంది ప్రచురరుచిఁ బెనఁగొనుఁ గదా కవి గా నీకవిత లెన్నఁ గవి వెంకనా (అం భా పీ 8ప ) ఉభయ భాషలయం దాటితేటి పద్యరచనయం దొక యుద్దండ కవీ యగుటయె కాక సర్వజ్ఞచక్రవర్తి యగు మహాపండితశిఖామణి గూడ నీతఁడు ఈతఁడు వ్రాసిన మల్లుపురాణ మిప్పటికిని వ్రాఁతయందే యున్నది ఇది జెట్లకుల శిరోరత్న మగు బిరుదు కుప్పాలుమల్లున కంకిత మీయఁబడి నది ఆకృతిపతి యీతని ని ట్లభినుతించు చున్నాఁడు అవాతాన్వయసత

ఇచ్చటి కందర శబ్దము గుహా పరము కాదు వివ రార్థకము కన్దరో ఽఙ్కుశే వివరే చ గుహాయాం చ అని (అమరసుధ ) ఈతనిపాండిత్య మిట్టిది

త్రం బావేదాంతము గఁ దెలిసినట్టికవీంద్రుండీ వొక్కఁడవె ధరాస్థలిఁ
గావున నీకవిత మిన్న కవి వెంకన్నా అని ఇఁక నీతనిఁగూర్చి వేఱు గా
మనము చెప్పనక్కఱ లేదు ఈతఁడు పార్వతీపరిణయ మను యక్షగాన
మొకటి రచించి మీనాక్షీసుందరేశ్వరులకుఁ గృతి యొసఁగెను తనప్రభు వగు
తొండమాన్ రాయ రఘునాథరాయల వంశావళిని తొండమాన్ వంశావళి
యను పేర సీసమాలికలో వర్ణించెను దీనిచేఁ బుదుకోట్టరాజ్యము దాని
చరిత్ర మనకు నేఁడు తేటతెల్ల మగును ఈతఁ డింతటి విద్వన్మహాకవి
యగుటవలననే ఆంధ్రకృతుల నెల్లఁ బరిశోధించి సేకరించిన యచ్చాంధ్ర
పదరత్నములతోఁ జక్కని కవితాస్రవంతిని మేళగించి యీయాంధ్రభాషార్ణ
వమును వెల్లివిరియఁ జేయఁ గలిగినాఁడు ఇం దున్న తెలుఁగుపదములు
చాలవఱకుఁ గ్రొత్తలు గానే మనకుఁ గాన్పించును సులభము గా మన
కవగతము లగు చున్న ఆమె-ఈమె వంటి పదము లూరక గ్రహించి
యీతఁడు గ్రంథము పెంచుకొనలేదు అట్లని తండ్రి అక్క అప్ప
ఆబిడ వంటివి వ్రాసిరా జన లే దీతఁడు ఈ పద్ధతినిఁ బట్టి పరిశీలించిన
ఆంధ్రవాఙ్మయము నఁ గవిప్రయుక్తము లై నవానినే బహుళము గా నీతఁడు
గ్రహించుటకుఁ బ్రయత్నపడినాఁ డనిపించును అయినను గ్రంథోప
యోగి (శిష్టసమ్మతము) అగువ్యవహారము నీతఁడు కాదన లేదు కనుకనే
యచ్చటచ్చట నీగ్రంథమం దీతఁడు వాడుదురు కవులు (ఆం భా 178)
పరువునేల యటంచు బలుకుదురు (ఆం భా 29) తన్ముఖంబున
పలక పేరు లాపరా యంచు జనులు పల్కఁగను వెలయు (1 154) అనురీతి
నచ్చ టచ్చట నను చుండును గ్రంథాదిని రాయ లీగ్రంథరచనకై యీ
తనిఁ బ్రోత్సహించినరీతియు నేతదనుగుణము గానే సాగినది - (కాన
ంబాయాంధ్రకృతులను గలుగునట్టి పదములకు నెల్ల నర్థ మేర్పడెడురీతి
నద్భుతంబు గఁ గృతినిఁ జేయంగ వలయు నర్థ మైన రసస్ఫూర్తి యగుట
యరుదె? (పి 11ప) రసవంతము లగు తెలుఁగుకృతులలో నచ్చతెలుఁగు

పదములు గొన్ని ముద్దుముద్దుగాఁ జేరి యర్థము తెలియరానందున రసస్ఫూర్తికిఁ బ్రతిబంధకము లగుచున్నవి అట్టి ప్రతిబంధము తీర్పఁగల మహాకృతి (మహానిఘంటువు) భారతాదిసర్వాంధ్రకృతుల పదపదార్థముల నిర్ణయించి చెప్పఁగలుగునది నిర్మింపఁబడవలయు నని రాయల ప్రోత్సాహము అందులకే యీ గ్రంథప్రవృత్తి సూర్యరాయాదినిఘంటువులఁ బరిశీలించి చూచిన వేంకనార్యుని యీ ప్రయత్నము కృతకృత్యమైన దని యక్షరాల మన మెఱుఁగ వచ్చును శ్రీకృష్ణదేవరాయాదుల యవ్వాంధ్ర జాతీయ ప్రయోగముల విప్పి చెప్పుటకై దీనినే ప్రమాణముఁ గాఁ గొనినారు చాలవఱకుఁ దద్వ్యాఖ్యాతలు ఇఁక వే ఱేల? ఇదిగాక ట్టియిటీవల నేను నన్నయతిక్కనలఁగూర్చి గ్రంథ మొకటి వ్రాయ సంకల్పించి ఆంధ్రమహాభారతము సాకల్యము గా మూఁడుమార్లు చదివితిని పలుతావుల వారిప్రయోగ సరణి నర్థము చేసికొనుటకు నాకిది యెంతో తోడ్పడినది అనుభవవేద్య మిది

## ఆం భా విధానము

ఇఁక ఆం భా కారుఁ డిం దవలంబించినవిధానమునుగూర్చి కొంత ప్రసంగించెదను ఈ గ్రంథోపసంహారణమున నొకపద్య మి ట్లున్నది-

అశ్రుతగ్రామ్య విస్మృత వ్యర్థ సులభ
శంకి తాలస్యనిర్ముక్త శబ్దవితతి
దక్క రచియించునీకృతి దయను గొనుము
మాతృభూత జగత్త్రయీమాతృభూత

తిరిచినాపల్లిమాతృభూతేశ్వరస్వామి కీ గ్రంథ మంకితము కావ్యదోషము లేమియు లేక నిరవద్యమైనయీకృతినిఁ గొను మనుట దీనికి వాచ్యార్థము (చూ నా ఆం భా పీఠికావ్యాఖ్య) ఐనను సూచనాప్రాయము గాఁ దా

నీ గ్రంథమునందలి పద్యగ్రహణమున నవలంబించినపద్ధతి గూడ నీకావ్యకర్త దీని
మూలమునఁ దెలిపినాఁ డనుట దోషము గాదు ఆ పద్ధతి యిది అశ్రుత
గ్రామ్యములు- ప్రయోగములందు శ్రుతములు గాని గ్రామ్యములు నింద్య
గ్రామ్యములు అనుట అవి యిందు గ్రహింపఁబడ లేదనుచున్నాఁడు విస్మృ
తములు-కవులచే నేమఱుపాటున నొకటికి మఱియొకటి గాఁ బ్రయుక్తము
లై పవిత్రాణికిని నిందు తావు లేదనినాఁడు వ్యర్థములు-ఛందోలక్షణపరిపూర
ణమాత్రమున కైనవి అవియును నిందు లేవనుచున్నాఁడు సులభములు-సాధా
రణము గా నరదుపాటులో నుండి చాపోటము గాఁ గవిప్రయుక్తములు కానివి
వానికిఁ గూడ నిందవకాశము లేదనినాఁడు శంకితములు-సందేహాస్పదము లై
నవి అర్థనిర్ణయమునకు సరిగా నవకాశమీక యాయర్థమా? యీయర్థమా?
యనునట్లు పొందుపడి యున్నవి అట్టివియు నిందు చేర్పఁబడ లేదను
చున్నాఁడు ఆలస్యనిర్ముక్తములు-అలసతచే (సోమరితనముచే) సరిగాఁ బరామ
ర్శించుకొనక యద్వా తద్వా భవతు అని అపి మాషం మషం కుర్యాచ్ఛన్దో
భఙ్గం న కారయే త్తనురీతినిఁ గవులు ప్రయోగించినవి అవియు నిందుఁ జేర
లేదనుచున్నాఁడు ఇట్టిది యీతని యీనిఘంటు ప్రణాళిక

ఈ గ్రంథపరామర్శనమున నిది చాలవఱకు సత్యమనియే యనిపిం
చును కొందఱు అశ్రుతగ్రామ్య అనుదానికి మిశ్రగ్రామ్యము లనుకొని
కాఁబోలు మిశ్రగ్రామ్యము లిందుఁ బ్రయుక్తములు కాలేదనుచున్నారు
పరిశీలించిన బాలసంగడము పాండవబీడు వంటి వీందు గృహీతము లైనవి
కొందఱు- అశ్రుత వేఱుచేసికావలయు గ్రామ్యము లిందు ప్రయుక్త
ములు గా లేదనుచున్నారు అప్పుడు అశ్రుత అనునది అప్రయుక్త
పరము కవులయందల్పప్రయుక్తము లైన వీందు గ్రహింపఁబడ లేదనవల
యును అప్పుడు మిశ్రగ్రామ్యము లీగ్రామ్యములందుఁ జేరవని గ్రామ్య
శబ్దార్థసంకోచము జరప వలయును అది యుచితమని నాకనిపింప లేదు
కవిప్రయోగము లైనంతమాత్రమున నన్నియుఁ బ్రమాణములు గావు కవు

లును భ్రమ ప్రమాదములు గలవారే అందులకే భ్రమప్రమాదములకుఁ దావీయని దైవానుగ్రహము హస్తగతమై శబ్దతత్త్వవేత్తలైన శిష్టులనే శబ్దనిర్ణయమునకుఁ బ్రమాణ మనినది శాస్త్రము (చూ నా పాణినీయము-కావ్యవాఙ్మయము )

ఇఁక మఱికొన్ని విశేషము లీతని గ్రంథావలోడనమున మనకు గోచరించును ఈతఁ డెందుఁ గొన్నిపట్టుల బహువచననిర్దేశ మొనర్చుచున్నాఁడు అది చాలవఱకు వివక్షితము (చూ కందుఱీఁగ అనంగఁ గణుఁదురు లనఁగాను (295 మొ ) వచననిర్దేశము వివక్షిత మగునప్పుడు కంఠోక్తము గా నేకవచన మై నిజమూలవాచ్యము లగును (241 ) . ఊసిళ్లు నాఁ గను బహుతచే నలరు చుండు (295) అనురీతుల నీతఁడు వచించుచుండును క్వాచిత్కము గా నీతని యీ(వచన) నిర్దేశము వివక్షిత మనవలసినపట్టులుగూడ (నేఁడు దొరకెడి ప్రయోగములఁబట్టి) కొన్ని గలవు ఇట్టి పట్టులఁగూడ నీతని దృష్టిలోఁ గేవలము బహువచనాంతము లవి కా వనిపించును అక్కడక్కడ నావ్యాఖ్యలో వాని నుదాహరించి వివరించితిని అతనికి నాఁ డెట్టిప్రయోగములు దొరకినవో మనప్రయోగపరిశీలన మెంతవఱకు సమగ్రమో విచారణీయము (పులకలు-మొ ఇట్టివి చూ 1141 మొ )

ఈతఁడు విశేషవాచకములు గా నిం దుదాహరించినవానిఁ గొన్నిటిని నానార్థములుగా నానార్థవర్గమున నుదాహరించునప్పుడు సామాన్యవాచకములు గా వచించినాఁడు (ఉదా -చోఱ-మొ చోఱ చోటు యనఁగను బరఁగు రాజీవంబు (ఆం భా 1159 ), తెలఁగుఁ జోటు యనంగ శిశుఝషములు (ఆం భా 344 నానా ) ఇట్టివి చూతము వృక్షు మనుట వంటివి (రాజీవము -(క్రూరమత్స్యము) చూ నావివ )

ఆం భా ఇచ్చిన విశేషవాచకములఁ గొన్నిటిని సాధారణవాచకములఁ గా (విశేషవివక్ష లేకుండ) అర్థనానుసంగ్రహాదు లిచ్చుచున్నవి. (చూ

తెరువాటుకాఁడు (2 29 మొ) ఆం భాలో దేవవర్గమున యౌగికములు గా నీతఁ డొసఁగినదేవతానామముల నాధారము గాఁ గొని తరువాతి పద్యకోశ కారు లూరక వీనినిఁ బెంచి పెద్ద చేసి తుద కసంభవము లివి యనునంతవఱ కును సాగినారు (ఉదా - తలిరువిలుకానివలన బి ట్టలసినట్టి మిటుకులాం డ్రకు గుబ్బచెమ్మట లడంచువితమరి (వేంక దేవ 15 మొ) ఈతఁడు యౌగికనామము లని తాను దేవవర్గముమొదల గట్టుల యెకిమీఁడు గన్న వాల్గంటినిఁ జెట్టపట్టుక యేలినట్టిదిట్ట అనురీతి నేనాల్గిటిరొ ప్రదర్శించి వీరి కిం దులకు మార్గదర్శి యైనాఁడు కవిప్రయుక్తములు సేకరించుటయుందే చాల వఱ కీతనిదృష్టి కేంద్రీకృత మైనందునఁ గవులు ప్రయోగించినయేకొలఁది పట్టులలోనో కాని యిట్టి విందు లే వన నగును

## పదగ్రహణరీతి

ఆంధ్రకృతులందుఁ గలిగినపదముల కెల్ల నర్థము విప్పిచెప్పుటకై ప్రవృత్త మైన దిది అందులకే దక్షిణాంధ్రకవులు ఉత్తరాంధ్రకవులు-అను విభాగము లేక కవిప్రయుక్తము లై సాధువు లై నశబ్దములఁ జాలవఱకు సంగ్రహింపఁ బ్రయత్నపడిన దిది పొంచడము అరగింపు లకోరి కొద్ది వంటి విందు గ్రహింపఁబడినవి పట్టుక లాజలు-వంటివి ప్రయుక్తము లై నవి కొంద అనుశాసనకర్తలు తమనాఁటి కివి సుప్రసిద్ధములు గాకయో తమ కంటఁ బడకయో మఱి యేకారణముననో వీనినిఁ దా మంగీకరింపక పోయినను దరువాతి లక్షణములు నిర్ధారకకవిప్రయోగములు వీనిని సాధువు లను చున్నవి (చూ అయాపదములకడ నైననావివరణము) మఱికొన్ని పదము లిం దిట్లు గానవచ్చు చున్నవి-

**చండ్లు:—** పాలిండ్లు చాచి గుబ్బ చను చన్ను చం డ్లనఁ గుచము చను (ఆం భా 2 137) ఇచ్చట- పాలిండ్లు చాచి గుబ్బ చను చన్ను చను లనఁ గుచములు చను అనుపాఠ మున్నను చను ఇచ్చి చను లనుట యుక్త

మనిపించుట లేదు ఇతరనిఘంటుసంవాదముగూడ నిట్లున్నది- చనులు గుబ్బలు చండ్లు చాచులు పాలిండ్లు చన్ను లనంగఁ గుచంబు లమరు (సాంబ మాన 19) ఒకటికి రెండు నిఘంటువు లేకకంఠముతోఁ దా మీ పారమే యిచ్చటిపాఠ మను చున్నవి అప్పకవి గ్రామ్య మిది యను చున్నాఁడు- గజయానచండ్లు బంగరుకుండ లన రాదు (1ఆ 118) ఒకలక్షణకర్త- చన్నులు గూడ గ్రామ్య మను చున్నాఁడు- పామరుల భాష గ్రామ్యము కోమలిచన్నులు గన్నులు గామునిపండువు లొనర్చెఁ గడువడి ననఁగన్ (నర 4ఆ 10ప) ఇచ్చటఁ గూడ చం డ్లనియే వ్రాఁత ప్రతిపాఠ మని పరిశోధకులు కవిప్రయోగము లిట్టి వున్నందుననే యీ నిఘంటుకర్త లిది గ్రహించి యుందురు అప్పకవి కది కానరాకయో లేక యది ప్రయుక్త మైనను బరిగ్రామ్యము గా దనియో పై రీతి నాతఁ డని యుండును ఒకలక్షణకర్త యీగ్రామ్యములనుగూర్చి యి ట్లనినాఁడు- తగిలి వర్ణంబు లెక్కువతక్కువలు గ నియమ మెడలించి పల్కునవియె తలంప గ్రామ్య మగు చుండె (సర్వ 1ఆ 2ప) ఇటువంటిగ్రామ్యపదంబు లయినను సుశబ్దంబు లగుట కుదాహరణము మహాకవిప్రయోగము అని మల్లెయు లంజెయు గద్దెయు నొల్లెయు ననుపగిదిపలుకు లొప్పు వటంచుం బొల్లెను మారయకేతన తెల్లంబు గ నవియుఁ గలవు త్రిపురారాతీ (సర్వ 1ఆ 9) ఒకలక్షణకర్తృకంటఁ బడనివి మఱియొక లక్షణకర్తకుఁ గానవచ్చి సాధువు లగు నని దీనివలనఁ దెలియ నైనది ప్రయోగ మన్వేషణీయము అన్వేషింపఁగా దీనికిఁగూడ ప్రయోగ మి ట్లున్నది కోవెలతముకుపై కొడు పులగతిఁ బొట్ట డోఁ కిచ్చ్రవేల్చండ్లు బోఁకినోరు (ప్రబం 622)(చూ సూ నితముకు)

కంసాలి —ఇది యీతఁడు గ్రహించినాఁడు సంస్కృతసమేతరము లయిన తెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది (బాల సం 16) అని(సూరి) ఇది గ్రామ్య మను చున్నారు వజ్ఝుల వారు కం

పాలజాతివాఁడు చాలఁ గీడు అని(భోజ 5 284) స్థిరతరకబిందువును గొన్నిచో ట్లఁ గలదు- ధురీణుభైరవుని శ్రితి కంరు తోలా క్కుం రేవ (త్రైశంకవో పాఖ్యానము అప్ప 5ఆ 154)మొ.

అట్టము- అహిళి -వంటి విందున్నవి జలధి వంటి వివి చాలసంగడము పాండ వలీడు అంతరదామర-వంటిమిశ్రగ్రామ్యము లిందుఁ జేరినవి దినవెచ్చము దిన బత్తెము వంటి వివి (సంస్కృతసమము లనిపించు వాకు నావ మజ్జనము వంటివి తెలుఁగులు గా ఇందు వచింపఁబడినవి వీనినిఁగూర్చి అచ్చటచ్చట వివ రింపఁబడినది (చూ నావివరణము) ఇఁక నీతని ఛందోధోరణినిగురించి యొకింత ముచ్చటించెదను

## ఛన్దోధోరణి

లడలకు యతిప్రాసముల నీతఁ డంగీకరించును- డవిణ యం చనఁగ నుల్ల సిలు డిండిమసంజ్ఞ(1కాం 127)మె జాలు నాఁగను విలసిల్లు గూడ యనఁగ (1కాం 157) ర-అల ప్రాస మితఁడు పాటించును- వేలు పెఱ యన నిత రాఖ్య మారవైరి (3కాం 24) మొ అఖండయతిగూడ నీతనికి సమ్మతము- మనుఁ దదస్థాన మంగిలి యన (2కాం 142)మొ సానుస్వారనిరనుస్వార ప్రాస మీతని కిష్టము 'కా టుగపిట్ట రువ్వపులుఁ గనఁ దనరు - (ఆం భా 2 91) క-ఖ-ప్రాస మొకటి యొకచోఁ గానవచ్చు చున్నది- కుంది కుందెన యనఁ గను గొఱలు వ్రీహ్యులూఖలము ముసల మెసఁగు రోఁకలియన (2 కాం 239ప) ఇట్టిదే బ-మ-లయతి యొకటి యొక్కెడఁ గాన్పించు చున్నది బాళి క్షేముడి మచ్చిక మక్కువ యన (1 136.) (దీనినిఁగూర్చి చూ నావివ రణము) ఇట్టి వెచ్చటను మఱి లేనందునఁ దగినంతపారాన్వేషణము జరపి యిటి యిట్టివే వైయివ ప్రబవూదవిశేషము లనఫలపి యున్నది సీసమాలిక గీతమాలిక యనువ్యవహార మున్నర్థ మెసరుచు పంచపాది షట్పాదిగాఁ గూడ గీతసీసములు ప్రయోగించినాఁ డీతఁడు (చూ 2 183 271 మొ) ఇట్టి

రచనలకు మార్గదర్శి తిక్కన యనవచ్చును (చూ భార శాం 4 354) మొయ్యము శాఖలయం దెక్కువ మక్కువ యాతని కున్నట్లు మన కాశ్వాసాంత పద్యములు వచించును ఇది యొక మహాప్రబంధము గానే యాతనిదృష్టిలో వెలసినది దీనినిఁ బద్యరూపమున నిట్లు రూపొందించి నిజముగా నీతఁ డుద్దండకవి నని చెప్పక చెప్పినాఁడు ఈతని కవితావైఖరినిఁబట్టి పదగ్రహణపద్ధతినిఁబట్టి పరిశీలించిన నీతఁడు చేమకూర వేంకనాదుల కోవకుఁ జెందినవాఁ డనిపించును ఇఁక నా కోశమున కైనస్వరూపస్వభావములు అందులకై నాపడిన పరిశ్రమము కొంత ముచ్చటించెదను

## నా కోశము - నా శ్రమము

## (కోశస్వరూపము)

ఆంధ్ర భాషార్ణవ మిది యగుటనుబట్టి దీని కైన వ్యాఖ్యానము నకు చంద్రిక యని నేను పేరిడితిని పాఠకజనసౌలభ్యమునకై రెండు భాగములు ( = అర్థము విశేషములు )గా దీనిని విభజించి అవి కలసి తాలుమ్రాలు గా కుండ వేఱు వేఱు గా నిందు వీనిని నే నుంచితిని

## మొదటిభాగము

ఆం భా పద్యములలోనిపదముల విభజించి పదస్వరూపములఁ బ్రదర్శించుచు వానికిఁ గవి యిచ్చినయర్థము వానికైననాయర్థవివరణము (ఆం భా ) పద్యములకు వెనువెంటనే నేను బ్రదర్శించితిని

ప్రబంధాదులయందు సుప్రసిద్ధములై లోకవిదితములు గాఁ గలసిన సంస్కృతాంధ్రపదములు గొన్ని యనావశ్యకము లనిపించినప్పుడు సరి యగు పర్యాయపదములు గా నవి యున్నప్పుడు నే నీవిభాగమున కంగములు గా

వానినిఁ జేర్చితిని బాగుగాఁ బరిశోధించి నేను నిర్ణయించుకొనినసిద్ధాంతితార్థ మునే యీ(యర్థ) వివరణముమూలమున వెలువరించితిని ఈవివరణమున కంగములు గా నాచూపినపదములు (సెమికోలన్) చిహ్నమున గుఱుతింపఁ బడి కవి నిర్దేశించిన యర్థమును వేఱుపఱచుచు నాయర్థవివరణముతోపా టివి ( ) (బ్రాకెట్)లాంఛనము గల వైనవి

అం భా కర్త యధికము గాఁ దనయర్థనిర్దేశమును సంస్కృతపదముల తోనే జరపినను దెలుఁగుపదములతోఁగూడ నిది జరపినపట్టులు చాలఁ గలవు మూఁడవకాండమునందలి క్రియావర్గమున కైనయర్థనిర్దేశము చాలవఱకుఁ దెనుఁగుననే నడచినది కావున నుభయభాషలతోను నిది యిందు జరిగిన దన వచ్చును కొన్నిపట్టులయం దీ వివరణమున నేను అం భా కర్త అర్థమునకై యిచ్చిన పదములను యిచ్చినట్లే యీయక సులభముగా నర్థము బోధ పడు టకై కొంతనావివరణమున మార్చితిని(ఉదా -) కలవరిం పనఁగను స్వప్న భాషణము గా జరుగు చుండును- అని (అం భా 1-142) ఇచ్చట స్వప్నమందలి భాషణము అని నేనంటిని చాలదీర్ఘములు గా నుండి యౌగిక ములు గా ఈయర్థమున కైన పదము లున్నప్పుడు వానిని గ్రహింపక తద ర్థమునే వివరించితిని (చూ 292 ఆరెబొట్టె మొ) సూ ని శ ర బ్రౌ - ఇచ్చినయర్థములు వివరణాపేక్ష లేనివి గా నున్నప్పుడు వారివాక్యము లను యథాస్థితములఁ గానే చాలచోట్ల నే నిందు గ్రహించుకొంటిని అవశ్యకము లగుపట్టుల వేఱు గా వివరించి వ్రాసికొంటిని నిఘంటుకర్తలసంప్రదాయ మిట్టిదే యగుటను దానిని నేను గా దన లేదు ఇందేకాక కొన్నితావుల నీని ఘంటువునందు నావ్రాఁతలలో నేను బరనసౌలభ్యమునకై నిఘంటు సంప్రదా య మని విసంధి నిఁ గా దన లేదు ధాతుజవిశేషణములమీఁద విసంధి వ్యా కరణసమ్మతము గాకపోయినను శ ర సూ ని జరపుటనుబట్టి నేనును జరపితిని శిష్టాచారమే యిందులకు శరణ్యము ఇది యవశ్యంభావి యనిపించినదిగూడ

ఆం భా కర్త యిచ్చిన పర్యాయపదములలో నేదేని యొకటి సుప్రసిద్ధమై సర్వజనవిదితము గా నున్నప్పుడు నేను వివరించినను నవేసవ మీయవలసి వచ్చినందునఁ బునరుక్తి యేల యని మరల దానిని నేను వచింప లేను చాల వఱకు ఉదా - ఒగ రనఁ దొగ రనఁ దగును గషాయంబు ( 04 వ ) ఇ.- ఒగరు తొగర- ఇవి కషాయమునకుఁ బేర్లు అని యే యం.వీని కషాయమునకు (ఒగరునకు) అని నే నవ లేను (ఇస్లే 48కుబునము-మొ) ఇది యంతయు నర్థవివరణమునకుఁ జెందిన దగుటను అర్థవివరణ మనిపించుకొని నది ఇది వావ్యాఖ్యకుఁ జెందిన మొదటిభాగము.

## రెండవభాగము

రెండవది యీక విషయవివరణము దీనినిఁ జర్చనీయము లగునాయాపద ముల నుట్టంకించుచు నాయావిషయముల నుదివితిని పాఠపరిశోధనాద్యనేక విషయపరామర్శ మిందు జరపితిని ఇందు పాఠభేదములు వాని కగుగుణదోష పరామర్శము అర్థవివరణమందలి యర్థనిర్ణయమున కైనయాధారములు, ఆయాపదముల కర్థనిర్ణయ మొనర్చుపట్టుల నాయానిఘంటుకారు లవలంబించి నమత భేదములు అర్థనిర్ణయమునఁ బదస్వరూపనిర్ధారణమున వారు వారు జరపి నయవకతవకలు, ఆయాపట్టుల నాయావిషయముల కైనయితరనిఘంటువుల సంవాదవిసంవాదములు, తదుదాహరణములు ఆవశ్యకము లగునెడలఁ గవిప్ర యోగములు అవశ్యంభావు లగువ్యాకరణాద్యంశములు- మొద లగునవి యెన్నియో గ్రంథవిస్తరభీతినిఁ జాల సంక్షిప్తములు గా సాగినవి

అచ్చటచ్చట నిందు అమరము- వైజయన్తి- విశ్వము- మొద లగు సంస్కృత నిఘంటువులు సాంబము వేంకటేశాంధ్రము ఆంధ్రనామసంగ్ర హము-మున్నగునచ్చ తెలుఁగుకోశములు అధికములు గాఁ గాన్పించి యివి

యింతగా విచ్చి రెండులకా? యనిపించును కాని, యవి యన్నియు నేయర్థ నిర్ణయమునకో, మటి యేపాఠపరిశోధనమునకో, యేదేనిమటియొకదానికో యచ్చట నావశ్యకము లయియే యుండును కొన్నిచోటులఁ బ్రసిద్ధపర్యాయ పదసంగ్రహమునకుఁగూడ నిది జరగినది. అనపేక్షితముగా నిం దొసఁగఁబడిన దేదియు లేదు. గ్రంథ మిప్పటికే చాలఁ బెరిఁగినందున, వానిని వివరించుట కవకాశ మేర్పడ లేదు

పాఠపరిశోధనమున సవరణలు గూడ నాకుఁ దప్పనివి గా నయినవి. కొన్నిపట్టుల వానినిఁగూడ నే నీవిషయవివరణమునఁ బేర్కొంటిని కొన్ని చోట్ల అమరాదులు, తద్వ్యాఖ్యలు కవిప్రయోగములు, నాయర్థమును సరిగా నిర్ణయించుటకు వివరించుటకే కాక, రూపాంతర ప్రకృతి ప్రదర్శనాదిప్రయోజనసంపాదనమునకుఁగూడ నవతరించినవి (చూ 1కాం 58ప) ఇచ్చట సూ వి. ప్రయోగ మొకటి యీయఁబడినది. 'నవుకు నకు నౌకు' అను (రూపాం) చూపుట మొఱ్ఱి యనుదానిని వివరించుట దీని కైనయవాంతర ప్రయోజనములు. ఇక్లే- ( . 41 ప. వ్యాఖ్య ) ఇచ్చట తన్ద్రీ నిద్రా ప్రమీలయోః' అని యమర ముదాహృతము 'తందర'కు 'ప్రకృతి' నిర్దేశము జరపుట, కవి యుద్దేశించిననిద్రావిశేష మెట్టిదో విప్పి చెప్పుట-యీ నిఘంటువువలన జరగినది (చూ అను ) ఇక్లే అచ్చటచ్చట నెఱుఁగునది.

ఈ కవి రూపాంతరప్రదర్శనమునకుఁ జాలవఱ కుపలక్షణవిధినే యాశ్రయించినాఁడు (చూ ఉయ్యాల-మొ ) నేనును నీతనిమార్గమునే యనుసరించి, దిఙ్మాత్రము గా నచ్చటచ్చటఁ గొలఁదిగానే వీనినిఁ బ్రదర్శించితిని గ్రంథవిస్తరభీతియే యిందులకుఁ గారణము. నిర్ధారకప్రయోగములే దొరకినంతవఱకు వీని కీయ యత్నించితిని

ఇందు పాఠపరిశోధనసందర్భమున, దోషము లేక సంగత మగుచు, నదియు నౌకపారముగాఁ బరిగ్రహింపఁ దగి యున్నప్పుడు- పాఠాంతర'మం

-టివి. అక్షరస్ఖాలిత్యమునకుఁ జెందిన వై ముద్రణప్రమాదము' లనఁ దగినప్పుడు 'అపముద్రితము' లంటిని అసంగత మై దోషయుక్తము గాఁ గాన్పించుచు ముద్రణప్రమాదమునకుఁ జెందినవి గా నవి లేనప్పుడుమాత్రము 'అపపాఠ' మంటివి దుష్టమో సాధువో వచించుట కాధారము లేనప్పుడు 'పాఠ' మంటిని ఇందు పాఠపరిశోధనమున కై ననాప్రణాళిక యిట్టిది. నావ్యాఖ్యాస్వరూప మిది ఇఁక నావ్యాఖ్య కనుగుణము గా నే నమర్చిన (ఆం భా ) పద్యములఁగూర్చి వచించెదను

## ఆం. భా. పద్యములు

శుద్ధపాఠములతో ముందు వీనినిఁ బ్రదర్శించితిని. ఈపద్యములందలి (తెలుఁగు) పర్యాయపదములకు , (కామా) చిహ్నములను, వాక్యార్థపరి పూర్తిసూచనకు , (సెమికోలన్) చిహ్నములను నే నుపయోగించితిని. పాఠకులు జాగరూకతో గుఱుతించుకొందురుగాక!

## వ్యాఖ్యాధోరణి

కొన్నిచోట్ల సూ. ని. శ. ర. (మొ.) వేఱు గాఁ బదములు గ్రహించి వను నా కవి యుక్తములు గాఁ గాన్పింపనప్పుడు (పాఠములు వేఱు గా జూపట్టు చున్నప్పుడు) తెందుల కై నయాధారములఁ జూపుచు వారికి భిన్నము గానే నే నిందుఁ బదగ్రహణ మొనర్పఁ గడఁగితిని (చూ. తలిబము-చెట్ల కొఱవి-మ్మొ )

(1) శయ్యాఖ్య పఱపు తలిపము దడిబము పాన్పు మెత్త యనఁ అని (వావి పా) (2 63 ).

(2) శయ్యాళ్య చెల్లు సెజ్జ పఱుపు తడిమము తడిబము పాన్పు (ఆం భా 2 163) అని ఒకచో (సూ ని చూ తడిబము)

(3) శయ్యాళ్య చెల్లు సెజ్జ పఱుపు దడిమము దడిబము పాన్పు మెత్త యు (ఆం భా 2 163) (ప్రాంత ప్రతిపా)-అని మఱియొకచో (సూ ని చూ దడిబము)

శ ర తడిబము తడిమము-గ్రహింప లేదు దడిబము దడిమము-గ్రహించి శయ్య పఱుపు అనునర్థము నిచ్చినది దీనిని బట్టి సూ ని (దడిబము కడ) ప్రాంత ప్రతిపాద మనినదే శ ర ఆం భా పాఠ మనవచ్చును ఇట బ్రౌ పా తడిబము తడిమము (చూ అను)

యయా ప్రయోగ మొకటి యిట్లున్నది ఱే తపాయపుందొగడలతోఁ దలివము లెక్కొడివెన్నెల పులుఁగులఁ గని తనుమదినిఁ బొదలువిరాళిన్ (యయా 2 88) ఇచ్చట సూ ని తలిమము అనుట ప్రమాదము (చూ శ ర తలివము) ఇఁక (సం తలిమమ్ ప్రా తలిమ) ఇచ్చట సూ ని తడిబము-తడిమము గ్రహించి ఈ ఆం భా ప్రమాణ మనినది పాఠము (2) ఇచ్చినది 'దడిబము దడిమము గ్రహించి సరళాదేశ ముతోఁ బ్రాంత ప్రతిపాఠ మనుచు పాఠము (3) ఇచ్చినది రెండును ప్రమాణము లగుట యెట్లు ఇది యిచ్చటిస్థితి ఇఁక నే నొకనిర్ణయమునకు వచ్చితిని నానిర్ణయ మిది-

యయా ప్రయోగము ప్రదర్శించు చున్న తలివము అనుదానికే డదయో రభేదః వబయో రభేదః అనురీతిని తడిబము (రూపాం) వావిపా తలిపము కాదు తలివము శయ్యాఖ్య - పఱుపు తలివము దడిబము పాన్పు మెత్త యనఁ ఇదియే యిచ్చటి శుద్ధపాఠము దడిబము అనుచోటి ద ఆదేశసరళముగాని సహజసరళము గాదు ఒకప్పుడు తలిమ అను ప్రాకృతరూపమునకుఁ బైయభేదరీతిని తడిమము (రూపాం)గా తడిబము సంగతము లగు ననుచో బ్రౌ పా పాఠాంతరము దడిబము, దడిమము అను ప్రాంత ప్రతిలోని రూపములు సరళాదేశసంజాతములు అన్యార్థమున దడిబము దడిమము-తెలుఁగున నుండవచ్చును అది వేఱు అంతమాత్రమున నివి సరళాదులు గా నక్కఱ లేదు

చెట్లకొలవి - చేట్లకొలవి దేవిణ నిర్భాగ్యుఁడు-అని (శ ర) సూ ని చిట్లుకొలవి - విణ (చిట్లు+కొలవి) చిటచిట్ల అనైదికొలవి తాపకారి బాధకుఁడు- అని కలువా శ ప్రయోగ మిచ్చినది సూ ని ఘటియుతర ప్రయోగము లేవియు నిందుల కుదాహరింప లేదు బ్రౌ. 'చెట్ల

వ్యాఖ్యాత అర్థవిర్ణయ మొనర్చుచుఁ దా మున్నపాఠము గొంతె మార్పవలసి యున్న దన్నప్పుడు వారు చెప్పినది నాకు సముచితము గా దనిపించు చున్నప్పుడు నే నాపాఠమును మార్పక యట్లే యుంచుకొంటిని (చూ కుట్టుతేలు)

కొరివి ఖలు డు-అని ఆం భా పా ను ప్రదర్శించు చున్నది (చూ అను) ఆం భా చిట్లుకట్టై-శరుడు అని వచింప చున్నది యీపద్యముననే (చూ 3 13) అది యిది వేఱు ఇట చెల్లకొఱవి అని స్పష్టముగా (వావి పా) ఇదియే నా కిచ్చటిసాధుపాఠ మనిపించినది సూ ని శ ర ల పాఠములు యుక్తము లని నా కనిపింప లేదు సూ ని కలువాళ ప్రయోగమునుబట్టి చిట్టుకొఱవి గ్రహించుట యుచితము గాదు కలువాళ ప్రయోగము చెట్లకొఱవి కాని చిట్లుకొఱవి కా దని నా కనిపించు చున్నది వంచ శరుం డొకప్రలయకాలయముండు చిన్నపెంపుడుచిల్క- చిట్లకొఱవి అని (కలువాళ 55వ) (చూ ఆర్ వేంకటేశ్వరకంపెని ప్రచురణము) చి చె గా వాఁతలలోఁ గాన వచ్చుట సహజము అందువలననే- చిట్లుకొఱవి అనునంస్కారమునకంటె చెట్లకొఱవి అను పరిష్కారమే యిట నుచిత మనుకొంటిని ఇఁక చిల్క- చెట్లకొఱవి యనుటలోని స్వారస్యము సహృదయు లూహింప లేనిది కాదు చెట్లకొఱవి దవాగ్ని నిలువునఁ దగులఁ బెట్టునది దయాదాక్షిణ్యములు లేక ప్రాణములు తీయునది 'దుర్జాతి యని యిట నర్థము చెట్లకు కొఱవి- ఆశ్రయనాశకము కృతఘ్నము- అనియు నిట అర్థాంతరస్ఫూర్తి ఇట్లు చెల్లకొఱవి యనుటకే యీప్రయోగము సాధక మగు చున్నది అందులకే నేను వావి పాఠమే సాధుపాఠ మంటిని సహృదయులు ప్రమాణము

*కుట్టుతేలు అనునది ఖలునకుఁ బర్యాయ మనినది (ఆం భా) (చూ 3 46) కుట్టుతే లనఁగఁ గంటకక్షుద్రు లగుదురు అని యీ ఆం భా పాఠ ముదాహరించి ప్రాఁతప్రతిపాఠ మిది యనినది సూ ని కుట్టుపేళ్లు - క్షుద్రశత్రువులు ముండ్లును- (o g) అనినది బ్రౌ (చూ అను) ఇట ఆము వ్యాఖ్య- కుట్టుతేళ్లు ఆం భా ముద్రితపాఠ మని వచించి ఈ తేళ్లు పేళ్లనుటకు వచ్చిన దేమో విచారణీయ మను చున్నది ఇట నాకు కుట్టుపేళ్లు అనుట యుక్త మనిపింప లేదు కొండి యున్నప్పుడు తేలు కుట్టును కొండి లేనప్పుడు తేలు కుట్టదు తేలుకొండి యని లాక్షణికవ్యవహారము దృష్టియందు లోకప్రసిద్ధము



పాఠము లేనప్పుడు, నిఘంటుకర్త లందఱు నేకముఖము గాఁ బ్రయోగారూఢ మిది యని ప్రయోగముల నుదాహరించు చున్నను, నిర్ధారక ప్రయోగములు గా నవి లేనప్పుడు, 'వృథాసంస్కార మేల' యని పాఠములు చూపు చున్న పదములనే యిందు నేను గ్రహించితిని (చూ సెగ్గెము) మొ (సెగ్గము) గ్రహింపఁబడ లేదు

కొన్ని నిఘంటువు లితఁ దొనర్చుకొనిన సకర్మకాకర్మక ప్రకరణ విభాగమును గమనింపక యీ ఆం భా.ను ఉదాహరించుచు విరుద్ధము గా సాగినప్పుడు, అందులకు వీ రిచ్చిన ప్రయోగములు ఆం భా కనుకూలము గా నెట్లు సమన్వయింప నగునో చూపి, ఆం భా ను బ్రమాణముఁ గాఁ గొని వీరు నిర్ణయించిన 'సకర్మకాకర్మకవిభాగము' ప్రమాద మంటిని (చూ కలిచెవ్-మొ ). ఇట్లు సాగినది నా వ్యాఖ్యాధోరణి

## పరిశ్రమము

నిఘంటువులు గొన్నిపట్టుల నర్థవివరణమునకై యితఁ డిచ్చినపదముల వ్వెల్లే యిచ్చి యూర కుండినవి వానిని వివరించుట సులభసాధ్యము గాలేదు వ్యాఖ్యాత నగునేను వివరింపక తప్పదు వివరించితిని (యుగి-మొ )

సూక్ష్మాతిసూక్ష్మములతో విశేషాకారమున వానివానిని వేఱుపఱచి, వానివానికిఁ దెలుఁగునామము లిచ్చుట యీనిఘంటురాజమునకై నయొక వైశిష్ట్యము (చూ 2 276 మొ ). ఒక్కొక్కచో నిట్టివానిని జాగరూకతతో

అందులకే నేను కట్టుపెట్ల గ్రహింపలేదు ఆము ప్రయోగముకూడ 'కట్టుకేలు' అనియే కా వచ్చును ప్రకరణమున కనుకూలము గానే యర్థసంగతి యున్నది సూ వి కూడ. ఇట 'కట్టుతేలు' అనఁ దగునా యని ప్రశ్నించినది (చూ గుట్టుకీడు )

గమనించి వ్యాఖ్యానించుట బహుపరిశ్రమసాధ్య మైనది (చూ. చెఱువు-కొలను) (బెలము-కన్నము మొ)

'చెఱువు-కొలను వే అనుచు వేఱు వేఱు గా వీనినామముల నిచ్చు చున్నది (ఆం భా) ఈ ఆం భా. నుదాహరించి యర్థము చెప్పుచు 'చెఱువు-కొలను సమానార్థకము లను నట్లు వ్యవహరించు చున్నవి నిఘంటువులు ఇక వీనికి భేదము చెప్పవలయును భేదము చెప్పినది (అమ) పద్మాకరస్తటాకోఽస్త్రీ కాసార స్సరసీ సరః అని ఇఁక వైజ ఆధారము 'తటాక మనుచు ఆధార స్తు తటాకో ఽస్త్రీ కాసార స్సరసీ సరః అనినది (అమ) ఆధారము తటాకము వే అనుచు ఖేయం తు పరి ఖాధార స్త్వమ్భసాం యత్ర ధారణమ్' అనుచున్నది సర స్తోయతటాకయోః అనుచు విశ్వము 'తటాక సరస్సులు' పర్యాయము లను చున్నది ఇఁక పద్మాకర స్తటాకో ఽస్త్రీ అనుదానిని వ్యాఖ్యానించుచు 'పద్మాగాధజలాశయస్య అనినది సుధ హ్రదవిశేషము లివి పద్మము లుండుట లే కుండుట యే వీని కీవ్యాఖ్యానమునుబట్టి భేద మనవలసి వచ్చు చున్నది 'కొలను-సరస్సు' పర్యాయము అని (ఆం భా) కాసార స్సరసీ సరః అనువో- కృత్రిమపద్మాకరస్య -అని సుధ దీనివలన (మనుజులు) త్రవ్విన చెఱువు (కొలను) అనుట చెప్పబడు చున్నది తటాకము సప్తసంతానములలో నొకటి అదియుఁ ద్రవ్వఁబడునదియే కదా ఈ చెప్పినభేద మెట్లు సంగతము? పంపాసరస్సు-మున్నగునవి కృత్రిమములా? అని తర్జనభర్జనములు ఆధారము. చెఱువు-అని (శర) వైజ కూడ ఈమాటే యనినది (ఆధారము)- జల ముండెడిచోటు-హ్రదాది-అని సాధారణము గా నుపక్రమించి హ్రదాదులను వేఱు గా నిచ్చినది యమరము '(జలాశయా జలాధారాః) త త్రాగాధజలే హ్రదః (అమ) 'గుంట, కొలను పర్యాయము అని (సాంబ మొ) గుంట అల్పతటాకము-అని (ఆం భా) ఇట్లు దారి తెన్ను లేనివి గా నివి సాగినట్లు కాన్పించి కలవరపెట్టినవి చివరి కిట్లు నిర్ణయ మొనర్పకొన వలసి వచ్చినది తటాక శబ్దము విశ్వమునుబట్టి సరోవాచక మొకటి వైజ నిఘంటువునుబట్టి ఆధారవాచకము (చెఱువును జెప్పునది) మఱియొకటి రెండును గలవు అమర మిచ్చిన తటాకము సరోవిశేషము నకుఁ జెందినది పద్మాకరః అనుట దానివే తెలుపును 'ఆధార స్త్వమ్భసాం యత్ర ధారణమ్ అనునది 'కట్ట వేసి నీళ్లు నిలిచినపెద్దగుంట (చెఱువును) జెప్పును వైజ దానినే-'ఆధార స్తు తటాకో ఽస్త్రీ అని వచించినది

వ్యవహారమున బాహాటము గా గోచరించు చున్నవానిని రూపాంతరములతో వేఱు గా వచించిన విందు చాలఁ గలవు అవి పెదపెద్దలనే భ్రమప్రమాదములకు గురి చేసినవి. వానియెడ జాగరూకత వహింపవలసి వచ్చినది ఇందులకు స్థాలీపులాకన్యాయమున నొకయుదాహరణము - కాటుగపిట్ట' కాటుకపిట్ట యని లోకవ్యవహారమున సుప్రసిద్ధము. ఈ గ్రంథకర్త దీనిని గ్రహింపక 'కాటుగపిట్ట యను చున్నాఁడు. కాటుగపిట్ట' యనియే యిచ్చట (వావి. పా.). సూ ని. కాటుకపిట్ట' గ్రహించి కాటుకపిట్ట రువ్వపులఁ గనఁ దనరు ఖంజరీటాభిధ' (ఆం భా.2 9 ) అని యుదాహరించినది ఇచ్చటిపాఠము 'కాటుకపిట్ట' యనినది జరిగిన ప్రాసయతిభంగమును గమనించుకొన లేదు 'కాటుకపిట్ట కూఁకటిగువ్వ' అని సాంబ (తిర్య. 8 ) మొద లగునవి యను చున్నను నిర్ధారకములు గా నవి లేవు ఇట్టియతిభ్రంశము లచ్చటచ్చట ఆం భా. పాఠములయెడ నిఘంటువులలోఁ గావచ్చును నావివరణమున వాని నరయ వచ్చును.

యెడ సూ ని కంటె ఇతర ఆధార శబ్దార్థనిర్ణయమున జాగరూకత వహించిన-దనిపించునది కనుకనే గుంట ను అల్పతటాక మనినది (ఆం భా ) దీనిని బట్టి పీటితోఁ దొణకిన లాదెడు పెద్దగుంట చెఱు వని ఆం భా అనుట స్పష్టమే నిండి యున్నదానిని 'తటాకము గా ఉన్నది-అని యనుట తెలుఁగువారికి నేఁటిది గాదు దీనికిఁ దోఁచు భారతాం వయోగ మిట్లను చున్నది చెఱువునకు మవిపినను బెను వెల మెకములు చెదరినను విపేకవిధీ యు క్కఁటి బహులసైన్య మతిముతిఁ బలచిన నా గంగ రాదు బలియుర కైనన్' (శిఆ 8 ) ఇఁక కొలను-అల్పసరస్సు- పడియ యను చున్నది(ఆం భా ) ఇఁక- పెద్దపడియ సరస్సు కొలను- నీరు నిలిచిన చిన్నపల్లము అను చున్నవి నిఘంటువులు అడవిలో ఉండె మడుగు - అని(బ్రౌ ) జలాధారవిశేషమే కొలఁకు కొలఁకులఁ గెలఁకులఁ గొమరారు నాను తలములఁ జలువలు తలకొల్పఁ బడెలఁ గడలఁ జప్పరములగతి నున్నమడల (నవ శివా ) (చూ సూ ని పడియ) ఆం భా దృష్టిలో పెద్దపడియలే కొలఁకులు' కొలను అనుదానికి మడుఁగు అను నర్థము గూడ నున్నది అది వేఱు ఇతర గుంట సరస్సు కొలను- అను చున్నది

పదవిభజనముగూడ నిం దంతసులభము గాదు. సారంగధరవ్యాఖ్య యొకటి ఉలుక్కు' 'లు' క్కని విభజించి (సూ ని) పొరపడిన దని తానే పొరపడినది. ఇట్టి వనేకములు సూర్యరాయాదినిఘంటువులు నైతము ఆం భా, పదవిభాగము నొక్కొ-కచో నిప్పటికిని సందేహాస్పదముఁ గానే వదలినవి (చూ. గుజాలి గోచ' మొ)

తెలుఁగున గజడదబాదేశము' 'గసడదవాదేశము' భ్రామకములు. పదస్వరూప నిర్ణయమున వీనికలవరపాటు చాల గొప్పది (చూ చౌతు-మొ)

ఇందలి -పద్యసమన్వయముగూడఁ జాల సావధానము గా జరపవలసి వచ్చినది బ్రౌణ్యము, సూ ని.వంటి నిఘంటువులే యిందుఁ బ్రమాదపడి, పదపదార్థముల నసంగతములఁ గా నిర్ణయించినవి (చూ కుసుమ2 237-మొ. బ్రౌ తటకాపాటు- 32-మొ.సూ.ని.)

వ్రాయసకాండ్ర వ్రాయసపుదొనఁగు లెన్నో యిందు వింతలు వింతలు గా దొరలినవి కూడలి యన సంభేదంబు' అనుటకు కూడలి యనఁ దద్భేద' మనురీతి వివి. వీని పరిశోధనమున నాకు (సూ ని) చాల సహాయపడినది.

నాయర్థవివరణమందు నే నాయాపదార్థములస్వరూపము గూడఁ గొంత విశదపఱపవలయు నని పీ లై నంతవఱకుఁ బ్రయత్నించితిని ఇందులకు బ్రౌణ్య మన్నిటికంటెఁ జాల నుపకరించినది

అర్థానుస్వారములు శకటరేఫములు తా మేమాత్రము మాఱినను నిందలిపదస్వరూపములు తాఱుమాఱు లై యర్థాంతములకుఁ దల యొగ్గును. జాగరూకతతో వానిని గమనించుకొనవలసి యున్నది నాకు సాధ్య మైనంతవ ఱకుఁ గా దన లేదు ఈయర్థానుస్వారములయెడ నేను సూ ని శ ర లనే చాలవఱ కనుసరించితిని కొన్నిచోట్ల పూబోడి' వంటివి యుదాహరించితిని.

3)

చిన్నయసూరి 'భిన్నార్థపీహిని స్త్రీ వాచ్యం భ్రగుచో నుపమానం ఋమీఁది మేనునకు బోడి యగు' అనియే సూత్రించినాఁడు (చూ. 1867 షం. మొదటిముద్రణము). ....మేనునకుఁ బోఁడి అనురీతినేఁటిముద్రణములు ప్రమాదభూయిష్ఠములు. ఇట్లగుచో 'చిగురుంబోణి' ఇత్యాదులు సిద్ధింపవు (చూ.బాల వ్యా. ఉద్ద్యోతము.). చిన్నయ 'మేను'నకు బోడి' ఆదేశ మగు ననుటకు (వసు 2.5 ) ప్రయోగ మాధార మై, అట్టి దవశ్యంభావి యను చున్నది. చిన్నయ నెఱ+నడుము- నెన్నడుము) అనుటయు నుచితమే గర్భవతి యగుగిరికను వర్ణించుచు 'నాళీకముఖికి నెన్నడుము గానఁగ నయ్యె. అని వసు.(3.20 )అనుచున్నది నిర్ధారకము గా. ఇట్టిదే 'నెమ్మది' ఇట్టి వాక్యక్కచో విస్తరభీతిని వివరింపక వదలితిని ఇట్టివి పాఠకులు ప్రమాదము లని తలఁప కుందురుగాక

తెలుఁగున కిప్పటి కేర్పడినవానిలోఁ గొంతకుఁ గొంత ప్రమాణము గాఁ దగినపెద్దనిఘంటువు (సూ ని.). అది యింకను గ్రహింపనిపదము లిందుఁ జాలఁ గలవు- (మెగ్గ, బూరుగ (శాల్మలి) మొ ). పాఠము ఇచ్చి గ్రహింపనివి గూడ నిందు బహుళముగా నున్నవి (చూ నిల్కడ' పెంపు' మొ ) 'క్షయః స్థానం చ వృద్ధి శ్చ' అని అమ. (తగ్గు)- గ్రహించి క్షయ మర్థ మిచ్చినది. పై రెండిటికి స్థానవృద్ధ్యర్థము లీయఁబడవలసి యున్నవి ఇట్టివాని యెడ శ్రద్ధ వహింపవలసి వచ్చినది.

పర్యాయపదకోశ మిది యగుటనుబట్టి దీనికి 'పదసూచిక' యొకటి యమర్చిన, మహోపకారక మగు నని నా కొకయూహ పొడమినది. ఇంచు మించు గా నెనిమిదివేలయచ్చతెలుఁగుపదము లిం దున్నవి ఇవిగాక, యీతఁ డర్థమునకై యొసఁగినసంస్కృతాంధ్రపదములు చాలఁ గలవు. ఇవి యిట్టుండ నక్కడక్కడ నా కావశ్యకము లనిపించి, యవి యివి నేను జేర్చినవి యధికములు గానే యిం దున్నవి. ఇవి యన్నియుఁ గలసి చాల నెక్కుడుసంఖ్యలోనే యిందుఁ గలవు నాయేర్పఱచినవిషయసూచిక, ఆం.భా.

ఒసఁగినపర్యాయపదములకు మాత్రము పరిమితము. ఈపదసూచిక యొకరూపము దాల్చుటకు నేను జాల శ్రమపడవలసి వచ్చినది.

నిఘంటు విది. ఇందు జరపవలసినవ్రాఁతపని చాలఁ గలదు. దీనికై కొందఱసాహాయ్య మపేక్షింపవలసి వచ్చినది. ఇదిగాక, పదసూచిక సరి చేసికొనుటకుఁగూడఁ బరాపేక్ష తప్పినది కాదు. వా రందఱకు నాకృతజ్ఞతాశీస్సులు.

ఈకోశరచనకై నశ్రమము కావలసినంత గలదు. ఒంటరివాఁడను నేను. ఏమిదోసఁగు లిందు పొసఁగినవో తెలియదు. పలువురు మహాపండితులు కావలసినంతసాధనసంపత్తితోఁ గలసిమెలసి పరిశోధించుకొని చేసినమహానిఘంటువులే యీ ఆం. భా. పరిశోధనమున నస్తవ్యస్తము లై ప్రమాదములపాలైనవి. అట్టిచో నే నిందు నెగ్గితి నని వచించుట కేవలము సాహసము.

ఈకృషియందు నా కెక్కువగాఁ దోడ్పడినది (సూ. ని.). దాని సాయమే లేనినాఁడు నే నీయర్ణవమునం దుక్కిరిబిక్కిరి గావలసినవాఁడనే! ఇందుండి నన్ను గట్టునకుఁ జేర్చిన దదియే! గ్రంథసామగ్రి తగినంత నాకు లభింపకుండుటనుబట్టి నాప్రయోగపరామర్శ మంతయు దీని నాధారముఁగాఁ గొనియే చాలవఱకు జరగవలసి వచ్చినది. ఆతరువాతిది బ్రౌణ్యము. ఈ నిఘంటుకర్తలకు నాకృతజ్ఞతాభినందనములు. వీ రేదో పొరవడి రని నే నచ్చట నచ్చట నెత్తి చూపుట దోషారోపణమునకై నాయొనర్చుచున్నది కాదు. ఈ గ్రంథపరిశోధనమునకై కడఁగిననాకుఁ, 'దండులార్థికిఁ దుషాపనయనమ' ట్లది యవశ్యంభావి గా దాపరించినది. ఇట్టివే వ్యాఖ్యానాదులయందలి నాదోషప్రదర్శనములుగూడ. ఇందులకు వీ రందఱు నన్ను మన్నింతురుగాక! ఇఁక రెండవకోశభాగమునుగుఱించి యొకింత ముచ్చటించెదను.

## రెండవకోశభాగము

పదకోశ మిది సంస్కృతపదములు చాలఁ దెలుఁగువారివ్యవహారమున భిన్నార్థకములు గాఁ దెలుఁగున్నాట రూపొంది తెలుగుకృతులందుఁగూడ నవి చేరి యున్నవి. ఆం.భా.కర్త అట్టివి కొన్ని గ్రహించి 'అచ్చతెలుఁగు' లని నాఁడు అట్టివాని నెల్ల వీలైనంతవఱకు సమగ్రముగా సేకరించి యిందుఁ బ్రదర్శించితిని

'అన్యదేశ్యము'లని మనము నేఁ డనుకొను చున్నవానినిఁ గొన్నిటి నీకవి గ్రహించినాఁడు ('నవారు'మొ). అట్టివానినిఁ గవులు ప్రయోగించినంతవఱకు వారివారిప్రయోగములు సరి గాఁ బరిశోధించుకొని యిందుఁ జేర్చితిని మనవ్యవహారమున నేఁడు గానవచ్చునన్యదేశ్యములకు, సేకరింపఁ గలిగినంతవఱకుఁ బర్యాయము లనఁ దగుతెలుఁగునుడులను సేకరించి యిందుఁ బ్రదర్శించితిని.

క్రియలయెడ (ఆం భా.) కొంత యసమగ్రత వహించినది ఇదికాక, ఈ క్రియలకు సంస్కృతపదములఁ బర్యాయములఁ గా నొసఁగుట మానినది. అందులకై చిన్నయసూరి 'ధాతుమాల' యని ప్రకటింపఁబడిన గ్రంథమును శోధించి ప్రయోగము లున్నంతవఱకుఁ జూపుచుఁ దదుద్ధరణ మొనర్చి, యందలిక్రియల నిందుఁ బొందుపఱచి, వానితోపాటు మఱికొన్ని క్రియలను గూడఁ జేర్చి (యీవర్గమునకు) వీలైనంతసమగ్రత సంపాదించితిని. శబ్దపల్లవములు, జాతీయములు, లోకోక్తులు-కవు లుపయోగించిన వెందుఁ జేర్చితిని రానున్న 'రెండవకోశభాగమున కగుస్వరూపస్వభావము లిట్టివి.

## ఉపసంహారము

ఆంధ్రుఁడ నై యాంధ్రజననిఋణము తీర్చుకొనుట యెట్లా? యని దినదినము తహతహలాడునా కీ యాంధ్రభాషార్ణవము, నేఁటి కొత్తత్రోవ

యేర్పఱచినది జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ' అనికదా! పెద్ద లందురు. ఈ ప్రథమకోశభాగావతరణమున నేను గొంత మాతృఋణము తీర్చుకో గలిగితి నని భావించు చున్నాను. దీనియం దింకను జరపవలసినపని లేక పో లేదు ఈపదముల కన్నిటికి భారతాదిపరిశోధనమునఁ బ్రయోగమ్ము లెత్తి తగును దాహృతుల నిచ్చుట, వీనికిఁ దగినరీతిని వ్యుత్పత్త్యాదులఁ బరిశీలించుట యన్ను నవి మిగిలి యున్నవి. ప్రభుత్వసాహాయ్యము తగినంత లేక యది సాధ్యము గాదు ఇఁక దానికి స్వస్తి. నాపని యైనట్లే ఎందఱో బుద్ధిమంతు లుండియు నీకోశ మిట్లు పరిష్కృతము గాక నేఁటివఱకు వేఁచియుండుట నాకౌఱకే, ఆంధ్రభారతి న న్ననుగ్రహింప నెంచినది ఆమెకరుణాకటాక్షమున నైనదే యీకోశరచన.

## కృతజ్ఞత

ఇఁక నీగ్రంథప్రచురణభార మొకటి యున్నది. ఇది నాకు సాధ్య మగు పని కాదు శ్రీ శ్రీ (మన) ఆంధ్రరాష్ట్రప్రభుత్వమువారు నా కిందులకుఁ దగినయార్థికసాహాయ్య మొనర్చి చాలఁ దోడ్పడిరి. వారియాంధ్రాభిమా నమునకు గుణజ్ఞతతోడియౌదార్యమునకు విజ్ఞతతోడి సహృదయతకు నా సహస్రకృత్వోఽభినందనములు వీరు నాకుఁ జిరస్మరణీయులు. ఇందులకు వీరికి నేను గలకాలము కృతజ్ఞుఁడను.

ఈగ్రంథ మిట్లు నేను సంతరించుటకు నిజము గా కారణభూతులు మా ప్రియమిత్త్రులు, న్యాయాధికారులు, సహృదయులు అగు శ్రీ శ్రీ ఆవుల సాంబశివరావుగారు, వారు న న్నిందులకుఁ బ్రోత్సహించి నాచే నీమహా కార్యము జరపించి రని ముందు నుడివితిని, మరల నుడువు చుంటిని. వారికి నాకృతజ్ఞతానివేదనములు ఇందులకే యీకృతిరత్నము వారి కంకిత మైనది వా

శ్రీకృతివతంసముతో చంద్రికతోఁ జంద్రుఁడట్లు లాకల్పస్థాయులై వెలయుదురుగాక!

ప్రభుత్వము, మన్మిత్త్రులు, ఆంధ్రప్రజానీకము నాకుఁ దోడ్పడి, తగిన ప్రోత్సాహ మొసఁగిన, నచిరకాలముననే రెండవకోశభాగమును గూడ నే నాంధ్ర భాషాజనని 'కొకయమూల్యరత్నోపహారముఁ'గా సమర్పించుకొని మాతృఋణమునుండి నిశ్శేషముగా విముక్తుఁడ నయ్యెదను. ఈఋణవిముక్తికై ప్రభుత్వమును నస్మన్మిత్త్రులను, బ్రజానీకమును నేను మరల మరల నభ్యర్థించుచున్నాను. మహాగ్రంథోద్ధరణ మిది. అందును దెలుఁగువారికై నస్వధర్మ మిది. వేఱుగా నే నికఁ జెప్పవలసినది లేదు

దీనిముద్రణమునకై నాపడినశ్రమ మనుభవైకవేద్యము దీనిముద్రణమునకుఁ దోడ్పడినముద్రణాలయాధికార్లు లందఱకు నాకృతజ్ఞతాభినందనములు.

ఇఁక, నిమిత్తమాత్రముగా నన్నుంచి యీకార్య మిట్లు నిర్వహించిన జగజ్జనని పరమేశ్వరికి నా పునఃపునస్సాష్టాంగదండప్రణామములు. ఆ పరాశక్తికి నాసమర్పించుపుష్పాంజలి యిదిగో. ఇదె

స్వస్తి

## విషయసూచిక
(గ్రంథమునకు)





[illegible]

# వర్గసూచిక (ప్రథమసంపుటమునకు)

## ప్రథమకాండము



## ద్వితీయకాండము

# సంజ్ఞా వివరణ పట్టిక

| సంకేతములు | వివరణము |
| --- | --- |
| ఉ పు బ | ఉత్తమపురుషబహువచనము |
| ఏ వ | ఏకవచనము |
| ఔ | ఔపవిభక్తికము |
| క. | కన్నడము |
| కాం | కాండము |
| కావ్య | కావ్యప్రకరణము |
| క్రి. / క్రియా | క్రియాపరిచ్ఛేదము |
| ఖగా. | ఖగాధ్యాయము |
| క్షత్రి. | క్షత్రియవర్గము |
| చూ | చూడుము |
| త | తమిళము |
| తద్ధి | తద్ధితప్రకరణము |
| తాళ ప్ర పా | తాళప్రతిపారము |
| తి | తిర్యగ్వర్గు |
| తృతీ. | తృతీయతరంగము |
| దీక్షా | దీక్షాప్రకరణము |
| దేవ | దేవవర్గు |
| ద్రో. | ద్రోణపర్వము |
| ధర్మ. | ధర్మకర్మాధ్యాయము |
| నాట. | నాటకప్రకరణము |
| నానా | నానార్థవర్గము |
| పం | పంక్తి |

| సంకేతములు | వివరణము |
|---|---|
| ప. | పద్యము |
| అచ | అచరవర్గము |
| అజ | అజన్తపరిచ్ఛేదము |
| అధి | అధికరణము |
| అధ్యా | అధ్యాయము |
| అను | అనుబంధము |
| అనౌ. | అనౌపవిభక్తికము |
| అన్త | అన్తరిక్షకాండము |
| అపపా | అపపారము |
| అపముద్రి. | అపముద్రితము |
| అర్ధ | అర్ధవల్లిజ్ఞాధ్యాయము |
| అర్థాం | అర్థాంతరము |
| అవ్యయీ. | అవ్యయీభావము |
| అవ్య వ. | అవ్యయవర్గము |
| అంశ | అంశము |
| ఆచా | ఆచారకాండము |
| ఆచ్ఛి | ఆచ్ఛికపరిచ్ఛేదము |
| ఆది | ఆదిపర్వము |
| ఆది | ఆదిదేవాధ్యాయము |
| ఆర | ఆరణ్యకాండము |
| ఆశ్వా. | ఆశ్వాసము |
| ఉ | ఉత్తరభాగము |
| ఉ | ఉణాది |
| ఉదా | ఉదాహరణము |
| పరి | పరిచ్ఛేదము |
| పర్వ | పర్వతప్రకరణము |
| పశు | పశుసంగ్రహాధ్యాయము |

| సంకేతములు | వివరణము |
|---|---|
| పా. | పాఠము |
| పా ఖం | పాతాలఖండము |
| పారాం | పారాంతరము |
| పాతా | పాతాలాధ్యాయము |
| పీఠి | పీఠిక |
| పురా | పురాధ్యాయము |
| పూ | పూర్వభాగము |
| పౌ | పౌరట |
| ప్ర | ప్రకరణము |
| ప్ర. | ప్రయోగము |
| ప్రకీ. | ప్రకీర్ణపరిచ్ఛేదము |
| ప్ర పు బ | ప్రథమపురుషబహువచనము |
| ప్రా | ప్రాకృతము |
| ప్రా ప్ర పా | ప్రాతప్రతిపారము |
| ప్రా<br>ప్రాయ | ప్రాయశ్చిత్తకాండము |
| బ వ<br>బహు | బహువచనము |
| బాల | బాలకాండము |
| బ్రా | బ్రాహ్మణాధ్యాయము |
| భీ | భీష్మపర్వము |
| భూతా | భూతాధ్యాయము |
| భూ<br>భూమి | భూమికాండము |
| భ్వా ప సే | భ్వాదిపరస్మైపదిసేట్టు (ధాతువు) |
| మను | మనుష్యాధ్యాయము |
| మ పు బ | మధ్యమపురుషబహువచనము |

| సంకేతము | వివరణము |
| --- | --- |
| మాన. | మానవవర్గు |
| మి. వి. | మిశ్రవిశేష్యము |
| మిశ్రని. | మిశ్రనిఘంటువు (బ్రౌన్) |
| మి స. గ్రా. | మిశ్రసమాసగ్రామ్యము |
| ముద్రిపా. | ముద్రితపారము |
| మొ | మొదలగునవి |
| మౌ. | మౌసలపర్వము |
| యు కా. | యుద్ధకాణ్ణము |
| రూపాం. | రూపాంతరము |
| వా. | వార్తికము |
| వావి.<br>వావి. పా | వావిళ్లవారిపారము |
| విక్ృ | వికృతి |
| విరా | విరాటపర్వము |
| వేద పా | వేదమువారిపారము |
| వై | వైరాగ్యశతకము |
| వై గ్రా. | వైకృతగ్రామ్యము |
| వై గ్రా. వి | వైకృతగ్రామ్యవిశేష్యము |
| వైశ్య | వైశ్యవర్గము |
| వ్య<br>వ్యవ | వ్యవహారము |
| వ్యవ కాం. | వ్యవహారకాండము |
| వ్యా | వ్యాఖ్యానము |
| శ.<br>శబ్ద | శబ్దపరిచ్ఛేదము |
| శాం. | శాంతిపర్వము |
| శూ.<br>శూద్రా. | శూద్రాధ్యాయము |

| సంకేతములు | వివరణము |
| --- | --- |
| శ్లే. | శ్లేష స్తబకము |
| శ్లో | శ్లోకము |
| స | సర్గము |
| సం | సంస్కృతము |
| సభా | సభాపర్వము |
| సమా | సమాసపరిచ్ఛేదము |
| సమా | సమాసము |
| సా | సామెత |
| సాధుపా / సా పా | సాధుపారము |
| సామా | సామాన్యకాండము |
| సుం | సుందరకాండము |
| సూ | సూత్రము |
| సౌ | సౌప్తికపర్వము |
| స్కం | స్కంధము |
| స్వర్గ. | స్వర్గవర్గము |
| హల | హలన్తపరిచ్ఛేదము |
| A B A. | ఆంధ్రభాషార్ణవము |
| T | తారాశశాంకవిజయము |
| O g | ఒరంగల్ గ్లాసరి |

# ఆంధ్రగ్రంథసంకేతవివరణపట్టిక

| సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
|---|---|---|---|
| అచ్చ రా | అచ్చతెలుఁగురామాయణము | 6 కాండములు | కూచిమంచి తిమ్మకవి |
| అప్ప | అప్పకవీయము | 5 ఆశ్వాసములు | కాకునూరి అప్పకవి |
| అభి ద్వి | అభిమన్యుద్విపద | — | చెన్నభట్టారకుఁడు |
| అహ. | అహల్యాసంక్రందనము | 3 ఆశ్వాసములు | సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు |
| ఆం కౌ | ఆంధ్రకౌముది | — | గణపవరపు వేంకటకవి |
| ఆం దీ | ఆంధ్రదీపిక | — | మామిడి వెంకన్న |
| ఆం ధా | ఆంధ్రధాతుమాల | — | చిన్నయసూరి |
| ఆనం. రం | ఆనందరంగ | 4 ఆశ్వాసములు | కస్తూరి రంగకవి |
| ఛం | రాట్ఛందము | | |
| ఆం ప / ఆంధ్రపద | ఆంధ్రపదాకరము | 7 వర్గములు | శ్రీ పూసపాటిరాజు |
| ఆం భా | ఆంధ్రభాషార్ణవము | 3 కాండములు | నుదురుపాటి వేంకనార్యుఁడు |
| ఆం శే | ఆంధ్రనామశేషము | — | అడిదము సూరకవి |
| ఆం సం | ఆంధ్రనామసంగ్రహము | 5 వర్గులు | పైఁడిపాటి లక్ష్మణకవి |
| ఆము | ఆముక్తమాల్యద | 7 ఆశ్వాసములు | శ్రీకృష్ణదేవరాయలు |
| ఇందు | ఇందుమతీపరిణయము | 6 ఆశ్వాసములు | కుమార ధూర్జటి |
| ఉ రా | ఉత్తరరామాయణము | 8 ఆశ్వాసములు | కంకంటి పాపరాజు |
| ఉ హరి | ఉత్తరహరివంశము | 5 ఆశ్వాసములు | నాచన సోమనాథుఁడు |
| ఉ హరిశ్చ | ఉత్తర హరిశ్చన్ద్రోపాఖ్యానము | 4 ఆశ్వాసములు | తక్కెళ్లపాటి లింగన |
| కకు | కకుత్థ్సవిజయము | 5 ఆశ్వాసములు | మల్లె అనంతభూపాలుఁడు |
| కళా | కళాపూర్ణోదయము | 8 ఆశ్వాసములు | పింగళి సూరన |

| సంకేతము | గ్రంధనామము | ఆశ్వాసాదులు | గ్రంధకర్తనామము |
|---|---|---|---|
| కవిజ | కవిజనాశ్రయము | 4 అధికారములు | వేములవాడ భీమకవి |
| కవి ర<br>కవిక | కవికర్ణరసా<br>యనము | 6 ఆశ్వాసములు | సంకుసాల నృసింహకవి |
| కవిరా | కవిరాజమనోరంజనము | 5 ఆశ్వాసములు | కనుపర్తి అబ్బయామాత్యుఁడు |
| కవిసర్ప | కవిసర్పగారుడము | 2 ఆశ్వాసములు | కాచన బసవన్న |
| కాళ | కాళహస్తిమాహాత్మ్యము | 8 ఆశ్వాసములు | ధూర్జటి |
| కాళ. శ | కాళహస్తీశ్వరశతకము | — | ధూర్జటి |
| కావ్య సం | కావ్యాలంకార<br>సంగ్రహము | 5 ఆశ్వాసములు | మూర్తికవి |
| కాశీ | కాశీఖండము | 7 ఆశ్వాసములు | శ్రీనాథుఁడు |
| కుచే | కుచేలోపాఖ్యానము | 3 ఆశ్వాసములు | గట్టుప్రభువు |
| కువ<br>కువల | కువలయాశ్వ<br>చరిత్రము | 5 ఆశ్వాసములు | నవరము చిననారాయణకవి |
| కు సం | కుమారసంభవము | 12 ఆశ్వాసములు | నన్నెచోడుఁడు |
| కేయూ | కేయూరబాహుచరిత్రము | 4 ఆశ్వాసములు | మంచన |
| క్రీడా | క్రీడాభిరామము | 1 ఆశ్వాసము | వల్లభరాయకవి |
| గురు | గురుబాలప్రబోధిక | — | లింగయసూరి |
| ఘటికా | ఘటికాచల<br>మాహాత్మ్యము | 3 ఆశ్వాసములు | తెనాలి రామకృష్ణుఁడు |
| చంద్ర | చంద్రభానుచరితము | 5 ఆశ్వాసములు | తరిగొప్పుల మల్లన్న |
| చంద్రా | చంద్రాంగదచరిత్రము | 6 ఆశ్వాసములు | పైఁడిమఱ్ఱి వేంకటపతి |
| చంద్రికా. | చంద్రికాపరిణయము | 6 ఆశ్వాసములు | సురభి మాధవరాయప్రభువు |
| చమ | చమత్కారమంజరి | 3 ఆశ్వాసములు | సింహాద్రి వేంకటార్యుఁడు |
| చి ని | చిన్నయసూరి<br>నిఘంటువు | — | పరవస్తు చిన్నయసూరి |

| సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
|---|---|---|---|
| చెన్న | చెన్నబసవపురాణము | 5 ఆశ్వాసములు | అత్తనూరి పాపకవి |
| ఛన్దో. | ఛన్దోదర్పణము | 4 ఆశ్వాసములు | అనంతామాత్యుఁడు |
| జాహ్నవీ. | జాహ్నవీమాహాత్మ్యము | 4 ఆశ్వాసములు | ఏనుఁగు లక్ష్మణకవి |
| జై. భా. / జైమి | జైమినిభారతము | 8 ఆశ్వాసములు | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| తారా | తారాశశాంకవిజయము | 5 ఆశ్వాసములు | శేషము వేంకటపతి |
| దశ / దశకు | దశకుమారచరిత్రము | 12 ఆశ్వాసములు | కేతన |
| దశా. / దశావతార | దశావతార చరిత్రము | 10 ఆశ్వాసములు | ధరణిదేవుల రామయామాత్యుఁడు |
| దాశ | దాశరథి శతకము | — | కంచెర్ల గోపన్న |
| ద్వా / సిం ద్వా | ( సింహాసన ) ద్వాత్రింశిక | 2 ఆశ్వాసములు | కొఱవి గోపరాజు |
| ద్వి. పరమ | ద్విపదపరమ యోగివిలాసము | 8 ఆశ్వాసములు | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు |
| ద్వి రామా / రంగ | ద్విపదరామాయణము (రంగనాథరామాయణము) | 6 కాండములు | గోన బుద్ధారెడ్డి కాచ భూపతి |
| ద్వి శ. సా | ద్విపద శమ్భుదాసుని సారంగధరచరిత్రము | 3 ఆశ్వాసములు | బాణాల శంభుదాసుఁడు |
| ద్వి హరి / హరి ద్వి | ద్విపదహరిశ్చంద్ర చరిత్రము (ఉత్తర భాగము) | — | గౌరన |
| ద్వి నల / నల ద్వి | నలచరిత్రము ( ద్విపద ) | 5 భాగములు | రాఘవార్యుఁడు |
| నవ | నవనాథచరిత్రము ( ద్విపద ) | 5 భాగములు | గౌరన |

| సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
|---|---|---|---|
| నా పంచ<br>నారా పంచ | నారాయణ పంచతంత్రము | 5 ఆశ్వాసములు | నారాయణకవి |
| నారా | నారాయణీయాం ధ్రవ్యాకరణము | 9 పరిచ్ఛేదములు | చర్ల నారాయణశాస్త్రి, గణపతిశాస్త్రి |
| నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము | 10 ఆశ్వాసములు | తిక్కనసోమయాజి |
| నీలా | నీలాసుందరీపరిణయము | 3 ఆశ్వాసములు | కూచిమంచి తిమ్మయ |
| నృసిం | నృసింహపురాణము | 5 ఆశ్వాసములు | ఎఱ్ఱాప్రెగ్గడ |
| నైష<br>శృం నై | (శృంగార) నైషధము | 8 ఆశ్వాసములు | శ్రీనాథుఁడు |
| పంచ | పంచతంత్రము | 5 ఆశ్వాసములు | వేంకటనాథుఁడు |
| పండి<br>పండితా | పండితారాధ్యచరిత్రము ( ద్విపద ) | 5 ప్రకరణములు | పాలకుఱికి సోమన |
| పద్మ<br>(ఉ | పద్మపురాణము ఉత్తరఖండము) | 11 ఆశ్వాసములు | సింగనార్యుఁడు |
| పద్మ. | పద్మపురాణము | 6 ఖండములు | పిళుపాటి చిదంబరశాస్త్రి |
| పరమ | పరమయోగివిలాసము | 5 ఆశ్వాసములు | తిమ్మభూవరుఁడు |
| పి శ<br>పి శకుం. | పినవీరభద్రుని శకుంతలాపరిణయము | 4 ఆశ్వాసములు | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| ప్ర. బం<br>ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసము | 1 ఆశ్వాసము | గణపవరపు వేంకటకవి |
| ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము | 5 ఆశ్వాసములు | పింగళి సూరన |
| ప్రౌ వ్యా | ప్రౌఢవ్యాకరణము | 10 పరిచ్ఛేదములు | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| పాంచా | పాంచాలీపరిణయము | 5 ఆశ్వాసములు | కాకుమాని మూర్తి కవి |

| సంకేతము | గ్రంధనామము | ఆశ్వాసాదులు | గ్రంధకర్తనామము |
|---|---|---|---|
| పాండు. | పాండురంగ మాహాత్మ్యము | 5 ఆశ్వాసములు | తెనాలి రామకృష్ణుఁడు |
| పారి. | పారిజాతాపహరణము | 5 ఆశ్వాసములు | ముక్కు తిమ్మన |
| పార్వ. | పార్వతీపరిణయము | 6 ఆశ్వాసములు | కోటి శ్రీరఘునాధతొండమాన్ మహీపాలుఁడు |
| బ ద్వి<br>బస | బసవపురాణము (ద్విపద) | 7 ఆశ్వాసములు | పాలకురికి సోమన |
| బహు | బహులాశ్వచరిత్రము | 5 ఆశ్వాసములు | దామర్ల వేంగళనాయఁకుఁడు |
| బాల<br>బాలవ్యా. | బాలవ్యాకరణము | 10 పరిచ్ఛేదములు | పరవస్తు చిన్నయసూరి |
| బాలస. వ్యా. | బాలసరస్వతివ్యాఖ్య | — | బాలసరస్వతి |
| బ్రౌ. | బ్రౌణ్యనిఘంటువు | — | బ్రౌనుదొర |
| భల్ల. | భల్లాణచరిత్రము | 5 ఆశ్వాసములు | వాలేశ్వరుఁడు |
| భాగ. | భాగవతము | 12 స్కంధములు | బమ్మెర పోతరాజు |
| భాను. | భానుమతీపరిణయము | 4 ఆశ్వాసములు | రెంటూరి రంగరాజు |
| భార. | భారతము | 18 పర్వములు | నన్నయ తిక్కన, ఎఱ్ఱా ప్రెగ్గడ |
| భీమ | భీమఖండము (భీమేశ్వరపురాణము) | 6 ఆశ్వాసములు | శ్రీనాధుఁడు |
| భో.<br>భోజరా. | భోజరాజీయము | 7 ఆశ్వాసములు | అనంతామాత్యుఁడు |
| మను.<br>మనుచ.<br>మనుసం.<br>స్వా<br>స్వారో. | (మనుచరిత్రము)<br>(మనుసంభవము)<br>స్వారోచిషమను సంభవము | 6 ఆశ్వాసములు | అల్లసాని పెద్దన |

| సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
|---|---|---|---|
| మల్ల | మల్లభూపాలీయము | 3 శతకములు | ఎలకూచి బాలసరస్వతి |
| మల్లు | మల్లుపురాణము (దేవమల్లచరిత్రము-వ్రాతప్రతి) | 4 ఆశ్వాసములు | నుదురుపాటి వేంకనార్యుఁడు |
| మార్కం | మార్కండేయ పురాణము | 8 ఆశ్వాసములు | మారన |
| మిత్రి ప | మిత్రవిందాపరిణయము | — | — |
| మృ వి. | మృత్యుంజయవిలాసము | 3 ఆశ్వాసములు | గోఁగులపాటి కూర్మదాసుఁడు |
| య<br>యయా. | యయాతిచరిత్రము | 5 ఆశ్వాసములు | పొన్నిగంటి తెలగనార్యుఁడు |
| రంగా | రంగారాయచరిత్రము | 3 ఆశ్వాసములు | దిట్టకవి నారాయణకవి |
| రాఘ<br>రాఘవ | రాఘవపాండవీయము | 4 ఆశ్వాసములు | పింగళి సూరన |
| రాజ చ. | రాజశేఖరచరిత్రము | 3 ఆశ్వాసములు | మాదయగారిమల్లన |
| రాధా | రాధామాధవము | 5 ఆశ్వాసములు | చింతలపూడి యెల్లనార్యుఁడు |
| రా వి | రాజవాహనవిజయము | 5 ఆశ్వాసములు | కాకుమాని మూర్తికవి |
| రావి<br>రాజ వి | రాజశేఖరవిలాసము | 3 ఆశ్వాసములు | కూచిమంచి తిమ్మకవి |
| రసి | రసికజనమనోభిరామము | 7 ఆశ్వాసములు | కూచిమంచి తిమ్మకవి |
| రామలిం. | రామలింగేశ్వరశతకము | — | అడిదము సూరకవి |
| రామా. | రామాభ్యుదయము | 8 ఆశ్వాసములు | అయ్యలరాజు రామభద్రుఁడు |
| రుక్మాం | రుక్మాంగదచరిత్రము | 5 ఆశ్వాసములు | ప్రౌఢకవి మల్లన్న |
| వరా<br>వరాహ. | వరాహపురాణము | 12 ఆశ్వాసములు | నంది మల్లయ్య<br>ఘంట పింగయ్య |
| వాల్మీ. | వాల్మీకిచరిత్రము | 3 ఆశ్వాసములు | రఘునాథభూపాలుఁడు<br>(తంజాపురి) |

| సంకేతము | గ్రంధనామము | ఆశ్వాసాదులు | గ్రంధకర్తనామము |
|---|---|---|---|
| వసు. | వసుచరిత్రము | 6 ఆశ్వాసములు | రామరాజభూషణుఁడు |
| వా. రా<br>వాసి | వాసిష్ఠరామాయణము | 5 ఆశ్వాసములు | మడికి సింగన |
| విక్ర. | విక్రమార్కచరితము | 8 ఆశ్వాసములు | జక్కన |
| విజ. | విజయవిలాసము | 3 ఆశ్వాసములు | చేమకూర వేంకటకవి |
| విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | 3 కాండములు | కేతన |
| వి. పు. | విష్ణుపురాణము | 8 ఆశ్వాసములు | వెన్నెలకంటి సూరన |
| విప్ర | విప్రనారాయణ చరిత్రము | 5 ఆశ్వాసములు | చెదలవాడమల్లయ్య |
| వేం. పంచ. | వేంకటనాధ పంచతంత్రము | 5 ఆశ్వాసములు | వేంకటనాధుఁడు |
| వేంక. | వేంకటేశాంధ్రము | 5 వర్గులు | గణపవరపు వేంకటకవి |
| వేం. మా. | వేంకటాచల మాహాత్మ్యము | 6 ఆశ్వాసములు | తరిగొండ వెంకమ్మ |
| వేణు. | వేణుగోపాలశతకము | — | — |
| వేమ.<br>వే శ. | వేమనశతకము | 3 భాగములు | వేమనయోగి |
| వైజ | వైజయన్తీవిలాసము | 4 ఆశ్వాసములు | సారంగు తమ్మయ |
| షోడ | షోడశకుమారచరిత్ర | 8 ఆశ్వాసములు | వెన్నెలకంటి అన్నయ్య |
| శకుం. | శకుంతలాపరిణయము | 4 ఆశ్వాసములు | పిల్లలమర్రి పినవీరభద్రుఁడు |
| శ ర. | శబ్దరత్నాకరము | — | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| శా. ప మ. | శాసనపద్యమంజరి | — | — |
| శివ.<br>శివధ. | శివధర్మోత్తరము | 8 ఆశ్వాసములు | మల్లారెడ్డికవి |
| శివరా. | శివరాత్రిమాహాత్మ్యము | 4 ఆశ్వాసములు | శ్రీనాధుఁడు |
| శుక. | శుకసప్తతి | 4 ఆశ్వాసములు | కదిరీపతినాయఁకుఁడు |
| శుద్ధాం. | శుద్ధాంధ్రపద పారిజాతము | — | ఓగిరాల జగన్నాధకవి |

| సంకేతము | గ్రంధనామము | ఆశ్వాసాదులు | గ్రంధకర్తనామము |
|---|---|---|---|
| శేష | శేషధర్మము | 5 ఆశ్వాసములు | తామరపల్లి తిమ్మయ్య |
| సకల. | సకలకధాసార సంగ్రహము | 9 ఆశ్వాసములు | రామభద్రుఁడు |
| సత్యసాం | సత్యభామాసాంత్వనము | 4 ఆశ్వాసములు | కామేశ్వరు డు |
| సమీ<br>సమీర | సమీరకుమారవిజయము | 7 ఆశ్వాసములు | పుష్పగిరి తిమ్మన |
| సర్వ | సర్వలక్షణసార సంగ్రహము | 3 ఆశ్వాసములు | కూచిమంచి తిమ్మకవి |
| సహృ | సహృదయరంజని (మధురావిజయాంధ్ర వ్యాఖ్య) | — | పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రి |
| సాం ని<br>సాంబ | సాంబనిఘంటువు | 5 వర్గులు | కస్తూరి రంగకవి |
| సారం. | సారంగధరచరిత్రము | 3 ఆశ్వాసములు | చేమకూర వేంకటకవి |
| సుమ<br>సుశ. | సుమతిశతకము | — | బద్దెనకవి |
| సూ. ని. | సూర్యరాయనిఘంటువు | — | జయన్తి రామయ్యపంతులు-మొ (పండితసాహాయ్యముతో) |
| హంస | హంసవింశతి | 5 ఆశ్వాసములు | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు |
| హర. | హరవిలాసము | 7 ఆశ్వాసములు | శ్రీనాధుఁడు |
| హరి. | హరివంశము | 9 ఆశ్వాసములు | ఎఱ్ఱాప్రెగ్గడ |
| హరి న. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము | 5 ఆశ్వాసములు | రామరాజభూషణుఁడు |
| హరిశ్చ. | హరిశ్చన్ద్రోపాఖ్యానము | 5 ఆశ్వాసములు | శంకరకవి |



# సంస్కృతగ్రంథసంకేతవివరణపట్టిక

| సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
|---|---|---|---|
| అథ. | అథర్వణకారికావళి | 5 పరిచ్ఛేదములు | అథర్వణాచార్యుఁడు |
| అన. | అనర్ఘరాఘవము | 7 అంకములు | మురారికవి |
| అమ | అమరకోశము | 3 కాండములు | అమరసింహుఁడు |
| అమ. మా. | అమరమాల | — | — |
| అహో. | అహోబలపండితీయము | 5 పరిచ్ఛేదములు | అహోబలపతి |
| ఆం చి. | ఆంధ్రశబ్దచిన్తామణి | 5 పరిచ్ఛేదములు | నన్నయ |
| ఉ | ఉత్తరరామచరితము | 7 అంకములు | భవభూతి |
| కవి<br>కవిక | కవికల్పలత | 4 స్తబకములు | దేవేశుఁడు |
| కాదం. | కాదంబరి | 2 భాగములు | భట్టబాణుఁడు<br>తత్పుత్రుఁడు |
| కావ్యా. | కావ్యాలంకార<br>సూత్రవృత్తి | 5 అధికరణములు | వామనుఁడు |
| కాశీసా | కాశీసారము | — | శంకరభగవత్పాదులు |
| క్రియా<br>క్రియాని | క్రియానిఘంటువు | — | వీరపాండ్యభూపాలుఁడు |
| కు సం | కుమారసంభవము | 17 సర్గములు | కాళిదాసు |
| జాత | జాతకచంద్రిక | 4 ప్రకరణములు | వేంకటేశ్వరసిద్ధాన్తి |
| తత్త్వ | తత్త్వబోధిని<br>(సిద్ధాన్తకౌముదీవ్యాఖ్య) | — | జ్ఞానేంద్రసరస్వతి |
| త్రి ని. | త్రికాండశేషనిఘంటువు | 3 కాండములు | పురుషోత్తముఁడు |
| ందికా | నందికేశ్వరకారికలు | — | నందికేశ్వరుఁడు |
| నా. | నానార్థరత్నమాల | 6 కాండములు | ఇరుగప దండనాథుఁడు |
| మ | నామమాల | — | హేమచంద్రుఁడు |
| చ | నీలకంఠవిజయచంపువు | 5 ఆశ్వాసములు | నీలకంఠదీక్షితుఁడు |

| సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
| --- | --- | --- | --- |
| నీల వ్యా | నీలకంఠీయవ్యాఖ్య (మహాభారతమునకు) | — | నీలకంఠదీక్షితుఁడు |
| పంచ | పంచతంత్రము | 5 తంత్రములు | విష్ణుశర్మ |
| పరా | పరాశరస్మృతి | 2 కాండములు | పరాశరుఁడు |
| ప్రతా | ప్రతాపరుద్రీయము | 9 ప్రకరణములు | విద్యానాథుఁడు |
| భట్టి | భట్టికావ్యము | 22 సర్గములు | భట్టి |
| భర్తృ సు | భర్తృహరి సుభాషితములు | 3 శతకములు | భర్తృహరి |
| భాగ | భాగవతము | 12 స్కంధములు | వేదవ్యాసుఁడు |
| (సం) భార. | భారతము | 18 పర్వములు | వేదవ్యాసుఁడు |
| భోజ చ | భోజమహారాజ చరిత్రము | — | బల్లాలకవి |
| మంజూ. | (వైయాకరణసిద్ధాన్త) మంజూష | — | నాగేశభట్టు |
| మత్స్య / మత్స్యపు | మత్స్యపురాణము | — | వేదవ్యాసుఁడు |
| మధు వి. | మధురావిజయము | 9 సర్గములు | గంగాదేవి |
| మను | మనుస్మృతి | 12 అధ్యాయములు | మనువు |
| మల్లి వ్యా | మల్లినాథసూరివ్యాఖ్య | — | కోలచల మల్లినాథసూరి |
| మహా. | మహావీరచరితము | 7 అంకములు | భవభూతి |
| మాధ / మాధ ధా. | మాధవీయధాతువృత్తి | 10 గణములు | సాయణాచార్యుఁడు |
| మృ వ్యా. | మృచ్ఛకటికవ్యాఖ్య (అమల) | — | జీవానన్దవిద్యాసాగర భట్టాచార్యుఁడు |
| మేఘ. | మేఘదూతము | 2 భాగములు | కాళిదాసు |
| మేది. | మేదినినిఘంటువు | — | మేదినికరుఁడు |
| యజు. బ్రా | యజుర్వేద బ్రాహ్మణము | — | — |
| రఘు | రఘువంశము | 19 సర్గములు | కాళిదాసు |

| సంక్షిప్తములు | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము |
| --- | --- | --- | --- |
| రసా. | రసార్ణవసుధాకరము | 3 విలాసములు | సర్వజ్ఞసింగభూపాలుఁడు |
| రామా. | రామాయణము | 6 కాండములు, ఉత్తరకాండము | వాల్మీకి |
| లఘుశ. శేఖ | లఘుశబ్దేన్దుశేఖరము | 2 భాగములు | నాగేశుఁడు |
| లలి త్రి భా. | లలితాత్రిశతీభాష్యము | —— | శంకరభగవత్పాదులు |
| వాచ. | వాచస్పత్యము | —— | తారానాధతర్కవాచస్పతి |
| విక్ర. | విక్రమాఙ్కచరిత్ర | 18 సర్గములు | బిల్హణుఁడు |
| విశ్వ | విశ్వనిఘంటువు | —— | మహేశ్వరసూరి |
| విష్ణు. విష్ణుపు. | విష్ణుపురాణము | 7 అంశములు | వేదవ్యాసుఁడు |
| వైజ | వైజయన్తి | 8 కాండములు | యాదవప్రకాశుఁడు |
| శాకుం అభి శా. | (అభిజ్ఞాన) శాకుంతలము | 7 అంకములు | కాళిదాసు |
| శివస | శివసహస్రనామము | —— | వ్యాసుఁడు |
| శివా. | శివానందలహరి | —— | శంకరభగవత్పాదులు. |
| శిశు | శిశుపాలవధము | 20 సర్గములు | మాఘకవి |
| స. త. సి. | సర్వతన్త్రసిద్ధాన్త | —— | గౌరీశంకరభిక్షువు |
| ప. ల. సం. | పదార్థలక్షణసంగ్రహము | | |
| సా. ద. | సాహిత్యదర్పణము | 10 పరిచ్ఛేదములు | విశ్వనాథకవిరాజు |
| సి. కౌ | (వైయాకరణ)సిద్ధాన్త కౌముది | 2 భాగములు | భట్టోజిదీక్షితుఁడు |
| సుధ సుధా | (అమర) సుధావ్యాఖ్య | —— | భానోజిదీక్షితుఁడు |
| సుభ. | సుభద్రాధనంజయము | 5 అంకములు | కులశేఖరవర్మ |
| సూ. శ. | సూర్యశతకము | —— | మయూరుఁడు |
| హర్షచ | హర్షచరిత్ర | | భట్టబాణుఁడు |

# అచ్చతెలుఁగుకోశము

## ప్రథమకాండము

### పీఠిక

శా. శ్రీమాతృప్రకటీకృతాంగరుచి సారెన్ జూచి భావింపుచో
నామే యైనఁ ద్రిలోకమాత యగుటన్ వైశ్యాంగనం దల్లి యై
ప్రేమం బ్రోచుట చూడ వింతయె యనన్, శ్రీమాతృభూతేశ్వరుం
డామోదంబునఁ బ్రోచుఁగాత రఘునాథాధీశచూడామణిన్.

(చంద్రికావ్యాఖ్య)

కం. మందస్మితవదనముతోఁ
గం దెఱుఁగనిచంద్రుఁ డనఁగఁ గాయుచు జ్యోత్స్నల్,
వందారుజనముఁ బ్రోచెడి
మందారమ మా కొసంగుమా యిహపరముల్

చం. గురువులు ప్రేమసాగరు లకుంఠితశాస్త్రమహత్త్వసాహితీ
పరిమలపుష్పగుచ్ఛమయ భాసురకీర్తిలతామతల్లికా
సురుచిరతారహారపరిశోభితసర్వదిగంగనాపయో
ధరసమలంకృతాత్మచరితప్రథితాత్ములు వారి.కంజలుల్.

గీ. భారతావనిభాగ్యంబు పండఁబాటి
రాయరఘునాథరాయఁడు వ్రాయ మనఁగ
'ఆంధ్రభాషార్ణవం' బనునచ్చతెలుఁగు
కోశమును గూర్చె వేంకనకోవిదుండు

కం. దానికిఁ 'జంద్రిక' యనువ్యా
ఖ్యానము రచియించి తెలుఁగుగడ్డను జ్ఞాన
శ్రీనిలయముఁ గావింపఁగ
నే నెంచెతిఁ గోర్కు లెఱుఁగు నేమీ శక్తుల్?

కం. సుబ్రహ్మణ్యుఁడఁ గవిసో
కబ్రహ్మణ్యతను గనఁగఁ గాంక్షించి యిదే
అబ్రాళిని బాహులతో
నబ్రంబు గ నీఁదఁ జూతు హాస్యమె యైనన్.

అవ —శ్రీమాతృభూతేశ్వరస్వామి యేతత్కృతిభర్త మహాకవి వేంకనార్యుఁడు కృతికర్త. ఈకృతికర్త యాకృతిభర్తను ద న్నీకృతిరచనకుఁ బ్రోత్సహించిన - శ్రీరాయంఘునాధరాజేంద్రునికి శుభము లొసఁగి రక్షింప వలయు' నని వేఁడుచు, నిజప్రభునకుఁ దపకృతజ్ఞతాశాసనముల నీకృతిముఖమున వెలువరించి ఆశీరూప' మగుమఙ్గళము నొనరుచ్చ చున్నాఁడు గ్రంథాదిని సంప్రదాయసిద్ధము గా.

అర్థ —శ్రీమాతృ ప్రకటీకృత + అంగరుచిన్-శ్రీమాత గా (పరమేశ్వరి గా) ప్రకటిత మైన తన శరీరముయొక్క కాంతిని (కాంతిమంత మగుస్వశరీరమును, తనవామాంగము ననుట) సారెన్-మాటిమాటికి చూచి-(ఆసౌందర్యమునకు ముగ్ధుఁ డై యెంత చూచినను దనివి తీఱక మరల మరలఁ జూచి యనుట). భావింపుచోన్-(ఊరక అదేపని గ చూచుచు ఆమెశరీరమును ఊరక తలపోయు చుండుటచేత) ఆమే = ఆశరీరమే (ఆవామాంగమే )( మేయి కి రూపాం.మే.) ఐనన్ (తాను గా) ఐనందున. త్రిలోకమాత అగుటన్-జగజ్జనని యగు నా పరమేశ్వరి (తాను)గా అగుటచేత. తల్లి ఐ-(వైశ్యకన్యకు మాత్రము)తల్లి గా వర్తించి వైశ్యాంగనన్-కోమటికన్యకను (మాత్రము). ప్రేమన్-స్నేహ

ముతో, తల్లిప్రేమతో. ప్రోచుట-రక్షించుట చూడన్ ఆలోచింపఁగా(ఆలోచించి చూచినప్పు డనుట) వింతయే-ఆశ్చర్యమా? కాదు (మాతృప్రేమముతో ముల్లోకములు రక్షించువాని కిది కైముత్యన్యాయసిద్ధము. కాన యొకగొప్ప గాదు.అనన్-అని లోకము ప్రశంసింపఁగా శ్రీమాతృభూత + ఈశ్వరుడు-శ్రీమాతృభూత స్వామి (కర్త) ఆమోదంబునన్ సంతోషముతో(నేఁడు తనబిరుదనామము సార్థక మగుటకుఁ దగిన రక్షణపాత్రము దొరకె ననెడిమహోత్సాహముతో ననుట). రఘునాథ (అధి + ఈశ) చూడామణిన్-రఘునాధుఁ డనెడి అధిరాజవతంసమును (ఉత్తముఁ డగులోకపాలకుని మహారాజశిరోమణిని అనుట).'అధీశ,చూడామణి శబ్దములు-లోకరక్షకు లగుప్రభువుల కెల్లను ప్రభుఁ డీతఁ డగుట తెలిపి ప్రకృతోపయోగు లగు చున్నవి). ప్రోచున్ కాతన్- రక్షించునుగాక (ఈతనియందు మాతృవాత్సల్యము చూపి తాను ఈతనిఁ బ్రోచిన లోకములకు మాత యైనవాఁడై శ్రీమాతృభూతేశుఁ'డనుటను దాను సార్థక మొనర్చుకొను ననుట వచింపఁబడినది).

తా — మాతృభూతేశ్వరస్వామి తనయర్ధాంగ మగుపరమేశ్వరిసౌందర్యమునకు ముగ్ధుఁడై ఆమూర్తి నూరక భావించి భావించి భ్రమరకీటన్యాయమున'నదా నా జగజ్జననిఁ గాఁ బరిణమించినాఁడు.ఇట్లాత్రిలోకీజనని గాఁ బరమేశ్వరుఁ డైనందున, ఆతఁడు తల్లి యై ముల్లోకములఁ బ్రోవవలసి యున్నది నేఁడు లోకరక్షకుల కెల్ల రక్షకుఁడు గానున్నరాయరఘునాధుని నీతఁడు ప్రోచిన, లోకములను మాతృవాత్సల్యముతోఁ బ్రోచిన శ్రీమాతృభూతేశుఁ' డీతఁ డగును అప్పుడు కైముత్యన్యాయసిద్ధ మగుటను'ఒక వైశ్యకన్యారక్షణ మీతని కేమిగొప్ప'యని జను లాడుదురు. అందులకే, యవశ్యము తనప్రభువు నీతఁడు ప్రోవవలసి యున్న దని అప్పుడే శ్రీమాతృభూతేశ్వరత్వ' మీస్వామికి సార్థక మగు నని వేంకనార్యుఁడు తనకృతజ్ఞతాశీస్సును గ్రంధముఖమున రాయరఘునాధున కొసఁగు చున్నాఁడు.

విశే — గ్రంథాదిని శ్రీకారము సర్వదోషఘ్నము శుభప్రదము లాక్షణికు లిట్లనుచున్నారు 'పదపడి శ్రీకారము కృతి మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం బొదవించుఁ బరుస మినుమును గదిసి సువర్ణంబు సేయుకరణిన్ ధరణిన్' ఇందుమూలమున మన కవి యాంధ్రకవులసంప్రదాయము పాటించినవాఁడును నైనాఁడు అప్పకవి యాంధ్రకవులసంప్రదాయ మిది యని పేర్కొనుచున్నాఁడు 'వేదముల కెల్ల నోంకార మాదియైన కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది గాన కవివరు లెల్లను దానిఁ దక్క నితర వర్ణంబు లిడరు' (అని)

మగణము ప్రబంధాదియందుఁ బ్రయుక్తమై సర్వసౌఖ్యప్రద మగును 'మగణ స్సర్వదోషఘ్న స్సర్వసౌఖ్యప్రదాయకః ప్రయుక్తశ్చే త్ప్రబన్ధాదౌ నగణో ఽపి చ తాదృశః' (అని లాక్షణికులు )

మాతృభూతేశ్వరస్వామి 'తిరిచినాపల్లి' అని యిప్పు డనఁబడు చున్నత్రిశిరఃపురము వాఁడు.అచ్చటిత్రిశీర్షకుధరము (త్రిశిరఃపర్వతము త్రికూటపర్వతము)ఈతనినివాసము. ఈస్వయంభూలింగమునకు 'మాతృభూతేశుఁ'డనుపేరు వచ్చుట కొకగాధ జనశ్రుతము గ వినవచ్చు చున్నది ఒకప్పుడు రాజ్యోపద్రవము సంభవించి ప్రాణరక్షణమునకై తననిసువుతో వలసపోవుచు,వైశ్యకన్యక యొకతె యీ దేవాలయముకడకు వచ్చెను తనబిడ్డ నటఁ బరుండఁబెట్టి తా నెందేని యేఁగెను అప్పు డాబాలిక పాలకై యూరక యేడ్చు చుండ నీలింగమూర్తి దయాళువై ఆవైశ్యమాతయాకారముతో నామెకడకు వచ్చి పా లిచ్చెను ఆయమృతపయఃపానమున నాశిశువు జ్ఞానభూమిక నందుకొనెను ఇదివఱకీతఁడు 'చెవ్వందీశుఁడు' నాఁటినుండి మాతృభూతేశుఁడు' జ్ఞానసంబంధియారు'గాధతో దీనికి సంబంధము లేదు తల్లిచావుబిడ్డఁ డాతఁడు. 'వైశ్యకన్యామాతృభూత, వైశ్యాంగనన్ బ్రోచి' అని, యీశిశువు 'అఁడునిసు' వగుట వచించు చున్నాఁ డీకవి. ఇట్టిజ్ఞానులు వైశ్యకులమందు శివభక్తులు గ జనించు చుండి రని శివలీలార్ణవము' రుద్రుఁ' డనువైశ్యుని గాధ నుదాహరించు చున్నది దీనితోఁ గొంత పోలిక గలిగి, ఇచ్చటిదే యనునట్లు మఱియొకగాధయూడ శివలీలార్ణవమునఁ గానవచ్చు చున్నది మధురకు సమీపమున వరాహపర్వత మున్న దని, శాపవశమున వృషలపుత్రులు వరాహశిశువులు గా జనించి తల్లినిఁ గోల్పోయి తల్లికై నెమకుచు ఆఁకలి కిటమటించు చుండ,ఆపర్వతముపై భక్తరక్షణకుఁ

గా నవతరించినపరమశివుఁడు ఆపిల్లలతల్లి గా వచ్చి పా లిచ్చి పోషించె నని, తదమృత పయఃపానమున నవి వరాహముఖములతోడిమానవులు గా సంభవించి సుగుణుఁ'డనునాఁటి పాండ్యరాజుకడ మంత్రిపదవులం దుండి శివభక్తితో నంతమున శివసాయుజ్యము నందిన వని యీగాథ

మేను- (రూపాం)మేఁ మేను నెమ్మేను మై మఱి మే మెయియొడ లన శరీరంబు దనరు' (చూ ఆం భా.2 134) శ్రీమాత-పూజ్యుఁ డగు మాతృభూతేశుఁ'డని పూజ్య యగు మాత గా (సాదాఖ్యకల) గా నైనయీశ్వరుఁ డని యర్థద్వయము (త్రిలోకమాత యగుటన్) చూడన్ వింతయె'-అనుట వ్యంగ్యమర్యాదతో, భూదేవతాగ్రణులచే యజ్ఞాదుల జరపించి దేవతాలోకాదులఁగూడ నీతఁడు (రాయఁడు) పోషించుట వచిం చినది అట్టి లోకరక్షకు నొక్కని మాతృవాత్సల్యముతో రక్షించిన 'త్రిలోకమాత' యీతఁ డగుట యర్థవంత మగును వైశ్యకన్యారక్షణమాత్రమున నది యట్టిది కాదు- అని తెలుపఁబడు చున్నది. ఈతడు- స్వామిని శ్రీ మాతృభూతుఁ డని, సదాశివ తత్త్వమునకు షోడశకలతో నైనయైక్యమును జాటి చెప్పి, శ్రీవిద్యోపాసనా పరమ రహస్యమును వ్యంగ్యమర్యాదతోఁ జెప్పినాఁడు శ్రీ మాతృస్మరణముతో నీ గ్రంథ మారంభించి, తన కృతిస్వామినిఁ గూడ శ్రీ మాతృభూతేశునిఁ గాఁ జేసి, తన యీ కృతికి సర్వమఙ్గలాలయత సంపాదించు చున్నాఁ డీతఁడు శ్రీ మాతా శ్రీమహారాజ్ఞీ' అని లలితాసహస్రనామస్తోత్రారంభము ఇది యంతయుఁ బరిశీలించి చూచిన ఈ కవి శ్రీ విద్యాపూర్ణదీక్షితుఁ డగుట తెలియ ఎచ్చును. 'వైదిక చిరజప్తకాదివిద్య' యని ముందు వచించు చుండుటనుబట్టి, యీతనిది వామాచారపద్ధతి కా దనియు, శాంక రాద్వైతమునకుఁ జెందిన మహోపాసనాపద్ధతి యీతని దనియు నెఱుఁగ వచ్చును మాతృభూతేశుఁ'డనియు నచ్చటచ్చట నీకవి యీ దేవుని సంబోధించు చున్నాఁడు. మాతృశబ్దముగూడ శ్రీమాతకు వాచకము మాలినీ హంసినీ మాతా మలయాచల వాసినీ' (లలి. స. 96) శ్రీ మాతృ' శబ్దము కద- అభియుక్తానాం నామ శ్రీపద పూర్వం ప్రయుఞ్జీత' అనుచొప్పున పూజ్యార్థకము' శ్రీ' శబ్ద మనియుఁ గొందఱు దీనిని లొల్ల లక్ష్మీధరపండితుఁడు సాదాఖ్యకలాపరము గా నిర్వచించినాఁడు (చూ.సౌం ల వ్యా)

అధీశ శబ్ద మిట్లు నిర్వచింపఁబడినది- 'రాజా తు ప్రణతాశేషసామన్తః స్స్యా దధీశ్వరః' (అమ) 'అధీశ' 'అధీశ్వర' శబ్దములు పర్యాయములు 'ప్రోచుక్ కాతన్- డుమూ కాతౌ కావుతాద్యా ఆశీరర్థేతు సమ్మతాః' అని అథర్వణుఁడు 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వా౽పి తన్ముఖమ్' అని (ఆలంకారికులు)

అలం —'అధీశ- చూడామణి' శబ్దము లర్థవంతము లై ప్రకృతోపయోగు లగుటవలన పరికరము' 'వైశ్యాంగనన్ వింతయె' అనుటవలన అర్థాపత్తి భావింపుచో ఆమే యైన-అనుచో సంబంధాతిశయోక్తి ఇవి యన్నియుఁ దాము పరస్పరపోషణమునఁ బెంపొంది 'శ్రీమాతృభూతేశ్వరత్వము' సార్థక మగుటకు 'రాయరఘునాధరక్షణ మవశ్యంభావి' అనువ్యంగ్యమున కంగము లై తత్పరిపోషణ మొనర్చి, యుత్తమకావ్యత్వమును దీనికిఁ బ్రసాదించి కృతార్థము లైనవి.

చ. తనధనురాలయమ్ములను దాఁచితివే యని మాటలట్ల తై
కను సడలించి చన్నుఁగవ గ్రక్కునఁ బట్టఁగ నెంచునాయకుం
గనిన 'సుగంధికుంతల' మొగంబునఁ దోఁచినచిన్ననవ్వు, కో
రినవర మిచ్చి ప్రోవుతను శ్రీరఘునాధనృపాలచంద్రునిన్ 2

మాతృభూతేశ్వరుని ప్రాణేశ్వరి సుగంధికుంతలాంబ. తన ప్రాణేశ్వరునితోడియా పరాశక్తి యానందానుభూతి రాయరఘునాధునకు సర్వాభీష్టప్రదాయకము గావలయు నని యిందు కవి వర్ణించు చున్నాఁడు.

అర్థ —తనధనురాలయమ్ములను-నాధనుస్సును(మేరుపర్వతమును) నానివాసమును (నే నుండుకైలాసపర్వతమును) దాఁచితివే-మఱుఁగుపఱచితివా, కనఁబడకుండఁ జేసితివా? అని-చెప్పి ఆటలట్ల (ఆటలు-అట్లు-అ)-పరిహాసములట్లే(పరిహాసములు ఆడుచున్నట్లే ఆడుచు అనుట) తైకను-అవికను. సడలించి-సళ్లించి

(ఇవిగో ఇక్కడ నున్న ట్లున్నవి చూచెదను అనునట్లు తిన్నగా హస్తమును ఆవంకకుఁ బోనిచ్చి ఱవికబిగి చెఱచి అనుట) చన్నుఁగవను క్రక్కునన్-శీఘ్రము గా-హఠాత్తు గా (నాయికకు) తెలియ కుండునట్లు గా (ఆమెలజ్జచే నైనప్రతిబంధము తనకు లే కుండునట్లు గా అనుట) పట్టఁగన్ ఎంచునాయకున్-తలఁచు చున్నతనభర్తను (మాతృభూతేశుని). కనిన (ఆవృత్తాంతము కనిపట్టి) చూచిన. సుగంధికుంతల-సుగంధికుంతలాంబయొక్క, మొగంబునన్. తోఁచిన-కానవచ్చిన చిన్ననవ్వు-(నీనర్మచేష్టలు తెలిసితిని లే యని (సవిలాసము గా తెలుపు) చిఱునవ్వు (కర్త) కోరినవమ్ము- (రఘునాథరాయలచే) కోరఁబడిన కోర్కిని-(కోరిన యాతనికోర్కుల నన్నిటిని-అనుట) (ఆభాసకర్మధారయము) (జాత్యేకవచనము) ఇచ్చి. శ్రీరఘునాథనృపాలచంద్రునిన్. ప్రోచుతన్-రక్షించుఁగాక

తా — ఔన్నత్యమునుబట్టి వక్షోజములనుగొండలతోఁ బోల్చుట కవిసమయసిద్ధము. దానినిఁబట్టియే యిటఁ బరమేశ్వరిపయోధరములు మేరుకైలాసములు గా అధ్యవసితము లైనవి. త్రిపురసంహారమున మేరువు శివునకు ధనువు. కైలాస మెల్లప్పుడు ఆయనకు ఉనికిపట్టు స్తనద్వంద్వమును ఱవిక కప్పి యుండుటనుబట్టి తనధనుస్సును ఆలయమును ఆమె దాఁచిపెట్టిన దని పరమేశ్వరియందు నర్మగర్భము గాఁ బరమేశ్వరుఁ డొకదోషారోపణ మొనర్చి వాని నన్వేషించుట కనునట్లు తినతిన్నగా వక్షోజము లంటుటకు ప్రయత్నించు చున్నాఁడు. సర్వేశ్వరి యది తెలిసి సిగ్గుచే మఱుమాటాడక చిన్నగా నవ్వి, తనప్రణయమును గంభీరము గా నాయకునకుఁ దెలిపినది ఇట్లాయాది మదంపతుల పరస్పరప్రణయమున కైన శృంగారచేష్ట లాశ్రితకల్పద్రుమము లనుటకు సందియము లేదు. అందును మృదుమధురము గా పరాశక్తిమంద స్మిత మతిగంభీర మై పరశివునకే యభీష్టదాయక మగు చున్నప్పు డది రాయనికి సర్వాభీష్టప్రదాయక మగుట నిశ్చప్రచము-అని కుంతలాంబసవిలాస మందస్మితమును బ్రకృతోపకారకముఁ గాఁ గవి వర్ణించినాఁడు.

విశే — తనప్రభునకు పరమేశ్వరునియాశాసనమును ముం దందఁజేసి ఆయన కంఠదండలు గా సర్వమునకుఁ దానై వర్తించుపరాదేవతాశాసనము, మృదుమధురరీతిని వెంటనే వర్ణించుట యెంతో యౌచిత్యమును సంపాదించు చున్నది ఇట దేవిచిఱునవ్వు చాల గంభీరార్థస్ఫూర్తి కలదీ ఇట్టికైలాటపువర్తనములు పెద్ద లగువారికిఁ దగ వని, సోల్లుం ఠనము గా 'కామదాహకు లగుసంయమీంద్రు లిట్టివారా' యని ఎన్నో భావముల నిది వెలు పఱచి, ఆపరదేవతాసౌందర్యమున కగుపరాకాష్ఠ నతిగంభీరము గా స్ఫురింపఁ జేయు చున్నది

ఇట-భావోదయ మొకయలంకారము దేవి మాట లాడుటకు బదులు చిఱునవ్వు నవ్వినది లజ్జాభావ మిందుచే వ్యక్త మై, యది శృంగారాంగ మైనది భావోత్ప త్తేః పరాఙ్గత్వం భావోదయ ఇతి స్మృతః' అని (లక్షణము.) పరమేశ్వరునినర్మవాక్య ములకు చిఱునవ్వు నవ్వుటతోడిసమాధానము గాత్రారంభజన్య మగునసుభావమును 'విహృత' మను శృం గారలీలను, వ్యక్తమొనర్చినది ఈర్ష్యయా మానలజ్జాభ్యాం మద త్తం యోగ్య ముత్తరమ్ క్రియయా వ్యజ్యతే యత్ర విహృతం త దుదీరితమ్' అని (రసా.)

ఇచ్చట నాయిక వయోమధ్య 'సమానలజ్జామదనా ప్రోద్యత్తారుణ్యశాలినీ మధ్యా కామయతే కామమ్' అనియు (రసా ) ఇందు, పరమేశ్వరుల (సంభోగ) శృంగారము వర్ణింపఁబడు చున్నది ఇచ్చట, సుగంధికుంతలాంబామాతృభూతేశులు ఆలంబనవిభావ ములు. సదాశివునినర్మవాక్యములు నాయికానురాగమున కైనయనుభావములు. ఇవియే యామెయనురాగమున కుద్దీపకములు కనిన'- అనుటచే వ్యజ్యమానము లగుచున్న-తల వాంచుట, పరాయత్తచిత్తత తదభినయము. (దాని కైనలీలారవిందసత్రగణనాదులు) (నిజసౌందర్యాతిశయమున కైన) గర్వమానాదులు ఇందు వ్యభిచారులు. చిఱునవ్వు దేవియనురాగమునకు అనుభావము'. నాయకునియందలియనురాగమున కది యుద్దీప కము ఈ విభావానుభావదులచే సముల్లసిత మగు చున్నరతి,తద్భావభావనాభావిత మగుట చే రస' మయి సహృదయహృదయాస్వాద్య మగు చున్నది.

సూర్యచంద్రులుదేవివక్షోజములు గా ఉండుటఆగమరహస్యము 'సూర్యచన్ద్రౌ స్తనౌ దేవ్యాః తావేన నయనే స్మృతే ఉభే తాటఙ్క-యుగల మి త్యేషా వైదికీ శ్రుతిః' (సౌం ల వ్యా (లొల్ల ) సూర్యుడు ఎఱ్ఱనివాఁడు- శోణాని భౌమతీక్ష్ణాంశుతామ్ర కుఙ్కుమ తక్షకాః (కవిః ) కనుకనే మేరువు'-అనుట యుచిత మైనది చంద్రుఁడు తెల్లనివాఁడు.

శ్వేతవస్తుప్రకరణమున సుధాం శుభ్రైశ్చ్రవ శ్శుమ్భః' అని(కవిక ) కనుకనే కైలాస మనుట పొసగినది [తన-మా (అస్మదర్థకము). ఆత్మార్థం లోకానాకచో నామాస్మదర్థాభిధాయియు నగు' (చూ.ప్రౌఢ వ్యా.(శబ్ద 8సూ ) ]

ఉ అంబరకేశముఖ్యవిబుధావలిగర్భములం దడంగ వ
య్యంబుజసంభవాండనివహమ్ము లటం చని వాని నుంచఁ దో
రంబు గఁ జేయురీతి నుదరంబును బెంచినగుజ్జువేల్పు ని
త్యంబు గ మామకీనకృతి ధారుణిలోనఁ జెలంగఁ జేయుతన్

కవి నిజప్రభుని కాశీస్సు లనుపేరఁ దా నిష్టదేవతాప్రార్థనము. కృతిభర్త ప్రశంస సలిపి యిప్పుడు ప్రతిబంధనిరాసమునఁ దనకృతి నాకల్పస్థాయినిఁ గా వెలయఁపు మని విఘ్నేశ్వరుని వేఁడు చున్నాఁడు

అర్థ —అంబరకేశ (విబుధ+ఆవలి)గర్భములందున్-ఈశ్వరుఁడు మొద లగు పలువురుదేవతలయుదరములలో ఆ+అంబుజసంభవ+అండ-నివహమ్ములు-ప్రసిద్ధము లైనబ్రహ్మాండములసమూహములు. అనన్తబ్రహ్మాండములు (లెక్కపెట్ట లేని (యీ) చరాచరప్రపంచము లనుట) అడంగవు-ఇముడవు, చాలినంత యవకాశము గలవి కావు.అటంచు-అని వానిని-ఆప్రపంచములనన్నిటిని ఉంచన్-ఉండఁ జేయుటకు (వానికిఁ జాలినంతయవకాశము కల్పించుటకు). ఉదరంబున్-తనబొజ్జను తోరంబున్ గాన్- ఎక్కువదానినిఁ గా, చాలఁ బెద్దదానినిఁ గా, లంబోదరమును గా చేయురీతిన్-చేసినవిధమున-చేసినాఁడా యనునట్లు పెంచిన-(తనయుదరమును) వృద్ధిపఱచిన గుజ్జువేల్పు-వినాయకుఁడు (కర్త). మామకీన కృతిన్-నా దైన (యీ) కావ్యమును (ఆంధ్రభాషార్ణవంబు ననుట). ధారుణిలోన్- భూమియందు, భూలోకమునందు. నిత్యంబు గన్-శాశ్వతము గా చెలంగన్ చేయుతన్- వెలయఁ జేయుఁ గాక

తా - విఘ్నేశ్వరుఁడు సహజము గా లంబోదరుఁడు (పెద్దబొజ్జ గలవాఁడు) కవి యందుల కైనకారణము నొకదాని ని ట్లుత్ప్రేక్షించు చున్నాఁడు ఈ బ్రహ్మాండములు పెరిఁగి పెరిఁగి ఈశ్వరాదులయుదరములందుఁ దా మిము డక, నిలువ నీడ లేని వైనవి. లోకముల కైన యుట్టిదుస్థితిఁ జూచి, లోకాను గ్రహకామనతోఁ దనబొజ్జ నూరక పెంచి పెంచి తాను లంబోదరుఁ డై యీ ప్రపంచము లన్నిటికిఁ గావలసినంతతా వేర్పఱచినాఁడు. అందులకే మహా మహిమసంపన్నుఁ డగునాగణపతి ప్రతిబంధముల దూరీకరించి శాశ్వత ప్రతిష్ఠను దనగ్రంధమున కనుగ్రహింపవలయు నని యీకవి వేఁడుకోలు.

విశే —(అంబుజభవ + అండము)-బ్రహ్మాండము- తత స్స్వయంభూ ర్భగవాన్ అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్ త దణ్డ మభవ ద్ధైమం సహస్రాంశుసమప్రభమ్ తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మ సర్వలోకపితామహః స్వయ మేవాత్మనో ధ్యానా త్త దణ్డ మకరో ద్ద్విధా తాభ్యాం స శకలాభ్యాం చ దివం భూమిం చ నిర్మమే అని(అగమము.) శివాదులుగూడ నివసింపఁ దా మవకాశ మేర్పఱప లేనిప్రపంచముల కీతఁ డవకాశ మేర్పఱచుటవలన వారికంటెను మహామహిమసంపన్నుఁ డీతఁ డగుట వర్ణింపఁబడినది. గణపత్యుపనిషత్తు గణనాధుని నిట్లు ప్రశంసించు చున్నది 'త్వం ప్రత్యక్షం బ్రహ్మా ఽసి త్వం జ్ఞానమయో విజ్ఞానమయో ఽసి సర్వం జగ దిదం త్వత్తో జాయతే సర్వం జగ దిదం త్వత్త స్తిష్ఠతి సర్వం జగ దిదం త్వయి లయ మేష్యతి సర్వం జగ దిదం త్వయి ప్రత్యేతి త్వం భూమి రాపో ఽనిలః' (అని )

(అంబరకేశుఁడు) ( వ్యోమకేశుఁ'డనుట) వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః (ఉమ ) వ్యోమ్ని కేశాః యస్య' అనురీతిని వ్యాఖ్యలు వ్యోమకేశి' అనుచోట, సహస్రనామభాష్యమున భాస్కరరాయలు వ్యో మైవ కేశాః యస్యాః విరా డ్రూపాయాః' అను చున్నాఁడు. గుజ్జువేలుపు- గుజ్జువేలుపు పిళ్లారి కొక్కరాతు' అని (ఆం భా 1 43 ) కంధరంబునమండి గంధసింధుర మైన గుజ్జువేల్పుఁ గుమారగురునిఁ గొల్చి'-అని శ్రీనాధుఁడు (కా భీమ 3 85 )

అటంచు —ఇచ్చట, అటు- వాక్యాలంకార మనఁ దగినది ఇట్టివి కొన్ని వాక్యాలంకారములు గాఁ గవులు ప్రయోగించుట గలదు- కుంతియట్టులకై వడి'-అని తిక్కన (చూ భార శాం1 12 మొ.)

అలం — (పెంచినగుజ్జువేల్పు మామకీనకృతి చెలంగఁ జేయుతన్' - అనుటను) కావ్యలింగము, ఏతదంగము హేతూత్ప్రేక్ష

తే. జడమతులచేత నిందింపఁబడినకృతుల
నుత్తమము లంచు సత్కవు లొప్పుకొంద్రు
శునకదంష్ట్రల రాచినవెనుకఁగాదె
పసిఁడిసొమ్ములు దాల్తురు ప్రభువు లెల్ల

దేవతాప్రార్థనానంతరము కవి, సుకవిస్తుతి యొనర్చుచుఁ గుకవినిందను దాని కజ్గముఁ గా నొనర్చు చున్నాఁడు

అర్థి —సత్కవులు-మహాకవులు. జడమతులచేతన్-మందబుద్ధులచేత (బుద్ధివికాసమునకు నోఁచుకొననికుకవులచేత ననుట) నిందింపఁబడిన-(తమమిడిమిడి జ్ఞానమున కవి తెలియరామిని గుణములు దోషములు గాఁ జూపి) తెగడఁబడిన. కృతులు-మహాకావ్యములు. అనుత్తమములు (న+ఉత్తమములు) మహోత్కృష్టములు 'నవిద్యతే ఉత్తమా యస్యాః ('దేనికంటె ఉత్తమకృతి లేదో అది అని విగ్రహము ). అంచున్-అని. ఒప్పుకొంద్రు-సమ్మతింతురు (ఆదోషములు గుణము లగుటను దెలిసి మనసారఁ బ్రేమించి వాని నాదరింతు రనుట). అందులకు ఒక దృష్టాంతము ప్రదర్శింపఁబడు చున్నది. ప్రభువులు ఎల్లన్-అందఱు ప్రభువులు (ప్రభువు లెవ్వ రైనను-అనుట) శునకదంష్ట్రలన్-కుక్కపండ్లతో. రాచిన వెనుకఁగాదె -రుద్దినతరువాతనేకదా . పసిఁడిసొమ్ములు-బంగారుభూషణములు తాల్తురు-ధరింతురు

తా.—కుకవి ఏదేనికృతి నొకదానిని దోషభూయిష్ఠముఁ గాఁ దాను బ్రకటించి నప్పుడు, దానివలన మహాకవు లాతని బుద్ధిమాంద్యమునెఱిఁగి అది యొకమహా కృతి యగు నని దాని నాదరముతోఁ బరిగ్రహింతురు. ఆకుకవి యొకప్పుడు మంచికావ్య మని శ్లాఘించినచో, అల్పబుద్ధి యగునాతనికి నచ్చినయాకావ్యము, అవశ్యము దుష్కావ్య' మని తెలిసి (ఆతఁడు చూపినగుణాభాసములఁబట్టి తెలిసి) దానివంకకుఁ బోరు అందులకే, సత్కవిసమాదరణపాత్రము కావ్యము గావలయు నన్న. మునుముందు కుకవినిందిత మది కావలయు ననుచు వేంక నార్యుఁడు దీని కొకదృష్టాంతమును బ్రదర్శించు చున్నాఁడు మహాప్రభువులు సువర్ణా భరణములఁ దాల్చి తాము వాని నాదరింపవలయ నన్న వానికి శునకదంష్ట్రలతోడి రాయిడి చాల నావశ్యకము. అట్టిది జరగ కున్న విలువ గలయాభరణములే యైనను, వారు వాని నాదరింపరు (ధరింపరు )

విశే —సత్కవుల కావ్యములకుఁ గుకవిజనులయావశ్యకతను మఱికొందఱు గవులును వర్ణించినారు(తెనాలిరామలింగకవి)- (కాన దోషాత్మ లయినదుష్కవులకతన గరిమ వహి యించుఁ గవిరాజుకావ్యమహిమ బహుళపక్షంబుచీకటి బహుల మగుటఁ జాయవెన్నెల తరితీపు సేయుకరణి' (పాండు.1.15 ) (కూచిమంచితిమ్మకవి)- కుకవు లనువారు గలుగఁగ సుకవులకుఁ బ్రకర్ష గలిగె సులభంబు గ నూ రకయే భువనోపకృతులఁ గుకవుల నిరసింప వలదు గుణమాన్యులకున్' (సర్వ 1 12 ).

అలం —ప్రతివస్తూపమ (జడమతులు) పరికరాంకురము, అంగము. వ్యాజనింద వ్యంగ్యము(అలంకారధ్వని)

వ. అని యిష్టదేవతానమస్కారంబును సుకవి కుకవి పురస్కారతిరస్కారంబులునుం జేయునవసరంబున 5

[అర్థ— పురస్కారము (భావఘఞన్తము) - పురస్కృతి, పూజనము తిరస్కృతి. అనాదరము. సుకవిస్తుతి కుకవినింద-యనుట.]

విశే —తిక్కనాదులు నిర్వచనోత్తరరామాయణాదులయందు దేవతాప్రార్థనతోపాటు సుకవి స్తుతి కుకవినింద'ల గ్రంథాదిని వెలయించిరి ఆసంప్రదాయము నీతఁడును బాటించినాఁడు.

సీ. శ్రీమదింద్రాన్వయక్షీరవారిధిచంద్రుఁ
డాశ్రిత చేలాంచలామరమణి
కవిజన మందిరాంగణ పారిజాతంబు
బాంధవ కరగత స్వర్ణశిఖరి
యాచకజనగోష్ఠ ఖేచరనైచికి
వైదిక చిరజప్తకాదివిద్య
పదనత సామంత బహుజన్మసుకృతంబు
దృప్యద్విరోధితృతీయగురుఁడు

గీ పాండ్యమహిమండలాధ్యక్షబహుదండ
కలిత తేజిత చకచక త్కరకృపాణి
దానవిద్యాస్వశిష్యసంతానపాణి
రంజితజనాళి రఘునాథరాయమౌళి.

ఈ కృతిరచనకై, (నిజ) ప్రభువు (రాయ) రఘునాథరాయఁడు పేరోలగము నందుఁ దన్ను సమ్మానించి ప్రోత్సహించుట వర్ణించుచు, ముందు తదంగము గా నాతనిఁ బ్రశంసించు చున్నాఁడు వేంకనకవీంద్రుఁడు.

అర్థ.—రఘునాథరాయమౌళి-రఘునాధుఁ డనురాజశ్రేష్ఠుఁడు (కర్త). (మౌళి శబ్ద ముత్తరపద మైన శ్రేష్ఠార్థకము) [ఇది పైవచనములోని 'కొలు వుండి రపిప్పించి, చేయుచు- అనువానితోను, (12వ.)లోని అనన్, 13వ.లోని అనినన్' అనువానితోను సంబంధించి బహుక్రియాన్వయము గలది] ఈ రఘునాథమౌళి కైనవిశేషణము లివి- శ్రీమత్+ఇంద్ర+అన్వయ చంద్రుఁడు-కీర్తిమంత మైన, ఇంద్రవంశము' అనుపాలసముద్రమునకు చంద్రుఁడు (సముద్రమునకు చంద్రుఁడట్లు, తద్వంశ్యు లందఱకు స్వజననమున మహానందము కలిగించినవాఁ డనుట, చెప్పఁబడి, వంశోద్ధారకుఁ డగుట తెలుపఁబడు చున్నది). ఆశ్రిత చేల+

అంచల + అమరమణి-ఆశ్రితులకు వస్త్రపుఁగొంగునందు ముడిఁచినచింతామణి-(సేవకులకు చింతామణియట్లు సర్వాభీష్టము లొసఁగు మహోదారుఁ డనుట వచింపఁబడి ఆశ్రితరక్షకుఁ'డనుట తెలుపఁబడినది). కవిజనమందిర + అంగణ పారిజాతంబు-కావ్యకర్తలయిండ్లముంగిట వెలసి యున్న పారిజాతము' (ఆపేరి దేవవృక్షము) (తన్నుఁ జేరిన కవులు మఱొకరిని ఆశ్రయింప వలసిన యావశ్యకత లే కుండ వారికిఁ గావలసిన దెల్లను ఇచ్చురసజ్ఞశేఖరుఁడు, కవులపాలిటి పెన్నిధి'-అనుట తెలుపఁబడినది కవులయం దింతటియాదరము చూపుట కాతఁడు కవి కావలయును. కావున మహాకవి యనియు సూచింపఁబడినది). బాంధవ స్వర్ణశిఖరి-బంధువులకు చేతియం దున్న మేరువు (బంగరుఁగొండయే వచ్చి తమచేతియం దున్న దనునట్లు, సర్వసమృద్ధులు వారికిఁ గరగతము లై యుండ, సర్వభోగములు వా రాతనివలన అనుభవించుచు ఏచీకు చింత లేక నిర్వచారము గా ఉండుట చెప్పఁబడి బంధుప్రియుఁ డాతఁ డగుట తెలుపఁబడినది.). యాచక ఖేచరనైచికి - 'దేహి అనువారి కందఱకు (తమ) పసులసాలయందు కట్టి యుంచినకామధేనువు (అడిగినవారికి అడిగిన దెల్ల అడిగినవెంటనే, కోర్కులు నిండారఁ దీర్చెడిమహాదాత యనుట బోధిత మైనది). వైదిక చిరజప్త కాదివిద్య-శ్రోత్రియు లగువారికి చాలకాలము జపించిన కాది విద్య'(శ్రీవిద్యాభేదము) (భుక్తిముక్తులు రెండును వారికిఁ గలుగఁజేయు చున్నాఁ డనుట. ఇందుమూలమున సమయాచారప్రియు లగుబ్రాహ్మణులయందలి ప్రీతి ఆతని కసమాన మనుట తెలుపఁబడి ఆతఁడు విగ్రహము తాల్చినధర్మ మగుట తెలుఁపబడినది.). పదనత సుకృతంబు - పాదములకు ప్రణమిల్లి తన్ను సేవించుసామంతరాజులకు ఎన్నిజన్మములనుండియో ఆర్జించిన పుణ్యము (అదృష్టవిశేషము) (చిరకాలమునుండి వారు చేసినపుణ్య మంతయు ఈప్రభునియాకారము ధరించి వచ్చిన దనుట చెప్పఁబడి ఈరాజుదయాదాక్షి

ణ్యాదిసకల సద్గుణసముపేతుఁ డగుట తెలియ నగు చున్నది) దృప్యత్ + విరోధి తృతీయగురుఁడు-మదించినశత్రువులకు మూఁడింట ఉండుబృహస్పతి అనఁగా మాంకుఁడు (చంపువాఁడు). (ఇందువలన గొప్పశూరుఁడు, ప్రతాపవంతుఁడు-అతఁ డగుట తెలుపఁబడినది.) పాండ్యమహిమండల + అధ్యక్ష కృపాణి-పాండ్యభూమండలాధిపతియొక్క నిడు పైనభుజముపై (భుజదండముపై) ఉంచుకొనఁబడినది, పదును పెట్టఁబడి ప్రకాశించు చున్నది-అగుతనచేతికత్తి కలవాఁడు(పాండ్యదేశాధీశునంతటివాఁడు తనకుఁ గింకరుఁ డై తనఖడ్గము మోయుచుఁ దన్ను వెంబడించు చున్నాఁ డనుట ఇందువలన, సాటి లేనిమహావైభవము ఆతని దగుట తేటతెల్ల యగు చున్నది). దానవిద్యాస్వశిష్యసంతానపాణి-[ సశిష్య అపముద్రి.).]ఈవి యనెడివిద్యయందు తనకు శిష్యుఁడు గా ఐన, సంతానము అనెడి దేవతావృక్షము కుడిచేయి గాఁ గలవాఁడు (ఆతనిచేయి, దానమును (శిష్యునకు విద్యనట్లు) గాఢశిక్షతో దేవతావృక్షమునకు సైతము నేర్పునది గా ఉన్నది (అనఁగా సంతానవృక్షమును సైతము తల దన్ని అంతు పొంతు లేనిదానమొనర్చు చున్న దాతనిచేయి యనుట,ఇందువలన ఆతఁడు సాటి లేనిత్యాగముగలవాడగుట తెలుపఁబడు చున్నది ). రంజిత జన + ఆళి- సంతోషింపఁ జేయఁబడిన ప్రజాసమూహము గలవాఁడు(నిజ మగురా జాతఁ డనుట ఇందువలన అతనియెడ ప్రజాప్రీతి అసదృశ మనుట విశదపడినది) రాజా ప్రకృతిరఞ్జనాత్ అని (రఘు.)

విశే —(ఇంద్ర + అన్వవాయము-)-ఇంద్రవంశము,ఇంద్రుఁడు మూలపురుషుఁడు గాఁ గల వంశ మిది ఇంద్రుఁడు మానవస్త్రీనిఁ బెండ్లియాడ వారికిఁ గలిగినసంతతితోడి దిది (ముం దిది విశదపఱుపఁబడును (చూ 15ఎ )

పారిజాతము, సంతానము అనునవి దేవతావృక్షవిశేషములు కల్పవృక్ష మనునది విశేషనామము, సాధారణనామము గూడ - పఞ్చైతే దేవతరవో మన్దారః పారిజాతకః సన్తానః కల్పవృక్ష శ్చ పుంసి వా హరిచన్దనమ్' (అమ ). 'కల్పద్రుమాణా మివ పారిజాతః 'అని (రఘు ) పారిజాతము వీనిలో శ్రేష్ఠ మైనది అని కూడఁ బై (రఘు )

నైచికి —'ఉత్తమగోవు స్యాదుత్తమా గోషు నైచికీ' (అమ ).(ఖేచరనైచికి-దేవతా ధేనురాజము కామధేనువు.).

కాదివిద్య - 'శ్రీవిద్య' 'కాదివిద్య', హాదివిద్య' అని ఉపాసనాభేదమునుబట్టి రెండు విధములు.అగస్త్యాదులచే ఉపాసిత మైనది కాదివిద్య లోపాముద్రచే ఉపాసిత మైనది హాదివిద్య. కాదివిద్యయే నేఁడు ప్రధానోపాస్య గా ఉన్నది. 'కాదిహాదిమనురూపిణీ మహం భావయామి పరదేవతాం శివామ్'-అని శ్రీపరాదేవతయే తదుభయమన్త్రరూపిణి' గా వర్ణిత యైనది శ్రీవిద్యోపాసన భుక్తిముక్తిప్రదాయకము 'సమారాధ్య మహేశానీం భుక్తిం ముక్తిం చ విన్దతి' (భూ లలి త్రిశ శంక భా.).

తృతీయగురుఁడు —లగ్నమునకు మూఁడింట నున్నగురుఁడు మారకుఁడు శ్లోక మొకటి యిట్లున్నది-'చన్ద్రాష్టమం చ ధరణీసుతసప్తమం చ రాహు ర్నవం చ శనిజన్మ గురు స్తృతీయే అర్క స్తు పఞ్చ భృగుషట్క బుధ శ్చతుర్థే కేతువ్యయ స్తు జనితో మరణాయ సద్యః' (జ్యోతిశ్శాస్త్రము-బాలారిష్టప్రకరణము)

రంజితజనాళి — ఇది యీతనియందు రాజన్' శబ్దము సార్థకమైన దనుటను వచించుచును-'జజ్ఞే మహీపతిః పూరుః రాజా ఉభూ జ్జనరఞ్జనాత్' (విష్ణు .పు 714 అధ్యా.93శ్లో )

వైదికుఁడు — వైదికో ఉధీతవేదకః'-అని (వైజ )

అలం —మాలారూపకము

వ. ఒక్కశుభదినంబున వివిధకవిబుధసముదయనిరంతరసమాగమంబు మెఱయ నుఱుముచినుకుమొగిలుతెగ లన సబ్బంహితమదమదావళరాజి రాజిల్ల, ఖచర పురవరస్థితతురంగం బే నేన యని యభినయించురీతినిఁ గైజామోరలు చేయు నిరాఘాటధాటీసమాటీకఘోటీపటలంబు జటిలం బగుచు నుండ, వేల్పుల కిక్క యు నమృతంబుచుక్కయు నిడుటకు నమందానందంబుఁ జెందుమేరుమం దరంబులు సమదభద్రగజంబుల నొసంగ నదసీయదానంబులం బొగడు వడువున భూరిభేరుల గంభీర భాంకారంబులు చెలంగ నధివసించి కవిజన దారిద్ర్యంబులు నిరాకరించు చందంబున నిందువదనాకరార విందసముత్సారితంబు లగుచామరంబు లొలయ నిరంతర శ్రీమంతు

లగుసామంతులును, రూపజితమారు లగురాజకుమారులును, గుణసింధువు లగు బంధువులును, సలలితతంత్రు లగుమంత్రులును, సకలవిద్యాసరోజసీంవు లగుకవులును వాదైకధుర్యు లగుశాస్త్రివర్యులును, నాదసుఖసంధాయకు లగుగాయకులును, భరతకళారహస్యోత్కటు లగునటులును, శృంగారకణిక లగుగణికలును, గొలువ సభాంతరాళంబునఁ గొలువుండి నన్ను రప్పించి సన్మానంబు సేయుచు వినయంబున.

ఇందు రఘునాధరాయలు కొలు వుండుట వర్ణించి, యం దీకృతి కైన యం కురార్పణమును వచించు చున్నాఁడు కవి

అర్థ-ఒక్క-శుభదివసంబున-(గ్రహసంపత్తిచే) శుభము కలిగించెడి యొకదినమునందు. వివిధకవిబుధసముదయనిరంతరసమాగమంబు-వేఱువేఱు కవితారీతులు గల కవులగుంపుల యొక్కయు శాస్త్రవైవిధ్యము గల పండితసంఘములయొక్కయు ఎడతెగనిరాకలు-(ఇచ్చట ..నిరంతరసమాగంబునన్ అని (వావి.పా.) అనన్వితమనిపించినది).మెఱయన్-ప్రకాశింపఁగా. ఉఱుముచినుకుమొగిలుతెగలు+అనన్-ఉఱుములు (వాన) చినుకులు గలమబ్బులగుంపులు అనునట్లు సబృంహితమద మదావళరాజీఘీంకారములతోను (ఏనుఁగులధ్వనులు ఘీంకారములు) వానితోను మదముతోను గూడిన ఏనుఁగులబారులు (బారులు తీరిన యేనుఁగులు). రాజిల్లన్-ప్రకాశింపఁగా. ఖచరపురవరస్థితతురంగంబు-దేవతలగొప్పపట్టనమునందు ఉన్న గుఱ్ఱము; ఉచ్చైశ్శ్రవము (దేవతాశ్వము). ఏను ఏను+అ-నేను (నీవు గాదు నేనే ') అని. అభినయించురీతిని-చేష్టలతో (ఒక టొకటి) మనోభావము ప్రకటించెడివిధమున. కైజామోరలు-శిరఃకంపనములు(తలలు పైకిఁ గ్రిందికి ఊఁపుటలు). చేయు - ఒనర్చు చున్న నిరాఘాట ధాటీ సమాటీక ఘోటీపటలంబు-దండయాత్రలయందు అడ్డు లేని విహారము గల గుఱ్ఱముల గుంపు. జటిలంబు - క్రిక్కిఱిసినది. అగుచున్-ఉండన్ (కొలువునందు - అనుట). వేల్పులకు — దేవతలకు ఇక్కయున్ - నివాసమును. అమృతంబు

చుక్కయున్-అమృతపుబొట్టును; కొలఁదియమృతమును ( అమృతకలశము న అనుట ). ఇడుటకు-ఇచ్చుటకు, ఉండ నిల్లు తినఁ దిండి ఇచ్చినందులకు (నివాస మిచ్చినది మేరువు. దేవతలు మేరునివాసులు- రత్నసాను స్సురాయః' (అమ ). అమృత మిచ్చినది మందరము- మందరము కవ్వము చేసి పాలసంద్రము మథిం పఁగా అమృతము కలిగిన దని పురాణగాధ(యథాసంఖ్యాన్వయము) న + మంద ఆనందంబు- గొప్పసంతోషము చెందు-అనుభవించు చున్న మేరుమందరంబులు (కర్తలు). ( మేరుమందరంబులకు' అని వావి అపము ) సమద (సహ + మద) భద్రగజంబులను-మదముతోఁ గూడినభద్రజాతియేనుఁగులను(చక్రవర్తులు ఎక్కఁ దగినవాని ననుట). ఒసంగన్- ఈయఁగా (ఆపర్వతములనుండి కొని తెచ్చిన యేనుఁగు లివి యగుటను, అవి యిచ్చినట్లు చమత్కరింపఁబడు చున్నది. ఇంద్రా దులకు ఉనికి తిండి యిచ్చినయివి అందులకుఁ గొదవ లేనియీతనికి ఊరేఁగు ట కది కావలసి యున్నయుత్తమగజముల నిచ్చి సంతృప్తి చెందిన వనుట వచిం పఁబడు చున్నది.) [ఈతరువాత నున్న 'అధివసించి - అనునది చెలంగన్ తరువాత ఉండ వలయు ననిపించినది ] అదసీయదానంబులం బొగడువడువున్- [అదవీయ దానంబునన్ అపముద్రి ) ]వీనియీదానమును పొగడువడువున్- స్తుతించు చున్న వనునట్లు భూరిభేరులగంభీరభాంకారంబులు- పెద్దదుందుభులయొ క్క (ఢంకాలయొక్క) (ఉఱుము ఉఱిమినట్లు)(మోయు భామ్' అనుపెద్దధ్వ నులు. చెలంగన్-విజృంభింపఁగా అధివసించి- (సింహాసనము) ఎక్కి. (ఇంతవ ఱకు రాయలు కొలువుప్రవేశించి సింహాసన మెక్కుట కగుపూర్వరంగము వర్ణిం పఁబడినది. ఎక్కినతరువాతివృత్త మిఁక వర్ణింపఁబడు చున్నది.)కవిజనదారిద్ర్యం బులు-కవిసంఘంబుల కైన లేములను, నిరాకరించుచందంబున్-త్రోసివేయు చున్నవో యనునట్లు. ఇందువదనాకర + అరవింద-సముత్సారితంబులు-చంద్రుని వంటిమొగము గలవారు,సౌందర్యవతు లగుస్త్రీ లనుట (వారియొక్క) పద్మములఁ బోలినచేతులతో, మృదుహస్తములతో త్రోసివేయఁబడు చున్నవి,గెంటఁబడు చున్నవి, ఇటు నటు నూఁగింపఁబడు చున్నవి, విసరఁబడు చున్నవి (అగు).

చామరములు-వింజామరములు ఒలయన్- ప్రకాశింపఁగా నిరంతరశ్రీమంతులు-
ఎల్లకాలము సంపద గలవారు ఏనాఁడు దారిద్ర్య మెఱుఁగనివారు (ఆగర్భశ్రీమంతు
లనుట). అగు (అట్టివారు) ఐనసామంతులును- మండలేశ్వరులును (అల్పదేశ
మునకు అధిపతులు గా ఉండి కప్పము చెల్లించురాజులును). రూపజితమారులు
సౌందర్యముచే గెలువఁబడినమన్మథుఁడు గలవారు, అతిసుందరు లనుట (అగు )
రాజకుమారులును-రాచబిడ్డలును గుణసింధులు-సుగుణములకు సంద్రమువంటి
వారు, అంతు లేని సుగుణములు గలవారు అగు బంధువులును సలలిత(సహ +
లలిత) తంత్రులు-సుకుమార మగుతంత్రముతో(మిత్రలాభమిత్రభేదాదినీతిప్రయో
గముతో కూడినవారు అగు మంత్రులును సకలవిద్యాసరోజనీరవులు-సమస్తవిద్యలు
అనెడిపద్మలకు సూర్యునివంటివారు విద్య లన్నిటిని బాగుగాఁ బ్రకాశింపఁ జేయు
వారు (అన్నివిద్యలయందుఁ బ్రసిద్ధి చెందినమహామహు లనుట) అట్టివారు అగు.
కవులును-విద్వత్కవులును అనుట. వాద + ఎకధుర్యులు-శాస్త్రవాదములందు ప్రధా
నము గా ముం దుండువారు(శాస్త్రార్థమునందు బాగుగా ఆఱితేఱినవా రనుట)అట్టి
వారు అగు శాస్త్రివర్యులు-గొప్పశాస్త్రజ్ఞులును నాదసుఖసంధాయకులు-కంఠవీణా
దులవలనిధ్వని నాదము.బ్రహ్మానందము గలిగించెడియాధ్వనియే నాదబ్రహ్మము.
తదుపాసనయే గానము. ఆగానము చేయువారే గాయకులు అట్టినాదమువలనిసౌఖ్య
మును, బ్రహ్మానందమును జేకూర్చువారు అగు గాయకులు. భరతకళారహస్య +
ఉత్కటులు-నాట్యవిద్యయొక్క మర్మములచే,వానిని బాగుగాఁ దెలియుటచే,గొప్ప
వారు (భరతమునిప్రణీతము నాట్యశాస్త్రము ఆకళయందు బాగుగాఁ బాఱంగతులై
పేరుప్రతిష్ఠలు సంపాదించినవారు అనుట అట్టివారు అగు.నటులును-నాట్య మొన
ర్చువారును. శృంగారకణికలు-శృంగారశలాకలు-శృంగార మంతయుఁ గరఁగి అ
చ్చునఁ బోసినకడ్డీలు. శృంగార శబ్దము ఇట తత్పోషకము లగుశృంగారచే
ష్టలయందు హావభావాదులందు లాక్షణికము (దిద్ది తీర్చినవిభ్రమవిలాసాదులే వీ
రై యున్నా రనుట వచింపఁబడు చున్నది.) అట్టివారు. అగుగణికలు-వేశ్యలు కొ
లువన్-(తన్ను)సేవింపఁగా సభా+అంతరాళమునన్-సభామధ్యమున కొలువుఉండి

కొలువుతీరియుండి, సభచేసి యుండి (వారివారిసేవలు చిత్తగించు చుండి యనుట). నన్నున్ (వేంకనకవీంద్రునిన్) రప్పించి. సన్మానంబు చేయుచు -గౌరవించుచు వినయంబునన్- అడఁకువతో (పైకి అన్వయము. కవిమాట లివి)

విశే — కైజామోర యన హస్తశీర్షకంపనము వెలయు' (అం. భా 2. 200). 'సభాసహా జలక్షణమ్' అని శాస్త్రము ఆసహా జము లిందు విశదపఱపఁబడినవి నాదమును ఒకమహాకవి అనందబ్రహ్మము' గా ఇట్లు వర్ణించు చున్నాఁడు వీనులవిం దై యమృతపు సోనలపొం దై యమందసుమచలదళినీ గానమ్రుక్రం దై యారవ మానంద బ్రహ్మ మను నధిపతి వలికెన్' (వసు.2. 14. ).

చతుర్విధకవితలు — పాండురంగమాహాత్మ్యకర్త యి ట్లను చున్నాఁడు- నలుదెఱంగుల నెన్నఁ గలకావ్యధారల, ఘనుఁడ వాశువునందుఁ గరము మేటి (1 23.) అవి 'బంధకవిత్వ, చిత్రకవిత్వ, గర్భకవి,త్వాశుకవిత్వము - లనుభేదములు గలవి అని కొందఱు (చూ. అప్ప). చిత్ర విస్తర మధు రాశువులు-అని కొందఱు ('చిత్ర వి స్తర మధు రాశులిలఁ గవితల్ రచియింపఁగ నేర్చె ' (చూ తారా. 2. 54.).

క. ఖచరీకచకుచవిచల
ద్విచికిలహారస్రవన్నవీనమరంద
ప్రచురరుచిఁ బెనఁగొనుఁ గదా
కచి గా నీకవిత లెన్నఁ, గవివెంకన్నా 8

రఘునాథరాయల ముఖమునఁ గవి యిందు తనకవితాప్రశస్తిని బొందుపఱచు చున్నాఁడు.

అర్థ.—కవివెంకన్నా-కవి యైనవెంకన్నా! (వెంకనకవీ యనుట.) ఇది సంబోధనము (కవినిఁగూర్చినరాయలమాట లివి). ఎన్నన్- పరిశీలింపఁగా. నీకవితలు ఖచరీ కుచ కచ విచలత్ విచికిలహార స్రవత్ నవీనమరంద ప్రచురరుచిన్-అప్సరస్త్రీలయొక్క, వక్షోజములయందు, శిరోజములందు (కేశపాశమునందు) కదలు చున్న (గాలిచేతను సవిలాసగమనాదులచేతను) అటు నిటు ఊఁగు చున్న మల్లె పూలదండలనుండి ఓడిగిలు చున్న క్రొత్తపూఁదేనెయొక్క గొప్పకాంతితో

(కాంతిమంత మగుక్రొత్తపూఁదేనెతో అనుట). కచాకచి,కా॥ (ఒకరిజుట్టొకరు పట్టుకొని పరస్పరము జరపుకొనుయుద్ధము కచాకచి అది కలుగఁగా. పెనఁగొనున్-కలియఁబడును (అట్టిమకరందముతో అన్నివిధముల సామ్యము కలది గా ఉండును- అనుట).

తా — పూవుఁదేనె సహజము గా మాధుర్యము సువాసన గలది. అందును మల్లెపూలతేనె సర్వజనసమాదరణీయ మగుసౌరభము మాధుర్యము విశేషము గాఁ గలది ఆమల్లెపూలదండలును, దేవతాసుందరులు తమవక్షోజాదులయందు ధరించినవి (ఇందువలన అవి దివ్యములు లోకాతిశాయిసౌరభరసజ్ఞజనతామోదాదులు గలయవి. అట్టిమకరందమును బోలినవి (మన) వెంకనకవీంద్రునికవితలని రాయఁడు స్తుతించు చున్నాఁడు.

విశే — ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహులం బహు' (అమ)

విచికిలము —ఒక జాతి మల్లెపువ్వు ఇది చాలసువాసన గలది 'స్మృతో విచికిలో మల్లీ ప్రభేదే దమనే ఽపి చ' అని (విశ్వ) మల్లీవిశేషవాచకమే' కాక, తత్సాధారణ వాచకము గూడ నిది - (చూ శ ర.మొ)

(ఖచరీ-) అచ్చరస్త్రీ లనుటనుబట్టి, అందచందములు చక్కని తీరుతెన్నులు, వారి వక్షోజకుచవిచలనవర్ణననుబట్టి- సర్వజన మనోహరత్వమున కగునౌచితి, రసపరిపుష్టి, (నవీనమరందము-అనుటనుబట్టి) గుమగుమ లాడుసౌరభముతోపాటు అనితరసాధారణ మగు తియ్యఁదనము (స్రవత్-అనుటచే) నిరాఘాట మగుధారాశుద్ధి, (ప్రచుర రుచిన్' అనుటచే) సముచిత మగునోజోగుణబాహుల్యము వేంకనకవీంద్రుని కవితా గుణము - అని స్ఫురించును

(కచాకచి) తత్ర తే నేద మితి సరూపే' (2 2.27) అని బహువ్రీహిసమాసము ఇచ్ కర్మవ్యతీహారే' (5 4 127)అని ఇ'చ్ప్రత్యయము (సమాసాంతము) 'అన్యేషామపి దృశ్యతే' (6 1 137) అని దీర్ఘము (కేశాకేశి)వంటిది (అవ్యయము).

వెంక + అన్న- అన్న' అనుశబ్దము పురుషనామములకు అనుప్రయుక్త మగును. తిక్కన్న' మొ. వంటి దిది.

ఉలం — కవాకచి గాఁ బెనఁగొనున్ అనుట ద్వేష్టి' అనుట కించుమించుగా సమానము సంస్కృతమున ద్వేష్టి' మొద లగునవి ఉపమానవాచకము లని ఆచార్యదణ్డి- స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి ఆక్రోశ త్యవజానాతి కదర్థయతి నిన్దతి త మన్వే త్యనుబధ్నాతి తచ్ఛీలం త న్నిషేధతి తస్య వా ఽనుకరో తీతిశబ్దా స్సాదృశ్యవాచకాః ఉపమాయా మిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః' అనినాఁడు వివాహ శ్చ వివాద శ్చ సమయో రేవ శోభతే'అని(పరస్పర) వివాదముగూడ సామ్యమునే వచించును (కావున) ఉపమ

వాక్కులకు సౌరభము వర్ణించుట కవిసమయసిద్దము విమర్దవ్యక్తసౌరభ్యా భారతీ భారవేః కవేః' అని (మధురావి 19 మొ ) శ్రీనాథుఁడు వేమారెడ్డిముఖమునఁ దనకవితల నిట్లు ప్రశంసించినాఁడు దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ గంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న ధ్యక్షించుం గవిసార్వభౌమ భవదీయప్రౌఢ సాహిత్యముల్' (కాశీ పీ 14 ) (ఇదియే యీపద్యరచనకు మూలము గావచ్చును )

తే. ఆంధ్రగీర్వాణకవనంబులందు నీకుఁ
గలుగుజ్ఞానం బ దేరికిఁ గలుగ నేర్చు?
నాశ్రితుఁడ వంచు నుతియించునట్లు గాదు
కాని యవి యిపు దేల?వెంకనకవీంద్ర

ఈమహానిఘంటునిర్మాణమునకు వెంకనకవియే యర్హుఁ డగుట తెలుపఁబడుచున్నది

అర్థ —వెంకనకవీంద్రా -(ఉద్దండకవి వైనవెంకన్నా ) ఆంధ్రగీర్వాణకననంబులందు-సంస్కృతాంధ్రభాషాకవిత్వములందు (వానియెడ ననుట విషయసప్తమియిది). నీకున్. కలుగు—ఉన్న జ్ఞానంబు-ఎఱుక (ఉభయభాషాపరిశోధనమున నైనయుద్దండవిజ్ఞానము- అనుట) ( అది -ఇది వాక్యాలంకారమున కైనది). ఏరికిన్-ఎవరికి, కలుగన్ నేర్చున్-కలుగుట సంభవించును, కలుగును, ఎవరికినిఁ గలుగ దనుట) ఇది ముమ్మాటికి నిజము పక్షపాతముతో వచించుమాట

గా దను చున్నాఁడు ఆశ్రితుఁడవు - (మమ్ము) ఆశ్రయించినవాఁడవు (మా యాస్థానకవివి యనుట) అంచున్-అనుచున్ అనుకొనుచుఁ నుతియించునట్లు-పొగడురీతి కాదు. అవి-ఆప్రశంసలు (దానిఁగూర్చినచర్చ లనుట). ఇప్పుడు-ఈ సమయమున ఏల-ఎందులకు ప్రయోజనము లేనివి (ఔను గా దనెడి యాచర్చలతో ప్రకృతకార్య్యవిలంబము సముచితము గా దనుట) కాని-కానిమ్ము (కానిమ్ము-అనుదానికి (రూపాం.) ఐన కానీ కి (రూపాం) అనఁ దగిన దిది). ప్రకృతకార్యము జరగ నిమ్ము (ప్రకృత మనుసరింత మనుట)

విశే —(వెంకనకవీంద్రా) ఇచట-కవీంద్రా' అనుపదము-'ఉద్దండకవి' బిరుద మీతనికిఁ గల దనుటను సూచించు చున్నది ఈపద్యము ఈతఁ డుభయభాషలఁ దరిచి చూచిన మహాకవివతంస మగుట వచించి ఆబిరుద మీతనియెడ సార్థక మను చున్నది

(అది) పాదపూరకము దీని నిట్లు నన్న యాదులును ప్రయోగించినారు- పాండవుల విభవ మది యాఖండలవిభవమునకంటెఁ గడుమిక్కిలి యై' (చూ భార.సభా 2 104 మొ)

తే దేవతలభాష గావునఁ దెలుఁగుకన్న
సంస్కృతము మిన్న యాయుక్తి సరియె తెలిసి
రసికుఁ డగువాఁడు తనదుజాలుసికరోనఁ
దులసినే యిడుకొనునొ? జాదులనె యిడునొ? 10

వెంకనకవీంద్రునిచే తెలుఁగునిఘంటువు రచింపఁ జేయఁ దలపెట్టిన రఘునాధరాయఁడు, దేశభాష కావ్యరచన కాదఁణీయము' అనుటను ముందు నిరూపించు చున్నాఁడు.

అర్థ —దేవతలభాష - దేవతలు మాటాడుభాష కావునన్-అగుటచే. తెలుఁగుకన్నన్ సంస్కృతము మిన్న - గొప్పది. ఆయుక్తి- ఆహేతువు (లేక) ఆ మాట.సరియె - యుక్తమే ఉచితమే (కా దనుటకు వీలు గాని దనుట) రసి

కుఁడు - రసజ్ఞుఁడు ఉచితజ్ఞుఁడు (ఏది యెందుల కుపయోగపడునో బాగుగా తెలిసినవాఁ డనుట). ఎఱిఁగి-తెలిసి (ప్రమాదమునఁగాక బుద్ధిపూర్వకము గానే యనుట) తనదు - ఆతని దగు జాఱుసికలోనన్ - (చక్కఁగా దువ్వి అంద చందములతో)వదులు గా అమర్చుకొనినజుట్టునందు(ముచ్చటముడియం దనుట) తులసినే ఇడునొ? (అలంకారము గా) పెట్టుకొనునా? (లేక) జాదులనే - జాజి పూవులనే. ఇడునొ - ధరించునా? (జాజిపూలనే ధరించు ననుట).

తా —సంస్కృతభాష దేవతాభాష అది యట్టి దగుటనుబట్టి సర్వజనపూజనీయ ము, సందేహము లేదు. అంతమాత్రమున నాయా దేశములవారి కాయాభాషలు కావ్యరచనకు గ్రాహ్యములు గా వనుటగాని, సంస్కృత మందులకుఁ బరిగ్రాహ్య మనుటగాని పొసఁగదు. తెలుఁగువారికిఁ దెలుఁగే కావ్యరచన కర్హము. అట్టిది సంస్కృతము గాదు తులసి భగవదారాధన కగు పూజాద్రవ్యములయం దెల్ల నుత్తమోత్తమము ఐనను నందచందములకై త న్నలంకరించుకొనునపుడు వివేకి దానిగౌరవ మెఱిఁగినను దనకేశపాశమున దానిని దుఱుమఁడు. జాజిపూవులనే యందు ధరించును గౌరవము వేఱు ఉపయోగము వేఱు. ఇది ప్రత్యక్ష దృష్టము, వేఱు గా దీనిని వచింప నక్కఱ లేదు. అట్టిదే సంస్కృతాంధ్రముల దైనస్థితి.

విశే —తన దగు -వాని దగు తాను శబ్దము తచ్ఛబ్దార్థకమును గలదు. తాముసుం దామను నేఁటిదాఁక మమతం దగ నర్మిలిఁ గూడి యున్నవారు' (విప్ర 4 72)

(దేవతలభాష) గీర్వాణవాణి' యనునామము సంస్కృతమునకు సుప్రసిద్ధము దేశ భాషాకావ్యములు పరిగ్రాహ్యములని నన్నయబాలసరస్వత్యాదు లిట్లు తెలిపినారు స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చా ఽన్య దపహాయ'(ఆంధ్ర చిం.2శ్లో) ఇచ్చట- బలవదిష్టానుబంధు లయినయెడల విషిద్ధ ములు సహ గ్రాహ్యములు క్రత్వర్థము గవాదిప్రతిగ్రహము ధర్మార్థము కొటసాక్ష్యా దికము తీర్థయాత్రార్థము కీకటాది ప్రవేశము - మొద లైనవి 'దేశభాషాపురాణాని రచితాని చ మానుషైః శ్రుత్వా కావ్యేతిహాసాం శ్చ భయ మాప్నోతి మానవః' అను

వచనములకుఁ దాత్పర్యము వేఱు స్వదేశవ్యతిరిక్త దేశభాషానిబద్ధము లైన రామాయణ భారత భాగవతాదులు జన్యబుద్ధిచే నాచరింప వల దనుట వానితాత్పర్యము (చూ బాలస వ్యా ) కనుకనే పద్మపురాణ మి ట్లనినది- తత్పురాణార్థములు విదితములు గాఁగ దేశభాషలలోపలఁ దెలియ జేయు వ్యాఖ్యలును గ్రంథములును బుణ్యావహంబు లగుట నవివోలె గౌరవార్హములు చూవె' (ఆంధ్ర పద్మ పాతా.2328ప ).

అలం —అప్రస్తుతప్రశంస అప్రస్తుత మగు తులసి జాతీకుసుమ ధారణ వృత్తాంతముచే గౌరవము వేఱు ఉపయోగము వేఱు' - అనెడి ప్రస్తుతవృత్తాంతము గమ్యము

తే కాన యీయాంధ్రకృతులందుఁ గలుగునట్టి
పదములకు నెల్ల నర్థ మేర్పడెడురీతి
నద్భుతంబు గఁ గృతినిఁ జేయంగ వలయు
నర్థ మైన రసస్ఫూర్తి యగుట యరుదె? 11

ప్రకృతము నిర్మింపఁబడవలసిన కృతిరాజమున కగు స్వరూపస్వభావములు దాని కగునావశ్యకత యిందు వచింపఁబడు చున్నది

అర్థ·—కాన- ఆంధ్రకృతు లాదరణీయము లవునుకావున ఈయాంధ్రకృతులన్- ఈతెలుఁగుకావ్యములందు కలుగునట్టిపదములకుఁ ఎల్లఁ-ఉన్నశబ్దముల కన్నిటికి అర్థము ఏర్పడెడురీతిన్-విశదపడెడు విధమున కృతిని-కావ్యమును(పద్య నిఘంటువు ననుట) అద్భుతంబు గఁ - ఆశ్చర్యము కలుగునట్లు గా (జను లందఱు మెచ్చుకొనునట్లు గా - అనుట) చేయంగఁ వలయును- చేయవలయును. అర్థము ఐనన్ - అర్థము తెలిసినచో (ఏపదమున కేది యర్థమో బాగుగా తెలిసినప్పు డనుట) రసస్ఫూర్తి- రసస్ఫురణము (శృంగారాది రసాస్వాదనమువలని యానందానుభూతి యనుట). అగుట - కలుగుట అరుదె - వింతయా? కాదు (తప్పక జరగు ననుట)

తా —అచ్చతెలుఁగుపదముల కర్థము తెలియనందున అర్థవ్యక్తి కొఱవడి రసవంతము లైన తెలుఁగుకావ్యముల యానందరసానుభూతి తెలుఁగువారికి

దూర మగు చున్నది. అందులకే యాంధ్రకృతుల నన్నిటినిఁ బరిశోధించి, సమగ్రము గా వానిలోనియెల్లశబ్దములకుఁ దేటతెల్ల గా నర్థము విప్పిచెప్పఁ గల మహానిఘంటు వొకటి నిర్మింపఁబడ వలయు నని రాయఁ డను చున్నాఁడు.

విశే —ఏతత్ప్రసంగముఁబట్టి 'ఈయాంధ్రకృతులందుఁ గలుగునట్టిపదముల కెల్లన్ అనుటఁబట్టి - ఇది యచ్చతెలుఁగునకు సమగ్ర మగు నొకమహానిఘంటు వగుట, ఇట్టినిఘంటువు లిదివఱకు బయలువెడల కుండుట బహుపరిశ్రమమున సాధిత మిది యగుట సూచిత మైనది అర్థవ్యక్తి రసపోషక మగు నొకగుణము దీనికి లక్షణ మిట్లు వచింపఁబడినది- అర్థవ్యక్తిః పదానాం హి ఝటిత్యర్థసమర్పణమ్'(సాహి 8పరి 11శ్లో) ప్రసాద' మనుగుణమునందు దీని కన్తర్భావము వచించినాఁడు గూడ సాహిత్య దర్పణకర్త - అర్థవ్యక్తేః ప్రసాదాఖ్యగుణే నైవ పరిగ్రహః' (అని) ప్రతిగ్రంథమున కును అనుబంధచతుష్టయ' మావశ్యకము అది యిందు తెలుపఁబడినది (అవి)- విషయము 2. సంబంధము 3 అధికారి 4 ప్రయోజనము - అనునవి ఇట విషయము - సకలాంధ్రకృతులందలి యాంధ్రశబ్దార్థములు సంబంధము - ప్రతిపాద్య ప్రతిపాదకభావము ఆధికారి - ఆంధ్ర పద పదార్థ జిజ్ఞాసువు. ప్రయోజనము-ఆంధ్ర శబ్దార్థపరిజ్ఞానము తద్ద్వారమున నైనయాంధ్రకావ్యరసానుభూతి

తే కృతికి నాయకు మాతృభూతేశుఁ జేయ
వలయు నన నేను నట్ల కాఁ దలఁచితి ననఁ,
బసిఁడిసొమ్ములు నేయించి వంటరాళ్లఁ
జెక్కనను మేలె? రత్నముల్ చెక్క కున్న

ఇందు రాయలమహౌదార్యము, సహృదయత ఈశ్వరభక్తి తెలుపఁబడు చున్నవి

అర్థ — కృతికిన్-ప్రకృతకావ్యమునకు నాయకున్- (కృతి) భర్తను మాతృభూత + ఈశున్- మాతృభూతస్వామిని (త్రిశిర్ష నగనివాసి యగు ఆపేరి శివుని) చేయంగన్ వలయును-చేయుట ఆవశ్యకము. అనన్-(రఘునాధరాయలు-

కర్త) పలుకఁగా నేనును (కవిమాట లివి) అట్ట కాన్ (అట్టు + ఆ + కాన్) అట్టే అని తలఁచితిని- భావించితిని (ఉచితజ్ఞు లగుమీరు దీనికి కృతిభర్త లగుట కియ్యకొన రని నేనును మీ రనుకొనినట్లె యనుకొంటి నని కవి యనుచున్నాఁడు ప్రభువుతో) అనన్- (వేంకనకవి కర్త) చెప్పఁగా (ఇఁక రఘునాధరాయలమాటలు) పసిఁడిసొమ్ములు- బంగారునగలు. చేయించి రత్నముల్- (దానికిఁ దగునట్లు విలువ గల) మహామణులు చెక్కక ఉన్నన్-చెక్క కుండినను వంటరాళ్లన్- (మంటితో వండిన) కృత్రిమమణులను. చెక్కినను- పొదిగినను మేలె-ఉచితమా? రెండును న్యాయములు గావు (విలువ గలవస్తువు విలువ గలవస్తువుతోఁ గూడినప్పుడే జనాదరణపాత్ర మగు ననుట). (పైవచనములోని అనినన్ క్రియతో దీని కన్వయము)

తా — రచించెడిది మహాగ్రంథము అది యొకమానవునకుఁ గృతి యిచ్చుట విలువ గలబంగారునగ యొకటి చేయించి గాజుపెంకుల నందుఁ బొదుగుటవంటిది అది చాలఁ బరిహాసాస్పదము బంగారము రత్నములతో సమ్మిశిత మైనపుడే శోభించును అట్లే ఈకృతియుఁ దనకుఁగాక మాతృభూతేశ్వరస్వామి కంకిత మైనప్పుడే శాశ్వతప్రతిష్ఠ కవికినిఁ దనకును సంపాదించు నని రాయఁడు తన యుచితజ్ఞత మహౌదార్యము పరమేశ్వరభక్తిపారమ్యము తెలుపుచు వెంకనకవితో సంభాషించినాఁడు

విశే — 'రత్నం సమాగచ్ఛతు కాఞ్చనేన' అని (రఘు) (అట్టు- అ + కాన్) 'అకానిత్యర్థకంబు' అని (ప్రౌఢవ్యా క్రి 33సూ) 'అపజయము కా లక్షించి' (భా. 2 62)

చేయ వలయున్- 'వలయుప్వాదిక్రియలకుఁ గర్త యగుభావంబునందు నుజీ యగు' (బాల క్రి 122సూ) 'పనుప వలసె దూతభావ మపేక్షించి దేవహితము దీనిఁ దీర్పవలయు' (భార ఆది 37) 'చేయన్' అందీనికి కన్ కాన్ అనుప్రయుక్తములై 'చేయఁగ వలయున్' అనురీతినిఁ గవిప్రయుక్తము లైనవి (చూ భార సభా

93.మొ ) కనుకనే కృతినిఁ జేయంగ వలయు ననినాఁ డీకవి (చూ ముందుపద్యము )
అలం కావ్యలింగము సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్' అని
లక్షణము.

వ అనిన నేనుం దదీయపరమేశ్వరచరణారవిందభక్తికి మెచ్చుచు సత్కులప్రసూ
తుండ వగునీకు నేతాదృశమనీషావిశేషం బరుదే యని తత్కులప్రశంస
సేయం దలంచి 3

కవి, యేతత్కృతికిఁ బ్రోత్సాహకుఁ డై తనకుఁ బ్రభు వైనరఘునాథరా
యలవంశ మభివర్ణింపఁ దలచి యందుల కొకసందర్భము గల్పించు చున్నాఁడు

అర్థ — సత్కులప్రసూతుఁడవు- మంచి (గొప్ప) వంశమునందు జన్మించినవాఁడ
వు (జన్మసిద్ధములు మహాగుణములు నీ కనుట). ఏతాదృశమనీషావిశేషంబు-
ఇట్టిగొప్పబుద్ధి తత్కుల ప్రశంస-ఆప్రభునివంశవర్ణన

తా. ఇంతగాఁ ద న్నీకృతిరచనకుఁ బ్రోత్సహించియుఁ దనకుఁ గృతి యి మ్మ
నక మాతృభూతేశు నికిఁ దాని నంకిత మొనర్పు మని రాయఁడు ప్రదర్శించి
నయుదారబుద్ధికి సద్వంశజననమే కారణము. అందులకే తా నాతనివంశము వర్ణిం
చెద నను చున్నాఁడు వెంకనకవి. (ఇట్లు రాయలవంశాభివర్ణన కొకసందర్భము
కల్పించుకొను చున్నాఁడు వేంకనకవి.)

సీ. రంభాదినైలింపకుంభస్తనీమణుల్
బానిస లగుచును బనులు సేయఁ
గకుబంతముల నేలఁ గలవేల్పుగమి కాంచు
సమయము లేక మోసలను గాయఁ
గులధరాధరములు చలనంబులను మాని
యెచటఁ దా ర్నిల్చెనో యచట నుండ
గర్వదూర్వహు లైనశర్వరీచరవరుల్
నిలువఁ గూడక రసాతలము సొరఁగఁ

గీ. గల్పకమునీడ వినువాఁకగట్టుతలఁపు
మానికపుఁదిన్నెఁ గిన్నరీగానఫణితి
నాలకించుచు నానంద మనుభవించు
నల్లదేవేంద్రుఁ; డలవియె యతనిఁ బొగడ? 14

ఇంద్రుడు రాయవంశమునకు మూలపురుషుఁడు. అతఁ డిందు వర్ణింపఁబడు చున్నాఁడు

అర్థ.—[అల్ల దేవ + ఇంద్రుఁడు-ఆదేవపతి, ఇంద్రుఁడు. (కర్త.) ఆలకించుచు (ఆనందము అనుభవించున్ -అనువానితో దీనికి సంబంధము.] రంభా + ఆది మణుల్-రంభ మొదలు గాఁ గల దేవతాసుందరీరత్నములు; అచ్చరలతలమానికములు (అప్సరస్త్రీలలో నెల్ల శ్రేష్ఠురాం డ్రగువారు) బానిసలు-సేవకురాండ్రు అగుచున్. పనులు సేయన్- (తన్ను) సేవింపఁగా. కకుభ్ + అంతములను-దిక్కులను (అంతశబ్ద మిట స్వరూపార్థకము).ఏలన్ కలవేల్పుగమి-పరిపాలించుట కైనదేవతాసమూహము(దిక్పతు లెనమండ్రు-అనుట). కాంచు సమయంబు (తన్ను) దర్శించెడి వేళ.లేక.మోసలన్-తలవాఁకిటిచావడిని. కాయన్-కాచి (రక్షించుకొని) ఉండఁగా (ఎక్కడకు నేఁగక యచ్చటనే నిలిచి యుండఁగా-అనుట). కులధరాధరములు-(భూమిని మోయు కులపర్వతములు ఏడును). చలనంబులను-కదలికలను (గమనమునే కాక కదలుటను గూడ భయమున మానిన వని యతిశయోక్తి). మాని-వదలి.తార్ (తారు)-తాము. ఎచట-ఏప్రదేశమందు. నిల్చెనో-ఉండెనో. అచటన్-ఆప్రదేశమునందే. ఉండన్-నిలువఁగా(ఈతఁడు తమఱెక్కలు వజ్రాయుధముచేఁ ద్రెంచినాఁడుగాన, భయ మంది కదలక మెదలక అచ్చటనే యుండిన వనుట) (పర్వతములు స్థావరములు గాన, య ట్లుండుట వానిస్వభావము). గర్వధూర్వహులు- (గరువపుభారము మోయువారు), గర్విష్ఠులు (మదోన్మత్తు లనుట.). ఐన.శర్వరీచరవరుల్-రాక్షసరాజులు (కర్త). నిలువన్-(తనయెదుట) నిలుచుటకు. కూడక-శక్తి చాలక (ఎంతప్రయత్నించినను వీలు

పడక) రసాతలము-పాతాళమును (స్వస్థలమును) చొరఁగన్-ప్రవేశింపఁగా. కల్పకమునీడన్-కల్పవృక్షచ్ఛాయయందు వినువాఁకగట్టుతలఁపుమానికపుఁదిన్నెన్- ఆకాశగంగయొక్క ఒడ్డునందలిచింతామణియరుఁగునందు కిన్నరీగానఫణితిన్-కిన్నరస్త్రీలు పాటలు పాడెడిరీతులను ఆలకించుచున్-శ్రద్ధతో వినుచు ఆనందము అనుభవించున్-సంతోషపడు చుండును అతనిన్-అట్టివానిని. పొగడన్ అలవియె-శక్యమా? సాధ్యము కాదు (స్తుతి కందనివాఁ డాతఁ డనుట వచింపఁబడు చున్నది)

విశే —అతనిభోగవైభవములు అప్రతిహతశాసనప్రతాపసంపదలు నిరుపమానము లని వర్ణించి త్రిలోకీనాథుఁ డాతఁ డగుట కెంతయుఁ దగినవాఁ డనుట సూచించిన దీపద్యము (ఇందు, 2 6పాదములు భోగవైభవములను, 3 4 పాదములు-అప్రతిహతదాజ్ఞాప్రతాపములను వర్ణించినవి )

నైలింప (కుంభస్తనీమణుల్) —(నిలింపులే-నైలింపులు-(స్వార్థికాణ్ణన్త మిది)(పుంవద్భావము) కుంభస్తనీ' అనుట సౌందర్యాతిశయద్యోతనమునకు. 'మణి' శబ్దము, 'లోకాతిశాయిసౌందర్య' మది అట్టిది కలవా రనుటకు

కకుబంతములు —దిక్కులు అన్త స్స్వరూపే నికటే ప్రాన్తే నిశ్చయ నాశయోః అని హేమచంద్రుఁడు

కులధరములు —ఇవి ఏడు మహేన్ద్రో మలయ స్సహ్య శ్శుక్తిమాన్ గన్ధమాదనః విన్ధ్య శ్చ పారియాత్ర శ్చ స ప్తైతే కులపర్వతాః (త్రికా శే )

(పాతాలము)- దైత్యనివాసము - పాతాలం బలిస ద్మాఽధోభువనం దైత్యభూమో రసా' (వైజ భూ పాతా )

తార్ — తారు (రూపాం) క్వచి ద్దేవగస్య సా్య దుతో లోపః ప్రయోగతః'(ఆథర్వణుఁడు )

(కిన్నరీగానఫణితిన్)-నరముఖము అశ్వదేహము గలవా రీజాతివారు- బిమ్బోష్ఠం బహుమనుతే తురఙ్గవక్త్ర శ్చుమ్బన్తం ముఖ మిహ కింనరం ప్రియాయాః శ్లిష్యన్తం ముహు రితరో ఽపి తం నిజస్త్రీ ముత్తుఙ్గస్తనభరభఙ్గభీరుమధ్యామ్' (శిశు 4 స.38 శ్లో ) వీరు దేవగాయకులు- గన్ధర్వ కింపూరుష కింనరా జగుః' (సం భాగ.

8 2 0 ) స వ్యబుధ్యత బుధ స్త వోచితః శాతకుమ్భకమలాకరై స్సమమ్ మూర్ఛ నాపరిగృహీతకైశికైః కింనరై రుషసి గీతమఙ్గళః' (కుమా 8.8 )

ఫణితి —ఫక్కి, సరణి,(రీతి ) పరమాత్ముఁ డైనవిష్ణుచరిత లన్నియు నీప్రసాదం బున విస్తరఫణితిని వినఁ గలిగెను' (విష్ణు 8 323 ) (చూ బ్రౌ )

అల్ల —ప్రసిద్ధార్థకము ఆమ్మకచెల్ల యల్లచిగురాకుఁగటారికడిందిజోదు పూవమ్ము లు' (నీలా 2 1 0 ) (చూ సూ ని )

అలం —కావ్యలింగము. ఉదాత్త మంగము

క అతఁ డొకనాఁ డొకమానవ
సతిని వరించెను, దదీయసౌందర్యం బ
ద్భుత మగుఁగద యాయింతికి
సుతు లంతటఁ గలిగి రతులసుగుణాన్వితు లై 15

ఇంద్రుఁ డీవంశమునకు మూలపురుషుఁ డగుట యెట్లో వచింపఁబడు చున్నది

అర్థ —అతఁడు-ఆయింద్రుఁడు ఒకనాఁడు-ఒకానొకప్పుడు ఒకమానవసతిని-ఒకానొకమనుష్యస్త్రీని. వరించెను-(కోరి) వివాహ మాడెను తదీయసౌందర్యము-ఆమె దగునందము అద్భుతము- ఆశ్చర్యము కలిగించునది; ఏనాఁడు విని కని యెఱుఁగనిది, అగునుగదా -అయి యుండవలయునుగాదా (కానిచో ఇంద్రుని యంతటివాఁడు అచ్చరలను గూడఁ ద్రోసిరా జని యీమెను వరింపఁడు.) అం తటన్-అటుతరువాత ఆయింతికిన్-ఆమెకు సుతులు. న + తుల + సుగుణ + అన్వితులు ఐ- సాటి లేనిమంచిగుణములతోఁ గూడినవారు గా (ఆకాశము స్వచ్ఛ మై యున్నది-అని వ్యవహారము, స్వచ్ఛము గా అని యర్థము. అట్టి ప్రయోగమే యిది) కలిగిరి-పుట్టిరి (ఇంద్రునకు ఈమానవసతికిఁ గలిగినసం తతియే యీవంశసంతతి, కావుననే యిది ఇంద్రాన్వవాయము)

విశే —ఈమానవస్త్రీయందు వర్ణింపఁబడినసౌందర్యాతిశయము 'య త్రాకృతి స్తత్ర గుణాః' అనున్యాయమున ఆమె గుణవతులలో నగ్రేసరి యగుటఁ దెలిపి, ఆమెసుతులు సుగుణవంతు లగుటయం దౌచిత్యమును సంపాదించినది

సుగుణాన్వితు లై కలిగిరి అనుట,వారు పుట్టినప్పడే వారితోపాటు పుట్టినది సుగుణసంపత్తి యనుటను దెలిపి సహజగుణసంపద గలమహావంశ మిది యగుటను సూచించినది

కం ఆయన్వవాయమందలి
రాయక్షితిపాలమౌళి రాజిల్లె యశ
శ్శ్రీయుక్తిని బ్రహ్మాండం
బాయెడ నాపాలకడలియట్లు చెలంగెన్. 16

'రాయరఘునాథరాయలు' అని ప్రకృతప్రభువునకు (పుదుకోట సంస్థానాధీశుఁ డగు నేతత్కృతిప్రోత్సాహకునకు) పేరు. రాయఁ' డనువాఁ డీవంశమునకుఁ జెందినయొకమహాపురుషుఁడు అతనిపేరితో రఘువంశ మట్లు రాయవంశ మిది యైనది, రాయరఘునాధుఁ' డీతఁ డై నాఁడు (వాల్మీకిచరిత్ర కర్త రఘునాధరాయఁడు వేఱు. అతఁ డీతఁడు కాఁడు). రాయవంశకర్త రాయఁ డిందు వర్ణింపఁబడు చున్నాఁడు.

అర్థ —ఆ+అన్వవాయమందలి మౌళి-పూర్వము చెప్పఁబడిన యింద్ర వంశమందు జన్మించిన రాయఁడు' అనుపేరు గలరాజశ్రేష్ఠుఁడు. (కర్త). యశః శ్రీయుక్తిని-కీర్తిలక్ష్మియొక్క సంబంధముచేత. రాజిల్లెన్-ప్రకాశించెను (గొప్పకీర్తి కలవాఁ డయి ప్రఖ్యాతి చెందె ననుట). ఆయెడన్-అప్పుడు (అతఁడు రాజ్య మేలెడునాఁడు-అనుట). బ్రహ్మాండము-సర్వప్రపంచము, పదునాల్గు లోకములును. పాలకడలియట్లు-పాలసంద్రమువిధమున.[ పాలకడవయట్లు' వావి.అప పా ]. చెలంగెను-అతిశయించెను, సర్వవస్తుసమృద్ధి కల దాయెను (ఏకొఱఁత లేక యుండె ననుట)

తా —రాయఁడు మహాకార్యము లొనర్చి వీరుఁడు ధార్మికుఁడు నై గొప్పపేరు గడించెను అతనిరాజ్యమం దెట్టికొఱఁతయు లేక లోకములు సుఖపడినవి

విశే — (అన్వవాయము)- అన్వవాయో ఒన్వయో వంశః (వైజ పాతా ఛూతా.)

క్షితిపాలమౌళి —ఉపమితసమాసము- మౌళి శబ్ద ముత్తరపద మై శ్రేష్ఠార్థక మైనది 'స్యు రుత్తరపదే వ్యాఘ్ర పుఙ్గవ ర్షభ కుఞ్జరాః సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః (అమ.) 'ఆద్యాః' అనుటచే ఇట్టివి సంగృహీతములు 'రాజమౌళి రసౌ భాతి రుద్రదేవో జగత్పతిః (ప్రతా కావ్య ) 'రాజమౌళిః-రాజోత్తమః-అని(వ్యాఖ్య).

'దానాదిప్రభవా కీర్తిః ప్రతాపప్రభవం యశః' అని యున్నను కవులు చాలవఱ కీవిశేషము పాటించుట లేదు 'యశః కీర్తి స్సమజ్ఞా చ' అని (అమ మొ ) 'యశ శ్శ్రీయుక్తి 'పాలకడలి అనునవి-'రాయక్షితిపాలమౌళి కి విష్ణుత్వమును వ్యంగ్యరీతిని బోధించు చున్నవి

అలం —ఉపమ

క ఆరాయనృపతి గాంచెఁ గు
మారుల రఘునాథరాయమహిపతి నమన
క్ష్మారమణుఁడు నచ్చన హం
వీరుఁడు, బేరమవిభుఁ డన వీరలలోనన్ 17

రాయనరపతిసంతానము పేర్కొనఁబడు చున్న దిందు నామగ్రహణముతో.

తా:—రాయనికి రఘునాధరాయఁడు, నమనరాజు, నచ్చనరాజు, హంవీరరాజు, బేరమరాజు-అనువా రైదుగురు పుత్రులు

విశే —మహి (పతి)- 'మహిః' 'మహీ రెండును సాధువులే 'కృదికారా దక్తినః అని జీవ్వికల్పము 'వీచిః పఙ్క్తి- ర్మహిః కేళి రిత్యాద్యా హ్రస్వదీర్ఘయోః అని (వాచ ). [వీరలలోనన్- అనునది పైపద్యముతో అన్వయము గలది.]

3)

క. ఆరఘునాధనృపాలుఁడు
ధారణి నేలంగఁ దొడఁగె దైవతయువతీ
హారపటీరతుషారశ
తారసుధారసవిధాముధాకృత్కీర్తిన్. 18

ఈపద్యముచేతను బై పద్యముచేతను (రాయనిపుత్త్రిలలో) జ్యేష్ఠుఁ డైన 'రఘునాధరాయఁడు' వర్ణింపఁబడు చున్నాఁడు.

అర్థ —(పీఠలలోనన్). ఆరఘునాధనృపాలుఁడు (కర్త). ధారణిని-భూమిని. దైవతయువతీ . ముధాకృత్కీర్తిన్—అప్సరస్త్రీలయొక్కయు, ముత్యాల హారములయొక్కయు, మంచిగంధముయొక్కయు, మంచుయొక్కయు, వజ్రాయుధముయొక్కయు, అమృతముయొక్కయు, నీటియొక్కయు, సమృద్ధిని (చాలయాధిక్యమును, తెల్లఁదనముచే నైన మిక్కిలిగొప్పతనమును) వ్యర్థముగాఁ జేయు చున్న, ప్రయోజనము లేమిని వానికిఁ గలిగించు చున్న) కీర్తిన్-కీర్తితో. ఏలన్ తొడఁగెన్ -(రాజ్యము) పరిపాలింపఁ బూనెను

తా:—రఘునాధరాయనిశుభ్ర మగుకీర్తి నలుదెసలకు వ్యాపింపఁగా, దానియందు లీన మై, తెల్లని వగు 'అప్సరఃస్త్రీ' హారాదులు కానరాని వాయెను. అందువలన, బ్రహ్మ యెందులకై వీనిని సృజించెనో యాప్రయోజనము శూన్య మాయెను. కనుకనే, బ్రహ్మసంకల్పమునకుఁగూడ వైయర్థ్యము కలిగింపఁ గలమహామహిమాతిశయము దీనికిఁ గలుగుట వర్ణింపఁబడినది ఇందువలన, రాయనిపేరుప్రతిష్ఠలు లేశమేని కలంకము లేక, శుభ్ర మైన వనుట తెలియఁ జెప్పఁబడినది

విశే—ధరణిమే (ధారణి)-ప్రజ్ఞాద్యణ్ణన్త మిది. 'విధా సమృద్ధౌ' (అమ). 'విధా గజాన్నే ఋద్ధౌ చ' అని (మేదిని) 'ఆస్వాదన ధ్వని సుధా ఒమ్బు ర సాఖ్యధాతు ష్వి ష్ఠో రసః (నానా.) కీర్తి, హారము, జలము, అప్సరస్త్రీలు-తెల్లనివారు (శ్వేతవస్తువులఁ బేర్కొనుచు దేవేశుఁడు 'సుధాం శూచ్చైశ్శ్రవ శ్శమ్భు కీర్తి చన్దనం హా రోర్ణనాభ

. సుధా జలం స్ఫటికాదయః' అనినాఁడు. 'ఆది'శబ్దముచే (కల్పద్రుమాదులవోలె) అప్సరస్త్రీలు, వజ్రాయుధముగూడఁ దెల్లని వగుట తెలియ నగును.

ఈకల్పన కాధార మన నగుశ్లోకద్వయ మిట్లు గానవచ్చుచున్నది.-'మహారాజ శ్రీమన్ జగతి యశసా తే ధవళితే పయఃపారావారం పరమపురుషోఽయం మృగయతే కపర్దీ కైలాసం కరివర మభౌమం కులిశభృత్ కలానాథం రాహుః కమలభవనో హంస మధునా'. 'నీరక్షీరే గృహీత్వా నిఖిలఖగతతీ ర్యాతి నాళీకజన్మా తక్రం ధృత్వా తు సర్వా నటతి జలనిధీం శ్చక్రపాణి ర్ముకున్దః సర్వా నుత్తుఙ్గశైలాన్ దహతి పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్ వ్యాప్తా త్వత్కీర్తికాన్తా త్రిజగతి నృపతేః భోజరాజక్షితీన్ద్ర'.

అలం — అతిశయోక్తి

ఉ. ఆరఘునాథభూపతి మహాద్భుతచర్యుఁ డటంచు నిచ్చలున్
ధీరజనంబు లెల్ల వినుతింపఁగ ధారణి నేలెఁ గాని యా
పేరుకుఁ దగ్గకార్యములు పెక్కువిధంబులు దెల్ప శక్య మె
వ్వారికి శైవధర్మపరిపాలన మొక్కటి యెక్కు డై తగున్. 19

అర్థ:— ఆరఘునాథభూపతి- (రాయవంశపు రఘునాథుఁ డనుట), ధీర జనంబులు ఎల్లన్- కవిసంఘము లన్నియును ('వినుతింపన్' అనుదానితో అన్వయము) నిచ్చలు-నిత్యము. మహత్-అద్భుతచర్యుఁడు-చాలవింత గలిగించెడి ప్రవర్తన కలవాఁడు అటంచున్-అని వినుతింపన్-పొగడఁగా ధారణిన్-భూమిని; రాజ్యమును ఏలెన్-పరిపాలించెను. (కాని-వాక్యాలంకారము) ఆపేరుకు-అతఁ డుంచుకొనిన నామమునకు (రఘునాథుఁడు-రాముఁడు-అనుదానికి). తగ్గకార్యములు-తగిన (గొప్ప) పనులు (అతఁ డొనర్చినవి). పెక్కువిధంబులు-బహువిధములు, పలువితము లైనవి (ఆతనిరాజ్యము రామరాజ్యము గా నాఁడు నడిచిన దనుట). ఎవ్వారికిన్-ఎవరికి. తెల్పన్-(వానిని) తెలియఁ జెప్పుటకు. శక్యము-సాధ్యముః (కాకువు) (అట్టికార్యము లెన్నెన్నో బహుముఖముల నాతఁ డొనర్చి యుండుటనుబట్టి ఎవ రెంత ప్రయత్నించినను అవి చెప్ప నలవి కాని వనుట).

శైవధర్మపరిపాలనము-శైవాచారముల రక్షించుట (శివుని దగుధనుస్సు విఱిచి వేయక పదిలము గా ఉంచుట-అని యర్థాంతరము) [శైవధర్మశబ్దము శ్లేషించి, అర్థద్వయమున కభేదాధ్యవసాయ మేర్పఱచుకొనినది]. ఒకటి-(ఇది ఒక్కటి మాత్రము). ఎక్కుడు ఐ-(ఈతనియందు) అధికము గా ఉండి (ఆతనియందు లేని దీతనియందుఁ గానవచ్చె యనుట). తగున్-ఒప్పును, శోభిల్లును

తా —రఘుపతి రఘునాధుఁడు, రఘువరుఁడు-ము న్నగుశబ్దములు, రఘు వంశపురాజులలో శ్రేష్ఠుఁ డగుటనుబట్టి శ్రీరామచంద్రుని వచించును రాయ వంశములోని యీరఘునాధుఁడు, తన కుంచినపేరు సార్థక మగునట్లు, రాముఁడు చేసినపను లన్నియుఁ దానును జేసి రామరాజ్యముఁ గాఁ దనరాజ్యము నొనర్చి నాఁడు మఱియొకవిశేష మే మనఁగా, శ్రీరాముఁడు శైవధర్మపరిపాలన మొనర్ప లేదు (సీతాస్వయంవరమునకై శివధనుస్సును విఱిచినాఁడుగాన. తద భేదాధ్యవసాయమున శైవాచారరక్షణ మొనర్ప లే దాతఁ డను చున్నాఁడు.) ఈతఁ డది యొనర్చి (శైవాచారరక్షణ మొనర్చి (తదభేదాధ్యవసాయమున శివ ధనూరక్షణ మొనర్చి యనుట). శ్రీరాముని మించినాఁడు. కనుకనే యీతఁ డద్భుతచర్యుఁడు).

విశే —(కాని-వాక్యాలంకారము) ' రమ్మా చూతము గాని నీగమనవేగంబున్ (భార. విరా 2.89 ) (మొ ). స్థితగతిచి_స్తన మిది 'కాన అని సవరించుట యుచిత మనిపించును. కవులే ఈతనిచర్యలను వివరింప లేక-'మహాద్భుతచర్యుఁ' డని యనినారు ఇతరుల కది యెట్లు సాధ్య మని స్వారస్యము.

'ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞ స్సంఖ్యావాన్ పణ్డితః కవిః' (అమ.) 'ధీర-కవి' శబ్దములు పర్యాయములు

(పేరుకు) ఇది ఔప అనియే సూ ని మొ ఐనను- 'తుద మొ వానివలె రెండును గల వను చున్న దిది. ఉపవిభక్తులఁగూర్చి అథర్వణుఁ డిట్లను చున్నాఁడు_ 'విభాషయా భవ న్త్యత్ర భవ న్త్యుపవిభక్తయః భవ న్తి కుత్రచి న్నైవ నిదానం తత్ర

సద్వచః (అని). ఇవి ప్రయోగైకశరణములు 'సేపునకున్ వంటివి ప్రయోగదృష్ట ములు 'ఒక్కింతసేపునకుఁ దేఱి యిట్టు లనియె నాదు ' (భార అశ్వ 2ఆ. 89) 'మఱికొంతసేపునకు (భార శాంతి) (చూ బాలవ్యాకరణోద్ద్యోతము)

ధర్మో ఒస్త్రీ పుణ్య ఆచారే స్వభా వోపమయోః క్రతౌ 'అహింసోపనిష న్న్యాయే నా ధను ర్యమ సోమపే అని (మేదిని). (తగన్) 'వెలసెఁ దనరెఁ దగె I నొప్పె న న్మాట గాఁ జెప్పఁబడును (ఆం భా 3 83)

శతఁ డింమవలన తథాఽపి భక్తి స్తరుణేన్దుశేఖరే అనురీతిశివభక్తుఁ డగుట తెలి యవచ్చును

అలం — వ్యతిరేకము శ్లేష- అంగము

తే అతఁడు గాంచెను బెద్దరాయక్షితీంద్రు,
భుజబలవిహారు శ్రీముద్దువిజయధీరు,
ధర్మగుణశీలుఁ దిరుమలధరణిపాలు,
రవితులితదేహవిభునిఁ జిన్నాయవిభుని. 20

రఘునాథరాయలయొక్క సంతతి పేర్కొనఁబడు చున్నది.

అర్థ:— భుజబలవిహారుఁడు- బాహుబలముచే విజృంభించువాఁడు; అడ్డు లేని భుజబలము గలవాఁడు (ఆయుధాపేక్ష లేనిజగజెట్టి యనుట) ధర్మగుణశీలుఁడు- సహజ మగుధర్మగుణము గలవాఁడు (ధర్మవ్యసని యనుట). రవితులితదేహ విభుఁడు- సూర్యునితో సరి యైనశరీరవైభవము గలవాఁడు (సూర్యునివలె దీప్తి మంత మగుగొప్పశరీరకాంతి గలవాఁ డనుట).

తా·—రఘునాథునికి నలుగురు పుత్త్రులు వారు పెద్దరాయభూపతి, ముద్దువిజయ భూపతి, తిరుమలభూపతి, చిన్నాయభూపతి- అనువారు.

విశే — చిన్నాయవిభుఁడు- చినరాయవిభునకు (రూపాం) 'ద్వ్యక్షరాదిచతుర్వర్ణపర్యన్తం జననామసు లోప స్స్యా ద్ద్వ్యాదివర్ణానాం శబ్దే రాయాదికే పరే క్వచి దత్త్వం క్వచి చ్చాత్త్వం యధాయోగ మన్య చ్చ వ్యవహారతః అని అధర్వణుఁడు

క. వారలలోపలఁ దిరుమల
భూరమణుఁడు ఖ్యాతిఁ గాంచె భుజబలదృప్య
ద్ఘోరాహితవారాహిత
సారాహితతీవ్రదీప్తశరజాలుం డై 21

పై నలుగురిలో మూఁడవవాఁ డగుతిరుమలరాయఁ డిందు. పై పద్యమునం దు వర్ణింపఁబడు చున్నాఁడు.

అర్థ.— వారలలోపలన్- వారియందు (నిర్ధారణషష్ఠి) తిరుమలభూరమణుఁడు- తిరుమలభూపతి (కర్త.) భుజబల-బాహుబలముచే. దృప్యత్-గర్వించిన, మందించిన. ఘోర-భయంకరు లైన. అహిత-శత్రువులయొక్క- వార-సమూహము లందు. ఆహిత-ఉంపఁబడినవి (ప్రయోగింపఁబడినవి అనుట) సార-శ్రేష్ఠము లైనవి. అహిత-అనిష్టముచే; హానిచే. తీవ్ర-తీక్ష్ణములు, క్రూరములు (ప్రాణము తీయునవి యనుట). దీప్త-ప్రకాశించునవి (కన్నులకు మిఱుమిట్లు గొలుపుగొప్ప కాంతి కలిగినవి యనుట.) (అగు) శరజాలుండు ఐ-బాణసమూహములు గల వాఁడు గా. ఖ్యాతిన్. ప్రసిద్ధిని. కాంచెన్-పడసెను; పొందెను.

తా:—తిరుమలరాయఁడు మదోన్మత్తు లగుశత్రురాజులపైఁ గాంత్యతిశయమున భయము కలిగించి ప్రాణములు తీయఁ గలమహాశరములఁ బ్రయోగించు మహావీరుఁ' డని యాతనిసోదరులం దెల్లఁ బ్రఖ్యాతి వహించినాఁడు.

విశే— ఈతఁడు జ్యేష్ఠుఁడు గాకపోయినను వీరత్వమునుబట్టి రాజు గా నగుట సూచితమగు చున్నది యీవర్ణనవలన

(ఐ) ఇది అగుధాతువున కైనక్త్వార్థకావ్యయము. 'అతఁడు మహాపురుషుఁ డై వన్నెకెక్కినాఁడు అనుటవంటిది

అలం— 'ఘోరాహితవారాహిత సారాహిత' అనుచో వర్ణవిభేదమునఁ బాదాదిపదావృత్తి జరగుటనుబట్టి 'స్ఫుటానుప్రాసము' (శబ్దాలంకారము) 'పాదాదిషు పదావృత్త్యా స్ఫుటో వర్ణవిభేదతః అని లక్షణము.

చ. తిరుమలరాయశేఖరవితీర్ణియుఁ బెక్కువిధంబు లౌటఁ ద
త్స్ఫురణముచేతఁజుమ్ము హరిపొక్కిలిఁ జేరె హిరణ్యగర్భుఁ, డా
హరియు నభోమణిం గదిసె, నల్లనభోమణి యుండ సాగె నం
బరమున, నంబరంబు గనుపట్టని దయ్యె విచిత్రరీతి గ॥ 22

ఈతిరుమలరాయఁ దేతత్కృతిప్రోతాహ్వకుఁ డగురాయరఘునాథునకు తాత అతఁ డిందు మహాదాత గా వర్ణింపఁబడు చున్నాఁడు.

అర్థ — తిరుమలరాయశేఖరువితీర్ణి-శ్రేష్ఠుఁ డైనతిరుమలరాజు (చేయు) దానము. పెక్కువిధంబులు-(భూదానము, గోదానము, సువర్ణదానము అనురీతిని పలుతెఱఁగులు. ఔన్-కలిగియుండుటచేత. హిరణ్యగర్భుఁడు- బ్రహ్మ (సాభిప్రాయమిది హిరణ్యమయము, సువర్ణవికారము (బంగారమే రూపాంతరము నందినది) అగుబొజ్జ గలవాఁడు. కనుకనె భయము) తత్స్ఫురణముచేతన్ చుమ్ము-దానియొక్క (కర్తృషష్ఠి, అది యనుట) తోఁచుటచేతనే సుమా మనస్సునకు (ఆదానములు) గోచరించుటవలననే (అందు సువర్ణదానముగూడ నొకటి. వానిని స్మరించునప్పుడు అది తలఁపునకు వచ్చుటనుబట్టియే యనుట) 'చుమ్మ' 'చూడు' నకు సంక్షిప్తరూపము, నిశ్చయార్థకము). హరిపొక్కిలిన్-విష్ణువుయొక్కనాభిని; నాభిపద్మమును (తనజన్మస్థలము ననుట). చేరెన్-సమీపించెను (భయము కలిగినప్పుడు లోకమున నెవ్వ రైనను జన్మభూమి చేరి తల్లిదండ్రులయండ నుండుట లోకసిద్ధము) ఆహరియున్-ఆవిష్ణువుగూడ నభోమణిన్-సూర్యుని. కదిసెన్-చేరెను (సూర్యునియందుఁ బ్రవేశించెను, దాఁగె ననుట. భయపడినప్పుడు ఎచటనేని తల దాఁచుకొనుట లోకసిద్ధము నారాయణుఁడు సూర్యమండలమధ్యవర్తి యగుట యాగమసిద్ధము). అల్లనభోమణి-ఆసూర్యుఁడును. అంబరమునన్-ఆకాశమునందు. ఉండన్ సాగెను (భయముచే భూమిని విడిచి అందరానియాకాశమున ఉండ మొద లిడె ననుట. లోకమున భయపడినవాఁడు, ఇతరులకుఁ జొరరానిప్రదేశము చూచుకొని యం దుండును. అట్లే యీతఁడును.

అంబరంబును- (అ) యాకాశమును. విచిత్రరీతిన్-ఆశ్చర్యము గలిగించువిధమున (ఉండియుఁ గనఁబడ కుండుట యిచ్చటివిచిత్రరీతి) ఆకాశము (మూర్తద్రవ్య గా నందున) కన్నుల కగపడదు ఐనను, అనుమానప్రమాణముచే (శబ్దమునుబట్టి) అది యున్న దని శాస్త్ర మనును. (కావుననే) కనుపట్టనిది అయ్యెన్-(ఉండియుఁ గానరా నిది గా) ఆయెను (భీతి కలిగినప్పుడు వంచనతో మఱుఁగుపడి యెవరికిఁ గానరా కుండ నుండుట లోకదృష్టము).

తా:— తిరుమలరాజు చేయు చున్న దానములు అప్రతిహతములు గాఁ బ్రవర్తిల్లుట బ్రహ్మ చూచి, తాను హిరణ్యగర్భుఁ డగుటను భయము చెంది శ్రీమహావిష్ణుని నాభికమలమునందు దాఁగినాఁడు. విష్ణువు లక్ష్మీపతి గనుక భయపడి సూర్యమండలము చొచ్చినాఁడు. సూర్యుఁడు హిరణ్మయశరీరుఁడుగనుక భీతి చెంది యాకాశమునందు వసించినాఁడు. ఆకాశము సువర్ణపద్మములతోడివియన్నది కలదిగాన, భయ మంది, కానరా కుండ నైనది (ఆతఁడు భూ గో హిరణ్యాదిదానము లన్నియు సర్వస్వము సమర్పించి యొనర్చు చున్నాఁ డనుట కావ్యమర్యాదతో వర్ణింపఁబడు చున్నది )

శ్లో — 'ధ్యేయ స్సదా సవితృమణ్డలమధ్యవర్తీ నారాయణ స్సరసిజాసనసంనివిష్టః కేయూరవాన్ మకరకుణ్డలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపు ర్ధృతశఙ్ఖచక్రః (స్మృతి )

ఆకాశము భావపదార్థము అనువారుగూడ దీనిని 'మూర్తద్రవ్యము గా (చక్షురింద్రియగ్రాహ్య మగుపదార్థముగా ఒప్పరు 'శబ్దగుణక మాకాశమ్ అని అనుమానప్రమాణగమ్యముఁ గానే దీనిని వా రొప్పుదురు.

బ్రహ్మాదులును దిరుమలరాయనికి భయపడు చున్నా రనుటవలన దానవీరతతోపాటు లోకాతిశాయిప్రతాపముగూడ నాతనియందు స్ఫురించు చున్నది ( స ప్రతాపః ప్రభావశ్చ య త్తేజః కోశదణ్డజమ్' అని అమ ).

అలం — లోకవృత్తాంతము (భయభ్రాంతునికృత్యము) ఒకటి బ్రహ్మాదులయం దారోపితమైనందున సాధారణవిశేషణసముత్థాపిత కార్యసమారోపమునకుఁ జెందిన 'సమాసోక్తి.' హేతూత్ప్రేక్ష, పరికరాంకురము- తదంగములు,

తే  అతఁడు గాంచెను శ్రీవిజయరఘునాధ
నరపతిశిరోమణిని, ముద్దునరసవిభుని,
రాజగోపాలధీరుఁ దిర్మలవజీరు,
మఱియు రణభాషికాఖ్యుఁ, గ్రమంబుతోడ.

తిరుమలరాజుయొక్క సంతతి ఇందు పేర్కొనఁబడు చున్నది.

తా — తిరుమలరాజునకు విజయరఘునాధనరపతి, ముద్దునరసరాజు, రాజగోపాల భూపతి, తిర్మలవజీరున్నృపతి, రణభాషికప్రభువు-అనువారు ఐదుగురు పుత్త్రిలు. వీరలలో జ్యేష్ఠుఁ డైనవిజయరఘునాధరాయఁడే యేతత్కృతిప్రోత్సాహకుఁ డగు రాయరఘునాధునితండ్రి.

విశే— తిర్మలవజీరు-'తిరుమల'కు (రూపాం) '(తిర్మల)' 'రాజద్గుణశాలి తిర్మలమహా రాయండు అని (వసు 1 65.) మొ

వ  ఆ కుమారులందు 24

తే  హరినిఁ దలఁపనియట్టిదిక్కరుల రోసి
గండములు గల్గుగిరులను గడకుఁ ద్రోచి
ధారుణీకాంత వరియించెఁ దనకుఁ దాన
విజయరఘునాధు జయభార్గవీనాధు. 25

ఈపద్యమునను, బై పద్యమునను విజయరఘునాధనరపతి వర్ణింపఁబడు చున్నాఁడు.

అర్ధ.—ధారుణీకాంత-భూమి యనెడిస్త్రీ-(రాజ్యలక్ష్మియనుట) (కర్త.) హరినిన్-విష్ణువును (సింహమును-అని యర్థాంతరము). తలఁపనియట్టి-స్మరింపనియట్టి (హరినామస్మరణమున కేనాఁడును నోఁచుకొనని పాపాత్ముల ననుట) (భావింపని యట్టి-అని యర్థాంతరము. 'సింహస్వప్నము' అని ప్రసిద్ధి. కలలో సింహము

గానవచ్చినను ఏనుఁగు మరణించును. అందులకే దాని నవి తలఁప కున్నవి యనుట). దిక్కరులన్-దిగ్గజములను. రోసి-ఏవగించుకొని. గణ్డములు-ప్రాణాపాయము గలిగించునుపద్రవములు; నీటిగండము మొద లగునవి (గణ్డశిలలు; (పర్వతమునం దుండు) పెద్దఱాలు-అని యర్థాంతరము). కల్గుగిరులను-కలిగి యున్నకులపర్వతములను. కడకున్ ద్రోచి-దూరమునకు నెట్టి, నిరసించి; (పరిహసించి యనుట) (దిక్కులకు వెడలఁ జేసి-అని యర్థాంతరము కుల పర్వతములు భూమిని మోయుచు ఆయాదిక్కులయం దుండుట ప్రసిద్ధము ). జయభార్గవీసనాధున్ - (వి) జయలక్ష్మితోఁ గూడినవానిని. విజయరఘునాధున్ (కర్మ). తనకుఁ దాన-స్వయముగానే (తానుగా కోరి యనుట) వరియించెన్-వివాహమాడెను.

తా:— భూకాంత యింతకుఁబూర్వము దిగ్గజములను గులగిరులను దా నాశ్రయించి యున్నది (దిగ్గజములు కులపర్వతములు భూమిని మోయు చుండుట పురాణప్రసిద్ధము.). ఆమె, విజయరఘునాధుఁడు తనపేరికిఁ దగినట్టులు తాను శత్రురాజుల నందఱ జయించి జయలక్ష్మిస్వయంవృతుఁడు కాఁగానే చూచి, హరిస్మరణము లే కుండుట (దిగ్గజములందు), ఎప్పుడు గండములు గలిగి యుం డుట (పర్వతములందు)- దోషములు గా భావించి, అట్టివి (లేకపోవుటయే కాక, ఎల్లప్పుడు జయలక్ష్మితో విభ్రాజమానుఁ డగు చున్నవిజయరఘునాధరాజును స్వయము గా వరించినది.

విశే — 'నా విష్ణుః పృథివీపతిః' అని విజయరఘునాధుఁడు విష్ణ్వంశసంభూతుఁ డగుటనుబట్టి భూదేవియు లక్ష్మీదేవియు అతనిని వరించుట సముచిత మని సూచిత మైనది

హరిస్మరణము చేయనివాఁడు దోషి, పాపాత్ముఁడు- 'జిహ్వా న వక్తి భగవద్గుణనామధేయం చేతశ్చ న స్మరతి తచ్చరణారవిన్దమ్ కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాఽపి; తా నానయధ్వ మసతో ఽకృతవిష్ణుకృత్యాన్' (యమునివాక్యము) (భాగ 6 29.).

ధారుణీకాంత-'ధరుణ స్సమ్మతే నీరే స్వర్లోకే పరమేష్ఠిని' అని (మేదిని.). ధరుణ మునుండి (నీటినుండి) పుట్టినది-ధారుణి 'ధరుణస్య అపత్యం స్త్రీ' అనునర్థమున షష్ఠ్యన్త మగు 'ధరుణ' శబ్దమునకంటె, 'అత ఇఞ్' (4.1.95.) అని ఇఞ్ ప్రత్యయము. 'ఇతో ఒమనుష్యజాతేః' (4 1.65.) అని జీష్ 'అద్భ్యః పృథివీ' అని శ్రుతి. '.., ధా రుణీప్రజ గూర్పఁగా విగతరోషుఁడ వై సుఖ ముండు (భార ఆది 7 128.) నన్నెచోడుఁడు దీనినిఁ బ్రయోగించినాఁడు (కు.సం 11.705 ). (దీని కంతకు చూ.సూ.ని.)

విజయభార్గవీ - విజయలక్ష్మి. 'భార్గవీ స్యా దుమా రమా' అని (నానా.).

ఈకల్పన కాధార మనఁ దగినపద్య మొకటి వసుచరిత్రమునఁ గానవచ్చు చున్నది- 'కిటి కనహాయజీవనము కేవలగండము లద్రికోటికిం గరులకు దుస్సహప్రకటఖర్జువు శ్వేతపుమేను చక్రి కీ విరసులఁ బొంద నొల్ల నని వేడ్క- భజించె ధరాపురంధ్రి శ్రీ తిరుమలరాయదేవజగతీరమణున్ మనోభవున్' (1.56.). 'కాంతా' శబ్దము. 'పురంధ్రి' శబ్దమునకంటె ఔచిత్యము గలది 'విజయభార్గవీసనాథున్' అనుటయు ఒకవిశేషము

'గణ్డశిలయే నామైకదేశన్యాయమున 'గణ్డ' మైనది. 'గణ్డో వ్రణే కపోలే పిటకే గర్వే మృగాన్తరే యోగే మూలాదిదుష్టభాగే హయభూషణే బుద్బుదే ఒప్యుపాయే చ' అని (నానా.) ('బుద్బుదే ఒపి'-అనుచోటి 'అపి' శబ్దముచే గణ్డశిల గ్రాహ్య మని టీక).

అలం:— హేతూత్ప్రేక్ష. దిక్కర్యాదులయందలి దోషములు భూకాంతాస్వయంవరమునకు హేతువులు గా కున్నను హేతువులు గా సంభావితము లైనవి. శ్లేష, పరికరాంకురము- అంగములు.

సీ. త్రిశిరఃపురీపరివృఢమనోనలినికి
బాలవిభాకరులీలఁ దోఁచి
చోళరాజాస్థానకేళీగృహంబున
మణిదీపికావళిమాడ్కిఁ దనరి
మహిసూరి (మహిశూరః) నరపాలమానసాంభోధికి
బాడబంబో యనుపగిది దెలసి

తత్ప్రియాన్యక్షమాధవశుష్కవనులకు
దావపావక మనుదారి నెగడి

గీ. త్రిపురదైతేయహరణసంకుపితనిటల
నయననయననటద్ధనంజయజయావ
హంబు శ్రీవిజయరఘునాథావనీంద్రు
సత్ప్రతాపంబు గనుపట్టు సంతతంబు. 26

విజయరఘునాథునియొక్క ప్రతాప మిందు వర్ణిత మగు చున్నది.

అర్థ:— త్రిపురదైతేయహరణసంకుపితనిటలనయన నయననటత్ ధనంజయ జయ + ఆవహంబు-త్రిపురాసురులసంహారమునకై బాగుగా కోపించినశివునియొక్క (మూఁడవ దగు) నేత్రమందు (అగ్నినేత్రమునందు) నాట్య మాడు చున్న (గంతులు వేయు చున్న; విజృంభించు చున్న) అగ్నియొక్క (కర్మవాచకషష్ఠి) (అగ్నిని-అనుట) (జయ) అతిక్రమణమును (ఆయగ్నిని) మించి యుండుటను (ఆవహము) కలిగియున్నది (సహజము గా చాలభయంకర మైన దనుట). (అట్టిది) (అగు) శ్రీవిజయరఘునాథ + అవని + ఇంద్రు సత్ప్రతాపంబు-శ్రీవిజయరఘునాథభూపతియొక్క గొప్ప ప్రతాపము (కర్త). త్రిశిరః పురీపరివృఢమనః నళినికి - తిరిచినాపల్లిప్రభునిమన స్సనెడిపద్మమునకు. బాలవిభాకరులీలన్-ఉదయకాలపుసూర్యునివిధమున. తోఁచి-స్ఫురించి. చోళరాజ + ఆస్థానకేళీగృహంబునన్-చోళదేశాధిపతియొక్క సభ యనెడిపడుకటింటియందు. మణిదీపికా + ఆవళిమాడ్కిన్-(పద్మరాగ) మాణిక్యదీపములపంక్తివిధమున. తనరి-ఉండి. మహిసూరి(మహిశూరః)నరపాలమానస + అంభోధికిన్-'మైసూరి' రాజుయొక్క హృదయ మనెడిసముద్రమునకు. బాడబంబు + ఓ అనుపగిదిన్-బడబాగ్నియోః యనెడివిధమున (బడబాగ్నియట్లు). వెలసి-ఒప్పి. తత్ప్రియ + అన్యక్షమాధవశుష్కవనులకున్ - ఆమైసూరిరాజున కిష్టు లైన యితరభూపతులనెడి యెండుటడవులకు. దావపావకము అనుదారిన్-కార్చిచ్చు అనెడిజాడను.

నెగడిఁ-ప్రవర్తిల్లి సతతంబు - ఎల్లప్పుడును కనుపట్టున్-చూచువారికిఁ గానఁవచ్చును దర్శన మిచ్చును

తా — విజయరఘునాధరాయలప్రతాపము శిష్టరక్షణ దుష్టశిక్షణము చేయుచు మిత్త్రుల కానందము శత్రువులకు దుఃఖము గలిగించు చున్నది ఈతనికిఁ దిరిచినాపల్లిప్రభువు చోళరాజు మిత్త్రులు మైసూరిప్రభువు అతనిహితులు శత్రువులు ప్రతాపము కవిసమయమున ఎఱ్ఱనిది గావున బాలసూర్యునితోఁ బోల్పఁబడినది బాలభానుఁడు తనకాంతిచేఁ బద్మములఁ గాంతిమంతములఁ జేసి వానికి వికాసము గలిగించును అట్లె యీప్రతాపమును (తిరిచినాపల్లిప్రభునిశత్రువుల నడఁచి) అతనిహృదయమునకు స్వాస్థ్యము చేకూర్చి సంతోషము గలిగించు చున్నది రత్నదీపములు చల్లనితమమనోహరకాంతులతో ఆఱి పోవక యెల్లప్పుడు వెలుఁగుచుఁ గేళిగృహమునందు వెలసి దానికి శోభ చేకూర్చును అట్లె చోళరాజునాస్థానమునం దిది (యెల్లప్పుడు) స్తుతింపఁబడుచుఁ దనప్రకాశమున దానికి దీప్తి చేకూర్చుచు నలరారు చున్నది (ఆసభ యంతయు నేతత్ప్రతాపము నభివర్ణించుచు మహోత్సాహమున మహానంద మనుభవించు చున్న దనుట) (ఇట రత్నదీపము ప్రతాపమైనందున ఆస్థానము కేళిగృహము గావలసి వచ్చినది) బడబానలము సముద్రమునందలి యపార జలము నెప్పటి కప్పు డిం కింపఁజేయు చుండును అట్లే యిదియును విజయరఘునాధరాయలకుఁ బ్రబల శత్రువైన మహిశూరరాజుమనస్సునం దూరక యుబుకు చున్న (పరరాజ్యాక్రమణమున కగు) తృష్ణా ప్రవాహమును ఎప్పటి కప్పుడు క్షీణింపఁజేయు చుండును (రాజ్యాక్రమణమునకై దండయాత్ర యొనర్ప నాతఁ డెప్పు డెప్పుడు సంకల్పించునో యప్పు డప్పు డిది (ఆతని)స్మృతికి వచ్చి యాతని యాశ నిరాశచేసి యాప్రయత్నమునుండి యాతనిని మరలించు చుండు ననుట కార్చిచ్చు చాల భయంకర మైనది అదిమహాగ్ని నీరసారణ్యముల నది యనాయాసము గా దహించి వైచును అట్లే యిది మహిశూర ప్రభువునకు హితు లగు వారి నంద

అను అవలీలగా భయంకర మై అచిరకాలముననే భస్మీకరించు చున్నది. త్రిపురముల దహించునప్పుడు కోపించి తన్నాశనమున కుద్యుక్తుఁ డైన యీశ్వరుని యగ్నినేత్రమునుండి మహాసంరంభముతో బయలు వెడలిన మహాగ్ని తేఱిచూడ నలవి కానిది అట్లే యందఱకుఁ గను విచ్చి చూడరాని దై సింహ స్వప్నము గా వెలయునట్టి సహజస్వభావము గల దిది అట్టి దయియుఁ దన యా శ్రితులయెడఁ బ్రసన్నత చూపుచు వారిని రక్షించు చున్న దిది

విశే — నళినీ శబ్దము పద్మవాచకము - నళినీ పద్మినీ పద్మ వ్యూమసిన్ధు సరోవరె అని (విశ్వ)

మణి (దీపికా - సాధారణ గ్రహణమున రత్నాదులు చెప్పినవానినే వచించును 'సామాన్యవర్ణనే రక్తత్వం రత్న బన్ధూక బిమ్బామ్భోజ వివస్వతామ్ అని దెవెళుఁడు (చూ కవిక శబ్ద 84శ్లో) ఎట్టిది పద్మరాగమణి అది యిట వచింప బడినది మణి శబ్దముచేత కనుకనే దీపముతోడి సామ్యము సముచిత మైనది ప్రతాపము ఎట్టిది 'ప్రతాపే రక్త తోష్ణతే అని (కవిక శబ్ద 47) ప్రతాపమును - దీపమును గాను అగ్ని గాను వచించుట గలదు ప్రతాపరుద్రస్య లసత్ప్రతాపప్రదీప నీరాజితదిఙ్ముఖస్య (ప్రతా నాట 30శ్లో) రత్నములకు దీపభావము కాళిదాసు వచించినా డు జ్వలన్మణిప్రభా శ్శైనం వాసుకిప్రముఖా నిశి స్థిర ప్రదీపతా మేత్య భుజఙ్గా పర్యుపాసతే (కుమా 2స 38శ్లో)

ఈశ్వరుని ఫాలనేత్రాగ్ని దాహకశక్తి గలది యయ్యు నా శ్రితులయెడల బ్రస న్నత గల దై వర్తించుట దృష్టము సంకుపిత పదము దీనిని సూచించు నన వచ్చును ఈశ్వరసంకల్పమువలన దాని కాయాశక్తులు వారివారియెడ నేర్పడును కుమారసంభ వమున పార్వతీ పరమేశ్వరుల శృంగారము వర్ణించుచు కాళిదా సి ట్లనినా డు - శూలి న కరతలద్వయేన సా సంనిరుధ్య నయనే హృతాంశుకా తస్య పశ్యతి లలాటలో చనే మోఘయత్నవిధురా రహ స్యభూత్ (కుమా 8స 6శ్లో) ఇట్లే మఱియొకచో హర స్తు కిఞ్చి త్పరిలుప్త ధైర్య శ్చన్ద్రోదయారమ్భ ఇ వామ్బురాశి ఉమాముఖే

బిమ్బ ఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని (కుమా 3స 67శ్లో ) అనినాఁడు అట్లే యీప్రతాపమునకును దాహకత సహజ మైనను నాశ్రితులయెడఁ బ్రసన్నత విరుద్ధ ము గాదు

త్రిశిరః పురి - తిరిచినాపల్లి ఈకవి తన కృతిభర్త యగు మాతృభూతేశుని త్రిశీర్షకుధరనిలయా అని సంబోధించు చున్నా డు ఇందువలన త్రికూటపర్వత మిది యని ఈ పర్వత మీపట్టనసమీపమం దుండుటనుబట్టి ఇది త్రిశిర పురి అయిన దని దానికి వికృతి గా ఏర్పడినదే తిరిచినాపల్లి అని చెప్పక చెప్పినా డు త్రిశీర్షు డను రాక్షసుఁ డిటఁ జంప బడినందున దీని కీపేరు గలిగిన దందురు అది యేమో

అలం — ఉల్లేఖము రూపకసంకీర్ణ మగు మాలోపమ అంగము గ్రహీతృభేదాభావే ఽపి విషయాశ్రయభేదత ఏక స్యా నేక ధోల్లేఖ మ ప్యుల్లేఖం ప్రచక్షతే -అని లక్ష ణము (చూ చిత్రమీమాంస )

తే దక్షిణామూర్తిసేవావిచక్షణుండు
సంతతాద్వైతవేదాంతసక్తచిత్తుఁ
డతఁడు తద్గర్భజలధిహిమాంశుఁ డీవు
రాయరఘునాథనృపచంద్ర రణమృగేంద్ర 27

విజయరఘునాథుఁడు మహావీరుఁ డగు రాజేకాక జ్ఞానవంతుఁ డగు నొకరాజర్షి యనికూడ వర్ణింపఁబడు చున్నాఁడు

అర్థ — రణమృగేన్ద్ర - యుద్ధమునందు సింహమువంటివాఁడా (మహావీరుఁడాః యనుట) రాయ రఘునాథ నృపచన్ద్ర - రాయవంశమందు జన్మించిన రాజ శ్రేష్ఠుఁడా (కృతిప్రోత్సాహకుఁ డగు ప్రకృత రఘునాథున కిది సంబోధనము. వినుమనుట) అతఁడు (ఆవిజయరఘునాథరాయఁడు (నీతండ్రి యనుట). దక్షిణామూర్తి సేవా విచక్షణుండు - (శివునిమూర్తిభేద మగు (మేధా) దక్షిణా మూర్తిదేవతయొక్క సేవయందు (విషయ సప్తమి) విచక్షణుండు - విద్వాం సుఁడు దానిని బాగుగా నెఱిఁగినవాఁడు (ఆతనిని యథావిధి గా సేవించి తదను గ్రహము బాగుగా సంపాదించినవాఁ డనుట) (కనుకనే) సంతత + అద్వైత

వేదాంత సక్త చిత్తుఁడు - ఎల్లప్పుడు (రాత్రిందివ మనుట) అద్వయ భావమును ఐక్యమును జీవాత్మ పరమాత్మల కగునభేదమును-దెలుపు వేదాంతశాస్త్రమునందు. (లేక) తత్ప్రతిపాదకము లగు నుపనిషత్తులయందు లగ్న మైన మనస్సు గలవాఁడు (జ్ఞానభూమికయందుఁ బరాకాష్ఠ నందిన రాజర్షి యనుట) ఈవు - నీవు (ప్రకృత రఘునాథ రాయఁడు) తత్ గర్భజలధి హిమ × అంశుఁడు - ఆరాయని యుదర మనెడి సముద్రమునందు చంద్రుఁడవు (ఆనందము కలిగించెడి పుత్రరత్నమ వనుట)

తా— (మేధా) దక్షిణామూర్తి జ్ఞానప్రదుఁడు ఆతనియుపాసనము జ్ఞానద్వారమున మోక్షసంపాదకము ఈతని యదృష్టవశమునఁ దదుపాసనకు జిత్త మలపడి సోఽహంభావమున బ్రహ్మభూతుఁ డై వర్తించుటకు మార్గ మేర్పడినది ఈతఁ డిందువలన నిర్లిప్తుఁ డై రాజ్య మేలుచు జీవన్ముక్తుఁ డయి వర్తించిన యొకరాజర్షి యగుట విశద పఱుపఁబడినది

విశే—దక్షిణామూర్తి జ్ఞానప్రదు డగు నొక మహాదైవము అతని స్వరూప మిట్లు వర్ణింపఁబడినది - స్ఫటికరజతవర్ణాం మౌక్తికీ మక్షమాలా మమృతకలశవిద్యాం జ్ఞానముద్రాం కరాగ్రైః దధత మురగకక్షం చన్ద్రచూడం త్రినేత్రం విధృతవివిధభూషం దక్షిణామూర్తి మీడే ఈతని జ్ఞానోపదేశ మిట్లు వచింప బడినది - చిత్రం వటతరో ర్మూలే వృద్ధా శ్శిష్యా గురు ర్యువా గురో స్తు మౌనం వ్యాఖ్యానం శిష్యా స్తు చ్ఛిన్నసంశయాః (అని)

తద్గర్భజలధి హిమాంశుఁ డీవు అనుటనుబట్టి రాయరఘునాధు డు గూడ నట్టివాఁడే యగుట సూచితము కాళిదాసు దిలీపుని వర్ణించుచు జుగో పాత్మాన మత్రస్తో భేజే ధర్మ మనాతుర అగృధ్ను రాదదే సో ఽర్థ మసక్త స్సుఖ మన్వభూత్ అనినాఁడు

ఈవు హిమాంశు డు - ప్రథమాంతంబు లగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు-ను లును బహుత్వంబున రు-ము లు నంతాగమంబులు ప్రాయికంబు గనగు (బాలవ్యా కార 33) ప్రాయికంబుగ ననుటచే రా కుండటయు దెలుప బడినది. గోముఖవ్యాఘ్రం బింతియకాక నీవు ఋషివే (కవుల షష్ఠము.) మొ

ఆలం—రూపకము (గర్భజలధిహిమాంశు డు)

ఉ. శ్రీరఘునాధరాయనృపశేఖర నీదుకరాసి భీమకా
లోరగతుల్య మౌటను రణోర్విని దుర్మదమత్తచిత్తులౌ
వీరుల ప్రాణవాయువులు పీల్చుట యుక్త మి దెంతవింత య
య్యారె సముద్ర మయ్యును రవంతయు భంగముఁ గాంచ దెప్పుడున్ 28

ఎతత్కృతిప్రోత్సాహకుఁ డగురాయరఘునాధరాయలపరాక్రమమున ఈ పద్యము పైపద్యము వర్ణించు చున్నది

అర్ధ — శ్రీరఘునాధరాయనృపశేఖర (సంబోధనము) నీదుకర + అసి-నీచేతి కత్తి (కర్త) భీమకాల + ఉరగతుల్యము-భయంకర మగునల్లత్రాఁచుతో సమాన మైనది ఔటను-అవుటచేత రణ + ఉర్విని - యుద్ధభూమియందు దుర్మద మత్తచిత్తులు-దుఃఖము గలిగించునది (చెడ్డది) అగుగర్వముచే మదించిన (శక్తి తెలియుజ్ఞానము లేక వర్తించు చున్న) మనస్సు గలవారు ఔ-అవు వీరులప్రాణవాయువులు- (పంచప్రాణముల ననుట) పీల్చుట- మ్రింగుట, ఆహారము గాఁ గొనుట (భక్షించుట) (గాలిగనుక పీల్చుట' యనుట యెంతయు సముచితము) యుక్తము-తగినది (పాములు పవనాశములుగనుక) ఇది- చెప్పఁబోవునది మాత్రము ఎంత- ఎంతయును మిక్కిలి వింత- ఆశ్చర్యము సముద్రము-సముద్రము గా (సహ + ముద్రము గా) (ముద్రతో-నామాక్షరములముద్దరతో కూడినది గా-అని అర్థాంతరము) అయ్యును- ఉండియును రవంతయున్-లేశ మైనను భంగము-అలలు (జాత్యేకవచనము) (శత్రుకృతపరాభవమును అని (అర్థాం) కాంచదు-కనదు పొందదు. అయ్యారె-ఆశ్చర్యము (ఎన్నఁడు కని విని యెఱుగనిది గాన) ప్రశంసార్హము-అని అర్ధాంతరము )

తా — కత్తి నల్లగాఁ బొడుగై యుండునది యగుటనుబట్టి త్రాఁచుపాముతోఁ బోల్చుట కవిసమయసిద్ధము కనుకనే ఇట రాయల కత్తి త్రాఁచైనది.

త్రాఁచు కాలితోఁ దన్ని తన్నుఁ బరిభవించినమదోన్మత్తుని ప్రాణములు తీయక వదలదు ఇది లోకసాధారణము ఇప్పు డీకత్తియుఁ ద్రాఁచువంటి దగుటనుబట్టి దురభిమాను లై యొడ లెఱుఁగక తనతో నెదిరినవారి ప్రాణముల బలిగొను చున్నది ఇది లోకసాధారణమే వింతపడవలసిన దిందు లేదు ఇఁక సముద్రము తా నయియు భంగము లేక యుండుట లోకవిరుద్ధ మగుటనుబట్టి (వింత) అర్థాంతరమున శ్లేషభంగి తోఁ దద్విరోధపరిహారము (నామప్రకటనముతో యుద్ధమున వీరవిహార మొనర్చుచుఁ బరాభవ మనునది యెఱుంగక మదోన్మత్తు లగుశాత్రవులప్రాణముల బలి గొను చున్నది నికత్తి అది చాలఁ బ్రశంసార్హ మైన దనుట యిచ్చటిపరమార్థము )

విశే — పరిపన్థినృపప్రాణపవనాహారదారుణః అసృజ ద్భుజగో యస్య కృపాణ కీర్తి శఙ్ఖకమ్ అని గంగాదేవి (చూ మధురావి 34) జిహ్మగ పవనాశన అని సర్వనామముల బేర్కొను చున్నది (అమ)

అలం — విరోధాభాసము ( ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే ) - అని లక్షణము )

చ కడెములు బాహుపుర్లు పతకంబులు పోఁగులజోడు లుంగరా
లడుగ గ వచ్చు భూషణము లౌటఁ దదంగము లి మ్మటంచుఁ గో
రెడి భవదీయసాయక మరిప్రతతిః ఘనమార్గణాళి కీ
నడతలు యుక్త మౌనె ? రఘునాథమహీప దిలీపవిక్రమా 29

అర్థ — దిలీపవిక్రమా- (ఇక్ష్వాకువంశజుఁ డగు) దిలీపమహారాజువంటి (గొప్ప పరాక్రమము గలవాఁడా రఘునాథమహీపా- రఘునాధుఁ డనెడిభూమిపతీ (సంబోధనము) (దిలీపునికుమారుఁడు రఘువు ఈత డును రఘునాధుఁ డవుట యిచ్చటియౌచితి ) భవదీయసాయకము- నీ దగుబాణము (జాత్యేకవచనము) నీ వైచెడిబాణము లన్నట) (కర్త) అరిప్రతతిన్ శత్రుసమూహమును(శత్రు

వుల ననుట (కర్మ) కడెములు - కడియములను (చేతికంకణములను) బాహుపుర్లు-భుజకీర్తులను (సందెకడియములను) పతకంబులు-హారములను గొలుసు-లో నగువానిని పోఁగులజోడులు-చెవిపోఁగులజంటలను (రెండుచెవు లకు ధరించెడికర్ణభూషణములను) ఉంగరాలు-ఉంగ్రములను (ఇవి అకథిత కర్మములు) (వానికై యనుట) భూషణములు-ఔటన్- (అలంకరించుకొను టకు దారిద్ర్యము తొలగించుకొని జీవించుటకు - ఉపయోగపడునవి అగు టవలన (వీనియీవివలన దాతకు జీవనహాని లేని దగుటవలన) అడుగం గన్ వచ్చున్-వేఁడ వచ్చును 'ఇమ్మని కోర వచ్చును (అట్లుగాక యిది) తత్ + అంగములన్- ఆభూషణములఁ దాల్చెడియవయవములను చేతులు బుజములు కంఠములు లో నగువానిని (దారిద్ర్యము తొలఁగిం చుకొనుటకుఁగాని అందము గా ధరించుటకుఁగాని యుపయోగపడనివానివి ఇచ్చువానికిఁ బ్రాణహాని చేకూర్చువానిని) ఇమ్ము- (దేహి) అటంచున్-అని కోరెడిన్-కోరు చుండెడిని (ఇచ్చుదనుక వదలక యడుగుచునే యుండు ననుట) (ఇందువలన వానినిఁ గొనిననేకాని యూర కుండ దనుట వచింపఁ బడి యాచకులదౌష్ట్యము బాణములయమోఘత్వము తెలియఁ జెప్పఁబడు చున్నది) ఘనమార్గణ + ఆళికిన్ - ఘను లైన వివేకముచే గొప్పవా రైన యాచకులసమూహమునకు (ఘనములు- మేఘములు మేఘము లట్లు జీవనప్రదములు ఐననీబాణపరంపరకు - అని అర్థాంతరము) ఈన డతలు-ఇట్టిప్రవర్తనలు (తమకు లాభము లేక యితరులకుఁ బ్రాణహాని కలిగించెడి (యిట్టి) చేష్ట లనుట) (చేతులకుఁ జేతులు కంఠమునకుఁ గంఠము లనురీతినిఁ దుండెతుండెములు గా క్రూరభంగిని జీవననాశ మొనర్చెడి వర్తనములు- అని అర్థాంతరము) తగునా? - తగదు (సర్వలోకాభయ ప్రదము లై మేఘునివలె జీవనప్రదము లగునిబాణములకు శాత్రవులయెడ నైనను నిట్టి చిత్రవధమున కై నక్రూరప్రవర్తనలు జీవననాశము సముచి తము కా దని యర్థాంతరమున కై నవివరణము).



తా ___రాయలబాణములు శత్రుశేషం న శేషయే' త్తనురాజనీతి ననుసరించి సంధి కొడంబడక మదోన్మత్తులై త మ్మెదిరించినశాత్రవులసంఘమును దుండెతుండెములు గాఁ జిత్రవధ మొనర్చు చున్నవి అట్టిది సముచితమే ఐనను మేఘములట్లు జీవనప్రదములు కావలసినవీనికి శత్రువులయెడ నైనను జీవననాశ మర్హము గా దని వ్యాజనింద

విశే ___అడుగు-అనునది యాచనార్థక మైనప్పుడు ద్వికర్మకము బలిం యాచతే వసుధామ్ అనుటవంటిది ఇం దొకటి ప్రధానకర్మము ఒకటి యవివక్షితకర్మము ద్వికర్మకము లిట్లు పరిగణితము లైనవి దు హ్యాచ్ పచ్ దణ్డ్ రుధి ప్రచ్ఛి చి బ్రూ శాసు జి మథ్ ముషామ్ కర్మయు క్స్యా దకథితం తథా స్యా న్నీ హృ కృ ష్వహామ్ (చూ- అకథితం చ ( 45 ) (సిద్ధాకౌ)

మార్గణం మృగణాయాం స్యాత్ మార్గణో యాచకే శరే అని(వైజ ర్త్య నానా) *శరి నాధిక సాన్ద్రేషు వాద్య మధ్యమ వృత్తయోః ముస్తా ముద్గర మూర్తేషు త్రిషు మేఘే పుమాఁ ఘన (నానా)

యుక్త మౌనె - ఏకత్వం భేధకగతబహువచనానాం చ దృశ్యతే వికృతౌ అని (ఆం చి 42సూ) కులిశధార ల్కొఁరితం బయ్యె అనుటవంటి దిది

పదకము - పదకము తాళి నేవళము లంబెన సరిపెన పరపణి గొలు సన లలంతికా విశేషం బగు - (ఆం భా 2 49)

అలం ___ వ్యాజనింద ఇట సర్వజనులకు జీవనప్రదములు గావలసిన నీఘనమార్గణములు శత్రువులయెడ దయాదాక్షిణ్యములు లేక క్రూరములు గాఁ బ్రవర్తించి జీవనభఙ్గ మొనర్చు చున్నవి అది వానికి యుక్తము గా దను మార్గణనిందచే నిజము గా నీవు దిలీపవిక్రముండవు అరిభయంకరు డవు మూర్తీభవించినక్షాత్రిమవు - అనురాయలస్తుతి ద్యోధిత మగు చున్నది స్తుతిచే స్తుతి కగునుదాహరణ మని ఆలంకారికులు వ్యాజస్తుతి ప్రస్తావమున ఒకశ్లోకము ని ట్లుదాహరించు చున్నారు శిఖరిణి క్వను నామ కియచ్చిరం కిమభిధాన మసా వకరొ త్తప తరుణి యేన త వాధరపాటలం దశతి బిమ్బఫలం శుకశాబక * అత్ర శుకశాబకస్తుత్యా నాయికాధరసౌభాగ్యాతిశయస్తుతిః వ్యజ్యతే

అని (వ్యాఖ్యాకర్త) అట్లే ఈపద్యమున నిందచే రఘునాథరాయలపరాక్రమస్తుతి తెలు పఁబడిన దన వచ్చును

ఉ శ్రీరమణీమణీ చరణశింజనమంజసరత్నపుంజమం
జీరనినాదవద్గృహవిశేషుఁడ వౌచు సపుత్త్రిపౌత్త్రితన్
ధారుణి నేలు సౌభరివిధమ్మున సర్వమహీపతు ల్మిమున్
సారెకుఁ గొల్చులీల రఘునాథనృపాల విశాలవైభవా  30

ఈపద్యము దీనికిఁ బైపద్యము రఘునాథరాయలయాశాసనముతో నవత రించి యీతని యాశీస్సులతోఁ బ్రారంభ మైన యీపీఠికను వానితోనే ముగించు చు నుపక్రమోపసంహారముల కొకవిధ మగు నైక్య మేర్పఱచు చున్నది

అర్థ — విశాల వైభవా వి స్తృత మైన విభుత్వము (ప్రభుత్వము) గలవాఁడా (సార్వభౌమా యనుట) రఘునాథనృపాలా (సంబోధనము) (నీవు) సౌభరి విధమ్మునన్-సౌభరిమహర్షి యట్లు సపుత్త్రి పౌత్త్రితన్ - పుత్త్రిలు వారి పు త్త్రిలు (మనుమలు) కలిగియుండుటతో (సహార్థతృతీయ) (వారు కలిగియుండు టతోపా టనుట) శ్రీరమణీమణీచరణ శింజనమంజస రత్నపుంజమంజీరనినా దవత్ + గృహవిశేషుఁడవు-కాంతా రత్న మగు లక్ష్మీదేవియొక్క పాదములయం దు ధ్వనించు చున్నవి (సమంజసములు) తగినవి (ఆమె) ధరించుట కన్నివిధముల అర్హ మైనవి (చాలయమూల్యము లైన వనుట) (అగు) రత్నపుఁగింకిణులసమూహముతోడియందెలయొక్క ధ్వని గలగొప్పగృహము గలవాఁడవు (నిత్యము శ్రీమహాలక్ష్మి (నీ) యింట విహరించు చుండ నిత్య కల్యాణము పచ్చతోరణము గా సంపత్సమృద్ధితో వెలయు చున్నవాడవు గా అనుట) ఔచున్ - అవుచు సర్వమహీపతుల్-రాజులందఱు సారెకున్- మాటి మాటికి మరల మరల (అతిప్రీతితో - అనుట) కొలుచులీలన్- కొలిచెడి వ్యాపారముతో (కొలుచుటతో అనుట) (అధీశ్వరత్వముతో చక్రవర్తిత్వముతో అని పరమార్థము) ధారుణిన్-భూమిని (రాజ్యమును) ఎలు-ఏలుము

తా·—సౌభరి మాంధాతృని కొమా_ర్తెల నందఱను వరించి తనతప ప్రభావ మున వారి కందఱకు విశ్వకర్మచే మహాసౌధముల నిర్మింపఁజేసి వానియందు అవార్యానంద యను మహానిధి నొకదాని నేర్పఱచి అక్షయము లై రుచ్యము లైన యన్నపానాదులతో భృత్యవర్గాదులఁ బోషించుచుఁ దనభార్యలయందు నూటయేఁబదిమందిసుతులఁ గాంచి ఆసుతులకు మనుమలు గలుగఁగాఁ జూచి యానందించుచు వా రందఱతో మహావైభవమున విలసిల్లెను నీవును అట్లే పుత్త్రపౌత్త్రాదిసమృద్ధితో వెలసి సామంతరాజు లై రాజు లందఱు నిన్నుఁ గొలువఁ జక్రవర్తి వై చిరకాలము మను - మని మానకవియాశీస్సు

విశే — శిఞ్జ) శిజి - అవ్యక్తే శబ్దే - పచాద్యచ్ (చూ మాధవ)

రత్నపుంజ) — రత్నములతో నేర్పఱప బడినకింకిణులే యట - తాస్థ్యాత్తద్వ్యపదేశ వహార అను న్యాయమున - రత్నము లన బడినవి రత్నములు నూపురములందు చిన్నచిన్నగజ్జెలు గా నుండి ధ్వనించుట యిట్లు వర్ణింప బడు చున్నది శిఞ్జన్నూపుర కిఙ్కిణీ ఘణి ధరాం మీనాక్షీం ప్రణతో ఽస్మి (మీనాక్షీపంచరత్నములు) మఱి యొకచో శిఞ్జన్నూపురపాదసారసమణిశ్రీపాదుకాలఙ్కృతే అని దేవి స్తుతింప బడు చున్నది దేవీస్తోత్రకుసుమావళి)

సర్వమహీపతుల్ గొల్చులీలన్ — రాజా య ప్రణతాశేషసామన్తస్స్యా దధీశ్వర (అమ)

(లీల) వ్యాపారము - లీలా విలాసక్రియయో (అమ)

సౌభరివిధమ్మున — మొదటి పాదమున వర్ణిత మైన లక్ష్మీ గృహ విహార వర్ణనచే విష్ణుపురాణవర్ణిత మైన అక్షయ్యాన్నదానాదిసమృద్ధి సూచితము తత పరం మహర్ణిణా ఽఙ్ఞప్త స్తేషు గృహే ష్వనివార్యానన్దనామా మహానిధి రాసాంచక్రే తతో ఽనవరతై భక్ష్య భోజ్య లే హ్యాద్యుపభోగై రాగతానుగతభృత్యాదీ నహర్నిశ మశేషగృహేషు తాః క్షితీశదుహితర భోజయామాసు (విష్ణుపురాణము)

సపుత్త్రపౌత్త్రకన్ — పుత్త్రపౌత్త్రులతో సౌభరి వర్తించుట విష్ణుపురాణ మిట్లు వచించినది పద్భ్యాం గతా యౌవనిన శ్చ జాతా దారై శ్చ సంయోగ మితః ప్రయా

తా దృష్టా స్నుతా స్తత్తనయప్రసూతిం ద్రష్టుం ఘన ర్వాఞ్ఛతి మే ఒన్తరాత్మా
(విష్ణు 4 అంశ 2 అధ్యా 1 7 శ్లో)

అలం — ఉదాత్తము (ఉపమ - అంగము)

మ హృదయాలవాలముచక్క భక్తిరసవారిన్ జ్ఞానబీజంబులో
నుదయిం బంది ప్రరూఢపాద మగుచున్ గోకర్ణనాథాభిధ
త్రిదశానోకహసంగతిం దనరుచున్ శ్రీమద్బృహన్నాయికా
ఖ్యఁ దగుంగల్పకవల్లి రాయరఘునాథాధీశునిం బ్రోవుతన్ 31

రాయల యిష్టదేవతమును బ్రస్తుతించి తదనుగ్రహ మాతనికిఁ గలుగ నాశాసించు చున్నాఁడు కవి

అర్థ — హృదయ + ఆవాలముచక్కన్ - (హృదయము) హృదయపుండరీకము - అనెడి ఆలవాలప్రదేశమునందు పాఁదునందు భక్తిరసవారిన్ - నిష్కల్మషభక్తి యనెడి నీటిచే (భగవంతునియందలిప్రీతి భక్తి రసశబ్దము ఔపచారికముగా భక్తి కగునిష్కల్మషత్వమును వచించును) జ్ఞానబీజంబులోన్-జ్ఞాన మనెడి వి త్తనమునందు (ఆవరణభఙ్గానుకూలవ్యాపారము అవిద్యానాశమున కైనప్రయత్నము - జ్ఞానము) ఉదయంబు అంది - పుట్టువు పొంది పుట్టి (భక్తివలన జ్ఞాన మేర్పడును) ప్రరూఢపాదము - బాగుగా నెలకొనిన వేరులు కలది (భూమియందు వేరులువారి బాగుగా నాఁటుకొనిన దనుట క్రమక్రమము గా జ్ఞానము దృఢపడిన దగుట బోధితము) అగుచున్ గోకర్ణనాధ + అభిధ త్రిదశ + అనోకహ సంగతిన్ - గోకర్ణేశ్వరుఁడు అనుపేరు గలవేలుపుఁజెట్టుయొక్క కలయికతో (పైకిఁ బ్రాఁకి పెనవేసికొని యుండుటతో అనుట) (వేఱుపఱప రా కుండ అభిన్న మై గోకర్ణేశ్వరుఁడె తా ననునట్లు బృహదంబిక యవినాభావముతో భాసించుట తెలుపఁబడినది) (అట్లు) తనరుచున్ - ఒప్పుచు. శ్రీమత్ బృహన్నాయికా + అఖ్యన్ - శోభావంత మైన ప్రకాశవంత మైన (అన్వర్థ మైన అనుట) (బృహతీ నాయికా అని వ్యుత్పత్తి సాక్షాత్పర

షేశ్వరియే యామె యనుట) (యోగరూఢశబ్ద మిది) (పరమేశ్వరునివిమల మగు చైతన్యము-చిచ్ఛక్తి ఈమె యనుట' యిందువలన బోధిత మైనది) బృహన్నాయిక అనెడిపేరితో తనరు - ఒప్పెడి ప్రవర్తిలెడి కల్పకవల్లి - కల్పలత (భక్తులపాలిటి కల్పలత యనియు స్ఫూర్తి) రాయరఘునాధ + అది + ఈశ్వరున్ - రాయవంశపు రఘునాధ ప్రభువును ప్రోవుతన్ - రక్షించుఁ గాక

తా — మానవుఁడు తన హృదయమున భగవంతునియం దతిప్రీతి నెలకొల్పి తా నొనర్చు సర్వకర్మములు నిష్కామబుద్ధితో నాపరమేశ్వరునికి సమర్పించుఁ జిత్తశుద్ధి యేర్పడును దానివలన జ్ఞానము (ఉపనిషత్తత్త్వార్థగ్రహణమున కగు మానసికప్రవృత్తి (అవిద్యానాశమున కైనది) ఎర్పడును అది క్రమము గా (ఇతర) వృత్తివిరమణ మొనర్చి యనన్యప్రవృత్తితో దృఢపడి హృదయపుండరీకమున బృహన్నాయిక గా (భగవంతునిచిచ్ఛక్తి గా) రూపొందును ఔష్ణ్యము దహనునియం దవినాభావముతో భాసించునట్లు పరమేశ్వరి (జ్ఞానశక్తి) జ్ఞేయమగు) ఆపరమాత్మయం దైక్యముతో (ఆపరమాత్మయే తాను గా) ప్రకాశించుచుండును దీనినే యీకవి కావ్యచమత్కృతి కగు రూపకమర్యాదతో మనసు ఓ పాదని జ్ఞానము ఒకవిత్తన మని, భక్తి యొకనీ రని అది దృఢపడుటయే వేరులు పారుట యని గోకర్ణేశ్వరుఁడే కల్పవృక్ష మని బృహదంబికయే కల్పలత యని వానిసంగతియే వారియైక్య మని (వర్ణించి) అట్టి యైక్యముతో భాసిల్లు బృహన్నాయిక సర్వాభీష్టప్రదాత్రి యై యెప్పుడు కంటికి తెప్ప యట్లు' (తన) ప్రభువును బ్రోవవలయు నను చున్నాఁడు

విశే — పరమేశ్వరునికి - ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి అను మూఁడుశక్తులు గలవు అందు ఆపరమాత్మ కగుచిచ్ఛక్తి గా (జ్ఞానశక్తి గా) బృహన్నాయిక యిందు వర్ణింపఁబడినది చిచ్ఛక్తినిగుఱించినవివరణ మి ట్లున్నది - చిచ్ఛక్తి పరమేశ్వరస్య విమలం చైతన్యమే వోచ్యతే తస్యైవా ఽస్య జడా ఽపరా భగవత శ్శక్తి స్త్వవిద్యాత్మకా

సంసర్గా చ్చ మిథ స్తయో ర్భగవత శ్శక్త్యా ర్జగ జ్జాయతే ఒసచ్ఛక్త్యా సవికారయా భగ వతా చిచ్ఛక్తి రి త్యుచ్యతే ఇత్యేవం కథయన్తి కేచి దపరే శ్రద్ధాలవ స్త త్ప్రన కస్మాంచి ద్భువి సమ్మతం చ విదుషాం నేష్టం చ భూమ్యన్తరె (సంక్షేపశారీరకము 3అ 228 229 శ్లో) సచ్చి దానన్దబ్రహ్మస్వరూపిణి గా లలిత వర్ణింప బడినది— చిత్ - చైతన్యమ్ - ప్రకాశకజ్ఞానమ్ ఆనన్ద శ్చా ఒసౌ చి చ్చ - ఆనన్దచిత్ ఏకా వాఒ సౌ ఆనన్దచిచ్చ ఏకానన్దచిత్ ఏకానన్దచిత్ ఆకృతి యస్యాః సా సచ్చిదానందరూప బ్రహ్మలక్షణవతీ అని శంకరభగవత్పాదులు (లలి త్రి భా)

(రస అతిశయ ప్రీతి - అని (లలి త్రి భా ఏకరసా అను నామవ్యాఖ్యాసంద ర్భము కల్పవృక్షము కల్పలత వేఱు గా నుండుట గూడఁ గలదు కల్పవల్లీ సమభుజా అనెడి నామవ్యాఖ్యానసందర్భమున లలితాత్రిశతీభాష్యమందు శంకర భగ వత్పాదు లి ట్లనినారు యథా దివ్యవృక్షా నన్దనోద్యానే ప్రసిద్ధా తథా తదలఙ్కారా య వల్ల్యాదయో ఒపి

బృహన్నాయిక రాయవంశమున కిష్ట దైవము బృహదమ్బికాకటాక్షసంజాత సామ్రాజ్యధురంధరుఁడు గా శ్రీరాయరఘునాథు డు వర్ణింప బడు చున్నా డు (చూ ఆం భా కాండాంతగద్యము)

భక్తి యోగము) జ్ఞానమునకు సాధనము భక్త్యా మా మభిజానాతి అని (స్మృతి).

వ అని తలంచి నాకార్యంబు నాశీర్వాదపూర్వకంబు గా నెఱవేర్చి మహారాజ నియుక్త ప్రకారంబున 32

కృతిప్రోత్సాహకుఁ డగు నిజప్రభునియాశాసనముతో నీకృతి నారంభించి, కృతిప్రస్తావనతోపాటు తదీయవంశాభివర్ణనమును దదాశాసనముతోనే ముగించి యేతత్కృతి నిఁక మాతృభూతేశుని కంకిత మొనర్ప నుపక్రమించు చున్నా డు కవి

అర్థ — తలఁచి- కోరి నాకార్యంబును- నాకర్తవ్యమును నేను చేయవలసిన పనిని (నేను జూపవలసినకృతజ్ఞత ననుట) నెఱవేర్చి- నిర్వహించి మహారాజ

నియుక్తప్రకారంబున్ - మహారాజుచే (రాయలచే) ఆజ్ఞాపింపఁబడినవిధమున (కృతి మాతృభూతేశుని కంకిత మొనర్పు మని యాతనియాజ్ఞ దానిని నెఱవేర్చి, అనుట)

షష్ఠ్యంతములు

క. శ్రీపతిముఖనిఖిలశుభ
ప్రాపకసంభాషునకు వరాంతర్లోక
క్ష్మాపమదాటోపకథా
లాపభిదారోషునకుఁ గలాభూషునకున్ 33

ఎకక్రియాన్వయము గలషష్ఠ్యన్తములతో మూఁడు పద్యములు రచించి తనకృతిని మాతృభూతేశున కంకిత మొనర్చు చున్నాఁడు వెంకనకవి

అర్థ — శ్రీపతిముఖనిఖిలశుభప్రాపకసంభాషునకున్- లక్ష్మీపతి యగుశ్రీమహా విష్ణువు మొద లగువారికి (సర్వదేవతాప్రభులకు సైతము-అనుట) సమస్తకల్యాణములను జేకూర్చెడిసంభాషణము గలవానికి (విష్ణ్వాదులంతవారుగూడ ఈదేవునితోడిసంభాషణమున సర్వశ్రేయోభాజను లగుచున్నా రనుటనుబట్టి యనితరసాధారణ మగు కల్యాణవాగధిష్ఠాతృత్వము తన్మూలమున సర్వదేవతోత్కర్షమున నగుపరమేశ్వరత్వ మీకృతిపతికి వచింపఁబడు చున్నది ) వర + అంతర్లోక క్ష్మాప మద+ఆటోప కథా+ఆలాప భిదా రోషునకున్-శ్రేష్ఠ మైనమధ్యమ లోకము (భూలోకము) నందలిభూపతులయొక్క మదవిజృంభణమున కైన) వారి గర్వాతిశయమును వెల్లడించెడి యనుట) వృత్తాంతముఁ నుగూర్చినమాటలను భేదించుటయందు (నశింపఁజేయుటయందు వినఁబడ కుండ జేయుటయం దనుట) (విషయసప్తమి ) (తద్విషయక మగు) కోపము గలవానికి (తామే సర్వేశ్వరుల మని యహంకరించెడిభూమిపతులపైఁ గోపించి వారిగర్వమును రూపుమాపెడివానికి (దుష్టశిక్షకున కనుట) కలాభూషునకున్-చంద్రకల అలంకారము

గా (శిరోభూషణము గా)కలవానికిఁ (నమస్కరించి అంకితంబు గా - అనువానితో నన్వయము )

తా —కవి తన కృతిపతి సర్వదేవతాసార్వభౌముఁ డై దుష్టశిక్షకుఁడు శిష్టరక్షకుఁ డగుట తెలిపి నాయకొత్కర్షమును వర్ణింపక వర్ణించినాఁడు

విశే — ఒక క్రియతో నన్వయము గలమూ డుపద్యములను విశేషకము అందురు ఈ షష్ఠ్యన్తము లట్టివే ద్వాభ్యాం యుగ్మ మితి ప్రోక్తం త్రిభిః శ్లోకై ర్విశేషకమ్ కాలాపకం చతుర్భి స్స్యాత్తదూర్ధ్వం కులకం మతమ్ అని లక్షణము) కాళిదాసాదులు రఘువంశాదులయందు షష్ఠ్యన్తములతో కుల కాదు లేర్పఱచి దిలీపాదుల వర్ణించినారు- సో ఽహ మాజన్మశుద్ధానాం రఘూణా మన్వయం వక్ష్యే (మొ) (చూ రఘు -5 వఱకు) పైనాచెప్పిన లక్షణముచొప్పున కృతిపతుల వర్ణించి తెలుగుకవులు షష్ఠ్యన్తము లని వీనిని వ్యవహరించినారు వీనియందు సంఖ్య యనియతము

అన్తర్లోకము — ఇది స్వర్గపాతాళములకు నడిమిలోకము ఇతరలోకములకంటెఁ జాల గొప్పది- అత్రా ఽపి భారతం శ్రేష్ఠం జమ్బూద్వీపే మహామునే యతో హి కర్మభూ రేషా హ్యతో ఽన్యా భోగభూమయ గాయన్తి దేవా కిల గీతకాని ధన్యాస్తు తే భారతభూమిభాగే స్వర్గాపవర్గాస్పదమార్గభూతే భవన్తి భూయ పురుషా (విష్ణు)

వరము — వరో జామాతరి శ్రేష్ఠే (విశ్వ

సముద్రమథనసమయమునం దుదయించినచంద్రునికలను శివుఁడు శిరో ఽవతంసముగాఁ బరిగ్రహించినాఁ డని పురాణములు చెప్పును

సంభాష - ఈశబ్దము భావఘఞన్తము సంభాషణము అనెడియర్థము గలది

క శరణాగతహృదయత
మస్తరణికి సంసారజలధితరణికి దైత్యో
త్కరశిక్షణురరిక్షణ
కరవీక్షణఘృణికిఁ జంద్రికాసమఘృణికిన్. 34

అర్థ — శరణ + ఆగత హృదయ తమః తరణికిన్-శరణుచొచ్చినవారియొక్క-మనస్సునందలియజ్ఞాన మనెడియంధకారమునకు సూర్యుఁ డైనవానికి (ఆశ్రితులకు జ్ఞానప్రదుఁ డగువాని కనుట) సంసారజలధితరణికిన్-సంసారము (జననమరణరూపము) అది యనెడిసముద్రము (కర్మబంధమునుబట్టి యంతు పొంతులేకుండ (జననమరణములు) సాగు చుండుటఁబట్టి సంసారము సముద్ర మన బడు చున్నది (దానికి) తరణికిన్-ఓడ గా (తారకుఁడుగా) అగువానికి (కర్మబంధము రూపు మాపి ముక్తి చేకూర్చెడివాని కనుట) దైత్య + ఉత్కరశిక్షణసురరక్షకర వీక్షణఘృణికిన్-రాక్షససమూహమును శిక్షించుట దేవతాసంఘమును రక్షించుట జరపునట్టి నేత్రజ్వాలలు నేత్రకిరణములు గలవానికి (అగ్ని సూర్యుఁడు చంద్రుఁడు-శివునినేత్రములు (అగ్ని తనజ్వాలలతో రాక్షససంహారము సూర్యచంద్రులు తమకిరణములతో దేవతారక్షణము జరపుట వచింప బడినది ) చంద్రికాసమఘృణికిన్-వెన్నెలవంటిదయ కలవానికి (తనదయచే సర్వలోకములకు మహానందము కలిగించువాని కనుట) (పూర్వమువలెనే పెక్కుక్రియలతో అన్వయము)

తా — తన్ను సేవించినభక్తజనమునకు జ్ఞానము ప్రసాదించి జననమరణాతీతులఁగా (ముక్తులఁగా) వారి నీదేవుఁ డొనర్చును అగ్ని సూర్యుఁడు చంద్రుఁడు-అనువా రీదేవునికి నేత్రములు (కనుకనే విరూపాక్షుఁ డీతఁడు) అం దగ్ని నేత్ర మొకటి దానిచేఁ త్రిపురాదు లగుమహారాక్షసుల భస్మీకరించినాఁ డీతఁడు రెండవది సూర్యనయనము దానిచే లోకమునకు వర్షము ప్రసాదించి తన్మూలమునఁ బ్రజ కాహార మొసఁగును వారు యజ్ఞాదులం దగ్నిముఖమున హవిర్దాన మొనర్చి దేవతల నాహారసంతృప్తులఁ జేయుదురు ఇట్లీనయనముచే దేవతారక్షణ మీతఁ డొనర్చు చున్నాఁడు మూఁడవది చంద్రనేత్రము ఈసుధాంశునికలల నాహారముగాఁ గొను చున్నారు దేవతలు అందువలన వారు జీవించి సురక్షితు లగు చున్నారు ఈతఁడు లోకములపై నపార మగుదయఁ జూపి హాలాహలభక్షణాదు లొనర్చినాఁడు అందువలననే చంద్రికయ ట్లీతనిదయ సర్వలోకాహ్లాదక మైనదిగా వర్ణింపఁబడినది ఇట-చంద్రికా + అసమఘృణికిన్-అనియు స్ఫూర్తి

విశే — ఘృణి ర్జ్వాలాంశు పీచిషు అని (వైజ ద్వ్యక్ష పుం) శరణం గృహ రక్షిత్రో ర్వధ రక్షణయో రపి అని (మేదిని)

త్రిపురాసురసంహారమునుగూర్చి శ్రీశైలఖండ మిట్లను చున్నది త దపశ్య మహం లక్ష్య మేకీభూతం పురో దివి సావజ్ఞ మగ్ర్యయా దృష్ట్యా నిటలస్థలజాతయా భస్మితం త త్పురం ఘోరం (63అధ్యా)

సూర్యకిరణములు మేఘము లై వర్షించుట మయూరు డిట్లు వర్ణించినాడు— అవృత్తి భ్రాన్తవిశ్వా శ్రమమివ దధత శ్శోషణ స్సోష్మ ణేవ గ్రీష్మే దావాగ్నితప్తా ఇవ రస మస కృ ద్యే ధరిత్ర్యా ధయన్తి తే ప్రావృ ష్యాత్తపానాతిశయరుజ ఇ వోద్వాన్త తోయా హిమర్తౌ మార్తణ్డ స్యాప్రచణ్డా శ్చిర మశుభభిదే ఒభీశవో వో భవన్తు (సూ॥శ. 14శ్లో)

దేవతలు చంద్రకలల భుజింతురు కలా షోడశ సోమస్య శుక్లే వర్ధయతే రవిః అమృతే నామృతం కృష్ణే పీయతే దైవతైః క్రమాత్ కలావశిష్టో నిష్పీతః ప్రవిష్ట స్సూర్యమణ్డలమ్ అమాయాం విశతే రశ్మౌ అమావాసీ తత స్మృతా (దేవీపురాణము) ద్వితీయాం పిబతే రవి (శ్రుతి)

శివునకు అగ్నిసూర్యాదులునేత్రములు- ఫాలస్థలే లోచన మేధమాన ధామాధరీభూత రవీన్దునేత్రమ్ యుగాన్తకాలోచితహవ్యవాహం మీనధ్వజప్లోషణ మాదధానమ్ (ఈశ్వరవర్ణనము) (చూ కుమా 2స 2శ్లో) వన్దే సూర్యశశాఙ్కవహ్నినయనం వన్దే ముకున్దప్రియమ్ (చూ శివ స పీఠి

చంద్రికాసమఘృణికిన్ - (సర్వధనివంటి దిది ఈదేవునిదయావైశిష్ట్యమును నీలకణ్ఠవిజయచంపువు వచించినది- (చూ నీల చం 2శ్లో)

తరణి ఘృణి శబ్దములు పునరావృత్తము లై యర్థభేదములు గలవి గా సంఘటితము లగుట గమనింపవలసి యున్నది

అలం — సాపయవరూపకము లుప్తోపమ

క శ్రీమత్సుగంధికబరీ
కామికిని మునీంద్రహృదయగామికిని క్షమా
భూమికిని మాతృభూత
స్వామికిని నమస్కరించి సద్భక్తి మెయిన్ 35

అర్థ — శ్రీమత్ సుగన్ధి కబరీకామికిని-(శ్రీ-ఐశ్వర్యము అది కలది) ఈశ్వరి (ఐన) సుగన్ధికున్తలాంబను ప్రేమించెడివానికి (సుగన్ధికున్తలామ్బాప్రియున కనుట) ముని+ఇంద్ర హృదయగామికిని - మహర్షులమనస్సును బొంది యుండువానికి (నిత్యము వారిచే హృదయపుండరీకమందు ధ్యానింప బడువాని కనుట) క్షమాభూమికిని-సహనమునకు స్థాన మైనవానికి మాతృభూత స్వామికిని (మాతృభూతేశునికొఱ కనుట) సద్భక్తిమెయిన్-గొప్పభక్తితో దృఢభక్తితో నమస్కరించి (పై వచనముతో అన్వయము)

విశే — సుగంధికుంతలాంబ మాతృభూతేశునియర్ధాంగి ఆమెనామ మన్వర్థము పార్వతి కేశపాశము సహజసుగంధము కల దని కాళహస్తిమాహాత్మ్యమునందు నత్కీరునికి భగవంతునితో నైనవివాదము మనకు విశదపఱచును- ముక్కంటియు నాతని కనియె న్గిరితనయా ఘనకచభారంబు సహజగంధం బనుచున్ 3 68 సుగన్ధి శబ్దము గన్ధ స్యేత్త్వే తదేకాన్తగ్రహణమ్ అనువార్తికమున సహజసుగంధము కలవానియం దే ప్రయుక్తము గావలయును ఇట నట్లే యైనది కున్తల శబ్దము కబరీ శబ్దప ర్యాయము గా ప్రయుక్త మైనది కున్తలా శ్చ శిరోరుహాః కేశకూటస్తు ధమ్మిల్లః కబరీ కర్బరీ సమే అని (వైజ పాతా భూతా)

(క్షమ)- ఇది యీశ్వరున కగుదశగుణములలో నొకటి గా (వైజ) పేర్కొను చున్నది జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం తప స్సత్యం క్షమా ధృతి స్రష్టృత్వ మాత్మ సంబన్ధో ఉప్యధిష్ఠాతృత్వ మి త్యపి (స్వర్గ ఆది) క్షమా తితిక్షా పృథ్వీ చ యోగ్యే శక్తే చాతే క్షమమ్ అని (ధరణి) క్షమనుగూర్చిన యొకలక్షణ మి ట్లున్నది- ఆక్రుష్టో ఒభిహతో య స్తు నా ఒఒక్రోశే న్న హనే దపి అదుష్టై ర్వా జ్మన కాయై స్తితిక్ష శ్చ క్షమా స్మృతా -(స త పి ప ల సం

హృదయగామికిఁ) - మాధవీయధాతువృత్తి యిట్లను చున్నది గమీ గమే రిన్ ఇతి భవిష్యదర్థా ఉయమ్ అగామీ- ఆజీ చ జిత్ ఇతి ఇనిః ణిత్త్వా ద్వృద్ధిః అయ మపి గమ్యాదిపారా ద్భవిష్యత్కాల అయం బాహులకాత్ కేవలా ద పీతి గామీ ఇ త్యపి భవతి గ్రామగమీ గ్రామగామీ శ్రితాదిషు గమిగమ్యాదీనా ముపసంఖ్యాన మితి ద్వితీయాతత్పురుష ఇతి - ఇది సు ప్యజాతౌ ణిని స్తాచ్ఛీల్యే అను తాచ్ఛీల్యార్థకణినికి విషయము భవిష్యదర్థక ణిని ప్రత్యయాన్త మిని కాదు కావున బ్రోక్తోత్తరముల యావశ్యకతయే ఇట లేదు

వ అంకితంబు గా నాయొనర్పం బూనిన యాంధ్రభాషార్ణవం బనుమహాకృతికి సందర్భం బనినంత సకలాంతర్యామిగావునఁ బ్రత్యక్షం బయి యెట్టు లని యడిగినట్టులు తోఁచె వినుము వివరించెద 36

అర్థ — అంకితంబు-కాన్-(కృతిపతినామముతో కృతిపద్యములందు గుఱుతింపఁ బడుట అంకితం బగుట) అట్టిది యగునట్లు (కృతి యీయఁబడిన దయినట్లు). నాయొనర్పఁ బూనిన-నాయొక్క (కర్తృషష్ఠి) నేను జేయుటకు ఉద్దేశించిన (అట్లు చేయుటకై సంకల్పించిననే ననుట) ఆంధ్రభాషార్ణవంబు (ప్రకృతకృతి నామ మిది) అనుమహాకృతికిన్ సందర్భము-ప్రస్తావము-ప్రారంభము కావ్యావ తరణము (లేక) (సందర్భము) కూర్పు (గ్రంథముయొక్క) పరస్పరసంబంధము తోడిపొందిక మొదలు మొదలుకొని తుదివఱకు సాగినగ్రంథనిర్మాణక్రమము అనినంతన్ - అన్నయంతలోనే (అర్థోక్తియందే-వాక్యము పూర్తి కాకముందే యనుట) సకలాన్తర్యామి కావునన్ - అందఱియందుఁ జొచ్చి వారివారిని అయ్యాకార్యములయందుఁ బ్రవర్తిల్లఁ జేయుపరమాత్మ యగుటనుబట్టి (సర్వము ఆదేవునికిఁ దెలిసిన దగుటనుబట్టి యనుట) (ప్రత్యక్షంబు అయి- సాక్షాత్కరించి, ఎదుట గొచరించి ఎట్టులు-ఎప్రకారము గా అని అడిగినట్టులు తోఁచెన్-(నాకు) స్ఫురించెను (నామనస్సునకు తట్టె ననుట) (అందులకే వినుము (గ్రంథమును).

వివరించెదను (ఈకృతి కైనస్వరూపస్వభావములను) (కృతిభర్తనుగూర్చి కృతికర్త యను చున్నమాట లివి) [ఇఁక గ్రంథ మారంభ మగు చున్నది ]

విశే.— కృతిభర్తను గృతికర్త ప్రతిగ్రంథభాగమున నాద్యంతములందు దప్పక సంబోధించుచు దనకృతిని విన్పించు చున్నట్లు వచించుట కృతిప్రదానమున కైనయొక సంప్రదాయము అది యీకృతికి భర్త యైనమాతృభూతేశునియం దెట్లు జరగెనో కవి యుందు విశదపఱచినాడు భగవత్సంనిధానమున మహాగ్రంథమును వినిపించుట యు నొకభగవదారాధనావిశేష మైనట్లు తిక్కన తనభారతమును హరిహరున కంకిత మొనర్చుపట్టున బేర్కొనినాడు (చూ విరా 3 )

అంకితంబు — ఈకృతి ప్రతిపద్యమును మాతృభూతేశుని సంబోధనముతో నంకితము నొనర్చి అంకితంబు అనుట నన్వర్థము చేసికొనినది ఇట్లు గ్రంథము నంతను కృతిపతినామాంకితంబు గా నొనర్చినకృతులు చాల నరుదే

(ఆంధ్రభాషార్ణవము) ఆంధ్రపదములకు సముద్రమువంటిది (అంతు పొంతు లేని యాంధ్రపదములు కల దనుట) దీనికి సార్థకనామ మిది (వివరణమునకై చూ. నా తొలిపలుకు)

మహాకృతికిన్ — మహాగ్రంథమునకు ఇ ట్లనుటనుబట్టి ఆంధ్రమహాభారతాదుల వంటిమహాగ్రంథముఁ గా దీని నీమహాకవి భావించినాఁ డని తోచును మహాభారతాదు లందలియాశ్వాసములట్లు వర్గములు పర్వములట్లు కాండములు వెలసిన వనవచ్చు నిందు

(సందర్భము శ్రన్థనం గ్రన్థనం గుమ్ఫ స్సందర్భో రచనా న నా (వైజ సామా ధర్మ ) గ్రంథము దీనికి లాక్షణికార్థము - ఈసందర్భము వీరలు చేసిన యది (నిర్వ 0అ ) మొ

# అచ్చ తెలుఁగు కోశము

## ప్రథమ కాండము

### స్వర్గవర్గము

సీ. గట్టులయెకిమీఁడు గన్నవాల్గంటినిఁ
జెట్టపట్టుక యేలినట్టిదిట్ట
మున్నీటిరాచూలిముక్కుఁ గెంజడలోనఁ
గ్రొవ్విరిఁ గాఁ దాల్చుకొన్న మేటి
గబ్బుచెంకమెకంబుగట్టికళవసంబు
కుబుసంబు గాఁ జేసికొన్నదంట
ప్రాఁబల్కుగుబ్బముల్ పన్ని సిస్తగునట్టి
పుడమితేరెక్కినపోటుగాఁడు

గీ. జముపగతుఁడు బూచులదొర జంగమయ్య
మినుసిక గలాఁడు ముక్కంటి యనఁగ నిట్లు
యౌగికంబులు భవదాఖ్యలలరి యుండు
ధాతృనుతపదజలజాత మాతృభూత 37

గట్టులయెకిమీఁడు కన్నవాల్గంటినిఁ జెట్ట పట్టుక యేలినట్టి దిట్ట మున్నీటి రాచూలిముక్కుఁ గెంజడకోనఁ గ్రొవ్విరిఁ గాఁ దాల్చుకొన్న మేటి గబ్బుచెంక మెకంబుగట్టికళవసంబు కుబుసంబు గాఁ జేసికొన్నదంట ప్రాఁబల్కుగుబ్బముల్ పన్ని సిస్తగునట్టిపుడమితేరెక్కినపోటుగాఁడు జముపగతుఁడు బూచులదొర జంగమయ్య మినుసిక గలాఁడు ముక్కంటి— ఇవి శివునకు (యౌగికములు- సముదాయార్థమున కనుకూల మగు నవయవార్థము గలవి- యోగరూఢములు- అగు) పేర్లు

స్వర్గవర్గము — అమరము స్వ రవ్యయం స్వర్గ నాక త్రిదివ త్రిదశాలయా అని స్వర్గనామములతో ఈ వర్గము నారంభించినది ఈ ఆం భా కర్త స్వర్గశబ్దము అర్శ ఆద్యజన్త మని స్వర్గివర్గ మిది యనునట్లు శివునినామములతో దీని నారంభించి తన యిష్టదైవ మై యీకృతికి పతి యైన మాతృభూతేశునిదేవతాగ్రామణిత్వమును చాటి చెప్పి నాఁడు లోకమునకు ఈత డు స్వర్గవర్గ మని యీవర్గమునకు పే రిడియు స్వర్గ నామముల వచింపలేదు ఈతనితరువాతి యచ్చతెలుఁగునిఘంటువులు దేవతానామము లిట్లే యీవర్గము మొదట నుంచి దేవవర్గు అని దీనికి పేరు పెట్టినవి ఇందు ఆంధ్రనామసంగ్రహము ఆం భా కర్తయట్లే స్వర్గనామముల నెచ్చటను స్పృశింప లేదు సాంబ ఆదౌ పూజ్యో గణాధిప అనుటను పాటించుచు విఘ్నేశ్వరుని నామములతో దేవవర్గు ఆరంభించి విన్ప్రోలు వేగంటికచ్చేరి వేల్పుటెంకి యన గ స్వర్గముపే ళ్లగు ( 8 ) అని స్వర్గ నామముల గా దనక యీ దేవవర్గువునందే వచించినది

అమరము 'ఇన్ద్రో వహ్నిః పితృపతి నైరృతో వరుణో మరుత్ కుబేర ఈశ పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్ అని దిగ్వర్గమున దిక్పతులనామములఁ బేర్కొనినది ఏతత్క్రమముననే స్వర్గవర్గమునం దిది ఇంద్రాదుల (దిక్పతుల) నామముల నుదాహరించినది కుబేరునితరువాత ఈశానునినామములు చెప్ప బడవలసి వచ్చినప్పుడు శివునినామములతోనే అవి గతార్థము లని కా బోలు వానిని వేఱు గా అమర ముదాహరింప లేదు ఆం భా గూడ అమరమట్లే వదలినది ఈశానునినామములను ఆంధ్రనామ సంగ్రహాదులు గొన్ని వీనిని విడువక విడిముడి గలవేలుపుచెలి జడముడి జంగంబు గడదెసం గాపరి యౌ నొడయండు పా పతొడవుల నిడియెడువే ల్పన గ నొప్పు నీశానుఁ డిలఙా' (ఆం సం దేవ 25) జడదారి గిబ్బసిపాయి తిగకంటిదొర తుదిదిక్కుటెంకి యన గ నీశానాఖ్య లనువొందు (సాంబ దేవ 4) కడదెసగాపరి విడిముడి గలవాని సంగాతి యన గ నీశాను పేళ్లు (వేంక దేవ 7) అని శివునిపేర్లనే మరల నిట బేర్కొనినవి ఈ నామములయం దన్నిటయందు కడదెసకాపరి అనునదియే ఈశానుని కైనవిశిష్టనామము ఇవి యిట్లు పునరుక్తము లగుటకంటె పరిత్యాజ్యము లగుటలోనే ఔచిత్య మున్న దని పించును అందులకే కావలయు ఆం భా అమరము వీనిని వదలినవి దేవవర్గులో దిక్పతులనామముల వచించునప్పుడు దిగాదిక్రమమును పాటించినవి ఆం సం సాంబ ఆం భా మాత్రము వరుణునితరువాత వాయువు క్రమప్రాప్తము గాఁగా వదలి

కుబేరునినామముల వచించినది ఆతరువాత నైనను వెనువెంటనే వాయునామములఁ జెప్పక పాంచజన్యాదుల వచించినవెనుకనే తన్నామముల నుడివినది గణపవరపు వేంకట కవిగూడ తనవేంకటేశాంధ్రమున దిక్పతినామగ్రహణమునందు క్రమ వ్యత్యాసము పాటించి ఇంద్రునితరువాత వాయువును వాయువుతరువాత అగ్నిని పేర్కొనినాఁడు దిగ్వర్గ మిదికాక దేవతావర్గ విది యగుటను తత్క్రమ మంతగా ఇట వివక్షితము గాక దేవత్వ మాత్రవివక్షతో ఇటులు వచింపఁబడియుండును ఆం భా దిగ్వర్గమున దిక్పతిపర్యాయము లగు నాచ్ఛికశబ్దములు పూర్వోదితములకంటె వేఱైనవి నాటికి లేకుండుటనుబట్టి వానిని వదలి యుండు ననిపించుచున్నది ఐనను అమరమట్లు ఆం భా దిగ్వర్గము వేఱుగా గ్రహించు టనుబట్టి దిక్పతులనామగ్రహణ మైనను దానియట్లు జరపి యుండుట సముచిత మనిపించు చున్నది

అమరమునందు బలభద్రాదినామములు స్వర్గవర్గమునందు వచింప బడియుండుట చూచి కాఁబోలు వేంకటేశాంధ్రాదులు దేవవర్గమున భీమాదినామముల గూడ వడముడి పయ్యెర బుడుత నా భీముండు వివ్వచ్చు కవ్వడి వేల్పుతేని కొడుకు గెలుపుబాసయొడయఁడు వెన్ను మచ్చు గల విల్కాఁడన సవ్యసాచి (వేంక దేవ 2 ) (ఆం సం దేవ 30 ) (సాంబ దేవ 6 ) వచించినవి ఇవి యిట్లు వచించినను ఆం భా మాత్రము క్షత్రియవర్గము నందే భీమాదుల నామముల వచించినది బలభద్రుని నామముల నెచ్చోటను వచింప లేదు వదలినది ఆం సంగ్రహాదులు అమరమట్లు బలుని నామములను నలుపుగింజెనదాల్పు నాగలి వాల్దొడు తాటిడాల్దొర కప్పుచేటిగొంగ మూపున రోఁకలి మోచినజగజెట్టి గొల్లవేల్పు టను గుఁగొమ్మబావ కడ దనరుచుక్కపేరిటిపడఁతిమగఁడు నాఁ బలుఁడు (వేంక దేవ 2 ) నల్లవలువతాల్పు తెల్లనిమైదంట వెన్నదొంగయన్న వెట్టిసీల్ల మేలువాఁడు దుక్కివాలుదాలుపు తాటి పడగవాఁ డనంగ బలుఁడు (ఆం సం దేవ 29 ) తుదచుక్కపేరిటితొయ్యలిపెనిమిటి కప్పుదేవరయన్న కలపదారి కటివల్వప్రోడ రోఁకలితాల్పు తాటిటెక్కెముమేటి బలియుఁడు జమునగొంగ యన గ బలభద్రుపేళ్లగు (సాంబ దేవ 5 )అను రీతిని వదలక వచించినవి ఇన్ని నిఘంటువు లిట్లు వచించినను బలునినామములను ఆం భా కర్త వదలుటకుఁ గలకారణ మీతనికి బూర్వ మున్న ప్రామాణికాంధ్రకృతులం దివి లేక ఇటీవలి యచ్చతెలుగుప్రబంధములందు అచ్చతెలుగు నిఘంటువులందు యౌగికములు గా (అనఁగా కృత్రిమములు గా) ఇటీవల వెలసినవి యగుటయే యనిపించును దూన్ప

సేనుఁడు ద్రోవది రారాజు విరటు డు— మొద లగునవి ఆంధ్రభారతాదులందు సుప్రసిద్ధములు ఈత డు వానిని వదల లేదు వీనినే వదలినా డు దశావతారములలోనివా రయి దేవతామూర్తు లగుబలరామాదులు దేవవర్గమందు జేరుట యుక్త మైనను భీమాదుల నిందుఁ జేర్చుట యనుచిత మని ఆం భా కర్త భావించి కా బోలు క్షత్త్రియ వర్గమునందే వీనికి స్థాన మొస గినాఁడు చాలవఱ కమరానుసరణమే యీతనిలక్ష్య మైనను ప్రామాణిక ప్రయోగసౌలభ్య దౌర్లభ్యముల బట్టి గ్రంథసంక్షేపమున కైన సంరంభమునుబట్టి భాషాస్వభావమునుబట్టి ఔచిత్యానౌచిత్యముల బట్టి కొన్నిమార్పు లిం దీతనికి తప్పని వైనవి

అమరము దేవతాసాధారణనామముల ముందు వచించి తదుపరి దేవతావిశేష నామముల వచించినది ఆం భా కర్త మునుముందు దేవతావిశేషనామములతో స్వర్గవర్గ మారంభించి ఏకక్రియా ద్వ్యర్థకరీ బభూవ అనురీతి నిష్టదేవతానామ స్మరణముతో మంగలాచరణముఁగూడ నొనర్చినవా డైనా డు ఈత డు దీని నొక మహాకృతి గా భావించి యుండుటచే మంగలాచరణ మీతని కవశ్యాచరణీయ మైనది నిజము గా గ్రంథారంభ మిది గా కున్నను విఘంటుస్వరూప మిచ్చటినుండియే ఆరంభ మగు చున్నదిగాన ఇదియు నొకగ్రంథారంభమువంటిదే అదిగాక ఏదో యొకవస్తువు నామముల వచించుచు గ్రంథారంభము జరపుట యవశ్యంభావి యయినప్పుడు భక్తకల్పద్రుమ మై సర్వజగన్నియన్తయగు నాపరమేశ్వరుని నామస్మరణముతోనే కృత్యారంభము జరపి శ్రేయ మంద దలచుట యెంతయో సముచితము ఇందువలన ఈ కృతికర్త మఙ్గలాదీని మఙ్గలమధ్యాని మఙ్గలాన్తాని చ శాస్త్రాణి ప్రథన్తే వీర పురుషకా ణ్యాయుష్మత్పురుషకాణి చ భవన్తి అధ్యేతార శ్చ ప్రవక్తారో భవన్తి అను మహాభాష్యకర్తవచనమును పరిపాలించి విఘ్ననిరాసముతో నిజగ్రంథపరిసమాప్తి కైన స్వకర్తవ్యతను నిర్వహించుట యను శిష్టసంప్రదాయమును పాటించినవా డగు చున్నా డు అందులకే పరశివునివృత్తము తేటతెల్ల యగునట్లు సర్వేశ్వరుని యౌగిక నామములనే మునుముందు పేర్కొనుచు తన కృతిపతి యగుమాతృభూతేశ్వరమహాదేవుని స్తుతించినా డు పుదుపుపాటి వేంకనార్య దీనామములతో

ఈశివునినామములను ఆం సం ముచ్చట గా ఇట్లు వచించినది ముక్కంటి యర పది మోముల వేలుపు మినుసిగదయ్యంబు మిత్తిగొంగ గట్టువిల్తు డు గఱకంఠుఁడు మిక్కిలి కంటిదేవర బేసకంటివేల్పు వలిమలల్లు డు మిన్నువా కశాలుపు కొండ వీటిజంగము గుజ్జువేల్పుతండ్రి వలరాజుసూడు జక్కులతేనిచెలికా డు బూచుల యెకిమీ డు పుసుకతాల్పు

విసపుమే తరి జన్నంపువే టకాఁడు బుడుతనెలతాల్పు వెలియాలపోతురౌతు తోలుదాలుపు మమ్మొనవాలుదాల్పు (అం సం దేవ 6) ఇట్లే మఱికొన్ని పేర్లను వేంక వచించినది (దేవ 5)

క వెన్నుండు కట్టి నెచ్చెలి
కొన్ననవిలుకాని తండ్రి గుడుసుటడిదపున్
మన్నెదొర లచ్చిమగఁ డన
నన్నలినాక్షునకుఁ బేరు లగును మహేశా 38

వెన్నుఁడు కట్టి నెచ్చెలి క్రొన్ననవిలుకాని తండ్రి గుడుసుటడిదపు మన్నెదొర లచ్చిమగఁడు — ఇవి నలినాక్షునకు (విష్ణువునకు) పేర్లు

పేరులు — పేళ్లుగూడ ఈత డు ప్రయోగించినా డు (చూ 43) బాలవ్యా బహు వచనము పరం బగునపుడు డ-ల- ట-ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబు గా నగు (అచ్చి 2 సూ) అనుదానికి గోర్లు గోరులు ఉదాహరణ మొసగి పేర్లు పే రులు సాధువు లను చున్నది ఇది బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబు గ నగు (అచ్చి 4) సూత్రముచే డకార లకార ములకే అలఘులకారము విధించి పేళ్ల గోళ్ల అసాధువు లను చున్నది పల్లు పలు నా గ దంతంబుపేళ్లు వెలయు (అం సం మాన 20) వంటి నిర్ధా రకప్రయోగములు దీని కున్నవి బాలవ్యా అసాధు విది యన్నను ఆం చింతామణి పేరులు పేళ్ల అను రెండురూపములు సాధువు లని సాధించినది (చూ రో లః డ ల టా ముదితాం తస్య చ వా లుక్ అనుసూత్రములు బాల సరస్వతిటీక) ఆంధ్ర కౌముదియందు గణపవరపువేంకటకవిగూడ వినుడు పేరులు పేళ్ల నా గను వెలయు అని యనుశాసించి యివి సాధువు లనినాఁడు ఈతఁ డి ట్లనుశాసన మొన ర్చియు కరదీపి కలపేర్లు నింగిలాయి లన (వేంక మాన 72) రెడ్డి వంక లన వడ్లపే ర్లగు (78) లని పేర్లు గూడ బాహాటముగానే ప్రయోగించినా డు నిర్ధారకప్రయోగ ములు దీనికి లే వన్నను ప్రయోగబాహుల్యము లోకసంమతి దీని కున్నవి ఏర్లనీళ్లను నొండె వేస్నీర్ల నొండె (మార్క౦ 3 ఆ) ప్రౌఢ సంధి 5సూ లోని ఏళ్లనీళ్లను

నొండె వేన్నిళ్ల నొండె అనుపారము కవిసమ్మతమ. గా దను చున్నారు విమర్శకులు నీర్లు అనుటవంటిదే పేర్లు ఇది యంతయు పరిశీలించి చూచిన పేరులు పేళ్ల పేర్లు అను మూ డును సాధువు లనిపించు చున్నవి సహృదయులు ప్రమాణము

ఆ పలుకువెలఁదిమగఁడు బంగారుకడుపువా
డంచతేజి నెక్కునట్టిరాతు
బమ్మ తాత నలువ తమ్మిచూలి దుగిను
డనఁగ బ్రహ్మపేరు లబ్జమౌళి 39

పలుకువెలఁదిమగఁడు బంగారుకడుపువా డు అంచతేజి నెక్కునట్టిరౌతు బమ్మ తాత నలువ తమ్మిచూలి దుగినుఁడు — ఇవి బ్రహ్మకు పేర్లు

బమ్మ —(సం బ్రహ్మ) బొమ్మ- (రూపాం) తద్భవముల వచించుచు బ్రహ్మ-బొమ్మ అవినది (అం కౌ) ఒకకవి యిట్లు వర్ణించినాఁడు తమ్ములకన్నను గన్నులు తొమ్మిదిగుణములను హెచ్చు తొయ్యలి కంచున్ బమ్మ తదక్షియుగోపాం తమ్మున వ్రాసిన నవాంకతం దెలిపె జెవుల్ (కవిజ 62) మఱియొకకవి యి ట్లను చున్నా డు బొమ్మ యనుపేరి యగసాలె పూఁటచెలిని గోరి యలరించుటకు జదల్గుదుట గా చి నీట ముంచినమేటివన్నియపసిండి పూదె యన గ్రుంకు గడలిలో బ్రొద్దు వ్రాలె (నీలా 3 3)

తాత —(సం ధాతా) ధాత తా త అని తద్భవముల వచించినది (అం కౌ) తాత వేల్పు = బ్రహ్మదేవు డు ముదిసి ముప్పున బెండ్లికై మొగము వేల్పు తగవు గా దని రా డయ్యె దాతవేల్పు (శృం నై 4 29)

దుగిను డు —(సం ద్రుహిణ ప్రా దుహిణ) దుగినుండు ద్రుహిణుండు అని తద్భవ ముల వచించు చున్నా డు గణపవరపువేంకటకవి

అబ్జమౌళి — చంద్రశేఖరు డు అబ్జో జైవాతృక సోమో గ్లౌ ర్మృగాజ్కః కలానిధి అని (అమ)

ఆ గట్టుఱేనిబిడ్డ కఱకంఠునిల్లాలు
కొదమసింగ మెక్కుకొన్నజంత

సత్తి సామితల్లి చండి యమ్మిక దుగ్గ
యనఁగ నీనెలంత యలరు నభవ 40

గట్లతేనిబిడ్డ కఱకంఠునిల్లాలు కొాదమసింగ మెక్కుకొన్నజంత సత్తి సామితల్లి చండి అమ్మిక దుగ్గ—ఇవి పార్వతికి పేర్లు

సత్తి —(సం శక్తి ) శక్తి రస్త్రాన్తరే గౌర్యా ముత్సాహాదౌ బలే స్త్రియామ్ (మేదిని)

చండి —(సం చణ్డీ క త చండి) లజ్జ వంటితద్భవ మిది లేదా (అళి ) అళీ (వల్లీ) వల్లీ-మొద లగునవి కొన్ని సంస్కృతములే యన దగిన సంస్కృతసమములు ప్రాకృతమున కానవచ్చు చున్నవి అట్టిప్రాకృతసమమే యిది కావలయును లేదా, చణ్డ అనుదానికి చండో అనురూప మున్నట్లు ప్రాకృతశబ్దప్రదీపిక వచించు చున్నది ఈప్రాకృతశబ్దమే పై కన్నడ తమి ళాంధ్ర పదములకు మూల మై దీనిని వెలయించిన దైనను కావచ్చును చజౌ తజ్జే ప్రాకృతే చ దన్త్యా వేవ న సంశయ అని ప్రాకృత వ్యాకరణము

అమ్మిక —(సం అమ్బికా ) మృడానీ చణ్డికా ఽమ్బికా (అమ )

దుగ్గ —(సం దుర్గా ప్రా దుగ్గా క దుగ్గె ) దుర్గా కాత్యాయనీ చణ్డీ కైటభీ సింహ వాహనా అని (వైజ ) దుగ్గి (రూపాం ) ( దుగ్గ దుగ్గి అని ఆం కౌ ) శర దుగ్గకు కాళి 2 పార్వతి- అని రెం డర్థముల నిచ్చినది మొదటి యర్థమునకు దుగ్గమ్మ కారుపోతుల లోను చేయుమీ తొలుముద్ద గా నిత్తు దుంత నొకటి (యయా 2 3 ) అనుప్రయోగము నుదాహరించినది వైజ శక్తుల నిట్లు పేర్కొనినది వామా జ్యేష్ఠా శివా రౌద్రీ చిత్తోన్మాదకరీ సుఖా కాళీ కలేబరా భూతదమనీ చేశ్వరశక్తయ (స్వర్గ ఆది ) ఈశక్తులలో ఒకటి యగుకాళినే విశేషవివక్షతో శ.ర వేఱుపఱచిన దనవచ్చును అవతారభేద మొకభేదము గా వివక్షించినప్పు డివి వేఱుపడును లేనప్పుడు లేదు అభిన్నములఁగానే సాధారణము గా వచించు చున్నవి నిఘంటువులు విష్ణు ర్నారా యణ కృష్ణః ( బమ్మదేవరతండ్రి తమ్మికంటి పదివేసములసామి పసి డిపుట్టము తాల్పు కట్టినెచ్చెలి మొద లగునవి యిట్టివే ఈపట్టున అమ వైజ లో నగునవి అధిక ముగా అవతారాభేదమునే పాటించి కాళీ హైమవ తీశ్వరీ (అమ ) పార్వతీ

శివా భ్రామరీ (వైజ) కాళికా యోగినీభేదే కార్ష్ణ్యే గౌర్యాం ఘనావళౌ (విశ్వ) కాళీ నవామ్బుదశ్రేణ్యాం భవానీమాతృభేదయో (నానా) అనురీతిని వచించినవి విశేషవివక్షతో అవతారభేదమునుగూడ ఇవి ఒక్కొకచో కాదన లేదు దుర్గా తు కాళ్యాం గౌర్యాం చ అనియు (నానా) ఈ నిఘంటుప్రామాణ్యమునుబట్టియే శ ర ఈ రెండర్థముల వేఱుపఱచి యుండును అం భా అమరము ననుసరించుచు అభేదమును పాటించిన దీమెడ ఇప్పుడు పై ప్రయోగము అం భా కు ఉదాహరణమే కను కనే సూ ని దుగ్గ కు రెండర్థముల నిచ్చుట మాని దుగ్గ పార్వతి శక్తి అని అం భా తోపాటు పై ప్రయోగమునుగూడ దీనికి ప్రమాణము గా ఒస గినది

పైనాలుగుపేర్లు అం సంగ్రహాదులకంటె విశేషము గా అం భా ఉదాహరించినది చండి అమ్మిక అనువానికి గాక తక్కినరెండిటికి శ ర సూ ని ప్రయోగము లిచ్చినవి మత్తగిల్లుసత్తుగిత్తతత్తడి నెక్కి మిత్తి మొత్తి సత్తి నత్తి బత్తి బత్తిరిడిన ముత్తి బుత్తులు రెండును నొత్తి గుత్తగట్టు చుండుతే ధ (నీలా 8) సూ ని ఈయర్థమున సత్తి గ్రహింప లేదు గ్రహింపక పోగా శక్తి- ఆయుధవిశేషము అనునర్థమ నకు పైప్రయోగము నుదాహరించినది అర్థమే మనుకొనినదో తెలియదు సత్తి-పార్వతిని అత్తి-కూడి పొంది పార్వతితో కలసి అనుట ఇచ్చటి యర్థము (చూ సూ ని అత్తు)

క వలరాజుతల్లి కలుముల
చెలి కలువలతేనితోడు సిరి లచ్చి యనన్
వెలయును లక్ష్మినామ
మ్ము లి వెల్లను జూడఁ జంద్రభూషితచూడా 4

వలరాజుతల్లి కలువలచెలి కలువలతేనితోడు సిరి లచ్చి— ఇవి లక్ష్మికి పేర్లు

కలుములచెలి — లక్ష్మీ స్సంపత్తిశోభయో ఋద్ధ్యౌషధౌ చ పద్మాయామ్ అని నిఘంటువులు లక్ష్మిసంపద లను వేఱుగానే వచించినవి ఐనను సంపదధిష్ఠానదేవత ఈమె యగుటను తదభేదమును పాటించినారు కవులు కనుకనే కలుములచెలి ఈమె య్యైనది కవులు సంపద కగుచాంచల్యాదుల నీమెయం దారోపించి యీమెను తెగడు చున్నట్లు చమత్కరించి చమత్కారసారః కావ్య మ్మనుట అర్థవంతి మొనర్చినారు కమల

యేనిళ్ళల రమణపేరెదకు మో పైనిల్పి యతని పే రడుగుపఱచె (వసు 3౬) మొద లగునవి యిట్టివే లక్ష్మీసంపదో రైక్యమ్మని కవిసమయము ఇచ్చట అం భా చూడఁగా అనుట ఈయంశమును ధ్వనింప జేయుటకె యగు నేమో

లక్ష్మీనామములను అం సం కూడ అం భా వలెనే చెప్పినది లచ్చి కలుములజవరాలు పచ్చవిల్తు తల్లి కలివేల్పునిల్లాలు తల్లితల్లి కడలికూతురు సిరి లిబ్బిఁడతి తమ్మి యింటిగరి తన శ్రీ యొప్పు (దేవ 0) తల్లితల్లి అనునది యీమె కొకవిశిష్టనామము సాంబ గూడ దీనిని వచించినది విష్ణుపాదోద్భవా గంగా అని అమ కనుకనే గంగతల్లి యైన దీమె నదీకాన్తస్సముద్రే స్యాత్ (విశ్వ) నదీపతి సముద్రుడు తెనాలి రామకృష్ణ కవి తుంగభద్రను వర్ణించుచు ఈతని నదీపతిత్వము నిట్లు విప్పిచెప్పినాడు గంగాసంగమ మిచ్చగించునె మదిం గావేరి దేవేరి గా నంగీకార మొనర్చునే? యమునతో నానందముం బొందునే రంగత్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ యంగం బంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ (పాండు అ 39) (తుంగభద్రకు సముద్రముతో సాక్షాత్సంగమము లేదను చరిత్రరహస్య మిం దెఱుఁగవలసిన పరమరహస్యము) ఈమె కిట్లు గంగ తల్లి తల్లితల్లి యైన దిప్పు డీమె

క పలుకుఁజెలి లచ్చికోడలు
కలనితబిసితల్లి తూఁటిగాసపు దేజీ
గలబోటి యనఁగ భాషా
జలజాక్షికి బేరు లౌ నిశాకరభూషా 42

పలుకుఁజెలి లచ్చికోడలు కలనితబిసితల్లి తూఁటిగాసపుఁదేజీ గలబోటి—ఇవి భాషాజలజాక్షికి (సరస్వతికి) పేర్లు

పలుకు జెలి — ఇచ్చటిచెలి స్త్రీ పర్యాయము లన్నిటికి ఉపలక్షణము పలుకు దొయ్యలి పలుకు గలికి పలుకు జేడియ పలుకు బూబోఁడి-మొద లగునవి ఇట్లే యెఱుఁగ దగినవి పల్కుఁ జెలి- (రూపాం) సకలామోదక తాళవృత్తగతులన్ సంగీతసాహిత్యనామక విద్యాయుగళంబు పల్కుఁ జెలికిం బాలిండ్లజోడై సిరు ల్ప్రకటింపన్ (వసు 3)

తే గుజ్జువేలుపు పిళ్లారి కొక్కురౌతు
బొజ్జదేవర యేనుఁగుమొగముసామి
పని చెఱుపువాఁడు వెనకయ్య యన వినాయ
కునకుఁ బేళ్లొప్పను సుగంధికుంతలేశ 43

గుజ్జువేలుపు పిళ్లారి కొక్కురౌతు బొజ్జదేవర ఎనుఁగుమొగముసామి పని చెఱుపువాఁడు వెనకయ్య — ఇవి వినాయకునకు (విఘ్నేశ్వరునకు) పేర్లు

పిళ్లారి —(త ఎళ్లైయార్) ఈపదము చెన్నపత్తనాదులందు సార్వజనికము గా వ్యవహృత మగు చున్నది అచ్చతెలు గునిఘంటువులు దీనిని విడువక గ్రహించు చున్నవి బొరియ పొగాజక్కినెరరౌతు పిళ్లారి (వేంక దేవ 8) పెద్దకడుపువేల్పు పిళ్లారి కుడుముల తిండి కా డు (ఆం సం దేవ. 2) తెలు గు కావ్యములం దిది బహులము గా ప్రయుక్త మైనది పిళ్లారిజియ్యతేజునఁ దెల్లంబు గ జింకమావుదేవరకతనం బెల్లద రార గ బుట్టిన బల్లిదు డవు (అచ్చ రా కిష్కిం 93) చేరి యీచేవ్రమాని పిళ్లారి నఱకి చెక్క లొనరించి యంగడి జేర్చి యమ్మి యింటి కే గుట కార్య మిం కేటిదే వు డెను గూటికి వగవఁగా నేమి కలదు (శుక 3 254) (చూ సూ ని) అప్పకవి అన్యదేశజాంధ్రములకు క్రిందిరీతిని లక్షణ మేర్పఱచినా డు కేశవ యాంధ్రులు నానా దేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్తద్దేశోక్తు లంట బలికిన నాశబ్దము లన్యదేశ జాంధ్రమ లయ్యెన్ (అప్ప 08) ఇట్టిదే యిది

చ కొమరుఁడు సామి కొంచమలఁ గొట్టినజాణఁడు విప్పుగన్నుమొ
త్తముపడవాలు ముద్దుగల తల్లుల బిడ్డఁడు తీగపేరిక
ల్కిమగఁడు తెల్లుచూలి నెమిలిం బయికొన్నమనీఁడు బారకే
ళ్లమరినవాఁడు నా నగు గుహాఖ్యలు శ్రీత్రిశిరఃపురీశ్వరా 44

కొమరుఁడు సామి కొంచమలఁ గొట్టినజాణ డు విప్పుగన్నుమొత్తముపడ వాలు ముద్దుగలతల్లులబిడ్డఁడు తీగపేరికల్కిమగ డు తెల్లుచూలి నెమిలినిఁ బయికొన్నమనీఁడు బారకేళ్లమరినవాఁడు — ఇవి గుహునకు (కుమారస్వామికి) పేర్లు

పడవాలు —(సం భటపాల ప్రా భడవాలో త పద్యైయాళ్ )= సేనాధిపతి (ఏ ) బ పడవాళ్లు ( పడవాలు కు రూపాం పవాలు )

ముద్దుగలతల్లులబిడ్డ డు — (మూ డు దుగలు-ఆఱు ఆఱుగురుతల్లులబిడ్డ షాణ్మాతురు డనుట

మొత్తము — సేన పఱచి హనుమంతు డెడ< దఱుముబలు మొత్తముల కుఱికి (భా రా యు 66 ) (మా సూ ని ) (విప్పగన్ను మొత్తము-దేవసేన )

త్రిశిర + పురీ + ఈశ్వరా — శిరస్సువంటి దై యున్న (పర్వత) శిఖరమే (లాక్షణిక ముగా) ఇచ్చట శిరస్సు అన బడు చున్నది ఆ శిరస్సులు మూ డు గల కొండ త్రిశిరస్సు త్రికూటపర్వత మనుట అది కలపురి - త్రిశిరఃపురి ఇదియే తిరిచినాపల్లి (అందలి) ఈశ్వరు డు - శివు డు - మాతృభూతేశ్వరు డు ఆయన కై ననంబోధన మిది త్రికకు త్పర్వతే (5 4 47 ) అనుపాణినీయసూత్రమును కాశిక ఇట్లు వ్యాఖ్యానించి నది త్రీణి కకుదా న్యస్య త్రికకుత్ పర్వతః కకుదాకారం పర్వతస్య శృఙ్గం కకుద మి త్యుచ్యతే న చ సర్వ త్రిశిఖరః పర్వత త్రికకుత్ కిం తర్హి ? సం జ్ఞైషా పర్వత విశేషస్య ఈ త్రికకుత్పర్వతమే ఇచ్చటి త్రిశిర పర్వతము కావచ్చును

సీ కండచక్కెరదిండికత్తలానివజీరు<
డలరువిల్కాడు పూవులవిలుతు<డు
చెఱకువిల్కాడు క్రొంజిగురులవిల్కా<డు
తలిరువిల్తుండు కన్నులవిలుతు<డు
పచ్చవిల్తుండు చౌవంచతూపులజోదు
కమ్మవిల్కా<డు దెందమ్ముచూలి
తియ్యవిల్తు<డు గాలితేరెక్కుమన్నీ<డు
చక్కెరవిల్కా<డు చక్కనయ్య

గీ తుంటవిల్కా<డు మరు< డించువింటివా<డు
దీగవిలుకా<డు వలరాజు తేఁటియల్లె

వింటిదొర నెలయల్లుఁడు వెడవిలుతుఁడు
నాఁగ మరునాఖ్య లగు శేషనాగభూష 45

కందచక్కెరదిండికత్తలానివజీరుఁడు అలరువిల్కాఁడు పూవులవిలుతుఁడు చెఱకువిల్కాఁడు క్రొంజిగురులవిల్కాఁడు తలిరువిల్తుఁడు కన్నులవిలుతుఁడు పచ్చవిల్తుఁడు చొవంచతూఁపులజోదు కమ్మవిల్కాఁడు దెందమ్ముచూలి తియ్యవిల్తుఁడు గాలితేరెక్కుమన్నీఁడు చక్కెరవిల్కాఁడు చక్కనయ్య తుంటవిల్కాఁడు మరుఁడు ఇంచువింటివాఁడు తీగవిలుకాఁడు వలరాజు తేటియల్లెవింటిదొర నెలయల్లుఁడు వెడవిలుతుఁడు—ఇవి మరునకు (స్మరునకు మన్మధునకు) పేర్లు

గాలి మన్నీఁడు—మన్మథునకు గాలి రథము గాడ్పుటరదపుదొం అనినాఁడు మన్మథుని గణ వరపువేంకటకవి (చూ వేంక దేవ 0) వాయునామములలో మరునితేరు అనియు వచించినాఁ డీత డు (చూ వేంక దేవ 5) విరహావర్ణనాసందర్భమున ఒకకవి ఇట్లను చున్నాడు— నీవిలు నేలపాలు గను నీశరముల్ తల విచ్చి పోను నీ సేవకు లెల్లఁ గాఱడవి జెందను నీధ్వజ మబ్ధిలో బడఁగ నీవలిదేరు పాము దిన నీమెయి భగ్గున మండి పోను నీ కావర మేల? కొమ్మ గసికందలు సేయకు రోరి దర్పకా (ప్రబం 743)

వెడవిల్తుఁడు—ఇక్షుధన్వుఁడు తుంట వెడ అనువానికి చెఱకు అని అర్థము మన్మథ ధనువు అని అర్థము చెప్పుచోట్లనే వీని కీయర్థము గానవచ్చుచున్నది అని సూని (చూ తుంట వెడ) బ్రౌ వెడ అనుదానికి తూడు పుష్పము కొరగానిదిన్ని అనెడియర్థముల నిచ్చి వెడవిలుకాఁడు అనగా పుష్పశరుఁడు అనినది తూఁడుగూడ మన్మథునివిండ్లలో ఒకటి మన్మథునిబాణములను ధనుస్సులను ఉల్లెత్రాళ్లను గణప వరపువేంకటకవి ఇట్లు వివరించినాఁడు — కలువ తామర మావియలరులు తుమ్మెద యల్లె చెఱకువింట నమరి యుండు నల్లవావి లరంటి మొల్లపువ్వు లిగురు గొనయంబు తూఁడువింటను దలిర్చు మంకెనాశోకము ల్మల్లెపూ ల్తూడునూ ల్నారి చిగురువింట సొరు గాంచు బాదిరి పొగడ సంప గినన ల్కురువేరు దంటగొనమ్ము పూవింట

దనరు మొదలిపొన్న దిరిసెనము మొగలిపూలు వెన్నెలయు శింజినియు బచ్చయెన్ను వింట నమరు నిట్టుల నమరు ని శైదుపదియు విరులు తూ పులు మరున కౌ (వేంక దేవ )

క కటిజేజెయన్న వినుఁబ్రోల్
దొర చౌదంతియెకిమీఁడు తూరుపుదొం మ
బ్బుంవుతు వేగంటి యనన్
సుంనాధునిపేళ్ల చెల్లు సూర్యవతంసా

కటిజేజెయన్న వినుబ్రోల్‌దొర చౌదంతియెకిమీఁడు తూరుపుదొర మబ్బు రవుతు వేగంటి—ఇవి సురనాధునకు (ఇంద్రునకు) పేర్లు

సూర్యవతంసా —శివుడు చంద్రశిరోభూషు దగుట సుప్రసిద్ధము సూర్యశిరోభూషణు
డగుటగూడ వర్ణితము
ఇంద్రునినామములను వేంక బాగుగా వివరించినది మలలచెట్టుపలు చెక్కలొనర్చుదిట్ట నూ అంచులవాలు చేనుంచువేల్పు నాతిడాయగఁ బెక్కుకూత వెట్టినపుంజు నిలువెల్ల గన్నులై వెలయుదంట వెలిగౌరు నిక్కువీనుల జక్కి నెక్కెడు వలతి తూర్పువిలాతి మెలగుమేటి నలువ దఱువది జన్నముల జేసినప్రోడ సోమాసులకు జోటు సూపుణాణ తెలిమొదవు పెట్టుచెట్టులు తలపుఱాయి సంతరించినదొర మబ్బు జక్కిరౌతు వింటిప్రోల్దొర వేగంటి వెన్నునన్న వేల్పుతేఁ డన నింద్రుండు (దేవ 4)

క దుగమోములయ్య ఫేల్పుల
మొగ మంటనివేల్పు మబ్బుపూనిసు వనఁగాఁ
దగు నగ్నిదేవతాఖ్యలు
నగజాచిత్తాబ్జతోష నాగవిభూషా 47

దుగమోములయ్య వేల్పులమొగము అంటనివేల్పు మబ్బుపూనిసువు—ఇవి అగ్ని దేవతకు (అగ్నిదేవునకు చేతనాగ్నికి) పేర్లు

మబ్బుపూనిసువు — నీటిబిడ్డ (మబ్బుపూవు - నీరు) మేఘపుష్పం ఘనరస అని ఉమ ఆం సం కూడ ఈపట్టున నీరుపాప గాలినెచ్చెలి యున్నింటి తిండికాడు కప్పు దెరువుజాడ యంటరానివేల్పు జంటమోములసామి యగ్గి యనగ నొప్పు ననలుడు (దేవ 8) అను చున్నది ఆగ్నేరాప అని శ్రుతి కొంద ఱిందులకే కృపీటయోని అనుచో కృపీటస్య (జలస్య) యోని (ఉత్పత్తిస్థానమ్) అనియు విగ్రహ మేర్పఱచి నారు మను వి ట్లను చున్నాడు అద్భ్యో ఽగ్ని ర్బ్రహ్మతః క్షత్ర మశ్మనో లోహ ముత్థితమ్ తేషాం సర్వత్రగం తేజ స్వాసు యోనిషు శామ్యతి (9 అ 32 శ్లో) ఇందువలన జలమునుండి అగ్ని యేర్పడుటయు శాస్త్రసిద్ధమే

తే అగ్గి యనఁ గి త్తనంగఁ జి చ్చనఁగ వెలయుఁ
జేతనాచేతనాగ్ని నీర్చి చ్చనంగఁ
బొలుచు బడబాగ్ని బూది విబూది యనఁగ
భూతి దనరారు శ్రీమాతృభూతలింగ 48

అగ్గి కిత్తు చిచ్చు — ఇవి చేతనాగ్నికి (అగ్నిదేవునకు) అచేతనాగ్నికి (నిప్పునకు) పేర్లు

నీర్చిచ్చు — ఇది బడబాగ్నికి పేరు

బూది విబూది — ఇవి భూతికి (విభూతికి ముఖాదులయందు ధరించెడి గోమయ భస్మమునకు) పేర్లు

అగ్నినామములను ఇతరనిఘంటువులు చేతనాచేతనవిభాగము లేకయే వచించినవి కిత్తగ్గి యేడికతత్తడినెరసావి కప్పు దెరువుజాడ గన్నజాణ సతనాలుకలపాదుసా తిగయడుగుత్తే డంట గూడనివేలు పన దగు శిఖి (వేంక దేవ 6) మొ

తే వెలిమిడియు ననఁగా భస్మభేద మెసఁగుఁ
గందు నారాట మారాట కాఁక మఱుఁగు
డుడుకు నెగ తెర్లు నాఁగఁ జె న్నొందుఁ దాప
మునకు నామంబు లై మాతృభూతలింగ 49

వెలిమిడి — ఇది భస్మవిశేషమునకు (వెల్మిడికి పిడుకనిప్పుబూడిదకు) పేరు

కందు ఆరాటము ఆరట కాఁక మఱుఁగుడు ఉడుకు సెగ తెర్లు—ఇవి తాపమునకు (సంతాపమునకు అగ్నివలనివేఁడిమికి) పేర్లు

ఉడుకు — ఆం శే ఉడుకు సెకి వెట్ట వేడిమి యుబ్బ యావి యుక్క యన నొప్పు నామంబు లుష్ణమునకు (57) అని ఉష్ణమునకు సాధారణనామములు గా (ఇందలి) ఉడుకు సెకి ఉనువానిని వచించినది ఆం భా ఉష్ణమునకు వేడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన నుష్ణ సంజ్ఞ లొప్పు (-83) అని వేఱుగా నామముల వచించినది విశేషవివక్షతో వీనిని వేఱుపఱచినది ఊష్మసంజ్ఞలు గా ఉమ్మలిక యుమ్మలిం పుబ్బ యుమ్మ యుక్క యుమ్మదం బావి యావిరి యుమ్మలిక మ నంగ నూష్మాఖ్య లౌ ( 87 )అని వేఱుగా ఉబ్బ ఆవి-మొద లగువానిని గూడ వచించినది ఇట్టి విశేష విభాగమే ఆం భా కైనయొకగొప్పవిశేషము ఈత డిందులకై యొనర్చినపరిశ్రమ మనితరసాధారణము

ఈసందర్భమున అమరము సంతాప స్సంజ్వర స్సమౌ అను చున్నది సంతాపము తాపము పర్యాయములు (చూ విశ్వ మొ ) గురు ఇచ్చటి యీ అమరము ను వేడిమికి పేళ్ల అని వ్యాఖ్యానించినది ఆం భా పూర్వాపరసందర్భమునుబట్టి అగ్గివేడిమి అనునది ఇచ్చటి కందు మొద లగువానికి అర్థ మని తోఁ చినది విరహాదులవలని సంతాపము వీనికి లక్షణచే నైనయర్థ మన దగినది సూ ని ఒకచో నీళ్ల లో నగునవి సలసల కా గి పొంగుట ఉడుకు తాపము అనునది వీనికి అర్థ మనినది (చూ తెర్లు ) మఱియొకచో ఈ ఆం భా కే తాపము బాధ అని అర్థము చెప్పినది (చూ కా క ) ఇంకొకచో 5 వ అర్థము గా సెగ కా క తాపము అని చెప్పి ఈ ఆం భా అందులకు ప్రమాణ మనినది (చూ కందు ) ఇట సూ ని (3 అర్థము గా) సంతాపము దు ఖము అనుదాని నిచ్చినదిగాన అది ఇది కాదు ఇవి యన్నియు ఏకార్థకము లగు పర్యాయపదములు ఒక్కొక్కచో ఒక్కొక్కవిధము గా వీనికి అర్థము లిచ్చుట యెట్లు సంగతమో

మఱు గుడు — కరణార్థమున డు వర్ణకము చోపుడు గోల మొద లగునవి ప్రయోగ దృష్టములు డువర్ణకం బాత్వాదుల కగునపుడు పకారంబు ఎయల కగు (బాలవ్యా కృ 20 )

తే జముఁడు గుదెతాల్పు పోతుగుఱ్ఱము గలాఁడు
దక్కినపుతేఁ డన యమాఖ్య దనరు బొలసు
దిండి రక్కసి రాతిరిఁ దిరుగుమేటి
యనఁగ నైరృతి దగు నుమాప్రాణనాథ 50

జముఁడు గుదెతాల్పు పోతుగుఱ్ఱము గలాఁడు దక్కినపుతేఁడు— ఇవి యమునికి పేర్లు

బొలసుదిండి రక్కసి రాతిరిఁ దిరుగుమేటి—ఇవి నైరృతికి పేర్లు

ఆం సం జమునసైదోడు పెతరులసామి ప్రొద్దుకొమరుడు అని మఱిమూడు నామముల గూడ అధికముల గా వచించినది

తే వానవెచ్చెలి పడమటి వంకతేఁడు
వల్లెత్రాడు గలాఁ డన వరుణుఁ డొప్పు
లిబ్బిదొర జక్కులకు తేఁడు గిబ్బరౌతు
సకుఁడు వానీఁ, డనంగ నీసఖుఁడు శర్వ 5

వానవెచ్చెలి పడమటివంకతేఁడు వల్లెత్రాడు గలా డు—ఇవి వరుణునకు పేర్లు

లిబ్బిదొర జక్కులతేఁడు గిబ్బరౌతుసకుఁడు వానీఁడు—ఇవి కుబేరునకు పేర్లు

వానీ డు — (వానె+ఈ డు) వానె- వైశ్యకులభేదము వానెవణిజునింట నుండి వైశ్యుండు (కాశీ 5 63) (వణిక్-సం) (క్రయ విక్రయవ్యాపారము-వాణిజ్యము) దీనిని జరపువైశ్యులు ఈభేదమునకు చెందినవా రన వచ్చునేమో ఈకులమునకు వాణిజ్యమీతనినుండియే ఆరంభమై వానె వంశమునకు ఈత దే మూలపురుషు డైనా దేమో చిఱుతొండనంబి వాణిజ్యవంశంబునకు గూటస్థుం డై యని వర్ణింప బడుచున్నా డు కంచిలో నేడువాడల గలిగినట్టి వానెకోమటివారిలో ఈత డొక డు ఈచిఱుతొండనంబి వ్యాపారిప్రభవాన్వవాయు డు వాణిజ్యచణు డు అలకాధిరాజు

వాననెచ్చెలి — వరుణజపము చేసిన వానలు గురియును వరుణుడు వర్షప్రదాత యగుట ఆగమములు వచించు చున్నవి. ఏహి పర్జన్య ఏహి వరుణ ఏ హ్యపామ్పతే పురోవాతం జనయ జనయ పశ్చాద్వాతం శమయ శమయ సద్య స్సువృష్టిం దేహి పర్జన్యోమ్ ఇ త్యుచ్చై స్త్రివారం జపేత్ అని శాంతికమలాకరము కనుకనే సాంబ ఈతనిపేరిట్లు వచించు చున్నది. పడమటిదొర నీటియొడయడు జడిసామి మొసలిగుఱ్ఱపురౌతు మొయిలుఱేడు వరుణాఖ్య లమరును (దేవ 3)

తే లచ్చిదొం బూరగొమ్ము వలమురి యనఁగఁ
బాంచజన్యంబు దనరు వేయంచులలుఁగు
చుట్టుఁగైదువు గుడుసువా ల్సుడియడిదము
బటువుకత్తి నాఁ జక్ర మౌ నిటలనయన 52

లచ్చిదొర బూరగొమ్ము వలమురి—ఇవి పాంచజన్యమునకు(విష్ణునిశంఖమునకు) పేర్లు

వేయంచులలుగు చుట్టుఁగైదువు గుడుసువాలు సుడియడిదము బటువుకత్తి— ఇవి చక్రమునకు (సుదర్శనమునకు విష్ణునిచక్రమునకు) పేర్లు

చుట్టుకైదువు అని (వావి అపపా) చుట్టుంగైదువుతోదు (రామా 3 54) మొదలగుప్రయోగముల బట్టి సమాగమముతో చుట్టు గైదువు అనుటయే సాధువు

క గరుటాలమంతుఁ డనఁగను
గరుడి యనన్ బొల్లినెమ్మొగముపిట్ట యనన్
గరుటామంతుం డనఁగను
గరుడునిపే ళ్లొప్పుఁ జాలఁ గంరేకాలా 53

గరుటాలమంతుఁడు గరుడి బొల్లినెమ్మొగముపిట్ట గరుటామంతుఁడు—ఇవి గరుడునికి (గరుత్మంతునకు వైనతేయునకు) పేర్లు

గరు మంతుఁడు — దీనిని యయాతిచరిత్ర ఇట్లు పేర్కొనినది కంబమయ్యరొ పెలు
గలిగింపు నీ కొక్క గరుటాలమంతుని గాను కిత్తు (యయా 2 3)

క. శూలము వెలయును ముమ్మొన
వా లనఁ దెలిగిబ్బ యనఁగఁ బరఁగుచు నుండున్
శూలధరుఁ డెక్కువృషభము
శీలవదాశయనివేశ చెవ్వందీశా 54

ముమ్మొనవాలు—ఇది శూలమునకు (శివుని త్రిశూలమునకు) పేరు
తెలిగిబ్బ— ఇది శూలధరుఁ డెక్కు వృషభమునకు (నందికి) పేరు

చెవ్వందీశా — ఇది మాతృభూతేశ్వరస్వామికి మొట్టమొదట ఏర్పడిన తెలుగునామము నత్కీరుని తీర్థయాత్రాసందర్భమున శ్రీకాళహస్తిమాహాత్మ్య మీదేవుని నిట్లే పేర్కొనినది చెవ్వందీశ్వరు నీశ్వరేశ్వరుని గాంచెన్ భీషణాంహోలతల్ త్రెవ్వం దీవ్రత రాంగసంభవశరశ్రేణీవిదాహవ్యథల్ వివ్వం దీఅనిభక్తితో హృదయ మావిర్భూత మోదంబునన్ నవ్వం దీగయు బోలె జూడ్కు లొదవన్ నత్కీరు డుత్కంఠతన్ (8 60) చెవ్వప్ప మొద లగుతెలుగువారినామములు ఈదేవుని నామములుగా వెలసినవే చెవ్వంది అనునది ఈత డు వెలసినయీకొండకో ఈయూరికో యైనపే రనిపించును చరిత్రకారు లేమందురొ చెవ్వంది + ఈశా అనునెడ నగు చున్నసవర్ణదీర్ఘసంధి దుష్టము కాదు యణాదేశే మానూర్యన్వయవర్ధన ఇకారె పరె సవర్ణదీర్ఘే మానూ రీతిపురీ బభౌ అని వ్యాకర్త లుదాహరించు చున్నారు (చూ భవే ద్విరుదశబ్దేషు యథేచ్ఛం వర్ణకల్పనా గ్రామ మానుష్య బిరుదశబ్దానా ముం సో మతః అను కారికా వ్యాఖ్యాసందర్భము - అహోబలపతి తెలుగున (పృథ్వీశుడు-మన్నగువానికి) వైకృతములుగా పుడమీశుడు ఇత్యాదులు దృష్టములు పుడమీశ సత్యవాక్యము నడుపుము (సకల 2)మొ (చూ సూ ని శ ర) ఇట్లే త్రిశిర పురీశున కైనవికృతిగా దీనిని గ్రహించినను ఇది సాధు వగు నేమో

పినాకో ఽజగవం ధనుః అని అమరము శివునిధనుస్సునే పేర్కొనినది శివుని వాహనమును ఆయుధమును ప్రత్యేకము గా గణించినది కాదు వదలినది విష్ణుని- ఆయుధ

మును ధనుస్సును వాహనమును (విడువక) వేర్వేఱు గా వచించినది మనతెలుగు నిఘంటుకర్త శివభాగవతు డగుటవుగా బోలు అది సహింపనివా డువోలె వీనిని శృఙ్గగ్రాహికతో ప్రదర్శించు చున్నా డు

క తనరును వేల్పులయి ల్లనఁ
గను వేవన్నెలపసిండిగ ట్టనఁగా మే
రునగము దగుఁ దెలియే అన
వినువాఁ కన సౌరగంగ వృషభతురంగా 55

వేల్పులయిల్లు వేవన్నెలపసిండిగట్టు—ఇవి మేరువుపర్వతమునకు పేర్లు
తెలియేఱు వినువాఁక—ఇవి సౌరగంగకు (దేవనదికి ఆకాశగంగకు) పేర్లు.

వేవన్నెలపసండిగట్టు — బంగారు ఎంతగా కాచిన అంతగా వన్నెక్కును అది దాని గుణము వేమాఱు నెంత గా చినను వన్నెక్కుఁగా దె సువర్ణంబు (బ 0)? (చూ పండి పీరి) మేరుస్సుమేరు ర్హేమాద్రీ రత్నసాను స్సురాలయ అని (అమ) మిక్కుట మగుకాంతి గల బంగారుకొండ అని అర్థము

సౌరగంగ — (సౌరీ+గంగా) సురాణా మియమ్ (సౌరీ) సంబంధార్థమున తస్యేదమ్ (4 3 20) అని అణ్ప్రత్యయము పుంవద్భావము (6 3 42 సూ)

తే దైవతమదావళంబు చౌదంతి యనఁగఁ
దెల్లయేనుఁగు నాఁగను దేజరిల్లు
దేవతాశ్వంబు వెలయును దెల్లతేజి
నిక్కువీనులజక్కి నా నీలకంఠ 56

చౌదంతి తెల్లయేనుఁగు — ఇవి దైవతమదావళమునకు (దేవతాగజమునకు ఐరావతమునకు) పేర్లు
తెల్లతేజి నిక్కువీనులజక్కి—ఇవి దేవతాశ్వమునకు (ఉచ్చైశ్శ్రవస్సునకు) పేర్లు

చౌదంతి — చవుదంతి రూపాం (సం చతుర్దన్త ప్రా చఉద్దంతి క చౌదంత) చవుదంతి వియన్నదిలో నవగాహ మొనర్చి చల్లనల్లవమధులౌ నా దివి యలచుక్కలు తోఁ చఁగ దివియలవారి గొని యపుడు తెగువ దలారుల్ (సారం 3 27) మొ

క వెలిగిడ్డి వింటిపసి వెలి
కిలఁ బడుతొడు కనఁగఁ బరఁగు ఖేచరగవి యీ
వులమ్రాను తెల్లమ్రా ననఁ
జెలఁగును గల్పకసమాఖ్య చెవ్వందీశా 57

వెలిగిడ్డి వింటిపసి వెలికిలఁ బడుతొడుకు — ఇవి ఖేచరగవికి (సురభికి కామధేనువునకు) పేర్లు

ఈవులమ్రాను తెల్లమ్రాను — ఇవి కల్పకమునకు (కల్పవృక్షమునకు) పేర్లు

తెల్లమ్రాను — శ్వేతవస్తుప్రస్తావమున దేవేశ్వరుడు సుధాంశూచ్చైశ్శ్రవ శ్శమ్భు కీర్తిజ్యోత్స్నా శరద్ఘనా మన్దారద్రుహిమాదయః (కవి శ్లేష వర్గ 2) అని దేవవృక్షము తెల్లని దనుచున్నాడు ఇచటి మందార శబ్దము దేవతావృక్షమాత్రవాచకము

కల్పకము — పఞ్చైతే దేవతరవో మన్దారః పారిజాతక సన్తాన కల్పవృక్ష శ్చ పుంసి వా హరిచన్దనమ్ అని (అమ) దేవతావృక్షములైదిటిలో కల్పకి మొకటియై విశేషవాచకమైనను దేవవృక్షముల నన్నిటిని జెప్పుసామాన్యవాచకముగా గూడ ఇది మహాకవులచే ప్రయుక్త మగుచున్నది కల్పద్రుమాణా మివ పారిజాత (రఘు 6 6) అని కాళిదాసు ఇచ్చట వ్యాఖ్యాన మిట్లున్నది- అత్ర కల్పద్రుమశబ్దః పఞ్చాన్యతమవిశేషవచనః ఉప కల్పయన్తి మనోరథా నితి వ్యుత్పత్త్యా సురద్రుమమాత్రోపలక్షకతయా ప్రయుక్త ఇ త్యనుసంధేయమ్ కల్పా ఇతి ద్రుమా కల్పద్రుమా ఇతి విగ్రహః (మల్లి) [కల్పమే కల్పకము] శ్రీనాధుడు దీని నిట్లు ప్రయోగించుచున్నాడు ఈసకలంబునం గలమహీపతివర్గము నున్న నుండనీ యాసభ యొప్పె నప్డు విషధాధిపుచేత జతుర్దిగీశచే వాసవలోక దివ్యవనవాటిక సర్వనగాధ్యయయ్యు నుద్భాసితలక్ష్మి నొందునకదా యలకల్పకపంచకంబుచేఁ (శృం నై 4 136)

ఐదీ కిని కల్పక వ్యవహార మున్న ట్లి ప్రయోగము చాటి చెప్పు చున్నది ఇట్లే మందారాదులును (ప్రవృత్తి నిమిత్తారోపమున - ఔపచారికము గా) తదితర దేవవృక్ష వాచకము లగుట విరుద్ధము కాదు

క తలఁపురతనం బనన్ జే
జెలమానిక మనఁగ వెలయుఁ జింతామణి వే
ల్పులకూ డన నమృతాభిధ
చెలఁగును సద్గుణనివేశ చెవ్వందీశా 58

తలఁపురతనము జేజెలమానికము—ఇవి చింతామణికి పేర్లు

వేల్పులకూడు—ఇది అమృతమునకు పేరు

జేజ — జేజే (రూపాం) జేజెలుం బ్రాతజేజేలు దే జార గఁ జేరి (అచ్చ రా యు 6 ) (చూ శ ర )

తే గాడ్పు కరువలి వినుచూలి గాలి వలపు
మోపరి చిలువమేఁ తనఁ బొలుచుఁ బవనుఁ
డెసఁగుఁ దెమ్మెర యనఁగఁ బయ్యెర యనంగ
మందమారుతసంజ్ఞలు మాతృభూత 59

గాడ్పు కరువలి వినుచూలి గాలి వలపుమోపరి చిలువమేఁత— ఇవి వాయువునకు పేర్లు

తెమ్మెర పయ్యెర—ఇవి మలయమారుతమునకు (చల్లగాలికి) పేర్లు

తెమ్మర వావి అపపా తెమ్మెర నీ కెం తెమ్మె ర (విజ 3అ 48 ) ( తెమ్మ + ఎర వృత్తిని ఎర శబ్దము గాలిని జెప్పును అని (శ ర ) (తెమ్మ తేమకు రూపాం) వేంక ఆం సం ఆం శే తెమ్మెర అనియే అనినవి (బ్రౌ ని) తెమ్మర అని కూడ గ్రహించినదికాని ప్రయోగము చూప లేదు (సూ ని తెమ్మెర గ్రహించి



క తెమ్మెరల్ తెమ్ము = దక్షిణము ఎరల్ = గాలి త తెన్నల్ = దక్షిణపుగాలి అని వ్యుత్పత్తి చూపినది తెమ్మెర అనియే ఇచ్చట (ఆం భా) పాఠము నిది యిచ్చినది

పయ్యెర — దోలా భూ షోత్త్రీయాణి వి నైత్వం నాస్తి మధ్యమే అని అథర్వణుడు దీని నాధారము గా గొనియే బాలవ్యాకర్త ఊయేల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు (ప్రకీ 3సూ) అని సూత్రించినాడు ఇందులకే శ ర పయ్యెర యే గ్రహించి ఇందులకు నిర్ధారకము గా కురువింద నదె గిలుబుకొనియె బయ్యెరదొంగ విరుల గరికుంభకుచ వెర జూ మయ్యెర గ్రుంగ (స్వా 3 84) అనుప్రయోగ మిచ్చినది గిలుబుకొను పదముకడ గురువింద దొంగ అని గకారాది గానే దీని నుదాహరించినది కురువింద గురువింద రెండును ప్రమాదములే ఇట గురివెంద అని యుండవలయును శ ర గురివెంద అనియే గ్రహించి గురిజ + వెంద అని వ్యుత్పత్తి చూపు చున్నది పయ్యెర కు పైప్రయోగము నిర్ధారకప్రయోగ మని శ ర అభిప్రాయము వెర జూ మ య్యెర గ్రుంగ అనెడియనుప్రాస మిందులకు నిర్ధారకము

[శ ర పా పై రీతిదే గురివెంద అనుచుయే కేవల మిట జరగవలసిన సంస్కారము] ఇట స్వా మనుచరిత్రము గురివెంద అనియే పాఠ మిచ్చినది (చూ ఆర్ వేంకటేశ్వర అండ్ కంపెనీవారి ప్రచురణము — 936 కొమాండూరు అనంతాచార్య విరచిత వ్యాఖ్యతో) గురివెంద నదె గిలుబుకొనియె బయ్యెరదొంగ విరుల గరికుంభకుచ వెర జూమై యరగ్రుంగ అనురీతిని ఈ పాఠ మున్న దిందు (మయి + అర-మయ్యెర) కావచ్చును మైకి-మయి మెయి రూపాంతరములు (నయి+ఆట-ము నయ్యాట మగు చున్నది) ఇది శ ర గ్రహించినట్లు మయ్యెర అనియే యుండును ఈ అనుప్రాసము ను బట్టి పైని గూడ శ ర అభిప్రాయపడినట్లు పయ్యెర యే యిట కవి హృదయంగమము గా నుండవచ్చును తగడ ఇది అనుప్రాస మిం దొకప్రధానాంశమునకు చెందినది అనుప్రాస పరిపుష్టి గలిగి యుండుటనుబట్టి శ ర పాఠమే ఇట సముచిత మై పరిగ్రాహ్య మనిపించు చున్నది పయ్యెర కిది గాక కూళ తొల్వేలుపు గూటువగాటంపు టడవుల మేటి పయ్యెరయనుంగ (అచ్చ బాల క్రాం 37) అను ప్రయోగమును నిర్ధారకము పయ్యెర కు ఈ ఆం భా ప్రయోగమే నిర్ధారకమ్ము (పేసఁగు పయ్యెర అని) ఇది అఖండపదము గాదు సమాసపదము పై + ఎరల్ అనికాని ఎయర + ఎరల్ అనికాని పైర + ఎరల్ అనికాని దీనికి వ్యుత్పత్తి (ఎరల్-

గాలి) తెమ్మెర-తెమ్మ్మ దక్షిణము ఎరల్- గాలి అని (సూ ౧) పైర అనుదానికి గాలి అనునర్థ మిచ్చి పైర తా చులనోట బడునుగాక అనుప్రయోగ మిచ్చు చున్నది (బ్రౌ) పయర పయ్యర దీనికి రూపాంతరములు (పైర-ఎరల్)-ఇట పునరుక్తి ఆదరార్థకము జనరంజక మగు గాలి దక్షిణపుగాలి యనుట లేదా పయర అనుదానికి దక్షిణపుగాలిచే పండెడిపెసరు లోనగు కాయధాన్యము అని అర్థ మిచ్చు చున్నవి నిఘంటువులు (చూ శ ర) కాయ ధాన్యము పండించెడి గాలి దక్షిణపుగాలి అన వచ్చును దక్షిణపుగాలికి-పయరుగాలి అని సర్వజన సాధారణ వ్యవహారము లేదా పయ్య+ఎరల్ అని వ్యుత్పత్తి తమిళమున పయ్య అనునది ఎల్లవాడు అనునర్థము గలది కనుక పిల్లగాలి అని అర్థము పిల్ల దెమ్మెర అను తెలుగు నామమునే ఈ వ్యుత్పత్తితో ఇది వచించిన దనవచ్చును ఇక పై వ్యాకరణములు అఖండపద విషయకము లగుటనుబట్టి ఏతద్విషయకము లవి కావు అప్పకవి ఊయెల మొద లగువానికిఁ జూపిన వ్యుత్పత్తిని అహోబలపతి నిరాకరించుట వేఱు దీనిని గా దన దది

వలపుమోపరి — గంధవహు డనుట యిట్లు వచింప బడు చున్నది గాలి పేర్లను మఱి కొన్నిటిని గూడ విశదము గా వేంక ఇట్లిచ్చినది- సురఁటివీపులపుట్టు కరువలి గాడుపు లేడిబాబా నెక్కి యాడురౌతు ఈదు తెమ్మెర వలి బీ దలపెనుబాద సోకు దయ్యము మింటిచూలి గాలి చిలువలమేత యొడలు దాల్పుమూ కకు దురు సైనచుట్టము మరునితేరు పయ్యెర మబ్బులపగవా డు సుడిగొట్టు జాణ గందపు గొండవాణె దారు వలపుమోపరి నెత్తమ్మికొలనికా పు తలిరువిలుకానికలన బి ట్టలసినట్టి మినుకు లాంద్రకు గుబ్బచెమ్మట లడంచు వితమరి యన గ బవనుపేళ్ల (దేవ ౯) ఉ కై

బ్రౌ ఈదు ఈదకు రూపాం అని చలిగాలి అని అర్థ మిచ్చినది శబ్దరత్నాకరము నకు వాయువు అనునర్థ మిచ్చి ఈఁదునకుం గాదిలి కొమ[illegible] కాం) అని ప్రయోగ మిచ్చినది సూ ని ఈదు నకు ఈ [illegible] ప్రయోగము సరిగా దీనికి దొరకక పోవుటయే ఇందులకు గారణ మగును అచ్చ రామాయణమున విను సుగ్రీవు డనం బర గినకోఁతులమన్నె [illegible] కొమరు డ హనుమంతు డనంగ బేర్మి [illegible] న్నది ఈ దరగాలి అనియే వ్యవహా[illegible]

496) ప్రయోగము గూడ (ఈఁద అనఁగా ఉనిన) సరి పోవునదియే (చూ సూ ని)
ఇందులకే ఆం భా ఈ దు వాయునామము గా పేర్కొన లెదు ఇందువలన ఆం భా
ప్రయోగ పరామర్శ మెంతగాఢ మైనదో మన మెఱు గ వచ్చును

తే ఈఁద యన నీఁదర యనంగ నెసఁగు శీత
వాయు వూపిరి యూర్పు నా శ్వాస మలరు
నొప్పు నది దీర్ఘ మైన నిట్టూ ర్పనంగ
నధిక మగునది రోఁజు రొ ప్పనఁ దగు హర 60

ఈఁద ఈఁదర— ఇవి శీతవాయువునకు (చలిగాలికి) పేర్లు

ఊపిరి ఊర్పు— ఇవి శ్వాసమునకు (ముఖనాసికాసంచారి యగువాయువునకు) పేర్లు

నిట్టూర్పు—ఇది దీర్ఘ మైనశ్వాసమునకు పేరు

రోఁజు రొప్పు—ఇవి(శ్రమాదులవలనఁ గలిగిన) అధిక మైనశ్వాసమునకు పేర్లు

నిట్టూర్పు — నిశ్వాసము అని (శ ర సూ ని మొ) వైజ ఇట్లను చున్నది- శ్వాస స్తు శ్వసితం సో ఉన్తర్ముఖ ఉచ్ఛ్వాస బహిర్ముఖత్తో నిశ్వాస (భూమి బ్రాహ్మ)

రొప్పు — నేను దంచెదను నీవు రొప్పు అని వ్య

తే ఉసుఱు నాఁగను బ్రాణాఖ్య యొప్పు చుండు
నదియ యొకచోట జీవాఖ్య యై చెలంగు
నాయురభిధానము గ నదె యలరు చుండు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 6

ఉసుఱు— ఇది ప్రాణమునకు (ప్రాణవాయువునకు) పేరు

ఉసుఱు— ఇది జీవునకు (జీవాత్మకు) పేరు

ఉసుఱు— ఇది ఆయుస్సునకు (జీవితకాలమున-- పేరు

ప్రాణము -- ఈశబ్దమునకు నానా ఇ ట్లర్థముల విచ్చినది దేహాన్తరానిరే ప్రాణో జీవాత్మ పరమాత్మనో ఆయు రిన్ద్రియ సత్త్వేషు (అని) హృషీక మిన్ద్రియం ప్రాణ ప్రాణా నా భూమ్ని వాసవ ప్రాణాపానాదయ స్త్వస్య వృత్త్తయ పఞ్చ వాయవ అని (వై జ భూమి బ్రాహ్మ)

జీవుడు --- ఆత్మన ప్రతిబిమ్బ శ్చ దేహా జీవ స్స ఏవ చ ప్రాణదేహాదిభృ ద్దేహీ స జీవః పరికీర్తిత అనినది జీవునిగుఱించి (స త ఎ ప ల సం)

ఉసుఱు — ఉసుఱు లని చి ని శ ర ప్రయోగములందు ఉభయరేఫములను గన్పట్టు చున్నవి నిర్ధారకములు లేవు అని (సూ ని) (సం అసువులు) సూరి తద్భ వములందు శకటరెఫము లె దనినను నన్నయ భారతమాత్రమున కది పరిమిత మనవల యును తిక్కనాదులు విఱిగినచో నిలువక వెఱ నుఱికెం దనరథము మీ ది కోడిఁతి పో పో పిఱికి యని పలికి (భార ద్రో 74) అనురీతిని తద్భవములందు శకటరేఫమును బహుళము గా ప్రయోగించియే ఉన్నారు ఇదిగాక చిన్నయసూరియే తననిఘంటువునందు దీనిని శకటరేఫయుతముఁ గా గ్రహించె ననుట విశేషము ఆయనయాశయ మిం దెట్టి దో బాగుగా పరిశీలించి యెఱు గవలసి యున్నది

క సురలకు వేల్పులు జేజేల్
తెఱగంటులు బాసవాలుదిట్ట లనం బే
ర్లిర వగు సురవేశ్యల క
చ్చర లనఁ బే ళ్లొప్పు బాలచంద్రవతంసా 62

వేల్పులు జేజేలు తెఱగంటులు బాసవాలుదిట్టలు — ఇవి సురలకు (అమరు లకు నిర్జరులకు దేవతలకు) పేర్లు

అచ్చరలు — ఇది సురవేశ్యలకు (సురకన్యలకు అప్సరస్త్రీలకు) పేరు

ఆ పొలసుదిండ్లు రక్కసులు తొలివేలుపు
లనఁగ నసురసంజ్ఞ లలరు బూచి
గాము సోఁకు సత్తి గాలి దయ్యము బూత
మనఁ బిశాచసంజ్ఞ లలరు నభవ 63

పొలసుదిండ్లు రక్కసులు తొలివేలుపులు—ఇవి అసురులకు (రాక్షసులకు) పేర్లు
బూచి గాము సోఁకు సత్తి గాలి దయ్యము బూతము — ఇవి పిశాచము నకు పేర్లు

తే. నీటిదయ్యంబు నెగడు నా నివ్వటిల్లు
బొమ్మరక్కసి యనఁగను బొలుచు బ్రహ్మ
రాక్షసునిపేరు గాఁ బోతురా జనుగతిఁ
దద్విశేషంబు లై కొన్ని తనరు నభవ 64

నెగడు—ఇది నీటిదయ్యమునకు (నీటిని ఆశ్రయించుకొని యుండెడిభూతమునకు) పేరు

బొమ్మరక్కసి—ఇది బ్రహ్మరాక్షసునికి (బ్రహ్మరక్షస్సునకు) పేరు

నీటిదయ్యము — జలగ్రహము అనునది దీనికి సంస్కృతనామము కన బడి అంతలోనే కన బడక మాయ మగు ఒకమత్స్యము నీటిదయ్య మని బ్రౌ వర్ణించు చున్నది నే డు విజ్ఞానశాస్త్రజ్ఞులుగూడ చాలదీర్ఘ మై మనుష్యునివలె గానవచ్చి భయంకర మైన మత్స్యము ఒంతలోనే మాయ మయి యెంత వెదకు చున్నను ఇప్పటికి గూడ కానరా కున్న దను చున్నారు ఇట్టిదే ఒకపిశాచవిశేష మిది

నెగడు —సాంబనిఘంటువు గాలి గాము నెగడి దయ్యఁ మన గ బిశాచాభిధానము లగు (దేవ 9) అని పిశాచసాధారణవాచకము గా నెగడి అనుదానిని వచించినది వేంక గూడ ఇట్లే బూతములు పిసాసములు నెగడులు (దేవ 24) అని చెప్పినది బ్రౌను నెగడు అనుదానికి మకరము తంతునాగము జలగ్రహము అనునర్థముల నిచ్చినది సూ. ని నెగడు గ్రహించి క్రూరజలజంతువిశేషము తంతునాగము అని ఒక త యలజళ్ల జెఱువుల నుండ రాక కార్మొసళ్లు నెగళ్లు మ గవులు విడిచి తరలి చెంతల నూతి గుంతల వసించె (వేం పంచ 264) ప్రయోగ ముదాహరించినది నీటిదయ్యము కద ఈ ఆం భా ప్రమాణము గా ఇచ్చి నెగడు- నీటి నాశ్రయించి యుండుభూతము అనినది శ ర నెగడు అనుదానికి ఒడ్డనములు నెగళ్లు (రా యు కాం) అనుప్ర యోగ మిచ్చి తంతునాగ మర్థ మనుచు కొందఱు జలగ్రహ మని అర్థము వ్రాసి

నారు- అనినది నీటిదయ్యము కిద జలగ్రహము నెగడు అని వ్రాసినది ఇది అంతయు పరిశీలించి చూడ సూ ని నెగడి నెగడు రెండును ఈయర్థమునందు కల వని నీటిదయ్యము అనెడియర్థము నెగడు అనుదాని కీయవలయు నని తోచుచున్నది

పోతురాజు — పోతరాజు (రూపాం) అని బ్రౌ తిండికి తిమ్మరాజు పనికి పోతరాజు అని సామెత ఒకానొకక్షుద్రపురుషదేవత అని శ ర (చూ పోతురాజు) గ్రామదేవతకు ముందు ఊరేగుచు ముందు నైవేద్యము గొనువాడు పోతరాజు ఈతనికి అక్క పోలేరమ్మ ఈతఁడు వేఱు ఆం ఘా బ్రహ్మరక్షోవిశేషము గా పఠించుచున్న పోతురాజు వేఱు బ్రాహ్మణు డై (అధీతిబోధరేకాని ఆచరణప్రచారణములు లేక ధర్మదూరు డై) దుష్కర్మ మొనర్చి రాక్షసు డైనవాడు బ్రహ్మరాక్షసుడు ఈత డు బేతాళికానాయకు డగుటను అము వర్ణించినది (చూ రిఆ) బ్రౌ పోతురాజు అనుదానికి గ్రహభేదము క్షుద్రదేవత అనురెండర్థముల నిచ్చినది (చూ అను)

ఉద్దవిడి యురవడి హుటాహుటి చుఱు కన
జఱజ అన దడద డనఁగాఁ జెరచెర యనఁ
దీవరము సుళ్వు వైళము తివురు తివుట
వేగిరము తుఱు తన శీఘ్ర మౌ గిరీశ 65

ఉద్దవిడి ఉరవడి హుటాహుటి చుఱుకు జఱజఱ దడదడ చెరచెర తీవరము సుళ్వు వైళము తివురు తివుట వేగిరము తుఱుతు—ఇవి శీఘ్రమునకు పేర్లు

చెర చెర — అని లఘురేఫముతోడనే దీనిని శ ర సూ ని గ్రహించినవి సూ ని తివుట కడమాత్రము ఉద్దవిడి చెఱచెఱ అని ఆం ఘా ను ఉదాహరించినది

తే పరఁగును సతంబు నిచ్చ లప్పసము నిచ్చ
మనఁగ మిక్కిలి మిక్కుటం బగ్గలంబు
బెట్టు నిబ్బరము దిటము బిట్టు గాట
మనఁగ నతిశయ మగును సూర్యావతంస 66

నిచ్చలు అప్పసము నిచ్చ — ఇవిసతమునకు (నిరంతరమునకు ఎల్లప్పుడును అనుటకు) పేర్లు

మిక్కిలి మిక్కుటము అగ్గలము బెట్టు నిబ్బరము దిటము బిట్టు గాటము— ఇవి అతిశయమునకు (అధికమునకు) పేర్లు

సతము - సతతము నకు వర్ణలోపముచే నిష్పన్న మైనరూప మిది పృషోదరాదీని యథోపదిష్టమ్(6 3 09) అని పాణినీయము

వేంక ఇంకను కొన్నిటిని ఏతత్పర్యాయములను ప్రదర్శించినది ఆజస్రాఖ్యలొనరును వాఁాయ మనయ మెపుడు నెప్పుడు నిచ్చ లెప్పటికిని నెప్త నెదపక యెప్రొద్దునుడుగ కన గ (మాన 60)

తే కలిమి సిరి పదవి యనఁగఁ జెలఁగు భూతి
పొలుచు నిక్షేపనామంబు పూడు పనఁగఁ
దనరు లిబ్బి యనంగ నిధానసంజ్ఞ
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 67

కలిమి సిరి పదవి—ఇవి (భూతికి ఐశ్వర్యమునకు) పేర్లు

పూడుపు —ఇది నిక్షేపమునకు (భూమియందు పాఁతి పెట్టిన ధనమునకు) పేరు

లిబ్బి — ఇది నిధికి (నిధానమునకు గూఢకోశమునకు రహస్యము గా భూమ్యాదులందు దాఁచిపెట్టఁబడి ఎంత తీసినను తఱుఁగ కుండ పెరుఁగు చుండిన ధనము పాఁతఱకు) పేర్లు

భూతి — విభూతి ర్భూతి రైశ్వర్య మణిమాదిక మష్టధా అని ఆమ ఇట వైజ విభూతిర్భూతి రైశ్వర్య మణిమాదికసంపదో (శేష నానాలిం) లను చున్నది ఆం ధా సంపదకు పర్యాయములను వేఱు గా వచించినది (చూ 2-2 0)

పదవి — దీనిని సాంబ సంపత్సామాన్యవాచకము గా వచించు చున్నది పదవి సిరి కల్మి యన గ సంపదకు పెలయు (మాన 33) శ్రీనాథు డు త పదవి తఱచు గా ప్రయోగించు చున్నా డు ఈతనిని జూచి తరువాతివారుగూడ దీని నిట్లు ప్రయోగించుకొని

నారు ఉచ్చతెలు గునిఘంటువులు ఉచ్చ తెలు గు గా దీనిని గ్రహించు చున్నను సంస్కృతసమాస స్థముఁ గా ఈ యర్థమున దీనిని ప్రయోగించి శ్రీనాథాదులు సంస్కృత మగూడ ఇది యను చున్నారు ప్ర యోగము లి ట్లున్నవి- భజియింతు సాహిత్య పదవీమహారాజ్య భద్రాస నాసీను బ్రవరసేను (భీమ 7) కమ లాధిరాజ్య పదవీ సమధిష్ఠిత మీవధూటి చారు ముఖాంభో జము (శృం నై 3 80) శ్రీరం గేంద్రు డశేష రాజ్యపదవీ సింహాస నాక్షీణ ల క్ష్మీ రాజ న్నిజసంతతి ప్రథితుఁ డై (వసు 32) వ్యాఖ్యాతలు శృం నై వసు ప్రయోగములకడ పదవి శబ్దమునకు విభవము వై భవము అని అరము వ్రాసినారు కొన్ని చోటుల చిహ్నము ఆధికారము అను అర్థములు వచింప వలయునట్లుగూడ ఏతత్ప్రయోగములు గాన వచ్చును ఇంద్రపదవి ఇత్యాదులవలె రాజ్యపదవి లో నగు నవిగూడ ప్రయు క్తము లై నవి పటుతరక్షేత్ర మిది రాజ్య పదవి నాకు (కాశీ 5 7) మొ అందలంబు గొడుగు నడపంబు మేల్కట్టు ఎస గు రాచపదవు లెల్లఁ బడసె (దశ 8) మొ ఈ దశకుమార చరిత్రవంటి ప్రయోగముల బట్టి ఇది అచ్చతెలుఁ గనకయు తప్పదు సాహిత్యపదవీమహారాజ్య మొద లగు చోట్ల ఐశ్వర్యము వై భవము అనెడి అం భా అర్థ మెంతో సముచిత మ నిపించు చున్నది సాహితీ వై భవము వాగ్విభూతి వాగ్వై భవము అనునవి సుప్రసిద్ధములు సంస్కృ తమున పదవీ శబ్దమునకు నిఘంటువులు ఐశ్వర్య మను నర్థము నిచ్చుట లేదు అందు లకే ఇది అనుమా నాదిపదములట్లు తెలు గుపద మనినవి తెలుఁగుకోశములు అపేట సంస్కృతపద మగు పదవి కి ఆధికారము అధికారస్థానము అనునర్థ మిచ్చి చున్నది ఏతత్ స్తోత్రం ప్రపఠతా విచార్య గురువాక్యత ప్రాప్యతే బ్రహ్మపదవీ సత్యం సత్యం న సంశయః (తత్త్వ మసి స్తోత్రము (2 3) లని ఉదాహరించు చున్నది ఆధికారము అను నర్థముతో ఎట్లో పై ప్రయోగములు కొన్ని కుదిరినను సాహిత్య పదవీ మహారాజ్య ఇత్యాదులు సరసములు గా సంగతములు కావు మురారాద్యిమహాకవులచే కాహల ము న్నగుదేశ్యములు సమాసగతములు గా ప్రయు క్తములు - కపటకర్పటీరవపై కుణ్ఠ కణ్ఠ కఠోర కోలాహల కాహలః (అన 6) మొ ఇచ్చటి కాహల శబ్దము దేశ్య మని వ్యాఖ్య వామను డు అతి ప్రయుక్తం దేశభాషా పదమ్ (కావ్యా అధి 5 3) అని సూత్రించి యివి సాధువు లనినా డు 'వసి

యించుకా హేరాళ క్రీడా సంచారిణి నూకాంబ భక్తజనరక్షకునై (భీమ 0) అంభా అచ్చతెనుగుగా ఇచ్చిన కైవార శబ్దము గూడ సమాస మధ్యగతముగా శ్రీనాధుడు ప్రయోగించినాడు ( కైవార దుర్భాషణం బులకుకా (నైష 7 89) మొ ఇట్టివానిని బట్టి శ్రీనాధునకు సంస్కృత సమాసమున సంస్కృతేతర పదములఁ జేర్చు నలవాటు గలదు అని సూని ఉను చున్నది (చూ కైవారము) ఇది పరిశీలనీయము (చూ నా కాశీఖణ్డ వ్యాఖ్య– కాశీ 7 57 ప)

నిక్షేపము —ధనము చోరాదులచేఁ బడకుండ భూమియం దొకచో భద్రముగా పాతి పెట్టి రక్షింతురు ఇదియే నిక్షేపము ఇది ఒకవిధమగు న్యాసధన మనవచ్చును వైజ ఉపనిధి న్యాసము నిక్షేపము పర్యాయము లను చున్నది న్యాస స్తూపనిధి స్థాప్య నిక్షేపా న్యస్తకో ఽ ప్త్రియామ్ (భూమి వైశ్యా) సప్తసంతానములలో నిక్షెప మొకటి బ్రహ్మప్రతిష్ఠా సంతానం తటాకో వన మేవ చ కృతి ర్దేవాలయ శ్చైవ నిక్షేప స్సప్త సంతతి అని (ఆగమము) రక్షణకై ధనము పాతి యుంచుటను భారత మిట్లు వచించినది ఎవ్వరికి నీక తమతమయిండ్ల బాతి కొని సుఖంబొంది రధములై కొంద ఱందు (ఆది 7 32) భూమౌ తు నిదధు కేచి ద్భృగవో ధన మక్షయమ్ (సం భార ఆది 74 75)

నిధి —ఇది విశేషవాచక మేకాక సామాన్యవాచకముగూడ నిధి ర్నా శేవధి స్త్రియామ్ అని (అమ) పద్మశఙ్ఖాదయో నవ అనియు(అమ) నిధిని గూర్చి వైజ ఇట్లను చున్నది నిధానం గూఢకోశో నా నిధి శ్శేవధి రస్త్రియామ్ (స్వర్గ లోక) నిధిః-శఙ్ఖపద్మాదిసంఖ్యాకవిత్తకోశ అని (స త సి ప ల సం) విద్యా వై బ్రాహ్మణ మాజగామ గోపాయ మాం శేవధి స్తే ఽహ మస్మి అనుమన్త్రములోని శేవధి శబ్దమును నిర్వచించుచు నిధిని గూర్చి నిరుక్త మిట్లను చున్నది యథా ధనినా చిరా దపి యథా రుచి గృహ్యమాణో నా ఽపక్షీయతే కిం త్వవిరతం పరిపూర్ణ ఏవ ప్రస్ఫురతి ఏవ మహం విదుషా శశ్వ త్ప్రదత్తా ఽపి నా ఽపక్షతి మాయామ్ కింతు వర్ధ్వౌ మ్యేవ

నిబ్బి —పాతఱ అనియు దీనికి పేరు తోలుదాల్పునను గు తొమ్మిదిపాతఱల్ రొక్క మున్న దనుచు నిక్కఁగాని (నీలా 37) మొ

తే శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ స్వర్గవర్గ మిట్లు

గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత ౪౪

కృతికర్త స్వర్గవర్గము పూర్తిచేసి కృతిభర్తకు దానిని సమర్పించు చున్నాడు —

అర్థ -జగత్త్రయీ మాతృ భూత =ముల్లోకములకు తల్లి యైనవాఁడా (తల్లి యట్లు సహజ మగు ప్రేమముతో లోకముల నన్నిటిని రక్షించు వాఁడా యనుట) భక్త సంఘ+అభిమాని = భక్త జనమును (నావా ఁను బుద్ధితో) ఎన్ని తప్పులు చేసి నను) ఆదరించువాఁడా (భక్తుల పాలిటి పరమ దయాళూ అనుట) మాతృ భూత = (ఈ పేరు గల దేవా ) కృతిపతికి సంబోధనము ) స్వర్గవర్గము (కర్త) ఇట్లు = ఈవిధము గా (ఇప్పుడు చెప్పినవిధము గా అనుట) శ్రీలు = విద్యా సంపదలు వెలయంగాన్ - (లోకము నందు) అతిశయిల్లఁగా నీపేరన్ చేయు కతనన్ = నీ పేరితో నిర్మించినందున (చివర నీ (కృతిపతి) నామముతో అంకితము గా ఇందలి ప్రతిపద్యము రచింపఁబడినందున ననుట) శాశ్వతము కన్ = స్థిరము గా (ఆబ్రహ్మకల్పము గ ననుట) పరం గున్ = ప్రకాశించును గాక దీనిన్ - (ఇఁక) ఈ స్వర్గవర్గమును కైకొనుము = పరిగ్రహింపుము దీనిని నీదానినిఁ గా చేసికొనుము (సర్వాధికారములతోడిప్రాభవము దీనిపై వెల యింపుము దీనికి స్వామివి కమ్మనుట)

ఈ కృతి యందలి కాండముల నేకాక కాండములలోని యవాంతర ప్రక రణము లనఁ దగిన వర్గములఁగూడ ఈశ్వరార్పణము చేసి (కృతి యిచ్చి) తన జన్మము ధన్యము చేసికొను చున్నాఁ డీ భక్తవతంసము

శ్రీలు —శ్రీ ర్వేషరచనా శోభా భారతీ సరలద్రుషు లక్ష్మ్యాం త్రివర్గ సమ్పత్తౌ విషోప కరణే మతా (విశ్వ ) శ్రీ శ్చ శ్రీ శ్చ శ్రియౌ (శ్రీలు) ఒని ఏకశేషము
పర గున్ — క్వచి ద్ధర్మ క్రియా మాత్ర మాత్రై రత్ర ప్రయుజ్యతే - ప్రథన జయ మిచ్చుఁ దిరుమలరాయమణికి - ఇత్యాది అని (అహో )
మాతృభూత — మాతృభూతు డ వీ వగుటను నాతప్పులను లోఁగొని నన్ను రక్షించుట

అవశ్యంభావి నీ కను చున్నా డు. తుపుత్రో జాయేత క్వచి దపి కుమాతా న భవతి అని (భగవత్పాదుల దేవీస్తవము)

తమకృతులు శాశ్వతములు గా వెలయవలయు నని తరువాతి నిఘంటుకర్తలు గూడ ఇట్లే కోరుకొను చున్నారు.- ఈ రుచి రాంధ్ర నిఘంటు మ హోరూఢి ఎహించి మించి యారవి శశిభూ తారక మై తారక మై తారక మౌ గాక సుకవితతులకు సాంబా (సాంబ నానా 97 ) మొ

[ప్రతివర్గ సమాప్తియందు నిట్లే ఆ యా వర్గముల నామములమాత్రము వేఱు వేఱు గాఁ బేర్కొనుచు దా నీ పద్యమునే యుదాహరించు చున్నా డు కృతి సమర్పణమునకు వేంకనకవి [చూ — ( కాం ) - 70 80 0 09 20 2 44 49 5 66

(2 కాం ) 0 26 33 80 02 69 8 227 28 308

(3 కాం ) 28 43 65 8 43 (వీని కన్నిటికిని వర్గ నామములు మాత్రము వేఱు వ్యాఖ్యాన మంతయు నిదే )

ఇది

స్వర్గవర్గము

---

# వ్యోమవర్గము

ఆ చదలు నింగి యాకసము మబ్బుత్రోవ యు
ప్పరము విన్ను మిన్ను బయలు వెన్ను
నడుగు రిక్కదారి యన నభం బై తగు
ఖ్యాతగుణసమేత మాతృభూత

69

చదలు నింగి ఆకసము మబ్బుత్రోవ ఉప్పరము విన్ను మిన్ను బయలు వెన్నునడుగు రిక్కదారి—ఇవి నభమునకు (ఆకాశమునకు) పేర్లు

విన్ను— విను(రూపాం) ఆం సం ఆకాశనామముల నిల్లు పేర్కొనినది- వేలుపుల త్రోవ యుప్పరవీది యాక సంబు విను విన్ను మిను మిన్ను చదలు నింగి దివి మొయిలుదారి చుక్కలతెరువు బయలు గాడ్పుతం డ్రన నభ మొప్పు (దేవ 3 )

మిన్ను —బహువచనమందును ఇది ప్రయుక్తము మేడ్పడి రాజ్యగర్వమున మీ దు తలంపవుగాక చిచ్చులున్ గాడ్పులు గూడినట్లు మురఘస్మరు చేతుల శంఖశార్ఙ్గముల్ వీడ్పడి మ్రోయ డాయ బదివేవురుజోదులసింహనాదముల్ తోడ్పడవే? రసాతలము దూటిన మిన్నులమీ ద బాటినన్ (ఉ హరి 4 98 )మొ

మబ్బుత్రోవ — మేఘవర్త్మము అని ఆకాశనామమును వైజ ఉదాహరించినది- అన్త రిక్షం నభో వ్యోమ గగనం సురవర్త్మ ఖమ్ వియ ద్విష్ణుపదం దివ్యం వాయువర్త్మ విహాయసమ్ తారావ ర్త్మామ్బరం మేఘవర్త్మ చాకాశ మస్త్రియామ్ (అన్త జ్యో ) పొలకవణంపుతేని వి క బూన గ జాల నటంచు నేలతొ య్యలి కతివేల్పుహజ్జ బడి యంగదతో దనచంద మంతయుం బొలుపు గ విన్నవించుకొన బోయెనొక్కో యన మబ్బుత్రోవకుకా బలుపు గ గ్రమ్మి దు మ్మెగసి పాఱె వడికా సురగాడ్పు పెంపునన్ (అచ్చ కిష్కిం 6 )

3)

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ వ్యోమవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68ప ]

ఇది

వ్యోమవర్గము

---

# దిగ్వర్గము

సీ. ఆస యంచనఁ గడ యంచన దెస యనఁ
దేజరిల్లుచు నుండు దిక్సమాఖ్య
తూరు పనంగను దొలిదెస యనఁగను
బ్రాగ్దిశసంజ్ఞ యై పఁగు చుండుఁ
దనరు దక్షిణసంజ్ఞ దక్కినం బన వల
కడ యనఁ బ్రత్యక్కు పడమర యన
నడరు నుదక్కు డాకడ యన విలసిల్లు
నఱ యన వెలయు నభ్యంతరంబు

గీ. మూల యన రోక యనఁ గోణ మొప్పు మొయిలు
మొగులు మ బ్బన మేఘాఖ్య లగును మోడ
మనఁగ మందార మనఁగ మేఘావృతి దగుఁ
బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ

ఆస కడ దెస—ఇవి దిక్కునకు (దిశకు) పేర్లు

తూరుపు తొలిదెస—ఇవి ప్రాగ్దిశకు (తూర్పుదిక్కునకు) పేర్లు

దక్కినము వలకడ— ఇవి దక్షిణదిక్కునకు పేర్లు

పడమర— ఇది ప్రత్యక్కునకు (పడమరదిక్కునకు) పేరు

డాకడ—ఇది ఉదక్కునకు (ఉత్తరదిక్కునకు) పేరు

అఱ—ఇది అభ్యంతరమునకు (మధ్యప్రదేశమునకు అంతరాళమునకు) పేరు

మూల రోక — ఇవి కోణమునకు (రెండుదిక్కుల నడిమిప్రదేశమునకు వి దిక్కునకు) పేర్లు

మొయిలు మొగులు మబ్బు—ఇవి మేఘమునకు పేర్లు

మోడము మందారము— ఇవి మేఘావరణమునకు (మేఘాచ్ఛాదనమునకు మబ్బు పట్టి యుండుటకు) పేర్లు

అఱ —అంతరాళము - అని (బ్రౌ) అభ్యన్తరం త్వన్తరాలమ్ అని (అమ) ఇట ద్వే మధ్యమాత్రస్య అని సుధ అభ్యన్త రాన్తరాళ శబ్దౌ అష్టదిఙ్మధ్య వాచకౌ ఉపచారా త్కేవల మధ్యవాచకౌ చ అని (గురు)

మందారము — మబ్బు వేసుకొని ఉండడము ఇప్పుడు మబ్బు మందారము గా ఉన్నది అని వ్యవహారము అని (బ్రౌ)

మొయిలు మబ్బు —సాంబ వీనితోపాటు మఱి రెండు నామములను ఆంభా కించె విశేషము గా నొడివినది జేజేతేనియరదము నీటిమో పరి మబ్బు మొయి లన బరగు ఘనము (దేవ 2) అమ - ఇంద్రనామముల వచించుచు తురాషా ణ్మేఘ వాహన అనినది ఆంభా కూడ మబ్బురవుతు అని ఇంద్రుని బేర్కొనినది (చూ 46) తటిత్వా న్వారిదో ఽమ్బుభృత్ అని మేఘనామముల వచించినది గూడ అమ అమ్బుభృత్ అనుదానినే నీటిమోపరి అనినది సాంబ అమ లోని మేఘ వాహనః అను దానిని మేఘా గజ (జాది?) రూపధారిణ ఐరావతాదయో వాహనం యస్య స మేఘవాహన అని మేఘా నావిశ్య వర్ష తీతి వా అని రెండు విధములు గా వ్యాఖ్యానించినది గురు మేఘుడు ఇంద్రుని- అమాత్యాది ప్రకృతి వర్గము నకు చెందినవాడు గాను కామరూపధారణము కలవాడు గాను కాళిదాసమహాకవి వివతంస ముచే వర్ణింప బడు చున్నాడు జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోన (మేఘ పూ 6) ఇట- ప్రకృతి పురుషమ్- అమాత్యాది ప్రకృతివర్గస్థం పురుషమ్ అని నాథవ్యాఖ్య ఇంద్రునకు పర్జన్య డను పేరు గలదు పర్జన్యో మేఘశబ్దే స్యా ద్ధ్వనదమ్బుద శక్రయో అని (విశ్వ) ఇంద్రున కున్నయీపేరే ఆతనికి ప్రకృతిపురుషుఁ డైన మేఘునకును (అట్టివాఁ డగుఁనుబట్టి) లక్షణచే ఏర్పడి యున్న దన వచ్చును దక్షిణావర్తనాథుని ప్రదీపవ్యాఖ్య ఒకచో ఇ ట్లను చున్నది- యక్షగుహ్యకశబ్దౌ ధనదే ఽపి వర్తేతే అథో యక్షగుహ్యకౌ ధనదే ఽపి ఇతి యాదవ తస్మా ద్వైశ్రవణవాచకేన గుహ్యకశబ్దేన

తద్భృత్యానాం యక్షాణాం వ్యపదేశస్య యుక్తత్వా ద్యుక్తం గుహ్యక ఇతి (చూ మేఘ 5 వ్యాఖ్య) ఇందులకే ఆం భార అత్తురంగ మగ్ని యప్పురుషుండు పర్జన్య డింద్రసఖు డు (అది 8) అనినది ఇంద్రసఖుఁ డనుట సం భారత మునందు కానరాదు య పురుష స పర్జన్యో యోఽశ్వ సో ఽగ్ని ర్య ఋషభ స్త్వయా పథి గచ్ఛతా దృష్ట స్స ఐరావతో నాగరాట్ (అది పౌష్య 67) య శ్చైన మధి రూఢః పురుష స చే న్ద్రో య దప తే భక్షితం తస్య ఋషభస్య పురీషం త దమృతమ్ తేన ఖ ల్వసి తస్మి న్నాగభవనే న వ్యాపన్న స్త్వమ్ (68) స హి భగవా నిన్ద్రో మమ సఖా త్వదనుక్రోశా దిమ మనుగ్రహం కృతవాన్ (69) నన్నయ ఇంద్రసఖు డు పర్జన్యు డనుట అతని విజ్ఞానమున కొక పరాకాష్ఠ ప్రకృతి వర్గమున కైన పురుషులలో సుహృత్తు గూడ ఒక డు సం భార ఇంద్రుని మేఘ వాహనతను ఒకచో స్ఫురింప జేసినది- యో వాజినం గర్భ మపాం పురాణం వై శ్వానరం వాహన మభ్యుపైతి నమోఽ స్తు తస్మై జగదీశ్వరాయ లోకత్రయేశాయ పురందరాయ (అది పౌష్య 3 అ 49) ఇంద్రునిని వృష్టిప్రదాత యగు మహామేఘుని గాఁ గూడ వర్ణించినది సం భార ఈశో హ్యసి పయ స్సృష్టం త్వ మనల్పం పురన్దర త్వమేవ మేఘ స్త్వం వాయు స్త్వ మగ్ని ర్విద్యుతో ఽమ్బరే త్వ మభ్రగణవిక్షేప్తా త్వా మే వాహూ ర్మహాఘనమ్ త్వం వజ్ర మతులం ఘోరం ఘోషవాం స్త్వం వలాహకః (అది ఆస్తీ 6 అ 9 0 1) ఈ ప్రసంగ మంతయు గురు చేసిన రెండు వ్యాఖ్యలను సుసంగతము లనుటకే ఐన పైరెండు నామములను (సాంబ ఉదాహరించినవానిని) ఆం భా గ్రహింప కుండుటకు కారణము అట్టిప్రయోగములు నా టికి లేక సంస్కృతములకు తెలు గులు గా తరువాత అవతరించుట యగు ననిపించు చున్నది సూ ని మొ (నిఘంటువులు) నీరుదాలుపు మొ గ్రహించి ప్రయోగములు ప్రదర్శించినవికాని వీనిని గ్రహింప లేదు ప్రయుక్తానా మేవ అన్వాఖ్యానమ్ అనుటను ఆం భా కర్త చాలవఱకు పాటింప దలకొనినా డని అతని నిఘంటువుపరిశీలనమునఁ దెలియ వచ్చును

క మెఱుఁ గన మెఱు పన మిం చనఁ
బరఁగును విద్యుత్తు స్తనితవాచక మౌఁ గా
యుఱు మనఁగ నశనిఁ బిడు గం
దురు కొర డన రోహితంబు దోఁచుఁ బురారీ 72

మెఱుఁగు మెఱుపు మించు— ఇవి విద్యుత్తునకు పేర్లు

ఉఱుము— ఇవి స్తనితమునకు (మేఘగర్జితమునకు) పేరు

పిడుగు— ఇది అశనికి (మేఘముల రాయిడిచే కలుగుతేజఃఖండమునకు) పేరు

కొరడు— ఇది రోహితమునకు (వంకర గాఁ గాక తిన్నగా ఉండెడి యింద్ర ధనుస్సునకు) పేరు

మెఱుపు — సూ ని శ ర మెఱపు అనియే గ్రహించినవి బ్రౌ - మెఱువు ఒనియే గ్రహించినది మించు లన మెఱుపు లన గను జంచలలకు బేళ్ల దనరు (ఆం సం దేవ 40) మెఱియు-అతిప్రకాశనే అని ధాతుమాల (చి) వట్టియుఁ-ములు మెఱుపులే కాని వాన లేదు అని(వ్య) మెఱుపులు మెఱయుట అని ఒప్పకవి (చూ ద్వి ఆ)

క ఆడె లన నాగడప లన
నాడెబ లన మొగిలుదొంతి కలరును బే ళ్లీ
మూఁడును వడగం డ్లంచును
వాడుదురు కవు ల్కరకల వాగీశనుతా 73

ఆడెలు అగడపలు ఆడెబలు— ఇవి మొగిలుదొంతికి (మెట్లవలె ఎత్తు గా ఏర్పడిన మబ్బుతునుకల వరుసకు) పేర్లు

వడగండ్లు— ఇది కరకలకు (వాన కురియునప్పుడు పడు (వాన) ఱాలకు వర్షోపలములకు) పేరు

వడగండ్లు — వానఱా ల్వడగండ్లు నా నొప్పు గరకలు అని (సాంబ స్థావ 66) వడగల్లు (ఏ) వడగండులు (రూపాం) పుడమి దనయాజ్ఞ సేకొని నడపినదంపతులమీద నలి మరు డింపే ర్పడ బుష్పవృష్టి గురిసిన వడువున దొలువాన గురిసె వడగండులతోఁ (కు సం 6 855) (చూ సూ ని)

క వఱ పన నవగ్రహం బై
పరఁగు సురేంద్రధనురాఖ్య భాసిల్లుచు నుం

ఉ॥ రతనపువి ల్లనంగను
స్ఫురితగుణావేశ మాతృభూతమహేశా 74

వఱపు— ఇది అవగ్రహమునకు (అవగ్రాహమునకు అనావృష్టికి వాన లేమికి) పేరు

రతనపువిల్లు— మేఘములందు నానావర్ణమై ప్రతిఫలించుచు ధనురాకారముగాఁ గానఁబడెడి రతనపువిల్లు అని శర (చూ ఇంద్రాయుధము) కాళిదాసు మేఘసందేశమున ఇట్లు వర్ణించు చున్నాడు— రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్షణీయం పురస్తాత్ వల్మీకాగ్రా త్ప్రభవతి ధను ఖణ్డ మాఖణ్డలస్య యేన శ్యామం వపు రతితరాం కాన్తి మాపత్స్యతే తే బర్హే ణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః (పూర్వ 5) ఇచ్చట నాథవ్యాఖ్యాన మి ట్లున్నది- వల్మీకాగ్రాత్ ప్రభవతి తదన్తర్గత సర్పశిరోరత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్షణీయం ధనుఃఖణ్డం వల్మీకాగ్రా త్ప్రభవ తీ త్యర్థః వల్మీకాగ్రా దిన్ద్రధనుషః ప్రాదుర్భావ ఉక్త స్సంహితాయామ్— జలమధ్యే ఽనావృష్టి ర్భువి సస్యవధ స్తరూత్థితే వ్యాధి వల్మీకే శస్త్రభయం విశి సచివ వధాయ ధను రైన్ద్రమ్ ఇతి

సీ॥ వాన యనంగను వర్షాఖ్య యగు నది
విడువక పట్టిన జడి యనఁ దగుఁ
బసపస యనునది ముసు రనంగను మీఱు
నల్పవర్షము సోన యనఁగఁ దనరుఁ
దూర జ ల్లనఁగను ధారాభిధాన మొఁ
దను పైన నదియ సూ చిను కనఁ దగు
జలబిందునామంబు వెలయు బొట్టు లనఁ దుం
పర లన నల్పశీకరము లెసఁగుఁ

గీ॥ దుప్రటి యన మంచుఁ బోలినతూరవాన
వాన వెలిసియుఁ జూరునఁ బడిననీరు

బొట్లు వంగుళ్లు నా గ నట్లొట్లు నాఁగఁ
బేరులు వహించు నొం కర్పూరగౌర ~5

వాన— ఇది వర్షమునకు పేరు

జడి— ఇది విడువక పట్టినవానకు (నిరంతరమహావృష్టికి ఎడతెగక కురిసెడిగొప్పవర్షమునకు) పేరు

పసపస— ఇది ముసురునకు (కొన్నిదినములు వెలియక కురియువానకు) పేరు

సోన— ఇది అల్పవర్షమునకు (చిన్నవానకు) పేరు

తూర జల్లు— ఇవి ధారకు (వర్షధారకు) పేర్లు

చినుకు— ఇది అల్పమైన (వర్షధారకు) పేరు

బొట్టులు— ఇది నీళ్లబిందువులకు పేరు

తుంపరలు— ఇది అల్పశీకరములకు (ఛిన్ననీటిబిందువులకు) పేరు

తుట్రి— ఇది మంచువంటి తూరవానకు పేరు

బొట్లు వంగుళ్లు నట్లొట్లు— ఇవి వాన వెలిసినతరువాత చూరునుండి పడునీటిబొట్లకు పేర్లు

జడి — ఒయ్యన వెల్లి సూపె జడి నుబ్బర వోయెడి ప్రాణి కోటికిన్ అని (హర 2 25) జడివాన- అవిచ్ఛిన్న వర్షము దట్టమైనవాన కారుమబ్బులు జడివాన గడగి కురియు పగిది నం బ కోఁతులపైని గురిసె (అచ్చ రా యు 323) అని సూ ని సాంబ దీనిని (వర్ష) సాధారణ వాచకము గా వచించినది జడి ముసురన గ వర్షమున కలరు (స్థావ 66) మెఱుమం ముసురు గురియ గ మెఱమం బురవీథులం బ యోధరవేళం దెఱవల రమణుల యొద్దకు నిఱు జీకటి నిశల నింక నెవ్వం డనుపున్ (హర 3 88) ఇది వీనికి అర్థాంతర మన దగినది ముసురు ఎనిమిది పది దినములు విడువక కురిసేవాన అని బ్రౌ

జల్లు — కురియువానజల్లుపెల్లున రిమ్మలుగొని సొమ్మలువోయి గొకులం బాకులం బయి (భాగ 2 186) (చూ సూ ని) ఒకమాఱు వడి గా కురిసి వెలియువాన-

అనునది దీనికి అర్థాంతరము సుప్రసిద్ధములు గా ఉండునర్థములు ప్రయోగజుష్టము లై యున్నను సువిదితము లని వానిని వదలి విశేషార్థములతోడివిశిష్టపదగ్రహణము నం దీ ఆం ధ్ర కర్త యెక్కువ మక్కువ చూపును పరిశీలించి చూచిన ఇం దిట్టివి చాల గలవు

తే అడ్డి యడ్డము మూయి క ప్పడ్డపాటు
మఱుఁగు చా టోల మోలిమి మాటు మూఁత
యనఁగ వ్యవధాన మౌ గడి యన గడంబు
నాఁగను ఘటాదికపిధాన మౌ గిరీశ 76

అడ్డి అడ్డము మూయి కప్పు అడ్డపాటు మఱుఁగు చాటు ఓలము ఓలిమి మాటు మూఁత— ఇవి వ్యవధానమునకు (అన్తర్ధానమునకు ఏదేనియొకదానిచే మఱొకదానిస్వరూపము మఱు గుపడి యుండుటకు )పేర్లు

గడి గడము— ఇవి ఘటాదికపిధానమునకు (కుండ మొద లగువానిమూఁతకు) పేర్లు

వ్యవధానము — వ్యవధి వ్యవధానము అన్తర్ధి అన్తర్ధానము పర్యాయములు ఛదో వ్యవధి రన్తర్ధి ర్వరణం చాపవారణమ్ అపిధాన తిరోధాన పిధా నాచ్ఛాదనాని చ (వైజ ఆన్త జ్యో) అన్తర్ధా వ్యవధా పుంసి త్వన్తర్ధి రపవారణమ్ అపిధాన తిరోధాన పిధా నాచ్ఛాదనాని చ (అమ) ఇట అష్టౌ అన్తర్ధానస్య అని సుధ మునుసుకొనుట కు అని (గురు) ఆచ్ఛాదనం సంపిధానే వస్త్రే ఉపవృతిమాత్రకే అని (ధరణి) (చూ సుధ)

చ నెల రెయివెల్గు చెంగలువనెచ్చెలి వెన్నెలగుత్తి చందు జా
బిలి చలివెల్గు చందురుఁడు వెన్నెలరాయఁడు చందమామ రే
పొలఁతిమగండు వేలుపులబోనముపుట్టిక చల్వజోతి చు
క్కలదొరం లచ్చితేనెడమక న్ననఁ జంద్రుఁ డగు న్మహేశ్వరా 77

నెల రెయివెల్గు చెంగలువనెచ్చెలి వెన్నెలగుత్తి చందు జాబిలి చలివెలు

చందురుఁడు వెన్నెలరాయఁడ చందమామ రేపొలఁతిమగఁడు వేలుపులబోనము పుట్టిక చల్వజోతి చుక్కలదొర లచ్చితోఁబుట్టువు మిన్నుమగువన్ను—ఇవి చంద్రునకు పేర్లు

వెలుపులబోనముపుట్టిక — వేలుపు పుట్టుక (అని వావి) ఇట పుట్టిక పుట్టుక గా అపముద్రిత మనిపించు చున్నది వేలుపులబోనము - దేవతలయన్నము (సుధ) దాని పుట్టిక అది ఉంచెడిగంప అన్నపుపాత్ర సుధాభాండము సుధానిధి చంద్రు డు—అని అర్థము బోనముపుట్టికకు (రూపాం) బోనపుట్టిక సముచితోత్సాహములు మించ శౌరిసుతు డు రీవి బురినుండి బోనపుట్టికలు రా ని జాప్త పరిజనయుతు డయి యార గించె (చంద్ర 2 50) ఇట సూ ని రీవి బురినుండి బోనపుట్టుకలు రా అని ఉదాహరించుట ప్రమాదము సూ ని వేలుపులబోనము మాత్రము గ్రహించి చంద్రు డు అనునది రెండవయర్థము గా దీని కిచ్చినది ఈ అం ధా ఇందులకు ప్రమాణ మనినది ఇదియు ప్రమాదమే వేలుపులబువ్వ అనునదియే జనరంజక మగు రీతిని ఏకవిచేతనో యిట్లు ప్రయుక్త మై ఆం ధా కర్త చే పై రీతిని గ్రహింప బడి యుండును

రేపొల తిమగ డు — ఇది రేమగ డు అనుదానికిని ఉపలక్షణము— చలువ లొసంగి వేడుక పొసంగ మెఱుంగుపరంగిపీ ట న న్నెల తలు రాచరెమగని నిల్పి కురుల్ తక్షి యార్చి గోకులం గలయ గ దువ్వచున్ హొయలు గా సిగ వైచి మెఱుంగుముత్య ముం గులికెడుబాసికంబు దగ గుట్టి రుమాలువు గట్టి రంతటన్ (కువల 5 9) (చూ సూ ని రెమగఁడు) రాత్రి నాయిక గాను చంద్రు డు నాయకు డు (భర్త) గాను వర్ణించుట కవులసంప్రదాయము రేరాజురాకకు రేచాన మును మున్న సవరించు నసితవసన మనంగ (భాను 3 7) మొ (చూ సూ ని రేరాజు) ఓషధీశో నిశాపతిః అని అమ

తే బిల్ల బిల్లిక యనఁగను బింబ మొప్పు
సగము సాఁబాలు సావాలు సవము సా మ
ర యనఁగాను సమాంశంబు ప్రణుతి కెక్కు
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ॥ 78

బిల్ల బిల్లిక— ఇవి బింబమునకు (మండలమునకు సూర్యచంద్రుల గుండ్రని యాకారమునకు) పేర్లు

సగము సాఁబాలు సావాలు సవము సాము అర—ఇవి సమాంశమునకు (సమభాగమునకు అర్ధమునకు) పేర్లు

సమాంశము — (సమ + అంశము) స౹౹ సంవత్సరే ప్రియామ్ సర్వసాధుసమానేషు సమం స్యా దభిధేయవత్ (విశ్వ) అని సుధ సాము సగము సా బా లనఁ దగు నర్ధమునకు అని సాంబ (నానా)

ఆ తోఁచు శకలసంజ్ఞ తునుక తుండెము తుండె
తుండు తుంట పఱియ తునియ ముక్క
వ్రయ్య వ్రక్క వ్రప్పు బ్రద్ద బ్రద్దర పఱ్ఱె
యన సుగంధికుంతలాంబి కేశ 79

తునుక తుండెము తుండె తుండు తుంట పఱియ తునియ ముక్క వ్రయ్య వ్రక్క వ్రప్పు బ్రద్ద బ్రద్దర పఱ్ఱె—ఇవి శకలమునకు (ఖండమునకు) పేర్లు

ముక్క —సూ ని ముక్క ౹ముక్క రెండును గ్రహించి రెండుచోట్లను ఆం ఖా నే రెండువిధములుగాను ఇచ్చి ప్రమాణ మను చున్నది శ ర ౹ముక ౹గ్రహింపక ముక్క యే గ్రహించినది సూ ని తుంట కడ ఆం భా పాఠము ముక్క అనియే ఉదాహరించు చున్నది ౹ముక్క లని బ్రౌ వావి పా (ఇది పారాం)

సీ వెన్నెల రేయెండ యన్నఁ జంద్రిక యొప్పుఁ
దగు సుషమాభిధ జిగి యనంగ
సిరి చెల్వు చెలువము చెన్ను సొం పొప్పు నొ
యగము చాయ యనంగ నలరుఁ గాంతి
తే అనఁ దే టన మీఱుఁ బ్రసన్నత
గుఱి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె

లక్కనం బాది కలం కానవా లడి
యాలము బచ్చెన యనఁగఁ జిహ్న

గీ మలరు మం చనఁగాఁ దుషారాఖ్య చెలఁగుఁ
జల్లన యివం బిగం బీము చలిమిరి చలి
జలుబు సి తివతాళింపు చలువ యివక
యనఁగ శీతంబు గుణిగుణాఖ్యలఁ దగ హర 80

వెన్నెల రేయెండ—ఇవి చంద్రికకు పేర్లు

జిగి—ఇది సుషమకు(మిక్కుట మగుకాంతికి)పేరు

సిరి చెల్వు చెలువము చెన్ను సొంపు ఒప్పు సోయగము చాయ—ఇవి కాంతికి పేర్లు

తేట తేట—ఇవి ప్రసన్నతకు పేర్లు

గుఱి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె లక్కనము ఆది కలంకు ఆనవాలు అడియాలము బచ్చెన—ఇవి చిహ్నమునకు(నగలు మొద లగువాని కిచ్చు కొలతకు కొలతను దెలుపువస్తువునకు)పేర్లు

మంచు—ఇది తుషారమునకు (హిమమునకు) పేరు

చల్లన ఇవము ఇగము ఈము చలిమిరి చలి జలుబు సీతు ఇవతాళింపు చలువ ఇవక—ఇవి శీతమునకు(గుణికి గుణమునకు-చల్లఁదనము కలదానికి చల్లఁదనమునకు) పేర్లు

రేయెండ —శ ర సమరవికాసంబు చెమట నొ ప్పఱ కుంద హేతిదీధితులు రేయెండ గాయు (భార భీష్మ ఆ 9) ఉదాహరించి ఇచ్చటి రేయెండ వెన్నెల యే అను చున్నది సూ ని ఈభారతము నీయక వదలినను (మార్క 60) ప్రయోగము కా దనుట లేదు ఇట్టిచో ప్రాచీనప్రయోగములందు రేయెండ పదము బాలతపార్థము

ననే చూపట్టు చున్నది అని ( 93 —వావి ) ఆం భా పరిష్కర్తలు అధస్సూచిక యందు వ్రాయుట ఉచిత మనిపించుట లెదు సూ ని భారతప్రయోగము నీయక వదలి నది దీనికి బాలాతప మని అర్థమనుకొనిన దేమో పరిశీలించి చూచిన ళ ర అర్థమే సముచితము వెన్నెల యన గ రెయెండ అని(వేంక మాన 22 ) (రేపు+ఎండ-) అనువ్యుత్పత్తితో) బాలాతపము అనునది దీనికి అర్థాంతరము

సుషమ — సుషమా పరమా శోభా అని అమ

ఇవము — మంచు అని దీని కర్థ మిచ్చినవి (సాంబ మొ ) ఇవము వలి మంచనంగను హిమము దనరు (సాంబ దేవ 9 ) ఇవ మన గ మంచనంగను హిమముపేళ్లు (ఆం శే 47 ) ఇవ మిగ మన గ మంచన హిమము వొల్పు (వేంక మాన 23 ) సూ ని మొ దీనికై ఇచ్చిన ప్రయోగముల ధోరణిని బట్టి ఈయర్థ మిటీవలివారి ప్రయోగములందే కానవచ్చు చున్న దని పించు చున్నది శ్రీనాధు డి ట్లను చున్నాఁడు- కొన్నిదేశంబు లెండచే గుమిలిపోయె గొన్నిదేశంబు లివముచే గొంకు వోయె గొన్నిదేశంబు లిరులచే గుతిలపడియె గొన్నిదేశంబు లీ దచే గూడ బడియె (కాశీ 37 నాపరిష్కృతప్రతి)ఇట ఇవము-చల్ల దనము కలది చలి-అని అర్థము (చూ నాకాశీ వ్యాఖ్య)

లక్కనం బన గ గళం కానవా లడి యాల మై బచ్చెన యనఁగ ఊహ్న మలరు అని వావి అపపా

తే చాయపెనిమిటి జముతండ్రి జగముకన్ను
తమ్మిచుట్టము మినురతనమ్ము ప్రొద్దు
ప్రాఁబలుకుచెంకి పచ్చగుఱ్ఱములరౌతు
వేవెలుం గన సూర్యుఁ డౌ విధువతంస 81

చాయపెనిమిటి జముతండ్రి జగముకన్ను తమ్మిచుట్టము మినురతనము ప్రొద్దు ప్రాఁబలుకుచెంకి పచ్చగుఱ్ఱములరౌతు వేవెలుఁగు—ఇవి సూర్యునకు పేర్లు

ప్రొద్దు — (సం బ్రధ్న ప్రా పద్దో క పొత్తు త పొఱదు ) కొన్నినామములను వీనితోపాటు సాంబ ఇట్లు వచించినది- సతపేరుతత్త డిజతతేరు గల్ప్రొద యనిఁ

బడ్డనెఱబంటు లరుగుత్రోవ వెన్నునివలకన్ను వెయివేతులదిట్ట తిగవేలుపులపెంకి పగటిజోతి జమునయ్య మినుమానికము చాయపెనిమిటి పగలుసేయువలంతి జగము కన్ను నెలజోడు తమ్మిచక్కిలిగింత వేవెల్గు కలువలసూడు చీకటులగొంగ జక్కవల యంటు మ్రొక్కులనొక్కసామి బారరూపులవేల్పు ప్రాబల్కునొమ్మ పెద్దు చలి దాయ ప్రొద్దు నాఁ బేళ్ల దనరు లోకబాంధవునకు (దేవ 9) ఆం భా కర్త గ్రహింపని విందు చాలఁ గలవు ఇవి ఈ తనితరువాత వెలసినవి కావలయును ఆం భా తరువాత వెలసినయీ అచ్చతెలుఁగునిఘంటువు అధోరణిని బట్టి చూచిన ఆధునాతనములగు అచ్చాంధ్రరచన లకనుకూలములు గా సంస్కృతనామములమీ దనే ఆధారపడి యివి యిట్లు ఏతత్కర్తలచే చాలవఱకు వెలయింపఁబడినవా? అని సందేహించుట కవకాశము లేక పో లేదు ఐనను బాగుగా ప్రయోగపరిశోధన మింకను జరఁగవలెనేకాని ఇద మిత్థమ్మన వీలు గాదు

సీ. పరివేషనామంబు భాసిల్లు చుండును
గుడి యనఁ బరిది నా గుడుసు నాఁగ
మినుకు తళుకు నిగ్గు మించు కళు కనంగఁ
గిరణనామంబు లై కెరలు చుండు
మెఱుపు డా ల్మెఱుఁ గనఁ బరఁగును బ్రభ తగు
దురవలోకప్రభ మిఱిమిడి యన
వెలయుఁ బ్రకాశంబు వెలుఁగు జోతి యనంగ
నది మించ నైన జ గ్గనఁగ నొప్పు

గీ. నాతపాభిధ యెండ యంఁ చనఁగ నెసఁగు
నలర నీరెండ యీరెండ యనఁగఁ గించి
దాతపం బగు మృగతృష్ణ లగుచు నుండు
నెండమావు లనంగ బాలేందుమౌళి 82

గుడి పరిది గుడుసు—ఇవి పరివేషమునకు (పరిధికి వఱదగుడికి గాలి గుడికి సూర్యచంద్రులకు చుట్టు ఏర్పడెడి మండలమునకు) పేర్లు

మినుకు తళుకు నిగ్గు మించు కళుకు — ఇవి కిరణమునకు పేర్లు

మెఱుపు డాలు మెఱుఁగు — ఇవి ప్రభకు (కాంతికి) పేర్లు

మిఱిమిడి — ఇది దురవలోకప్రభకు (చూడ శక్యము కానికాంతికి అధికకాంతికి) పేరు

వెలుఁగు జోతి — ఇవి ప్రకాశమునకు (వెలుతురునకు) పేర్లు

జగ్గు — ఇది అధిక మైనప్రకాశమునకు పేరు

ఎండ — ఇది ఆతపమునకు (సూర్యకాంతికి) పేరు

నీరెండ ఈరెండ — ఇవి కించిదాతపమునకు (కొంచెపుటెండకు) పేర్లు

ఎండమావులు — ఇది మృగతృష్ణికలకు (ఎండలో గుఱ్ఱములువోలె చలించుచుఁ గానవచ్చునీళ్లవంటి-చాయలకు (నీడలకు) పేర్లు

పరివేషము — పరివేష స్తు పరిధి రుపసూర్యకమణ్డలే అని అమ ఇట చత్వారి చన్ద్ర సూర్యయో రుత్పాతాదిజాతమణ్డలస్య అని సుధ గురు- పరివేష స్తు పరిధిః అను దానిని వేఱుపఱచి ఈరెండే పరివేషముపేళ్లనినది ఉపసూర్యక మణ్డల శబ్దములు ప్రతి సూర్యునకు (అన్తరిక్షోత్పాతవిశేష మగురెండవసూర్యునకు) పేళ్లనినది ఉపసూర్యక శబ్దము స్వరసము గా సంగత మగు చున్నది వేఱుపఱచి వ్యాఖ్యానించినప్పుడు పరివేషము సూర్యచంద్రుల కిద్దఱకు కలుగునది- శ్రీహర్షుడు నలుని వర్ణించుచు పరివేషముసుగుఱించి ఇట్లను చున్నాఁడు- తదోజస స్తద్యశసః స్థితా విమౌ వృ థేతి చిత్తే కురుతే యదా యదా తనోతి భానోః పరివేషకైతవా త్తదా విధి కుణ్డలనాం విధో రప నైష 4) వఱదగుడి అను దీని తెలుఁగుపేరు ఇది ఒకయుత్పాత మగుటను సూచించు చున్నది అందులకే సూర్య ముపగతమ్ అనువ్యుత్పత్తి ప్రదర్శించి ఉపసూర్యక శబ్దములోని సూర్యశబ్దము చంద్రోపలక్షక మనునాశయముతో పైనాఱుగునామములను ఏకార్థములే యనినది సుధ మల్లినాథాదివ్యాఖ్యాతృశిరోమణులు గూడ ఇట్లే అభిప్రాయపడు చున్నారు (చూ పై నైష శ్లో మల్లి వ్యా)

ఎండమావులు — వీనిస్వరూపమును 'కులశేఖరాళ్వారు లిట్లు వివరించినారు- జ్వలదవ నిఖి రాత పావలేపై రతిజడనేత్రమరీచి రంశుభర్తుః ఉపచితబహులప్రతాపశక్తి నుదక

మయా నభినున్యసే మరీచీణా (సుభ 0 ) దీనికి వ్యాఖ్య యిట్లున్నది- మరీచీనాం ప్రతాపబాహుళ్యే నైతత్ప్రసరరూపాణా మాతపానా మవనిం జ్వలయి త్వోర్ధ్వప్లవనం భవతి తత స్తన్మధ్యే నయనరశ్మీనాం జాడ్యే నావలోకనాశక్త్యా నివృత్య నయనయో రేవ సంకోచో భవతి తదా తేజసి జలభ్రమ పైశ్లోకమునకు నాయనువాద మిట్లున్నది- తపను చండాతపములు ప్రతాపబహుల శక్తిమంతంబు లై క్రాచి క్ష్మాతలంబుఁ బై కెగయ నేత్రరశ్ములు వాని జూడ గాక మ్రాన్పడ నవి నీళ్లగా గదోచు (సుభ 0 )

ఎండ — ఆతపంబునకు నెండ ప్రొద్దు వేండ్రం బనెడి పేళ్లొ పొసగు (దేవ 20 ) అనినది (సాంబ )

ఆ వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన
నుష్ణసంజ్ఞ దగుఁ గదుష్ణనామ
మలరు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ
యన సుగంధికుంతలాంబికేశ 83

వేఁడి, వెచ్చ వెక్క వెట్ట వెచ్చన—ఇవి ఉష్ణమునకు పేర్లు
గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ — ఇవి కదుష్ణమునకు (కొంచెమువెచ్చనకు కొంచెమువెచ్చ నైనదానికి) పేర్లు

కదుష్ణము — కోష్ణం కవోష్ణం మన్దోష్ణం కదుష్ణం త్రిషు తద్వతి అమ ఈషదుష్ణమ్ అవి విగ్రహము కవం చోష్ణే (6 3 0 ) కదాదేశము

తే కటు కనంగను రుట మనఁ జుఱు కనంగఁ
దీండ్ర మనఁ దీండ్ర యనఁగను దీక్ష్ణనామ
ధేయములు గాను జగతినిఁ దేజరిల్లు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 84

కటుకు రుటము చుఱుకు తీండ్రము తీండ్ర— ఇవి తీక్ష్ణ మైనదానికి పేర్లు

రటము —ఇట ఉరుటము అని ఛేదించినది బ్రౌ (చూ అను ఉరుటము) దీనిని రటము గానే గ్రహించినది సూ ని

కఱకు — కరు కనంగ వావి పా కఱ కైనవాడు అని వ్యవహారము బ్రౌ కరుకు గ్రహించినది (చూ 2 22 వ్యా) శాతమునకు నాఖ్య లై తనరారును జూఱుకు వాడి, తెగువ కఱ కనంగ (ఆం శేష 46ప)

తిం్రడము — తిం్రడ మనఁ దీవర మనంగ దిక్ష్ణ నామ ధేయములు అనునది (ప్రాత ప్రతిపా) అని సూ ని ఇచ్చినది (చూ తిం్రడము) దీనినిఁ గూడ నిచ్చినది (చూ చుఱుకు)

గీ శ్రీలు వెలయంగ నీ పేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గను దిగ్వర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 85

(వ్యాఖ్యకై చూ స్వర్గ 63.)

ఇది

దిగ్వర్గము

4)

# కాలవర్గము

సీ. తఱి తఱి పదను హదను సావి యదనుఁ నాఁ
        గాలాభిధానంబు గాఁ జెలంగు
    నాయతి కారు కందాయ మనంగ జ్యే
        ష్ఠాదిమాసచతుష్టయంబు దనరుఁ
    గారు చిత్తడి తొలుకారు తొలుకరి నా
        వర్షర్తుసంజ్ఞ యై పరగు చుండు
    మంచుకా రన గ హేమంతర్తు దగు శిశి
        రర్తు వౌను జలికా రని యనంగ

గీ. నామని యనంగను వసంత మలరు చుండు
    వెలయు గ్రీష్మర్తు వేసవి వేసఁగి యన
    గవిజనదయాంతరంగ పుంగవతురంగ
    ధూళిలసితాంగ శ్రీమాతృభూతలింగ 86

తఱి తఱి పదను హదను సావి అదను— ఇవి కాలమునకు (సమయమునకు సామాన్యకాలమునకు) పేరు

ఆయతి కారు కందాయము— ఇవి జ్యేష్ఠాదిమాస చతుష్టయమునకు (జ్యేష్ఠ మాసము మొదలుకొని నాలుగుమాసములకు జ్యేష్ఠాషాఢ శ్రావణ భాద్రపద ములకు) పేర్లు

కారు చిత్తడి తొలుకారు తొలుకరి— ఇవి వర్షర్తువునకు (వర్షఋతువునకు) పేర్లు

మంచుకారు— ఇది హేమంతర్తువునకు (హేమంతఋతువునకు) పేరు

చలికారు — ఇది శిశిరర్తువునకు (శిశిరఋతువునకు) పేరు

ఆమని— ఇది వసంతర్తువునకు (వసంతఋతువునకు) పేరు

వేసవి వేసఁగి— ఇవి గ్రీష్మర్తువునకు (గ్రీష్మఋతువునకు) పేర్లు

తొలుకారు — (తొలుత+కారు) తొలుకు+కారు' అని (శ ర.) మలుకారు అను దానిని బట్టి మొదటివ్యుత్పత్తియే సరి అని (సూ ని) తొల్కారు తొలకరి తొల్కారి (రూపాం) తిరం బగురూపు జెందుతొ ల్కారు మెఱుంగు జీవకళఁ గాంచిన విత్తరుబొమ్మ యానళ్ళం గారిణి యొసుధాసరసి గా నుతి సేయ గి వచ్చు నెచ్చెలిా (హంస -64) తొలకరిమెఱుగు తొలకరివాన (మొ) (మాయాకురంగవర్ణన)- కలికి తరితీపు సొలయు నలయు న్మలయుఁ గలయుఁ గసవు న్మెసవుఁ దొలకరి మెఱుంగుక్రియ మెలఁకువలఁ దోఁచుఁా (రామా 5 160) ప్రబలవజ్రొ పలప్రాసాదభాస మై తొలకరి నిది కుతూహలము నిలుపు (వసు-3 5) అవి (శ ర పా) (చూ తొలకరి) తొలుకరి అని (ముద్రి పా సూ ని పా)- ఇట తొల కరి అనుటయే ఉచిత మనిపించును తరుణులు చంచలాలతలు శోభన భుక్తివేళ తొ ల్కారిసమయంబు పేరెలమిఁ గైకొన కుండునె? భోక్తృసస్యముల్ (నైష 6 2) తొలికారు తొలికరి నా అని వావి (అపపా.)

వర్షర్తు — (వులోపము) అం కొ -ఇ ట్లను చున్నది ఇంకఁ దక్కినయలయుదం తముల కెల్ల వుత్వంబు గల్గుఁ బోవును మీఁద రాహువు రాహు నా బాహువు బాహు నాఁగ మేరు మేరు వనంగ నూ రూరు వన రఘు రఘు వన నిట్లు పరఁగు' (ఇట్టివే హేమంతర్తు మొ) అచ్చు ఉచ్చుట ఈతఁ డిట్టి వు లోపముల బహులములఁ గానే యొనర్చినాఁడు అథ శరత్ స్త్రియామ్ అని (అమ) ఐనను శర దృతువును ఈతఁడు పేర్కొనక పోవుట గమనింపఁ దగినది తెలుఁగునామము లట్టివి లేమియే యిందులకు కారణ మేమో

తే ఉమ్మలిక యుమ్మలిం పుబ్బ యుమ్మ యుక్క
యుమ్మదం బావి యావిరి యుమ్మలిక మ
నంగ నూష్మాఖ్య లొ నూట నా ద్రవోష్మ
బొలుచును వినంగ శ్రీ మాతృభూతలింగ



ఉమ్మలిక ఉమ్మలింపు ఉబ్బ ఉమ్మ ఉక్క ఉమ్మదము ఆవి ఆవిరి ఉమ్మలికము— ఇవి ఊష్మమునకు (ఉష్ణతాపమునకు) పేర్లు

ఊట — ఇది ద్రవోష్మకు (ద్రవము (నీరు) గా ఐన-ఊష్మకు (వేఁడికి) పేరు

ఊష్మము — గ్రీష్మోష్మ బాష్ప ఊష్మాణ అని (నానా) ఇచ్చట గ్రీష్మోష్ణ అని ఉండవలయు నని పించు చున్నది ఇచ్చటితెలు గుటీక ఇట్లున్నది- ఊష్మణ- పు ఇది- గ్రీష్మకాలమునకును వే డిమికిని కన్నీటికిని బేరు దీనికి ఉష్ణతాప మనునది లాక్షణికార్థము

ఉమ్మలిం పుబ్బ నుమ్మ అని వావి (అపపా)

తే. ప్రతిపదాదితిథుల్ నాల్గు పాడ్యమి విది
యు తదియ చవుతి యనఁగఁ జెన్నలరు చుండుఁ
బారసి యనంగ ద్వాదశి పరఁగు బూదె
యనఁ జతుర్దశి వెలయు సూర్యావతంస 88

పాడ్యమి— ఇది ప్రతిపత్తునకు పేరు

విదియ— ఇది ద్వితీయకు పేరు

తదియ— ఇది తృతీయకు పేరు

చవుతి— ఇది చతుర్థికి పేరు

బారసి— ఇది ద్వాదశికి పేరు

బూదె— ఇది చతుర్దశికి పేరు

చవుతి — (సం చతుర్థి ప్రా చఉత్థి క చవుతి) పాడ్యమిఁ బితృపూజ పాటింప గాంచనా గమము భాసురపటూత్కరము విదియ దదియ శాత్రవగణధ్వంసంబు చవుతి దిరచిత్రదర్శనప్రాప్తి ప్రకట లక్ష్మి పంచమిఁ గీర్తిలాభంబు షష్ఠి సప్తమి మహిసర్వప్రధానశక్తి యష్టమి నవమి నుత్కృష్టతయును బ్రభుత్వము బ్రహ్మవర్త

నవ్యాప్తి దశమి వేదసమ్మతైశ్వర్యంబు వినుతవేద వాదితయును నేకాదశి వసుమతీశ పదము జయమును బారసి బ్రజలపెంపు పుష్టతయును త్రయోదశిఁ బొందు జనుల (హరి పూ 2 34) ఇచ్చట చవితి అని వావి పా చవుతి అనియే (శ ర) (చూ చవుతి) ఆం భా కర్త ఈపద్యమును లక్ష్యీకరించినా డనుటకు ఇందలిపదములు చాలవఱకిం దుండుటయే నిదర్శనము శ ర పాఠము ఇటఁ బ్రామాణిక మైనది శ ర చవుతి కి చౌతి (రూపాం) అను చున్నది బ్రౌ కూడ చౌతి ఇచ్చు చున్నది చవితి తోపాటు చవుదంతి-చౌదంతి చవువీథి-చౌవీథి చవుసీతి-చౌసీతి- మొ దృష్టములు వా ఉయి రవు ర్వక్రితమౌ (ఆం చి అజ 65) బ్రౌ వ్యావహారిక ముల గా దనదు అట్టిదే బ్రౌ -చవితి చవుతి కైన అపభ్రంశరూపమే ఈ చవితి పై చూపిన ప్రాకృతాదులుగూడ చవుతి అనియే దీనిస్వరూపమును నిర్ణయించు చున్నవి ఇందువలననే భార్యపాలిండ్లు రిక్తకుంభములు గోయి వెలఁదిచనుదోయి నిండుకుండలు కులంబు తరుణిఫాలంబు చవితిచందురుఁడు వేశ్య నుదురు వానికిఁ బ్రతిపదిందుండు నయ్యె (పాండు 3 ) చవుతి అనుటయే ఇచ్చట గూడ సము చితము పరిష్కర్తల ట్లనక ప్రమాదపూరిత మగుప్రాతప్రతిని అనుసరించి గతానుగతి కన్యాయమును పాటించినా రనిఎంచు చున్నది ఇచ్చటి ప్రతిపదిందు డు (సామీప్యలక్ష ణాశ్రయణమున) విదియచందురుఁడు ప్రతిపచ్చన్ద్ర మివ ప్రజా నృపమ్ మొ ఇట్టివే విదియనాఁడు వెదకినను కన బడనిచంద్రు డు తదియనా డు తానే కన బడును - అని తెలుఁగువారి నానుడి

ప్రతిపత్తు — ప్రతిపన్నామ విజ్ఞేయా చన్ద్రస్య ప్రథమా కలా అని అభియుక్తోక్తి (చూ లఘుశ తత్వ) \ వృద్ధిక్షయములతోడియీకలలసంఖ్యయే తిథులయం దుపచరిత మై ద్వితీయ (విదియ) తృతీయ (తదియ) మొ వానిని ఏర్పఱచిన దనిఎంచును

బూదె — (సం భూత) భూతతిథి అని చతుర్దశి కి పేరు కర్తవ్యము పితృ పరిచరణము భూతతిథి దపస్వివరెణ్యా (హరి పూ 2 135)

ఈత డు వచింప గా మిగిలినతిథులకు తెలుగునామములు లే వనిపించును అందు లకు పై పద్యములే తార్కాణములు ప్రయోగదృష్టములు కానివానిని కృత్రిమముల గా సృష్టించుట ఆం భా ప్రణాళికకు విరుద్ధము అందులకే తదభిధానమునకు సంస్కృతనామ ములే సమర్థము లనినట్లు వానిని వదలిన దిది

తే పున్నమ యనంగఁ బూర్ణిమ పొలివి యుండు
నమవస యమాస యం చన నలరి యుండు
దర్శనామంబు గాఁ బ్రమథాధినేత
మాతృభూత జగత్త్రయీమాతృభూత 89

పున్నమ—ఇది పూర్ణిమకు పేరు
అమవస అమాస—ఇవి దర్శమునకు (అమావాస్యకు) పేర్లు

అమవస — (సం అమావస్యా అమావాస్యా క అమవాసె అమాసె త అమావసి) (అమాస రూపాం) మగువనెఱికప్పు గొప్పు నమాస యనుచు బొలతి నెమ్మోము గన్గొన బున్న మనుచు బ్రమసి (దశా 8 36 ) (చూ సూ ని ) ఇట మగువనెఱికొప్పు చూచి యమాస యనుచు అని బ్రౌ పా రెండవపాదములో బ్రౌ పా కన్గొని అయి యుండును క్రమభ్రంశమునకు గుఱి గాక బ్రౌ పారము సుసంగత మగు చున్నది అన్వయము సరసము [బ్రౌ దశా 9 462 గా దీని నుదాహరించు చున్నది ]

దర్శము — చంద్రు డు కలాభివృద్ధికై సూర్యునితోఁ గలసి యుండు దినము అమావాస్యా త్వమవస్యా దర్శ స్సూర్యేన్దుసంగమ (అమ ) సూర్యునివలనిచంద్రకలాభివృద్ధిని దేవీపురాణ మిట్లు వచించినది కలా షోడశ సోమస్య శుక్లే వర్ధయతే రవి అమృతే నామృతం కృష్ణే పీయతే దైవతై క్రమాత్ కరా (లా?) వశిష్టో నిష్పతః ప్రవిష్ట స్సూర్యమణ్డలమ్ అమాయాం విశతే రశ్మౌ (చూ శ్రుం నై 2 22 వేదవ్యా )

తే పొద్దనఁగ నాఁ డనంగను బ్రొద్దు నాఁగఁ
బొదలు చుండును దినము నాఁటిది యనంగ
దినభవముపేరు గాఁగను దేజరిల్లు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 90

పొద్దు ప్రొద్దు నాఁడు—ఇవి దినమునకు (అహోరాత్రమునకు రాత్రితో కూడిన పగలికి) పేర్లు

నాఁటిది—ఇది దినభవమునకు (దినమం దేర్పడినదానికి) పేరు

నాఁటిది —(నాటి+అది) అది అవి శబ్దంబులయత్తునకు వృత్తిని లోపంబు బహులంబు గ నగు (బాలవ్యా సం 45) ఇచ్చటి అది శబ్దము సంబంధార్థకము సంబంధియందు పర్యవసితము

క ఎల్లి యన రేపనం దగు
నెల్లికి నావలిది వెలయు నెల్లుండియు నా
యెల్లుండి కవలి దావలి
యెల్లుండి యనంగఁ దనరు నిందువతంసా 91

ఎల్లి—ఇది రేపటికి (మఱునటిదినమునకు నేఁటికి తరువాతిదినమునకు) పేరు

ఎల్లుండి—ఇది ఎల్లికి ఆవలిదానికి (రేపటి కావలిదినమునకు) పేరు

ఆవలియెల్లుండి—ఇది ఎల్లుండికి ఆవలిదానికి (నేఁటికి తరువాత మూఁడవదినమునకు) పేరు

రెపు — ప్రాత కాలము అనునది (అర్థాం) ఎల్లి సేయుపనులు నే డ యింతి మా పొనర్పుపని రేప చేయుట నామతంబు (భార అను 5 238) ఆవలియెల్లుండి ఆవలిమొన్న-వీనిని శ ర గ్రహింప లేదు సూ ని గ్రహించి ఆం భా ప్రమాణ మనినది కవిప్రయోగములు లేక ఆం భా పదగ్రహణ మొనర్పదు అన్వేషణ మావశ్యకము ప్రహత మగుజనవ్యవహారము సాధుత్వము వీనికి కలదు పదములు గా ఇట్టివానిని గ్రహించుట కొన్నియెడల ఆం భా జరిపినది పరిశీలించిన ఇది ఉచితమే (చూ 92 వ్యాఖ్య)

క ని న్నన మొ న్నన నావలి
మొ న్ననఁ బ్రకృతతిథిముందు మూఁడు వరుస గా
నెన్నఁగ సరిపడి వచ్చును
బన్నగకృతహార భక్తభావ్యశరీరా 92

నిన్న—ఇది ప్రకృతదినమునకు ముందు జరగినదినమునకు(గతదినమునకు)పేరు

మొన్న—ఇది ప్రకృతదినమునకు ముందటి రెండవదినమునకు (గతదినమునకు ముందుదినమునకు) పేరు

ఆవలిమొన్న—ఇది ప్రకృతదినమునకు ముందటిమూడవదినమునకు (గతదినమునకు పూర్వము రెండవదినమునకు) పేరు

నిన్న మొన్న —(క నిన్న త నిణ్ణల్ క మొన్నె) అన విని యుత్తరుండు దగ నజ్జనపాలకుతోడ ని ట్లనుఁ మన కౌరరాజ్యముం గలదె? నన్నును నిన్నును నిన్న మొన్న వీ రనితరసాధ్యశత్రువిజయంబున గాంచినయప్డు కల్ల జేసనయది దక్క— (భార విరా 5 349)

ఆవలిమొన్న —(ఆవలను + మొన్న) ఇట్టివి కేవలయౌగికము లనుకొని పదగ్రహణ మొనర్చి సంజ్ఞావాచకము' లనుట యుక్తము గా దని కొందఱనుకొనవచ్చును కాని ఆవతలిమొన్న మొద లగువానికి ఇట్టియర్థము లేదు అందులకే ఇవి యోగరూఢము లై సంజ్ఞావాచకము లనిపించుకొనినవి వీనిని అం భా గ్రహించుట సముచితమే త్రిపురుషులు సప్తర్షులు చతుర్యుగములు లో నగునవి సంజ్ఞావాచకములు గా సంస్కృతభాషయందు పాణినీయసిద్ధములు (చూ నా పాణినీయము- కావ్య వాఙ్మయము- 40 4 పు)

తే పగ లనంగను పవ లనఁ బరఁగు నహము
పట్టపగ లన మధ్యాహ్నవాచక మగు
నాహ్నికాభిధ పగటిది యనఁగ నొప్పు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 93

పగలు పవలు—ఇవి అహమునకు (దినమునకు పగటికి) పేర్లు

పట్టపగలు—ఇది మధ్యాహ్నమునకు (మధ్యందినమునకు పగటినడిమిభాగమునకు) పేరు

పగటిది—ఇది ఆహ్నికమునకు (పగటియందు చేయఁ దగినకర్మమునకు) పేరు

పట్టపగలు —(పగలు + పగలు) భృశార్థమున ద్విత్వము మధ్యాహ్నము కుతపకాలము
అని (శ ర) కుతప స్స్యా త్కుశే వాద్యే తపనే ఛాగకమ్బళే కుతపో భాగినేయే
స్యా దష్టమాంశే దినస్య చ అని (విశ్వ)

సీ సంధ్య యొప్పుచు నుండు సం జనఁ బూఁ టనఁ
బుంట యం చనఁగఁ బురంట యనఁగ
సాయంసమాఖ్య యై చను చుండు మా పన
మునిమా పనఁ బ్రదోష మొప్పు చుండు
రెయి రేయి రాతిరి రేతి రనంగను
రజని పొల్చును నడిరాతిరి యన
నడిరేయి యనఁగఁ గాందారిమాందారిప్రొ
ద్దన సరిప్రొ ద్దన నర్ధమరెయి

గీ యన నిశీథాఖ్య దగుఁ బ్రభాతాఖ్య దనరు
వేకువ యనంగ వేవి నా వేగు నాఁగఁ
దెల్లవాఱఁగ ననుమాట తేజరిల్లు
- భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 94

సంజ పూఁట పుంట పురంట—ఇవి సంధ్యకు (సంధ్యా కాలమునకు అహోరా
త్రమున కగు సంధికాలమునకు సూర్యోదయ సూర్యాస్తమయములకు ముం
దుండు (కొలఁది) కాలమునకు) పేర్లు

మాపు—ఇది సాయంకాలమునకు (దినాంతమునకు దినముయొక్క కడపటి
భాగమునకు) పేరు

మునిమాపు—ఇది ప్రదోషమునకు (రజనీముఖమునకు రాత్రియొక్క మొదటి
భాగమునకు) పేరు

రెయి రేయి రాతిరి రేతిరి—ఇవి రాత్రికి పేర్లు

నడిరాతిరి నడిరేయి కాందారిమాందారి ప్రొద్దు సరిప్రొద్దు అద్దమరెయి— ఇవి నిశీథమునకు (అర్ధరాత్రమునకు) పేర్లు

వేకువ—ఇది ప్రభాతమునకు (అహర్ముఖమునకు తెల్లవాఱుటకైన ప్రారంభమునకు) పేరు

వేవి వేగు— ఇవి తెల్లవాఱఁగాన్ అనుమాటకు (తెల్లవాఱుట కాఁగా తెల్లవాఱఁగా- అనుటకు) పేరు

సంధ్య — అహోరాత్రస్య య స్సంధి సూర్యనక్షత్ర వర్జిత సా తు సంధ్యా సమాఖ్యాతా మునిభి స్తత్త్వ దర్శిభి సంధౌ సంధ్యా ముపాసీత నా ఽస్తగే నోద్గతే రవౌ (పరా ఆచా అ) రాత్రే రాద్యన్త దణ్డచతుష్టయాత్మకకాల (సంధ్యా) దణ్డ -ఘటికామాత్ర కాల -అని (స త సి ప ల సం) సూర్యాస్తమయమునకు ముందు మూడుగడియలు సూర్యోదయమునకు ముందు ఐదు గడియలు (సంధ్య) అని (గురు)

సాయంకాలము — దినముయొక్క కడపటి భాగమందలి రెండు ముహూర్తముల కాలము (ముహూర్తము-రెండుగడియలకాలము)- అని (గురు)

మునిమాపు — ఇచ్చటి మాపు నకు రాత్రి అని అర్థము మున్ను నకు సంక్షిప్త రూపమే మును వృత్తిని అంత్యోకారమునకు ఇకారము వికల్పము రజనీముఖమనుటనే వచించినది ట్లిది మునుమాపు (రూపాం) ఇచ్చ బార్వతి పూయు పచ్చని విభూతి యిచ్చె నొక్కయ్య నా కీమునుమాపు (బ ద్వి 3 269) (చూ బ్రౌ) మునిమాపు బ్రౌ గ్రహింప లేదు మునుమాపు శ ర ఈయ లేదు మున్మాపు ప్రయోగ దృష్టము ఆ నీవె మున్మాపు కంబంబునం బుట్టి గు బ్బెల్ల బో రక్కసుం బట్టి యి ట్టట్టు గా గొట్టి ప్రహ్లాదు నాహ్లాదదృష్టిఁ నిరీక్షింపవే? (శేష 4 32) (చూ సూ ని) ప్రదోషము రాత్ర్యంశము- ప్రదోషౌ దోషరాత్ర్యంశౌ (వైజ త్ర్యక్ష పుంలి) ఐనను ప్రదోషమునకు సంనిహిత మగుటచుజేసి ఔపచారికము గా సాయంకాలమే యిట మున్మాపు నకు అర్థము కనుకనే యిట నరసింహావిర్భావవర్ణన సంగతము పై బ ద్వి పారము మునిమాపు గానే నేటి ముద్రితప్రతులలో ఉపలబ్ధమగుచున్నది శ ర ను బట్టియో ఆం భా ను బట్టియో జరపిన పరిష్కర్తల సంస్కారమిది అనిపించును మఱియొకమాట శ ర మాపు అనుదానికి రాత్రి అర్థమని

అందులకు ప్రమాణము గా- మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద ప్రాపిత ధూళీ ధూసరిత భాసిత కుంతల మై సరోరుహో ద్దీపిత మైన నీమొగము ధీర జనోత్తమ మాకు వేడ్కతో జూపి మనంబులకా మరుని జూపుదుకాదె క్రమ క్రమంబునకా (భాగ 0 స్కం 000) ఉదాహరించినది సూ ని సాయంకాల మర్థ మనిన దిచ్చటి మాపు నకు 053 పద్య మొకటి శ్రీకృష్ణదర్శనము పగలు కలుగు టకు (గోపికలకు) వీలు గా దని రాత్రియే అది సంభావ్య మని వచించు చున్నది కావున ప్రదోష మర్థము దీని కనుట ఉచితము ప్రదోషము రాత్ర్యంశమే రాత్ర్యంశము రాత్రియే శ ర రాత్రి అనుట అసంగతము కాదు ప్రదోష మనుట సముచితము సాయంకాల మనుట మీ దివర్ణనకు విరుద్ధము

కాందారిమాందారిప్రొద్దు — ఇట్టిదే కాందారిమాందారి వేళ ( శివ శివా కాశిపతీ యంచు మ త్కనినాదంబుల బిగ్గనం బలుకుచుం గాందారిమాందారివే ళను ధన్యు ల్విహరింతు రౌ (మల్ల వై 85) (చూ సూ ని)

అర్ధమరెయి —అర్ధమరేయి (రూపాం)- అర్ధమరెయి దా క బొల మారసి (పాండు 37)

ప్రభాతము — ప్రత్యూషో ఽహర్ముఖం కల్య ముషః ప్రత్యుషసీ అప అని అమ ప్రాత కాలము పేళ్ళ అని (గురు) అరుణోదయము లేక ఉదయకాలము- అర్థమని (బ్రౌ)

వేకువ —(వేగు + కువ) కువవర్ణకం బడంగ్వాదుల కగు (బాలవ్యా కృ 6) ఇది ఽదికర్మణి క్త కర్తరి చ చ (3 4 7) అని పాణినీయ విహిత మైన క్త ప్రత్యయము వంటి దనవచ్చును

వేవి —(వేవు + ఇ) వడిప్రభృతు లి ల్లెఱుంగునది (బాలవ్యా కృ 22) ఇందు ఇ వర్ణకమును ఒకటి చేయి వ్రాయి ఉదాహరింప బడినవి ఆట్టిదే ఇది

వేగు —(వేగు + ఉ) (చూ బాలవ్యా కృ 2 సూ) ఇట- బ్రౌ వేవి లేక వేవిన విణ. తెల్లవారంగ అం భా అను చున్నది (చూ అను) దీనిని బట్టి ఇట బ్రౌ పా వేవిన వేవి నా గ దెల్లవాఱంగ అని ఉండు ననిపించు చున్నది ఈ వేవిన అనునది ఇన ప్రత్యయాంత మగు కృదన్తనామ మన వలయును ఈరెండును క్రియావి

శేషణము అని బ్రౌ అభిప్రాయము ప్రయోగ మొకటి ఇట్లుదాహరించు చున్నది బ్రౌ వేవిన నిద్ర మేలుకని వేకొకబానకు నేర్పుతోడఁ బై మీవడఁ బుచ్చి కవ్వ మిడిటీ తెల్లవారగా అని ఇది భావలక్షణార్థక మగు న వర్ణకాంత మనినను సరిపడునదియే అపూర్వము గా ఇట్టి ఇనవర్ణకకృదన్త రూపమును అంగీకరింప వలసినయక్కఱ కనిపింపదు బ్రౌ ఆశయ మేమో

తే గడె గడియ నాఁగ ఘటిక యౌ నదరు జాము
నాఁగ యామము దగు నెల నాఁగ మాస
మెసఁగు వత్సర మేఁడాది యేఁడు నాఁగ
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 95

గడె గడియ—ఇవి ఘటికకు (ఇరువది నాలుగు నిమిషములకాలమునకు) పేర్లు

జాము—ఇది యామమునకు (ఎడున్నర గడియకాలమునకు) పేరు

నెల—ఇది మాసమునకు (ముప్పది దినముల కాలమునకు) పేరు

ఏఁడాది ఎఁడు—ఇవి సంవత్సరమునకు (పంద్రెండు నెలలకాలమునకు) పేర్లు

ఏఁడాది — (ఏఁడు+ఆది) ఇట ఆది శబ్దము నిరర్థకము వంచాది పాఁతాది వంటిది అని శర ఏఁడు పరిమితి గా గలకాలము అని సూ ని

తే నిరుడు నాఁగఁ బరుత్పంజ్ఞ పరఁగు చుండు
మీఁఱు మున్నేఁడు నాఁగఁ బరారినామ
మలరు నియ్యేఁడు నా నైషమార్థ మగుచు
నద్యసమ మగు నేఁడు నా నబ్జచూడ 96

నిరుడు— ఇది పరుత్తునకు (జరగిన సంవత్సరమునకు) పేరు

మున్నేఁడు— ఇది పరారికి (జరగినసంవత్సరమునకు ముందటిసంవత్సరమునకు (ముందటియేఁడాదికి) పేరు

ఇయ్యేఁడు —ఇది ఐషమమునకు (జరగు చున్న సంవత్సరమునకు) పేరు

నేఁడు — ఇది అద్య అను దానికి (ఇప్పటికి వర్తమానకాలమునకు జరగుచున్న దినము- మొదలగుదానికి) పేరు

అద్యసమము — అస్మిన్ కాలే అను నర్థమున ఇదం శబ్దమునకంచె ద్యస్ ప్రత్యయమును విధించి పాణినీయము అద్య అనుదానిని సాధించినది- సద్య పరు త్పరార్యైషమ పరేద్య వ్యద్య (5 3 22) అద్యాఽత్రాఽహ్నా ఽని (అమ) ఆ అద్య తో నేఁడు అనునది తెలుగున సమానార్థకమనుట వచింపబడుచున్నది నాద్యసమ మగు నేఁడు నా వావి అపముద్రి అద్యసమము నేఁడు లేక ఏఁడు అని పదవిభజన మొనర్చుట సంగతము కాదనుట విస్పష్టము

తే అన్యదినసంజ్ఞ యొక్కనాఁ డనఁగ వెలయుఁ
దాని మును వెన్కదినములు దనరును దొలి
నాఁ డనంగను మఱునాఁ డనంగ వరుస
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 97

ఒక్కనాఁడు— ఇది అన్యదినమునకు. (ఇతరదినమునకు వేఱుదినముకు) పేరు

తొలినాఁడు— ఇది దాని మునుదినమునకు (అన్యదినమునకు ముందటిదినమునకు) పేరు

మఱునాఁడు— ఇది దాని వెన్కదానికి (అన్యదినమునకు తరువాతిదినమునకు) పేరు

ఒక్కనాఁడు — అడిగితి నొక్కనాఁడు కమలాసనుతేరికి వారువంబనై నడచుచు (శృం నై 2 58) అని శ్రీనాథుఁడు, ఇట్టివి దీనికి లక్ష్యము లనిపించును [ఒక్కనాఁడు- ఈదినమునందుఁ గాక మఱొకదినమునందు ఇప్పుడు గాక మఱొకప్పు డనుట] ఇది మొదలు గాఁ గలమూఁడుపదములు ఈయర్థములందు ప్రామాణికనిఘంటువులచే గ్రహింపఁబడ లేదు తొలినాఁడు మఱునాఁడు- అనునవి ప్రకృతదినమునకు ముందటి దినము అనునర్థములు గలవి గా మాత్రము సూ వి శ ర త్నా అచే ప్రయోగములతో

ఒసగఁబడినవి అన్యేద్యు పూర్వేద్యుః అపరేద్యు అనునవి వరుసగా వీనిచే చెప్పఁబడుచున్న వనవచ్చును ప్రకరణమునుబట్టి 96 పద్య మిందులకు నిదర్శనము దాని అనుసర్వనామము సర్వనామ్నాం బుద్ధిస్థపరామర్శకత్వమ్ అనున్యాయమున ప్రకృతదినాభిధాయకము కావచ్చును ఇట్టివ్యాఖ్యానమే యిట ఉచిత మనిపించును మఱొకవిశేషము సద్యః పరుత్పరా ర్యైషమ పరేద్య వ్యద్య పూర్వేద్యు రన్యేద్యు రన్యతరెద్యు రితరెద్యు రపరెద్యు రధరెద్యు రుభయేద్యు రుత్తరెద్యు (5 3 22) అను సూత్రమున పూర్వేద్యుః (తొలినాడు) అపరెద్యు (మఱునాడు) అనునవి అన్యదినసంజ్ఞకు (అన్యేద్యు అన్యతరేద్యుః ఇతరెద్యు) అనువానికి వరుసగా ముందు వెనుక నున్నవి అవియే ఇట వివక్షితములై వానికి పర్యాయములుగా తొలినాఁడు మఱునాడు వచింపబడుచున్న వనుట గూడ అంభా కావ్యమర్యాదతో ఇట తెలిపిన దనిపించుచున్నది ఉద్దండ పండితుడు వేంకనకవి కాదనలేము

సీ. దుమగతికేతు నా ధూమకేతువు దోఁచు
వెలయుఁ ద్రుంగు దనంగఁ బ్రళయసంజ్ఞ
దోస మనంగను దొసగు దొసంగు నాఁ
గసటు నాఁ బాపంబు గాఁ దనర్చు
దమ్మ మం చనఁగను ధర్మంబు విలసిల్లు
హర్షాభిధ చెలంగు నరుస మనఁగ
సంతస మంచన సంతోస మంచన
నలరు సంతోషంబు వెలయు సుగము

గీ. హాయి సుకము సుమాళ మం చనఁగ సుఖము
క్షేమ మగు లగ్గు లెస్స మే ల్సేమ మనఁగ
సకిన మనఁగను విలసిల్లు శకునసంజ్ఞ
గొన మనంగను గుణము గాఁ దనరు నభవ 98

దుమగతికేతు— ఇది ధూమకేతువునకు (తోఁకచుక్కకు) పేరు

త్రుంగుడు— ఇది ప్రలయమునకు (ప్రలయకాలమునకు క్షయమునకు) పేరు

దోసము దొసఁగు దొసంగు కసటు—ఇవి పాపమునకు (దుష్కృతమునకు) పేర్లు

దమ్మము— ఇది ధర్మమునకు (పుణ్యమునకు సుకృతమునకు) పేరు

అరుసము— ఇది హర్షమునకు (ఆనందమునకు ప్రమోదమునకు) పేరు

సంతసము సంతోసము— ఇవి సంతోషమునకు (సంతుష్టికి లేనిదానికి వగవక ఉన్నదానితో చెందుసంతృప్తికి) పేర్లు

సుగము హాయి సుకము సుమాళము— ఇవి సుఖమునకు (సౌఖ్యమునకు దుఃఖరాహిత్యాదులవలని స్వస్థచిత్తతకు) పేర్లు

లగ్గు లెస్స మేలు సేమము— ఇవి క్షేమమునకు (శుభమునకు) పేర్లు

సకినము— ఇది శకునమునకు (శుభసూచకనిమిత్తమునకు) పేరు

గొనము— ఇది గుణమునకు(సౌశీల్యాదిగుణమునకు సుగుణమునకు) పేరు

దమ్మము —(సం ధర్మ ప్రా ధమ్మో క దమ్మ) తమవారి గుమిగూడి దమ్మరాజుల కతల్ నోటి కడ్డము లేక నొడివికొనుచు (కువల 2 4 (చూ సూ ని) దీనికి వికృతి దరమము అని ఆం కౌ- ధర్మంబు దరమంబు ధనుర్వాచక మగు ధర్మ శబ్దమునకే ఇది వికృతి యని క్రిందిప్రయోగ మను చున్నది- దరమంపుటొజ్జకు దనవ్రే లొసంగినయే నాది మా కిత వైన(యట్టి?) తేడు (ప్రబంధ 60) (చూ సూ ని) ధర్మ శబ్దము నానార్థకము- ధర్మ పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ ఉపమాయా మహింసాయాం చాపే చోపనిగద్యతే అని (విశ్వ)

అరుసము —(సం హర్షః ప్రా హరిసో) హరుసము (రూపాం) పరహితు దైనవానికి శుభంబు లభించిన నెల్లవారలుఁ హరుసమె కంద్రు (ఉ రా 2 ఆ 96) (చూ శ ర) సాంబ - అరుసము సంతోసము సంతసము ఏకార్థకము లను చున్నది

వేడ్క- చెలిమి వేడుక సంతోస మింపు ముదము సంతసము సొంపు మే లరుసంబనంగఁ బ్రమదమున కాఖ్య లగు (మాన 22) ఆం భా వే అనినది సంస్కృత

మున-వైజ ధృతిస్తుష్టి స్సంతోషః అని మదో హర్షః ప్రమోదో మోదసమ్మదౌ (భూ ౹ బ్రా ) అనినది వేఱు వేఱుగా నియమములలో గూడ సంతోష మొకటి నియమా శ్శౌచ సంతోష తప ఆదయ (వైజ భూ బ్రా ) ఈ సంతోషము (సంతుష్టి)-స్వత స్తృప్తి యథాలాభసంతుష్టి ప్రాణధారణమాత్రహేతుకతృప్తి అని మూడు విధములు (చూ స త సి ప ల సం)

ప్రలయము — కల్పము అనియు దీనికి పేరు ఇది మహాప్రలయము అవాంతర ప్రలయము అని రెండువిధములు వీని నిట్లు వివరించినది పరాశరమాధవీయము కల్ప్యతే జగదస్మిన్ కాల ఇతి సృష్ట్యాది మారభ్య జగ దవిచ్ఛిన్న కాల కల్ప స చ ద్వివిధః మహాకల్పో ఉవాన్తరకల్ప శ్చ మూలప్రకృతే ర్య స్సర్గ స్త మారభ్య చతుర్ముఖా యు పరిమితో మహాకల్ప చతుర్ముఖస్య దినమాత్ర మవాన్తరకల్ప (ఆచా అ)

సుఖము — ముత్ప్రీతిః ప్రమదో హర్ష శర్మ శాత సుఖాని చ అని హర్ష సుఖ ముల నేకార్థకముల గానే వచించినది (అమ) ఆం భా ఇవి వే ఱను చున్నది సుఖము నానార్థములు గల శబ్దము దుఃఖరాహిత్యాదులలవలని స్వాస్థ్యము గూడ దీని కర్థమే అవిషాదమ్మన సుఖముండిరి (భార ఆది 6 229) అదే ఇట వక్తవ్యము గాఁ దోఁచినది బహుపరిశీలమున ఇచ్చటి సుమాళము అనుదానికి తిక్కనాది ప్రయోగము లి ట్లున్నవి కంకు నాలోకించి నెత్తం బొకపలుక యాడుదమే యని యుబ్బు మై మాట గాఁ బలికిన నతండు నీవు సుమాళంబున నున్నవా డవు నేడు నీతోడ నాడి జయింప రాదు (భార విరా 5 244) మొ పై ప్రయోగములందు కానవచ్చు సంతోషావేశాదులు అర్థాంతరము లనఁ దగినవి

తే చేటు చేట్పాటు, గీడ్పాటు, చెట్ట కీడు
నేగి చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభ
మలరుఁ గట్టిడి బవిసి దయ్యమ్ము బైసి
కట్టడి యనంగ నియతి గాఁ గాలకంఠ 99

చేటు చేట్పాటు కీడ్పాటు చెట్ట కీడు నేగి చెడిది సిలుగు—ఇవి అశుభము నకు (అమంగలమునకు) పేరు

కట్టిడి బవిసి దయ్యము బైసి కట్టడి—ఇవి నియతికి (భాగ్యమునకు అదృష్టమునకు) పేర్లు

నియతి — భాగ్యం స్త్రీ వియతి ర్విధిః’ అని (అమ)

బైసి — బైసి మాలినపరమనిర్భాగ్యధాలు విధవ దావియాశీస్సును విషమఘంటు (కాశీ 2 85)

ఆ ఒప్పు హృదయసంజ్ఞ యుల్లంబు మది డెంద
మెడఁద యెడ్డ యాద యెద మన సనఁ
బుట్టు పుట్టువ యనఁ బొలుచు జన్మము సుహృ
దయము నెమ్మది యనఁ దగు, మహేశ 100

ఉల్లము మది డెందము ఎడఁద ఎడ్డ అధ ఎద మనసు—ఇవి హృదయమునకు (మనస్సునకు) పేర్లు

పుట్టు పుట్టువ—ఇవి జన్మమునకు (పుట్టువునకు, పుట్టుగునకు పుట్టుకకు) పేర్లు,

నెమ్మది—ఇది సుహృదయమునకు (నెమ్మనమునకు నిండుమనస్సునకు క్షమించి మనస్సునకు విశాలమైనహృదయమునకు) పేరు

నెమ్మది —(నెఱ+మది) ప్రయోగ మి ట్లిచ్చినది (సూ ని) దీనికి ‘బావలు పుత్త్రుఁడులు వనుచును నీవు కృపాతిశయ మెసఁగ నెమ్మది మమ్ముం గావను బ్రోవను దలఁచి రమావర కలిసికొవి తిరిగి మన్నించుటలకా’ (భార శాం 1 888)

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గఁ గాలవర్గ మిట్లు,
గైకొనుము దీని భక్తసంఘాభిమానిః
మాతృభూత జగత్త యీమాతృభూత 101

[చూ వ్యాఖ్యకై స్వర్గ. 68వ్యా]

ఇది

కాలవర్గము

# ధీవర్గము

తే బుద్ధి యంచన వెలయును బుద్ధిసంజ్ఞ,
తెలివి యనగ నెఱుక యనఁ దెలివిడి యనఁ
బరఁగు జ్ఞానంబు వగ పనవగ యనఁ దల
పోఁత యనఁ జింత యౌ మాతృభూతలింగ 02

బుద్ధి—ఇది బుద్ధికి (మతికి) పేరు

తెలివి ఎఱుక తెలివిడి—ఇవి జ్ఞానమునకు (మోక్షోపయోగి యగుబుద్ధికి) పేర్లు

వగపు వగ తలపోఁత—ఇవి చింతకు (విచారణకు ఆలోచనకు) పేర్లు

జ్ఞానము—విజ్ఞానమునకు పేర్లు వేఱుగా వచింపబడుచున్నవి- విన్నాణమనగ నేరు పనగ - విలసిల్లు విజ్ఞానము (ఆం భా 03) కావున ఇచ్చటిజ్ఞాన మది కాదు మోక్షే ధీ ర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయో అని (అమ) ప్రయోగ మి ట్లున్నది- కలదది యూరక కానగ నలవియె? శ్రుతివాక్యసమితియర్థంబులపై నిలి చినశ్రద్ధం గ్రమమునఁ దెలివొందినఁగాక యెట్టిధీమంతులకుఁ (భార అను 6 63) (చూ సూ ని) జ్ఞానమాత్రమునందలివీనిప్రయోగములు ఔపచారికములు

తెలివి — తెల్వి (రూపాం) చెలువము విద్దెయు గ్గానము జేవయు బ్రోదతనంబుఁ దెల్వియుఁ (నీలా 1 92)

తలపోత — సూ ని దీనికి విచారము చింత అని అర్థ మిచ్చి ఈ ఆం భా ప్రమాణ ములందుల కనుచున్నది చింత-ఆలోచన అనునర్థము కలదిది ఇచ్చటి వగ వగపు లు దీని కైనపర్యాయములే అతివిచారణసంజ్ఞ యలరు నెవ్వగ అనురీతి పైపద్యోప క్రమము దీనిని తేటతెల్లచేయుచున్నది చర్చా సంఖ్యా విచారణా అని (అమ) బాధకు వేఱుగా ఇది పర్యాయముల నిచ్చినది (చూ 60) అందువి లేవు దుఃఖము అనునది వీనికి అర్థాంతర మనవలసినది బ్రౌ ఈ తలపోఁత కు ఆలో

చన దు ఖము- రెండును అర్థము లను చున్నది నానార్థవర్గ మిది కాదు వేఱుపట్టుల రెండర్థముల నిచ్చుట ఆం ధ్ర పద్ధతి కాదు వచించినది దుఃఖార్థకముల మరల వచింపదు

సీ అతివిచారణసంజ్ఞ యలరు నెవ్వగ యన
నసుమాన మొ ప్పగు నంచన యనఁ
దారకాణ యనంగఁ దనరుఁ బ్రమాణంబు
తరకటిం పనఁగను దర్క మెనఁగు
సందియ మం చన సందేహ మై తోఁచుఁ
బరఁగు సంకేతంబుఁ బస యనంగ
దిట్ట మం చనఁగఁ గన్పట్టు నిర్ణయము గ
బవిరి బమ్మెర యన భ్రాంతి చెలఁగుఁ

గీ బంత మనఁగను బద్ధ నాఁ బ్రతిన యనఁగ
నలరును బ్రతిజ్ఞ విన్నాణ మనఁగ నేరు
పనఁగ విలసిల్లు విజ్ఞాన మగు నెఱుంగ
మి యన నజ్ఞాన మద్భుతమిహిరభూష 103

నెవ్వగ— ఇది అతివిచారణకు (అధిక మైన- ఆలోచనకు) పేరు
అంచన— ఇది అనుమానమునకు (ఊహకు ఫలపరిమితిని ఊహించుటకు) పేరు
తారకాణ— ఇది ప్రమాణమునకు (వివాదనిర్ణయసాధనమునకు) పేరు
తరకటింపు— ఇది తర్కమునకు (ఊహమునకు ఒకవిషయముయొక్క తత్త్వము తెలియనప్పుడు కారణోపపత్తితో దానితత్త్వము తెలియుటకై చేయు-ఊహకు) పేరు
సందియము— ఇది సందేహమునకు (సంశయమునకు) పేరు.
పస— ఇది సంకేతమునకు (సమయమునకు అన్యోన్యము చేసికొను-ఒడఁబాటునకు) పేరు

దిట్టము — ఇది నిర్ణయమునకు (నిశ్చయమునకు) పేరు

బవిరి బమ్మెర— ఇవి భ్రాంతికి (భ్రమకు మిథ్యాజ్ఞానమునకు ఒకవస్తువును మఱియొకవస్తువుఁ గా అనుకొనుటకు) పేర్లు

పంతము పద్దు ప్రతిన— ఇవి ప్రతిజ్ఞకు (ఏదేనీ యొకపనిని దృఢము గా చేసెద నని చెప్పుటకు) పేర్లు

విన్నాణము నేరుపు— ఇవి విజ్ఞానమునకు (శాస్త్రాదులయందలిజ్ఞానమునకు) పేర్లు

ఎఱుఁగమి— ఇది అజ్ఞానమునకు పేరు

పంతము — పంత మైనను గా నిమ్ము పార్థివేంద్ర యుక్తులను విగ్రహస్థాన మొదవెనేని అమ్మ దెచ్చిన విద్వాంసుఁ డనఁగ వలవ దెట్లు గావింపవలయు న న్నట్ల చేయు (ఆము 4 ఆ ౬౪) ఇచ్చట ప్రతిజ్ఞ యను- ఈయర్థము చాలసమంజస మనిపించు చున్నది వేదవ్యా ఇ ట్లనుట లేదు

విన్నాణము — విజ్ఞానము' అన గా నేరుపు ప్రావీణ్యము అని బ్రౌ (చూ అను) విజ్ఞానము అనఁగా వానివానియందలివిశేషజ్ఞానము దానివలనఁ గలుగునదియే నేర్పు కార్యకారణముల కభేద మొసర్చి ఆయు ర్వే ష్కృత మ్మనునట్లు ఈయర్థము చెప్పు ప్రయోగములు సంగతము లన వలయును ప్రయోగము లిట్టియర్థమును వచించు చున్నవి- బహువర్ణంబులు బ్రహ్మ తొల్లి జగ ముత్పాదింప విన్నాణి గాక (భాగ 2స్క-౦ 19) ఇచ్చట శ ర విన్నాణి- నేర్పరి (కాశ) అని అర్థ మను చున్నది. ఇట- (విన్నాణ + ఇ) ఆగమవిజ్ఞానము కలవాఁడు గాక అనుటయు సంగతమే విజ్ఞాని కి వికృ విన్నాణి ధాతా యథాపూర్వ మకల్పయత్ అవిక్రుతి ఖిలము లై న యాగమములను పరమేశ్వర ప్రసాదమునఁ బొంది హిరణ్యగర్భు డు సృష్టి జరపుట ఆగమప్రసిద్ధము చిత్తం బూరక కలఁచెదు నెత్తము నాతోడ నాడ నేరుపు గలదే? (ఉ హరి 3 16) ఇట నేరుపు- ద్యూతశాస్త్రమందలి విజ్ఞానము' అనుట సమంజసము కాకపోదు విన్నాణి' శబ్దము సంన్యాసిపరము గాఁ గూడ ప్రయుక్తము- వేదవిదునిచేత విన్నాణిచేతను దపసిచేతఁ బిన్నదానిచేత రాయబారిచేత రాయసుంకరులచేఁ గూలి పుచ్చుకొనుట

చాలఁ దప్పు (విజ్ఞా ప్రా కాం 87) న శ్రోత్రియే ప్రవ్రజితే న యజ్ఞే అని(సం) (చూ శ ర సూ ని) ఇచ్చటి విన్నాణ శబ్దము ఉపనిషదాద్యాగమజ్ఞానమును వచిం చును అది కలవాఁడు విన్నాణి (సంన్యాసి) అన వచ్చును మంజులము' అనునర్థము గూడ దీనికిఁ గలదు నాణెంబు సౌరు విన్నాణంబు తిన్నన నెసంగు ననెడుపేళ్ల తగు మంజులమునకు' (సాంబ మాన 39) దీనికిది అర్థాంతరము.

అజ్ఞానము — అథా ఽజ్ఞాన మవిద్యా ఽహంమతి స్త్రియామ్ అని (అమ)

అద్భుతమిహిరభూష — దివ్య మగు సూర్యభూషణము గలవాఁడా వికర్త నార్క-మార్తాణ్డ మిహి రారుణ పూషణ అని (అమ) చంద్రసూర్యరూపము లగు- ఆభర ణము లను తలను ధరింపఁ బడుట వను ఇట్లు వర్ణించినది- జవరాలినెఱవేణి

చెలువవేనలి చిమ్మచీకటిఁ గికురింపఁ జంద్రసూర్యుల నుంచెఁ జామ యొర్తు'

(5ఆ 1 5)

తారకాణ — ప్రమాణము దృష్టాంతము నిశ్చయము' అని (సూ ని) తారాక్కాణ మనఁగ నిదర్శనంబు' (56) అని (ఆం శే)

తరకటింపు — తరకటించు' అ క్రి (సం. తర్కః ప్రా తక్కః) తర్కించు తనశిరః కోటీరతపనీయమయరుచుల్ తపనాంశురేఖతోఁ దరకటింప (ఇందు 5 46) ఇట ఔపమ్యద్యోతకము' తరగలింప ముద్రి అని (సూ ని)

పస — అమరము (గురు ప్రతి) ప్రక్షిప్త పాఠము గా 'సమౌ నంకేత సమయౌ ప్రతిపత్తి ర్విహ స్తథా అని ఉదాహరించు చున్నది ఇట (సమౌ ప్రతిపత్తి శ్శిత స్తథా అని ఉండవలయు ననిపించు చున్నది దీని నాధారము గాఁ గొనియే ఆం భా కర్త పరఁగు సంకేతంబుఁ బస యనంగ అని వచించినట్లు కాన్పించు చున్నది సూ ని బస- సంకేతము అని ఈ ఆం భా ఉదాహరించినది బస కు ప్రసక్తి కాన్పింపదు ఇది పస యగు ననిపించినది

సీ ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు
మేకోలు సమకోలు మేము దొడఁబ
దీక యొడఁబా టనుట కనుపట్టుచు నుండు
నమ్మతిపేరు గోచరము వెలయు

నగ్గ మంచన గను నగపా టనంగను
గోచరత్వంబు గాఁ దోఁచి యుండు
నొగ రన దొగ రనఁ దగును గషాయంబు
చనుఁ దీపు తియ్యన యన మధురము

గీ. లవణ ము ప్పుప్పన యనఁ జెలంగు గాటు
కార మొ ట్టొట్టన యనంగఁ గటువు వెలయు
నమరుఁ దిక్తము చేఁ దన నామ్ల మొప్పుఁ
బులుసు పుల్లన యన మాతృభూతలింగ 104

ఇయ్యకోలు ఒప్పికోలు ఈకోలు మైకోలు మేకోలు సమకోలు మేముడు
జడ బడిక ఒడఁబాటు —ఇవి సమ్మతికి (అంగీకారమునకు) పేర్లు
అగ్గము—ఇది గోచరమునకు (కన బడుదానికి) పేరు
అగపాటు—ఇది గోచరత్వమునకు (కనఁబడుటకు) పేరు
ఒగరు తొగర—ఇవి కషాయమునకు పేర్లు
తీపు, తియ్యన—ఇవి మధురమునకు(తీపికి) పేర్లు
ఉప్పు ఉప్పన—ఇవి లవణమునకు పేర్లు
గాటు కారము ఒట్టు ఒట్టన—ఇవి కటువునకు పేర్లు
చేఁదు—ఇది తిక్తమునకు పేరు
పులుసు పుల్లన—ఇవి ఆమ్లమునకు పేర్లు

క. ఉప్పిఁడి యనఁ జప్పిడి యనఁ
జప్పన యన నలవణాఖ్య చను రసనామం
బొప్పుఁ జవి చవు రనంగ గ
కుప్పాలకభావ్యదేహ గోపతివాహా 05

ఉప్పిఁడి చప్పిడి, చప్పన— ఇవి అలవణమునకు (ఉప్పు లేనిదానికి) పేర్లు

చవి చవురు—ఇవి రసమునకు (రుచికి) పేర్లు

ఉప్పిఁడి —(ఉప్పు + ఇఁడి) ముక్కు లోనగు వానికిం దదభావద్యోతకం బయి మతుబర్థం బునం దిఁడివర్ణకం బగు (బాలవ్యా తద్ధి 24)

చప్పిడి —(చప్పన + ఇడి) చప్పనిది ప్రౌ వ్యా తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థం బునం దిడివర్ణకం బగు (తద్ధి 8) ఈసూత్రమునందు చప్పన కూడ చేర వలసి యున్నది

రసము — రుచి రసో గన్ధరసే స్వాదే తిక్తాదౌ విషరాగయోః శృంగారాదౌ ద్రవే వీర్యే దేహధాతౌ చ పారదే' (విశ్వ)

కకుప్పాలకుఁడు(కకుబ్ + పాలకుఁడు) దిక్పతి- ఈశానుఁడు

ఆ కంపు గబ్బు గవులు గందంబు వల పన
గంధ మొప్పు సురభి కమ్మన యన
నడరుఁ దావి యనఁగ నామోద మై తోఁచుఁ
గలుము నాఁగఁ గలుషగంధ మభవ 106

కంపు గబ్బు గవులు గందము వలపు—ఇవి గంధమునకు (వాసనకు) పేర్లు

కమ్మన—ఇది సురభికి (ఇష్టగంధమునకు ఇం పైన వాసనకు) పేరు

తావి—ఇది ఆమోదమునకు (సువాసనకు) పేరు

కలుము—ఇది కలుషగంధమునకు (ముఱికివాసనకు) పేరు

గవులు —గౌలు (రూపాం) 'లేఁగ పులితండము నెత్తుటి గౌలుకై హాళా హాళి మెయి రాఁగ' (సారం 3 117) (చూ సూ ని) మూడువేళలఁ బురువులఁ దోఁడి వేసి నీళ్లచే గౌలు వోవంగ నెమ్మిఁ గడిగి (భల్లా 2 ఆ) మొ (చూ శ ర సూ ని) (వీనికి దుర్గంధ మనునది (అర్థాం)

వలపు —వల్పు (రూపాం) నులివాడు నా చు వల్లుల గొం తొగర్చి లేఁ బొలవల్పు గాలి వేపోక నెఱిఁగి (ఆము 2.58) (చూ సూ ని) (వల్పుగాలి అనియే వేద ఆము.పా)

సురభి — సురభి ర్ఘ్రాణతర్పణః ఇష్టగన్ధ సుగన్ధి స్స్యాత్ - అని (అమ) ఇట గురు ఇం పైన వాసన గల వస్తువులపేళ్లు అని వ్యాఖ్యానించినది సుధ- చత్వారి ఇష్టగన్ధస్య' అను చున్నది- సుగన్ధి స్స్యా దిష్టగన్ధే త్రిషు క్షీరే నపుంసకమ్' అని విఘంట్వంతరమును గూడ ఉదాహరించినది ఈ వ్యాఖ్యానమే ఆం ధా కు సమ్మత మని పించినది

ఆమోదము —(విమర్దోత్థే పరిమలో గన్ధే జనమనోహరే) ఆమోద స్సో ఒతినిర్హారీ అని అమ ఇట సుధ - సః పరిమలో ఒతినిర్హారీ అత్యన్తమనోహర శ్చేత్ ఆ-సమన్తా న్మోదయతి ఇ త్యామోదః అని ఏకం సుగన్ధస్య అను చున్నది ఆమోదో గన్ధహర్షయోః అని కోశాంతరమును గూడ ప్రదర్శించినది గురు - ఆమోదశబ్దము మిక్కిలి దూరము గా వ్యాపించునట్టి యాపరిమలముపేరు అని సుగంధముపేరు అని వివరించినది పరిమలము అనుదానికి నానాద్రవ్యములు మేదుపుటవలనఁ బుట్టి జనమనోహర మైన గంధము అని అర్థము చెప్పినది సూ ని శ ర లు దీనినే సంగ్రహించి దూరము గా వ్యాపించెడుపరిమళము పరిమళము అనినవి ఆమోదొ హర్షసౌగన్ధ్యే అని (వైజ త్ర్యక్ష 7) విమ ర్దోత్థే-అనుదానికి సురతాదివిమర్దోత్థే మాల్యాది గన్ధే ఘర్షణాసముద్భవే చన్దనాదిగన్ధే చ జనానాం మనోహరే పరిమలః - అనినది (సుధ)

కమ్మనే తావి — వీనివి గంధసామాన్యార్థకము లను చున్నవి ఆం సం మొ వాసనకు నాళ్ళ లై యొప్పు వలపు కంపు తావి కమ్మన యనఁగ (ఆం సం స్థా 29) కడి వలపు తావి కమ్మన గం పనంగ గంధ మలరును (వేంక మాన 75) చెమటచే జాఱిన చికిలికస్తురిబొట్టు ఘుమఘుమ తావుల గ్రుమ్మరింప (తారా 3 9) మొ. ఇది వీనికి (అర్థాం)

కలుషము — కలుషం త్వావి లైనసోః' అని (విశ్వ)

ఆ వెగటు వేదు నాఁగ వికటగంధం బొప్పుఁ
బుస్తు బూఁజు నాఁగఁ బూతిగంధ
మలరు గదురు నాఁగ నగును విస్రాఖ్య యై
మహితగుణ సమేత మాతృ భూత 107

వెగటు వేదు—ఇవి వికటగంధమునకు (భరింపరాని వాసనకు) పేర్లు
పుస్తు బూఁజు—ఇవి దుర్గంధమునకు (దుర్వాసనకు) పేర్లు
గదురు—ఇది విస్రమునకు (పచ్చిమాంసము లో నగువాని వాసనకు) పేరు

బూ జు —దీనికి శ ర త్రౌ లు ఈయర్థ మిచ్చుట లేదు ఎండ సోఁకమిచే తడివస్తువుల మీఁదఁ గలుగు కొంచెము మాసిన తెలుపు అని మాత్రము దీని కర్థ మను చున్నవి పుస్తు కు దుర్గంధము అనెడి యర్థము ప్రయోగ దృష్టము అదె వచ్చె నడపీనుఁగనుచు నంతంత గదియుచు మైపుస్తుకంపున కెడసి తొల గుచుఁ బురజనుల్ తుప్పున నుమియ (హరిశ్చ ౨ఆ ) (చూ శ ర ) పుస్తు తో ఏకార్థకమే బూఁజు దుర్వాసన అనునది దీనికి సాదృశ్యలక్షణచే నైన-అర్థము దానినే ఇచ్చినది (ఆం భా ) వ్యవహార దృష్టము లై సువిదితము లగు వాని కెక్కుడు గా ప్రయత్నపడక గ్రాంథికము లైన విశేషార్థముల సంగ్రహించుటయందే ఆం భా దృష్టి కేంద్రీకృత మైన దని యేతన్నిఘంటుపరిశీలనమున మన కెఱుకపడును అట్టివి ఈతఁడు వదలినవి చాలఁ గలవు ఆం సం మొ వానిని సంగ్రహింపఁ గొంత ప్రయత్నించిన వనవచ్చును తావి- మొ ఇందుల కు విదర్శనములు అదిగాక అమరమట్లు భాష కొక సంపూర్ణత కొని రావలయు నని ఈతని ప్రయత్నము అందులకే కొన్నిపట్టుల తగినంత గ్రంథపరిశీలనము కావలసినంతప్రయోగవిజ్ఞానము లేనిమనకు ఈతఁ డిచ్చినయర్థములు ఒక్కొకచో సంభావ్యములా అనికూడ అనిపించును

గదురు — ఇట విస్రం స్యా దామగన్ధి యత్ అని అమ సూ ని దీనికి ‘విఱ విస్రము పచ్చివాసనగలది అని ఈ ఆం భా ఇందులకు ప్రమాణ మనినది ఆమః అపక్వ మల తస్యేవగన్ధో ఽస్మి న్న స్తీతి ఆమగన్ధి అని వ్యాఖ్యానించి “అపక్వ మైనమాంసాదులగంధముపేళ్లు అని గురు ఇది యిట్లే పూతిగన్ధి లో నగువానిని గూడ వ్యాఖ్యానించి ఉండవలసినది అట్లుగాక దుర్గంధము గలవస్తువులు అనురీతిని అర్థ మనుట ఉచిత మనిపింపదు సుధ-గంధపరములఁగానే అన్నిచోట్ల ఏకముఖము గా వీనిని సముచిత మగురీతిని వ్యాఖ్యానించినది ఇష్టగన్ధ స్సుగన్ధి స్స్యాత్ అనుచోఁగూడ గన్ధవద్ద్రవ్యపరము గా వ్యాఖ్యానించుట ప్రమాద మనిపించును ఇట్టిచో సూ ని ఆం భా ను ఉదాహరించి విఱ అని ఎందులకు దీని నను చున్నదో ఇందుల కేమిప్రమాణమో యెఱుకపడదు సుధ అపక్వమాంసాదిగన్ధస్య అని విస్పష్టము గా అను చున్నది

వేదు —ఇది (సాధారణ)గంధవాచకము గూడ ఆదంద జడలదండను వే దండ జెలంగఁ జెరివి వేదండగతిఁగా వే దండము చే వీచుచు నాదండధరారి బొలె నాడుచు వచ్చెఁగా (విపు )(చూ శర ) గంధ విశేషమును గంధ మనుట గ్రామైకదేశాదులయందు గ్రామత్వాదివ్యవహారము జరపి గ్రామో దగ్ధ ఃటో దగ్ధ అనుటవంటిది ఇట్టివి అర్థాంతరము లన దగినవి కావు అను చున్నారు స్పష్టప్రతిపత్త్యైకై నిఘంటుకర్తలు

సీ వన్నె వన్నియ యన వర్ణంబు విలసిల్లుఁ
దెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల
వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు
చామనచాయ నా శ్యామ మొప్పుఁ
గఱి కట్టి కాఱియ కఱియ నల్లన నల్పు
కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణ
వర్ణంబు పచ్చన పచ్చ పసిమి నాఁగఁ
బీతవర్ణం బగు వెలయు నశఁది

గీ యన హరిద్రాభ పాటలాఖ్యలు చెలంగు
బల్లె యనఁ బన్నె యనఁగను బయ్యె యనఁగఁ
గావి జా జెఱ్ఱన యెఱుపు జేవురు తొవ
రనఁగ రక్తాఖ్య వెలయు సూర్యావతంస 08

వన్నె వన్నియ—ఇవి వర్ణమునకు పేర్లు

తెలి, తెల్ల తెల్లన తెలుపు వెల్ల వెల్లన వెలి—ఇవి శుక్లమునకు (ధవలవర్ణమునకు తెల్లవన్నెకు) పేర్లు

చామనచాయ—ఇది శ్యామమునకు (కృష్ణనీలమునకు మేచకమునకు మబ్బువన్నెకు) పేరు

కఱి కట్టి, కాఱియ కఱియ నల్లన నల్పు కప్పు కందు—ఇవి కృష్ణవర్ణమునకు (కాటుకవంటినల్లనినలుపువన్నెకు) పేర్లు

పచ్చన పచ్చ పసిమి —ఇవి పీతవర్ణమునకు (ఆకుపచ్చవన్నెకు హరితవర్ణమునకు) పేర్లు

అరఁది—ఇది హరిద్రాభకు (పసుపుపచ్చనివన్నెకు) పేరు

పల్ల పన్నె పయ్య—ఇవి పాటలమునకు (తెలుపు ఎక్కువ గా ఉన్న యెఱుపు వన్నెకు) పేర్లు

కావి జాజు ఎఱ్ఱన ఎఱుపు జేవురు తొవరు— ఇవి రక్తమునకు (కెంజాయకు కెంపువంటి యెఱుపువన్నెకు) పేర్లు

చామనచాయ —సూ ని దీనికి శ్యామవర్ణము ఆకుపచ్చ అని అర్థ మిచ్చి అందులకు ఆం భా ప్రమాణ మను చున్నది 2 కృష్ణవర్ణము నలుపు ఇచ్చి 'నీలమేఘముడాలు డీలు సేయ గ జాలఁ మెఱు గు జామనచాయమేనికోడ (మనుచ 6 0) అను ప్రయోగ ముదాహరించినది ఇది ప్రమాదము శ్యామ శబ్దమునకు కృష్ణనీలము (మేచకము) అనునర్థముగూడ గలదు శ్యామ స్స్యా న్మేచకే అని (విశ్వ) మేచకః కృష్ణనీల స్స్యా దతసీపుష్పసంనిభ అని (శబ్దార్ణవము) (చూ సుధ) ఈకృష్ణనీలమే(మేఘచ్ఛాయయే) ఇచ్చటి ఆం భా లోని శ్యామము నకు శ్యామవర్ణ మమరుఁ జామనచాయ యన గ (వేంక స్థా 85) లోని శ్యామము నకు అర్థము సూ ని ఇచ్చిన మను చ ప్రయోగము ఆం భా కే చక్కనియుదాహరణము ఈఆం భా పద్యము నంతను బాగుగా సమన్వయించుటకు చాలపరిశీలన మావశ్యక మైనది ఈపరిశోధనముచే వేంకనార్యుని నిఘంటుపరిజ్ఞాన మనన్యాదృశ మని తెలియ నైనది

పీతవర్ణము —(ఆకుపచ్చవన్నె) పీతం పీతే హరిద్రాభే అని (నానా) హరిద్రాభే ఎతే అనుటవలన- ఆకుపచ్చనివన్నె కు గూడ ఎత శబ్దము వాచక మనుట తెలిపినది ఈ నిఘంటువు కనుకనే టీక ఎత ఇది ఆకుపచ్చకును పసుపువర్ణమునకును పే రగునపుడు-న అని వ్యాఖ్యానించినది పీతపర్యాయములలో పసిమి ఒకటి దీనికి ఆకుపచ్చన -అనునర్థము ప్రయోగములలో విస్పష్టము గా కానవచ్చు చున్నది పసిమి హెచ్చిన పచ్చికపస నడంచి మసృణహరిదశ్వహరికాంతిమహిమ నొంచి పసరుచాయలకసుగాయ లెసకమెస గె (ఉ రా 6 4) (కలా 3 9) మొ (చూ సూ ని పసిమి)

అళఁది — అళిది -వావి పా (సం హరిద్రా ప్రా హలిద్దా క అళ ది హళ ది) పసుపు రంగు ఒకయెడ దెలు పొకయెడ నలు పొకయెడ నళ ది వగ యొలుపు నొకయెడ నెఱుపుగా బ్రకటింపుచు సకలాశా నికురుంబంబునకు మేదినీరజ మెసఁగెగా (రామా 7 278 ఆం భా 08 ఆం సం స్థా 6 ) అను చున్నది సూ వి (రూపాం హళఁది ) పట్టుతలాడయుగా హళఁది పచ్చనునుంబలుపు (పాంచా 5 0 ) మొ ) (చూ సూ వి ) బాలవ్యా హాదులయు నీలుఁగు లో నగువానితొలిహల్లు నకు లోపంబు బహుళంబు గా నగు (ప్రకీ 0 సూ ) అని హాదిగణమునందు హ ల ది అలఁది ఉదాహరించినది సూ వి శ ర లు అళఁది గానే గ్రహించినవి వేంక ఇట హరిద్ర వర్ణ మొప్పు నలిది వసుపుచాయ యనఁగ (స్థా 85 ) అను చున్నది ఆం సం (రామా అండ్ కో 924 ప్రతి) కూడ ఒకటి అళిది అనుచు చున్నది బ్రౌ ఆం భా 2 50 లో హళిది అని ఆం. భా పారము గా ఇచ్చు చున్న ది ఐనను వావి బ్రౌ పా పై ప్రమాణముల బట్టి ఉపేక్షిత మైనది

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గను ధీవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 109

[చూ వ్యాఖ్యకై స్వర్గ 68 ]

ఇది

ధీవర్గము

---

# వాగ్వర్గము

తే వాకు నా భాష యౌ నఱవమ్ము తెనుఁగు
కన్నడం బన మఱి యిట్లు కొన్ని దేశ
భాష లై యొప్పుఁ గఱద నాఁ బలుకు నాఁగఁ
బొల్చు భాషిత మై మాతృభూతలింగ 10

వాకు—ఇది భాషకు (దేశభాషకు) పేరు [అఱవము తెనుఁగు కన్నడము- దేశభాషలు ఇట్టివి మఱికొన్ని దేశభాషలును గలవు ]

కఱద పలుకు—ఇవి భాషితమునకు (మాటాడుకొనుమాటకు) పేర్లు

వాగ్వర్గము — అమరము వాగధిష్ఠానదేవత యగుసరస్వతినామములతో ఈ వర్గము నారంభించినది స్వర్గవర్గమున విష్ణునామాదులకడ లక్ష్మ్యాదులనామముల వచించియు, బ్రహ్మనామములకడ సరస్వతినామముల వచింపక వదలినది ఆం భా కర్త స్వర్గవర్గము నందే లక్ష్మ్యాదినామములట్లు సరస్వతినామముల గూడ వచించినాఁడు (చూ 42) అందులకే ఇట వానిని వదలి వాకు ను పేర్కొనుచు ఈవర్గ మారంభించి వాగ్వర్గ మనుట అర్థవంత మొనర్చినాఁడు బ్రాహ్మీ తు భారతీ భాషా అను-అమరమును వ్యాఖ్యాత లందఱు సరస్వతినామము లఁ బేర్కొను చున్నట్లే వ్యాఖ్యానించు చున్నారు సుధావ్యాఖ్యతోడి-అమరము- వాగ్వర్గము శబ్దాదివర్గము' అనువిభాగమును పాటింపక ఈరెంటినిఁ గలపి శబ్దాదివర్గము అనియే వ్యవహరించినది. గురు అమరము రెండును వే ఱనినది ఆం భా గురు (అమరము) ను అనుసరించి రెండును వే ఱను చున్నది

వాకు — (సం వాక్) వాకు (ఛూపాం.) సర్వలక్షణసారసంగ్రహము తత్సమప్రకరణమున- వాక్పదంబున కగువాకు వాక్కు- అను చున్నది ఇట్లే- అలరఁగ భూదివ్

శబ్దం బుల ఘవి దివి యనగ బరగు అనియు అను చున్న ది ఇతరలక్షణము లను వీనిని తత్సమములను గానే నిర్వచించినవి (చూ బాలవ్యా తత్స 69 84మొ ) దీవిని భాష - అనునర్థమున నైన వికృతి పదము గా ఈతఁ దభిప్రాయపడు చున్నా డు ఈత దేకాక అచ్చతెలు గు నిఘంటుకర్త లు కొందఱు కొన్నితత్సమములను తెలు గుపదములుగా ఉదాహరించు చున్నారు- వేడుక సంతోస మింపు ముదము (సాంబ మాన 22 ) దివి మొయిలుదారి చుక్కలతెరువు బయలు గాడ్పుతం డ్రన నభ మొప్పు (ఆం సం దేవ 3 ) మొ 'దివి కద శ ర ఇ ట్లను చున్నది ఆధునికకవులు కొందఱు దీనిని వైకృతముఁ గా వాడి యున్నారు అవి మహాకవుల ప్రయోగము లేవో అచ్చతెలు గు లనవలసినవి ఆం భా కర్తకు లభించియుండుటవలననే ఈ తత్సమములను ( వాకు వంటివానిని) ఈత డు తెలు గులుగా గ్రహించి ఉండును దివి ముదము వంటి- ఆధునికకవిప్రయోగముల నీత డు గ్రహింప లేదు అట్టివానిని గ్రహించునవి ఆం'సం మొద లగునవియే

కఱద — మాయమాటలు అనియు దీనికి అర్థము కలదు ఈ ఒర్థము నం దిది (బ ) ఎఱు గుదు తథ్య మింతయు మహీసురవర్య మతిప్రకాశతం గఱదలు మావి ఖైప్పుము ఖగత్వము నేమినిమిత్త మొంది తీ వు' (పద్మ 4 6 ) (చూ సూ ని )

భాషితము— భాషితం వచనం వచ అని (అమ )

సీ నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు
నొడి నొడికారము నొడుగు నాఁగఁ
బద మొప్పు మా టన వాక్య మై యెసఁగు వా
కొనుట యం చనఁగ వాక్రుచ్చుట యన
వచనంబు విలసిల్లుఁ బలుకరింత యనంగ
వాచనసంజ్ఞ యై వఱలు చుండు
మినుకు నాఁగను సూక్తి దనరును జదువు నా
విద్యాభిధానంబు వెలయు చుండుఁ

గీ బ్రాఁజదువు ప్రామినుకు నాఁగఁ బరఁగు వేద
మట్ల మనఁ గాండసంజ్ఞ యై యలరు చుండుఁ

బన్న మనఁ బ్రశ్న మై యంతగుఁ బనస యనఁగఁ
బొల్చును దదంశ మై, మాతృభూతలింగ

నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు నొడి నొడికారము నొడుగు — ఇవి పదమునకు(శబ్దమునకు వాచకమునకు సాధుశబ్దమునకు) పేర్లు

మాట — ఇది వాక్యమునకు (పదసమూహమునకు) పేరు

వాకొనుట వాక్రుచ్చుట — ఇవి వచనమునకు(చెప్పుటకు) పేర్లు

పలుకరింత — ఇది వాచనమునకు(పలుకరింపునకు మాట లాడించుటకు) పేరు

మినుకు — ఇది సూక్తికి(సువచనమునకు మంచిమాటకు) పేరు

చదువు — ఇది విద్యకు పేరు

ప్రాఁజదువు ప్రామినుకు — ఇవి వేదమునకు పేర్లు

అట్ఠము — ఇది వేదములోనికాండమునకు(ఎనిమిదిపన్నములు గలవేదభాగమునకు) పేరు

పన్నము — ఇది (వేదములోని)ప్రశ్నమునకు(అట్ఠములోనియెనిమిదవభాగమునకు) పేరు

పనస — ఇది ప్రశ్నములోని అంశమునకు (భాగమునకు) (ఏఁబదిపదములు గల వేదభాగమునకు) పేరు

పదము — శాస్త్రే శబ్దస్తు వాచక అని (అమ) ఇట శాస్త్రే-వ్యాకరణాదౌ యో వాచకః-సాధు శబ్దః స ఏవ నిరుపపదేన శబ్ద శబ్దేన వ్యవహ్రియతే అని సుధ పద మనునది వాచక మనుటకే పర్యాయము అపదం న ప్రయుఞ్జీత అని (మహా భాష్యము) శబ్ద శబ్దమునకు పద మను అర్థము కలదు పదం స్థానే శరె త్రాణే పాదాఙ్కే- పాదచిహ్నయోః శబ్దే ఽంశే వస్తు వాక్యేషు అని (వైజ ద్వ్యన) అం భా కర్త అమ లోని శబ్ద మునే ఇట పద మనినాఁడు సుప్తిఙన్తంపదమ్ ( 4 4 )అని పాణినీయము

వాక్యము — తిఙ్సుబన్తచయో వాక్యం క్రియా వా కారకాన్వితా అని (అమ) తిఙన్త చయము సుబన్తచయము తిఙ్సుబన్తచయము అని అర్థము గురు — తిఙ్సుబన్తచ యము అనునది మహావాక్యమునకు క్రియా వా కారకాన్వితా అనునది అవాన్తరవాక్య మునకు లక్షణ మను చున్నది ఏకతిఙ్ వాక్యమ్ అని సం వైయాకరణులు వివరణ మునకై (చూ మఞ్జూష-మొ)

వచనము — వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః అమ భాషణస్య అ సుధ మాటాడుటపేళ్ల అని (గురు)

వాచనసంజ్ఞ — వాచకసంజ్ఞయై వావి అపపా (పలుకరింత-మాటాడుట అని శ ర ప్రమాణ మీయ లేదు పల్కరింత (రూపాం) నయగారపుఁదమిఁ గపట ప్రియమ్ము/ మెఱమెచ్చుఁబల్కరింతను మిథ్యా చయములను బైపచారపు నయమున ముని గ్నా/ కొన్నినాళ్ల రమింపగా (విప్ర 4 3) (చూ సూ ని)

మినుకు — ననవిల్తు శాస్త్రంపుమినుకు లావర్తించు. పని వెన్నతోఁ బెట్టినది మాకు (సుచ 2 43.) ఈ సందర్భమున సుప్రలాప స్సువచనమ్ అని అమ పతిశ్ర మైనమాటపేళ్ల అని (గురు) శోభన వచనస్య అని సుధ శాస్త్రంపు మిను కులు- శాస్త్రసూక్తులు అనుటయే సముచితము ఆగమసూక్తు లనుట సుప్ర సిద్ధము ఈ మినుకు నకు స్త్రీపర్యాయములు పరములు గా చేరి సరస్వతీ వాచకము లగును మినుకుఁగొమ్మ మినుకుఁజేడియ మొ - ఇట్టివి శశిరేఖఁ గై కొన్న సౌవర్ణ గిరివోలె మినుకుఁ జేడియఁ గూడి మెఱయువాని (పాండు 5 174)

అట్టము — ప్రాకృతసమము (సం అష్టకమ్ ప్రా అట్ట అ) -అని (సూ ని) వై గ్రా అని శ ర అం చింతామణి- ప్రాకృతభవము లగు వికృతి భవములను మువ్వి ధములఁ గా పేర్కొనినది అందు ప్రాకృతసమములు గూడ ఉన్నవి ప్రాకృత భవ సంస్కృతభవ సంస్కృతవత్ప్రాకృతభవ వికృతిభవాః అని ఇట- ప్రాకృత భవవికృత్యాం ప్రాకృత భాషాసమ్బన్ధిన స్త్రివిధా శ్శబ్దా ప్రవిశ స్తీతి ఫలితమ్ అని అహోబలపతి (చూ.హల 1సూ) కనుక సూ ని చెప్పినది ఉచితమే అప్పకవి వీనినిఁ గూర్చి ఇట్లను చున్నాఁడు శవశ రీవి రేవ రావును ధాకయు మొదలు గా ద్వితీయములు చతుర్థ వర్ణములును గలుగువాక్యంబులును స్వదేశ్యములు గాని వైకృతములు గావు'

(అప్ప 2 39) ఉవధారు జిఱిభి వంటి-అనాంధ్రవర్ణపదములు తెలుఁగున త్రోసిరా జన రానివి అట్టము- మొద లగునవి అనింద్యగ్రామ్యము లనుటకంటె జిఱిభి వంటి దేశ్యము లనుటయే సముచిత మని అప్పకవియు అభిప్రాయపడు చున్నాడు

వక్కాణ వక్కణ వైన మనంగను
వ్యాఖ్యానసంజ్ఞ యై వఱలు చుండుఁ
గత యన కథ తోఁచు గాధ యౌ జోలి నాఁ
గబ్బ మనంగను గావ్య మెసఁగుఁ
సందర్భసంజ్ఞ యై చనును గైకట్టన
సమసక, మన సమానంబు చెలఁగు
నానొడి నాఁగను నానుడి నాఁగను
సుబ్బు నాఁగను జనశ్రుతి దనర్పుఁ

బొలుచుఁ దద్భేద మై పొక్కు పోవడి యన
వార్త సుద్ది యనంగను బరఁగు చుండుఁ,
బేరు నా నామ మలరును బిలుపు చీరు
డనఁగ నాహ్వాన మమరు సూర్యావతంస 112

వక్కాణ వక్కణ వైనము—ఇవి వ్యాఖ్యానమునకు (వివరణమునకు) పేర్లు
కత—ఇది కథకు (కావ్యకథకు ప్రబంధమునందలి- ఇతివృత్తము నకు) పేరు
జోలి—ఇది గాధకు (పురావృత్తమునకు పురాణాదులయందలికథకు) పేరు
కబ్బము—ఇది కావ్యమునకు పేరు
కైకట్టు—ఇది సందర్భమునకు (రచనకు కూర్పునకు) పేరు
సమసకము—ఇది సమాసమునకు (అచ్చతెలుఁగుపదములసమాసమునకు) పేరు

నానొడి నానుడి సుబ్బు—ఇవి జనశ్రుతికి (కింవదన్తికి జనులు చెప్పికొనెడి వృత్తాంతమునకు లోకప్రవాదమునకు) పేరు

పొక్కు పోవడి—ఇవి జనశ్రుతిభేదమునకు (కర్ణాకర్ణిక గా ఒకరినుండి ఒకరికి విన వచ్చినవార్తకు) పేర్లు

సుద్ది—ఇది వార్తకు (వృత్తాంతమునకు) పేరు

పేరు—ఇది నామమునకు పేరు

పిలుపు చీరుడు—ఇవి ఆహ్వానమునకు పేర్లు

వ్యాఖ్యానము — ఐదు లక్షణములు కల దిది ఆలక్షణములు ఇవి- పదచ్ఛేద పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పఞ్చలక్షణమ్ (స త సి ప ల సం)

కథ — ప్రబన్ధకల్పనా కథా అని ఇతిహాసః పురావృత్తమ్ అని పురాణం పఞ్చలక్షణమ్ అని ఈసందర్భమున (అమ)- ఇచ్చట ఔపచారికము గా కాదంబర్యాదులే కథాదులకు అర్థములు గా వ్యాఖ్యాతములు కథ జోలి అనువానికి గూడ అట్లే కావ్యవిశేషము పురాణము అర్థ మనిన ఉనవచ్చును వేఱు గా ఈతఁడు వీనిని ఈయర్థమున మరల గ్రహింప కుండుటనుబట్టి గాథాశబ్దసారస్యమునుబట్టి పై రీతిని అర్థ మీయ బడినది

గాథ — గాథా శ్లోక (కే) సంస్కృతాన్యభాషాయాం గేయ వృత్తయో అని (మేది) గాధృ-ప్రతిష్ఠాలిప్సయోః గ్రన్థే చ అని పాణినీయధాతుపాఠము గాథృ ధాతువు ధాతుపారమున లేదు విశ్వాదినిఘంటువులు థాన్తపదమధ్యమున దీనిని పఠించు చున్నవి గాథా వాగ్భేద వృత్తయో (విశ్వ) మొ ప్రమాణ మేమో

జోలి — విను మింకం బెనుజొలిరిత్తచదువుల్ వేయేల (మల్ల శృం 39) (చూ పూని) సారంగధరపద్య మొకటి ఇట్లున్నది వలవదు రా రతి మరునకు వలవదు రా రంభ యక్షవరసూనునకు వలవ దురాశల బెట్ట వలవదు రా వట్టిజాలివార్తలు విడరా (సారం 2 9) జితకాశివ్యాఖ్యాతలపరిశోధనమున నైన దీ జాలి యిట వా రిట్లను చున్నారు శా పా జోలివార్తలు (ఇదియు పూ ము పాఠమే) అర్థ మేమో పూ టీ లో లేదు జాలి వార్తలు అని తంజ పా తంజ పా సరి యైన దని యీక్రింది

పంక్తులు చెప్పు చున్నవి మంచివా డవు నీవు మరవుమీ వట్టి జగజాలిమాటల జరిపెదు ప్రొద్దు (నవనాథ ప్ర 49) జొలివార్తలు-పూర్వకథలలోని వృత్తాంతములు (పురాణము లలోని యమదండనాదిగాథలు) విడరా -వదలిపెట్టు వానిజొలికిపోకు-అని అర్థము ఎందుల కన గా- రతి మరునకు వలచినది రంభ నలకూబరునకు వలచినది వారికి నీ వన్న యమదండనాదు లెవియు కలుగి లేదు (అందులకే)-అని సమన్వయము పూ టీ జొలి-బుద్ధి-అని అర్థము వ్రాసి యున్నది వ్రాయ లే దనుట ఎట్లో నవనాథ చరిత్ర మందు గూడ వ్రాయసకాంద్రచేత బడి జొలి జాలి ఐన దేమో ఆం భా సారం ఆము లను చాలవఱకు ప్రమాణముల గా గొనుచు సాగుట కానవచ్చును ఈ పద్యము నందు దురాశల బెట్టుట అనుటగూడ సముచిత మనిపించుట లేదు దురాశలఁ బెట్టుట అనుదానికి అడియాసలపాలు చెయుట అని టీక దురాశ అత్యాశ అనుటయందు ప్రసిద్ధము దురాశల బెట్టు అత్యాశలు కలుగ జేయు అనునర్థ మిట సరసము గా ఉపపన్నము కాదు సారంగధరు డు చిత్రాంగికి తననీతిబోధలచే దురాశ కలుగఁ జేయుట లేదు విరాశ కలుగఁ జేయు చున్నా డు పరిశీలించిన ప్రకృతసందర్భమునకు విరుద్ధ మిది యనిపించు చున్నది ఇదిగాక నాలుగు పాదములందును వలవదు+రా' అను పదవిభజనమే కవియభిప్రేత మైనట్లు తక్కిన మూ డుపాదములు తెలుపు చున్నవి వలవ దురాశ అని ఈయొక్కచో వచించుట ఉచితము కాదు ఇది గాక వలవదు అనుదానికి రెండుపాదములు రెండుపాదముల కొక్కొకయర్థమే కవి సంపాదింప దల చె ననుటకు మొదటిరెండుపాదములు నిదర్శనములు. ఆకవియుద్దేశము భంగపడు చున్నది ఈవిభజనమువలన అందులకే ఇచ్చట వలవదు రా చలపట్టఁ గ అని ఉండునా? అని యొకయూహ విమర్శకులు సహృదయతతో పరిశీలింతురు గాక ఏ మైనను జొలి పార మిట అర్థ వంత మే

కావ్యము — గద్యపద్యమయీ చమ్పూ స్సారణీ పద్యమాత్రికా శృఙ్గారాద్యధికం కావ్యం సమాసాధ్యం తు దణ్డకమ్ అని (వై జ అన్త శ)

సందర్భము — శ్రన్థనం గ్రన్థనం గుమ్ఫ స్సందర్భో రచనా న నా (వై జ సామా ధర్మ)

సమసకము — (సం సమాసకము) కేవలవికృతిపదై ర్య స్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞా (ఆం చిం హల 46)

సీ. పేర్కొనుట యనంగ వెలయు నామగ్రహ
ణంబు వా దనఁగ వాదంబు చెలఁగు
వావా దనంగను బరఁగు నుపన్యాస
మెత్తు జి త్తనఁగ నిం పెసఁగు యుక్తి
మందట యనఁగను మందలిం పనఁగను
వ్యవహారసంజ్ఞ మై పరఁగు చుండు
జాటువ యనఁగను జను నుదాహరణంబు
తిట్టు నా శాపంబు తేజరిల్లు

గీ. నొట్టు నాఁగను శపథాఖ్య యొప్పు చుండు
దీవన యనంగ నాశీస్సు గా వెలుంగు
నడుగుట యనంగఁ బ్రశ్న మై యలరు చుండు
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ

పేర్కొనుట—ఇది నామగ్రహణమునకు (పేరెత్తుటకు పే రెత్తి పిలుచుటకు) పేరు

వాదు—ఇది వాదమునకు (వాక్కలహమునకు) పేర్లు

వావాదు—ఇది ఉపన్యాసమునకు (వాఙ్ముఖమునకు మాట లాడుట కైన ప్రారంభమునకు) పేరు

ఎత్తు జిత్తు—ఇవి యుక్తికి (ఉపాయమునకు) పేరు

మందట మందలింపు—ఇవి వ్యవహారమునకు (ధనాదినిమిత్త మైనకలహమునకు) పేర్లు

చాటువ—ఇది ఉదాహరణమునకు (దృష్టాంతమునకు) పేరు

తిట్టు—ఇది శాపమునకు పేరు

ఒట్టు—ఇది శపథమునకు (శపనమునకు పుత్త్రాదులను స్పృశించి చేయు ప్రమాణమునకు) పేరు

దీవన —ఇది ఆశీస్సునకు పేరు

అడుగుట—ఇది ప్రశ్నమునకు పేరు

పేర్కొనుట —పేరుకొనుట (రూపాం) పేరుకొని చెప్పె నతని గాంధారి కంత (భార ఆశ్ర 2 34) పేరుపెట్టి పిలుచుట అనునది ఛాయార్థము అమిత సహస్రవర్ష విశదాయుష నన్నిటు లెవ్వ డొకొ్కనా విమలతపంబు గైకొనక వృద్ధత సూతక బాలు — నవజ్ఞ మిగుల నిట్లు పేర్కొనియె సర్వ పితామహుఁ డబ్జసూతియుఁజా సమధికదీర్ఘజీవి యనుశబ్దము వెట్టక పిల్వఁ డెన్నఁడుఁజా (హరి ఉ 9. 04)

వాదు — నిర్ణయఫలకకథావిశేషాదులు శాస్త్రార్థాదులు దీనికి లాక్షణికార్థములు. వాధున గెల్వ లేక పురవైరి అఱాటముతన్ను చూపఁ దాఁ బాదమునందుఁ గన్నుఁ ప్రతిపక్షతఁ జూపెను (ప్రబ - 2) (చూ సూ ని)

ఉపన్యాసము — ఉపన్యాస స్తు వాఙ్ముఖమ్ ఉని అమ వచనోపక్రమస్య అని (సుధ)

వ్యవహారము — వివాదో వ్యవహార స్స్యాత్ అని (అమ)— ఋణాదిన్యాయస్య అని సుధ వ్యాఖ్యానించి వ్యవహారశబ్దార్థము నిట్లు వివరించు చున్నది వి నానార్థే ఉవ సందేహే హరణం హార ఉచ్యతే నానాసందేహ హరణా ద్వ్యవహార ఇతి స్మృతః అని ధనాదినిమిత్త మైనకలహము అని (గురు)

మందట —ప్రయోగము లి ట్లున్నవి మనకు వేల్పులకును మందట లే కుండఁ బంచి పెట్టెద నని పడఁతి పూనె (భాగ 8 32) మనముల సమ్మతించి తమమందట నాస భవారు తీర్చి చెప్పనగతిఁ జేసిరి (నా పంచ 55) సమీపము అని శ ర మఱుమా టన కొసభవారు (ముద్రి పా) (చూ సూ ని) ఈ ప్రయోగములఁబట్టి గురు. చెప్పిన యర్థమే వ్యవహార శబ్దమునకు అం భా అభిప్రేత మిట నగు నని పించినది

ఉదాహరణము — ఉపోద్ఘాతః ఉదాహారః అని అమ ఉదాహారము-ఉదాహరణము పర్యాయములు వక్ష్యమా ణోపయోగ్యర్థ వర్ణనస్య ప్రకృతోపపాదక దృష్టాన్తాదే రి త్యన్యే అని (సుధ)

చాటువ —సూ ని చాటువ-ప్రఖ్యాతి ప్రసిద్ధి - అని ఉదాహరించిన ప్రయోగము లి ట్లున్నవి నాట కాలంకార నైపుణిఁ జాలఁ జాటువ కెక్కిన సత్కవీశ్వరుల్ (నవ

5పు) చాటువ కెక్కినట్టి నెఱజాణతనంబున వాగ్విలాసితఁగా మేటివి నీవు
నిన్ను నుపమింప ద్రిలోకములందు రాజులెవ్వరును లేరు (విక్ర 8 04)
ఇట - చాటువ కెక్కినట్టి=దృష్టాంతము - ఉదాహరణము (మేలు బంతి)గా జన - అను
టయు సంగతమే ప్రసిద్ధికెక్కు- అయినది యిట పర్యవసితార్థము ఆం భా కు చక్కని
యుదాహరణములు కా దగినవే ఇవి యనిపించుచున్నవి సూ ని ఇట ఉం భా
చాటువ వే అనుట యుక్త మనిపించుట లేదు

శాపము — శపనము శాపము శపథము పర్యాయములు శాప శ్శపథ ఆక్రోశే అని
(విశ్వ) శపనం శపథ పుమాఁగా ఉమ (సుతస్పర్శాదినా శపథకరణస్య) అని
(సుధ) శపథ కార ఆక్రోశే శపనే చ సుతాదిభి అని హైమ ము (చూ సుధ)
తిట్టు — వే టకతన గాదె వెఱవెల్ల గోల్పోయి తలిసితిట్టు గుడిచె దశరథుండు (రంతీ
4 44) మొ (మా సూ ని)

సీ మాఱుమా టనఁగను మఱుమాట యనఁగను
బదులుమా టనఁ బ్రతివాక్య మొప్పు
మిథ్యాభియోగంబు మీఱును వళు కనఁ
బొలుచుఁ బ్రణాదంబు బొబ్బరింత
యనఁగ బొబ్బెట్టు నా గను బొబ్బ యనఁగను
యశము విరాజిల్లు నస మనంగ
నగ్గింపనం గొనియాడుట యన గను
గైవార మనఁగఁ బొగడ్త యనఁగ
గీ బొగడిత యనంగఁ బొగడు నాఁ బొగడిక యన
మెప్పు నా మెచ్చు నా గను మీఱు వినుతి
గోసన యనంగ గోసు నా ఘోషణ మగు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 4

మాఱుమాట మఱుమాట బదులుమాట—ఇవి ప్రతివాక్యమునకు (ప్రతివచనము
నకు ప్రత్యుత్తరమునకు) పేర్లు

వణకు—ఇది మిథ్యాభియోగమునకు(కారణము లేనితగవునకు) పేరు

బొబ్బరింత బొబ్బెట్టు బొబ్బ—ఇవి ప్రణాదమునకు (ప్రీతివిశేషముచే కలుగు-కంఠాదులపెద్దధ్వనికి) పేర్లు

అసము—ఇది యశమునకు (కీర్తికి ఖ్యాతికి) పేరు

అగ్గింపు కొనియాడుట కైవారము పొగడ్త పొగడిత పొగడు పొగడిక మెప్పు మెచ్చు—ఇవి వినుతికి (స్తుతికి స్తోత్రమునకు) పేర్లు

గొసన గోసు—ఇవి ఘోషణమునకు (చాటింపునకు) పేర్లు

ప్రణాదము —(అథ మిథ్యా ఽభిశంసనమ్ అభిశాపః) ప్రణాద స్తు శబ్ద స్స్యా దనురాగజ అని(అమ) విష్నోరో ధనుష స్స్వనో భూషాదీనాం తు శిఞ్జితమ్ ప్రణాద స్త్వనురాగోత్థః చిత్కృతం స్యన్దనధ్వనౌ అని (వైజ అన్త శ). ప్రీతివిశేషజనితస్య ముఖకణ్ఠాదిశబ్దస్య అని పై అమరమును వ్యాఖ్యానించినది సుధ ప్రణాద శబ్దమునకు బిగ్గర గా ఏడుచుటయు అర్థమే ప్రణాద స్త్వారశబ్దే స్యాత్ అని (విశ్వ). ఐనను ఇచ్చట చాలవఱకు అమరము ననుసరించుచు వచించు చున్న ఆం ఛా ధోరణిని బట్టి అమరము చెప్పినయర్థమే ప్రణాద శబ్దమునకు వచించుట ఉచిత మనిపించినది ప్రయోగ మొకటి ఇట్లున్నది బొ బ్బలు నార్పుల్ పటుసింహనాదములు నుత్పాదిల్ల ధాత్రీస్థలిఙా (భీమ 4 9) వీరులపెద్దయఱపును (సింహనాదమును) అర్పు బొబ్బ యనంగ నగు సింహనాదంబు (2- 223) అని వేఱు గా వచించియే ఉన్నది ఆం ఛా ఇట ఇవి యన్నియు సూక్ష్మభేదముతో సింహనాదమువంటి వై సింహనాదము లనఁ దగినవియే

కైవారము —కియివారము (రూపాం)- వందిజనంబు గ్రమ్మి కియివారముఁ జేయఁగ (ఉ హరివ 4 3) (చూ సూ ని) కైవారము కద సూ ని ఇట్లను చున్నది- కయివారము అనురూపాంతర ముండుటచేతను అచ్చతెనుఁగుగ్రంథములలో నుండుటచేతను సంస్కృతనిఘంటువులలో లేకపోవుటచేతను దీనిని అచ్చికము గా గ్రహించుటయే యుక్తము (అని)

ఘోషణ — ఉచ్చైర్ఘుష్టం తు ఘోషణా అమ ఉచ్చైశ్శబ్దనస్య అని సుధ బెట్టుగా బలుకుట ఏని (గురు)

సీ రట్టు రట్టడి అవ్వ రద్ది ర ద్దుప్పత
　　అంతు గొహారు గోర, పన వెలయు
నాఘోషణసమాఖ్య యాడిక యేవ మీ
　　సడ మీసడింపు తెగడు తెగడిక
యాఱడి యవసడి యగ డారుదూఱు దూ
　　రు దిసంతు సడి రోయి రోఁత తొచ్చు
సేగింపు సెగ్గెము సె గ్గెవగింపు నా
　　నపవాదసంజ్ఞ యై యలరు చుండు

గీ మొట్ట యన మొఱ యనఁగ వాపోక యనఁగఁ
　గూయి నాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పుఁ
　గొసరు కైనా ననులాప మల్లసిలు చుండు
　భూరిభవభంగ శ్రీమాతృ భూతలింగ 115

రట్టు రట్టడి అవ్వ రద్ది రద్దు ఉప్పత అంతు గొహారు గోరప—ఇవి ఆఘోషణమునకు (పెద్దధ్వనికి గట్టిమ్రోఁతకు) పేర్లు

అడిక ఏవము ఈసడము ఈసడింపు తెగడు తెగడిక ఆఱడి అవసడి ఆగడు ఆరుదూఱు దూరు దిసంతు సడి రోయి రోఁత తొచ్చు సేగింపు సెగ్గెము సెగ్గు ఎవగింపు—ఇవి అపవాదమునకు (నింద ) పేర్లు

మొఱ్ఱ మొఱ వాపోక కూయి కూఁత—ఇవి ఆక్రోశమునకు (రక్షణమునకై బిగ్గర గా అఱచుటకు) పేర్లు.

కొసరు—ఇది అనులాపమునకు (ముహుర్భాషణమునకు మాటి మాటికి పలుకుటకు, మఱిమఱి మాటాడుటకు) పేరు

ఉప్పత—ఓర్వలేనితనముచే పరుల సంపత్తు మున్నగువానిని గూర్చి యెక్కువగా చెప్పుట అట్లు స్తుతింపఁబడినవానికి కీడు మూ డు నని ప్రసిద్ధి అని (సూ ని )

ఆరుదూఱు — బొరుమూఱు వావి (అపహా) అహల్యా సంక్రందన మిట్లను చున్నది- మగని నటుంచి మార్మగనివెంబడి జన్న తారకె యిల్లాలితనము తగ్గ వారికెవ్వారికిని లేని యారుదూఱు నీతిలనె వ్రాసెనే ధాత నికృతిచెత (3 48) ఆరు దూఱు అనునవి భిన్న పదములు గా గూడ ఊకవిచె ప్రయుక్తము లైనవి వారక యత్తగారిఁ గనుఁ బ్రామి విజేళ్వలు మోసవుచ్చి యె యారును దూఱు నైన బడి యందఱ కన్ని ఘటించి యాత్మ దా గోరిననాథునిం గలిసి కొల్లలు గా సుఖ మొంద కున్నయా సారస పత్ర నేత్ర యెలజవ్వన మేటికి జన్మ మేటికిన్ (ఒహ 3 33)-(చూ సూ వి) ఆరును బోరును లేని సంసారము ఒవి బ్రౌ

అంతు — ఇది మహాధ్వని అనుటను క్రిందిప్రయోగ మిట్లు వివరించు చున్నది విని యాఅంతు దురంత శైల మథనావిర్భూతి సింధూద్ధత ధ్వనియో కాక మహోదక ప్రలయ సంత్రాసంబులో కాళీ బై కొని కారించెనో యానుదున్నవా మహాకోలాహలోద్వృత్తి కే మి నిమిత్తం బని భర్త లోకభర ణోన్మేషంబు వాటింపఁగాన్ (వసు 2 42)

సెగ్గము — అనియే విషంటువులు గ్రహించినవి అట్లే ప్రయోగముల గూడ నిచ్చినవి. బ్రౌను- సెగ్గె ము గ్రహించి సెగ్గము సె గ్గేవగింపు ఒనియె అం భా వా అని ఉదహరించినది సెగ్గి మే ఇది అనుటకు నిర్ధారకము లేదు

అపవాదము — అపవాద స్తు నిన్దాయా మాజ్ఞా విస్రమ్భయో రపి (చూ సుధ)

అనులాపము — అనులాపో ముహుర్భాషా అని (ఒమ) ఇట వారం వారం భాషణస్య ఒని (సుధ) మాటి మాటికి జెప్పెడి మాట అని (శ ర) చెప్పిన మాటే చెప్ప డము ఒని బ్రౌ

కొసరు — మనుచ ప్రయోగ మొకటి ఇట్లున్నది ధవుఁ గూర్మి కొసరు చున్నవివోలె ముఖరాశీ వనరుహాస్యముల బద్మినులు దెలిచె (5 40) ఇట- (పద్మినులు) ధవునిని- ప్రియు డైనసూర్యుని కూర్మిని-స్నేహమును కొసరుచుకా ఉన్నవి వో లేకా-ప్రార్థించు చున్నవో యనునట్లు ముఖరాశివనరుహాస్యములను తెలిచెను-అని వ్యాఖ్యాతలు సూ ని కూడ ఇట్లే అభిప్రాయపడు చున్నది ఇచ్చట- ధవుకూర్మి అనుమార్పుతో-(పద్మినులు) ధవుకూర్మి - ప్రియుని ప్రేమమును కొసరుచుకా ఉన్నవి

వోలెఁగా-మాటి మాటికి (మరల మరల) చెప్పు చున్నవా ఉగ్గడించు చున్నవా అను నట్లు ముఖరాళి ఏనరు హాస్యముల దెలచెఁగా ఒని సమన్వయ మనిపించు చున్నది ఇప్పు డిది ఆం భా కొఁపరు నకు లక్ష్యమే అగుచు పద్మినులు లజ్జావతులు వారు ప్రియుని బ్రేమమునకై ప్రకటము గా ఊరక వేఁడు చుండి రనుట ఉచిత మనిపింప లేదు ముఖరశబ్దము నకైన సారస్యము గమనించుకో దగినది నాసమన్వయమున వ్యంగ్యరీతిని బ్రియునిప్రేమము పద్మినులచే కొరబడుచు వారి పద్మినీత్వమునకు పరిపుష్టి చేకూర్ప బడు చున్నది ముఖర శబ్దము గూడ అర్థవంత మగు చున్నది ఇట్టి యర్థమే ఆం భా కర్త కిట అభిప్రేత మనిపించు చున్నది సుహృదయు లిక ప్రమాణము

సీ రోఁజుడు రొంజుడు రొడ్డుడు రొండుడు
రొల్లుడు రజ్జు ప్రేలుడు పలుము ప
లవరింపు బైజ ప్రల్లదము వదరు వదా
వళి బజారము నాఁగఁ జెలఁగ నోఁ బ్ర
లాపాభిధ బతిమాలడ మన మిడు కన
వన రన వన పన వనట యనఁగ
వాచారపం బన వాచరం బనఁగను
దేవురిం పనఁగను దేవు రనఁగఁ

గీ బరఁగు బరిదేవనము కచ్చె పగటు కంట
సమ్ము నాఁగను విప్రలాపమ్ము చెలఁగు
నటమట యనంగ నపలాప మలరు చుండు
భూతిలసితాంగ శ్రీ మాతృభూతలింగ 6

రోఁజుడు రొంజుడు రొడ్డుడు రొండుడు రొల్లుడు రజ్జు ప్రేలుడు పలుము పలవరింపు బైజ ప్రల్లదము వదరు వదావళి బజారము—ఇవిప్రలాపమునకు (అర్థము లేని మాటకు) పేర్లు

బతిమాలడము మిడుకు వనరు వనపు వనట వాచాంపము వాచరము దేవు రింపు దేవురు—ఇవి పరిదేవనమునకు (దైన్యముతోడి వాక్కునకు) పేర్లు

కచ్చె పగటు కంటనము—ఇవి విప్రలాపమునకు (విరోధముతో నైనమాటకు) పేర్లు

అటమట—ఇది అపలాపమునకు (ఉన్న దున్నట్లు చెప్పక వేఱు గా చెప్పెడి మాటకు) పేరు

బైజ — పైజు అని (వావి అపహా) ప్రయోగి మిట్లున్నది కల్లలు వేదముల్ స్మృతులు గల్లలు గల్లలు యజ్ఞకర్మముల్ కల్లలుపైతృకక్రియలు గల్లలు ఘోరతపః ప్రభావముల్ కల్లలు దేవకార్యములు గావున బైజలు మాని మామతం బెల్లవిధంబులఁ నడుప డిమ్ముల ముక్తికి బోవఁ గోరినఁ (వి పు 4 32) శ ర ఇట బైజ కు అజ్ఞానము - అర్థ మనినది బ్రౌ ఎచ్చిపని-అని తో చినది - అని ప్రశ్నార్థకచిహ్న ముంచినది అర్థరహితము లైనమాటలు అనుట దీని కర్థము (చూ సూ ని) ఇది పైజు గా కొన వచ్చి కా బోలు నిఘంటుకర్తలను ఇంత కలవరపఱచినది వేంకనార్యుని లక్ష్య పరిశోధన మెంత గాఢ మైనదో మన కిది తెలియఁ జెప్పును ఇట్టి ప్రమాదములె వాల చోటుల జేసి పదస్వరూపమును మఱు గుపఱచి పరిశోధకులకు చికాకు కలిగించు చున్నవి [బైజలు-అర్థము లేని మాటలు పిచ్చవారి ప్రలాపములు అన దగినశ్రుతిస్మృతి వాక్యము- లనుట మాని-(వానిని ప్రమాణముల గా గైకొనక) వదలి-అని చక్కనిసమన్వయము ప్రలాపో ఽనర్థకం వచ ఽని (అమ)]

బజారము — ప్రచార శబ్దమునుండి వచ్చిన తద్భవ మిది కావచ్చును బజారపుఁ బలుకులు-స్వేచ్ఛాలాపములు అని సూ ని ఇందులకు ప్రయోగ మిట్లిచ్చినది పాలిండ్లపై బల్మఱుం జీర ల్జాఱ బజారపుంబలుకులం జిట్టాడుచుం బాడుచుఁ సారా చొక్కుల దిక్కులం దిరిగి రెన్నం గన్నె లవ్వెన్నెలఁ (బహు 3 58) ఇచ్చట త్రాగుడువలని పారవశ్యమున అగుదుస్థితి వర్ణింప బడు చున్నది సారా చొక్కువలన అర్థశూన్యము లగు పిచ్చ మాటలు మాటాడుటయు మన మెఱి గనదియే అదియే యిచ్చట జరుగు చున్న దనిన అం భా బజారము న కిది లక్ష్యమే స్వేచ్ఛాలాపము లని అర్థాంతరానుధావన మొనర్ప నక్కఱ లేదు గోబలీవర్ద న్యాయమున బజారపు బలుకు లనుచోటి బజారము అర్థము లేనివి అనియే వచించును

వాచారపము — విలాపము ఏడ్పు ఉని (బ్రౌ విలాప పరిదేవనమ్ అని (అమ) అనుశోచోక్తే అని (సుధ) శ ర వాచారు-పరిదేవనముచేయు ఉని క్రింది ప్రయోగ మిచ్చినది- చనునె మాటల బ్రొద్దు జరపుచు నిల్వ మునితహూఁడు జలమ్ములకు వాచాఁ (హరిశ్చ థా) వాచారవము నుండి ఏర్పడిన వికృతి ఇది దీనికైన (రూపాం) వాచరము అని కొందఱు

వనరు — వనరు (వనరు + ఉ) వనరు ధాతువునకైన కృదంతరూప మిది ఈధాతువునకు దీనాలాపము లాడుట అనెడి ఉర్థము ప్రయోగదృష్టము- వనరు శాకాయ వా లవణాయ వా యటంచు (పాండు 4 49) మొ (చూ సూ ని)

బతిమాలడము — (బతిమాలు + అడము) ప్రతిక్రియ మత్వాన్తత్వం ప్రతీతం న తు గీయతే అని అథర్వణు డు ఉడప్రత్యయాన్తములు వ్యవహారప్రసిద్ధము లైనను ప్రయోగార్హ్యములు — అని ఉహోబలపతి (చూ అం చిం అజ సమాసు సమా 85 సూ వ్యాఖ్య) ప్రయోగము లి ట్లున్నవి- పెలుచ దనంబుఁ బ్రేలడములు (పాండు 3 43) తరుణిచూపులు నెలత్రావడంబుల ద్రోచు (హరి న 4 43) మొ శ ర మనసు రాదు నాకు మానినీ మణులార ప్రేలడములు గట్టిపెట్టి రండు కాక యున్న నన్నుఁ గనలింప కూరక యుండుఁ డనిన వార లులుకు వుట్టి (చంద్రా 2 ఆ) అని ఉదాహరించి దీనికి పురాతన గ్రంథములందు ప్రయోగము గాన బడదు- అని వ్రాసినది రామరాజ భూషణాదులు ప్రయోగించు చున్నయీప్రయోగములు ఆం ధా కర్త త్రోసిరా జన డు బహులము గానే వీనిని గ్రహించినా డు ఆం కౌ కూడ వీనిని సాధువుల గా పేర్కొనినది- రహా తో పడము కొసరడము కోరడ మన, నల యడప్రత్యయ మగుచు జను అని

దేవురింపు — క్వచి దిమ్వన్తాం కేచి దూచిరే నహా షే రుచి అని అథర్వణు డు నా టికి కొన్ని ప్రయోగము లిట్టి వున్నను తనకు సమ్మతము లవి కా వను చున్నా డు చారు వైష్ణవసహస్రమున కన్వహము నారగిం పొనరింతు నని యొడంబడిన (ద్వి పర 6 465 పౌ 0 పం) (మా సూ ని) ఇట్టి ప్ర గములు ప్రమాణములు గా గొని వీనిని గూడ ఈత డు కా దన లెదు

విప్రలాపము — విప్రలాపో విరోధోక్తిః అమ అన్యోన్య విరుద్ధ వచనస్య అని (సుధ) విరోధముతో బలుకుట పేరు ఉని (గురు)

అపలాపము — అపలాపస్తు నిహ్నవ (అమ)

సీ తనరు దెప్పనఁగ గృతప్రశంసాభిధ
 ముసగస గుసగుస ముచ్చట యన
సల్లాపసంజ్ఞలై యుల్లసిల్లుచు నండు
 నెగ్గు నా రుశతిపే రెసఁగు మండు
సాంత్వనసంజ్ఞయై చనుఁ దీయ మనఁగను
 నిష్టోక్తి భాసిల్లు నిచ్చక మనఁ
గఱకు కరుసు కాఱు కాఱొడ్డెము పరుసు
 పరుసన యనఁగ నిష్ఠురము వెలయుఁ

గీ దొంచ్చెము తుటార మనఁగను దుచ్చవచన
 మొప్పు గెంటన మన స్ఖలితోక్తిసంజ్ఞ
 ద్రాబ యనఁగ నసారోక్తి దనరు చుండుఁ
 బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 17

దెప్పు— ఇది కృతప్రశంసకు (చేసినమేలు పలుమాఱు గొప్పగా చెప్పుటకు) పేరు

ముసగస గుసగుస ముచ్చట—ఇవి సల్లాపమునకు(ప్రీతితోడివాఁస్పరసంభాషణమునకు) పేర్లు

ఎగ్గు— ఇది రుశతికి (అమంగళ మగువాక్కునకు) పేరు

తీయము—ఇది సాంత్వనమునకు (బుజ్జగింపుమాటకు) పేరు.

ఇచ్చకము—ఇది ఇష్ట మగుమాటకు(ముఖప్రీతికై ప్రియముగా పలుకుమాటకు) పేరు

కఱకు కరుసు కాఱు కాఱొడ్డెము పరుసన—ఇవి నిష్ఠురమునకు(పరుషవాక్యమునకు కఠిన మైనమాటకు) పేరు

తొచ్చెము తుటారము—ఇవితుచ్ఛవచనమునకు (దుర్వాక్యమునకు అశ్లీలాది వాక్యమునకు) పేర్లు

గెంటసము—ఇది స్ఖలితోక్తి (తొట్రుపాటు గలమాటకు తబ్బిబ్బులు గా అక్షరవిభాగము లేక వెల్వడుమాటకు) పేరు

ద్రాబ —ఇది అసారోక్తి (సారము లేనిమాటకు) పేరు

దెప్పు — తనరు దెల్పనగ వావి అపపా దెప్పు ట్రౌ పా (చూ అను )

ముసగస — మొసగెస వావి మొసగుట-ట్రౌ (అపపా ) సూ ని ముసగుస ఇది యవి ఒకప్రయోగము ని ట్లుదాహరించినది- రాచిలుకరాణివాసము లోచెలికి యెల మావిచిన్నియుప్పరిగలపై జూచితె? ముసగస లాడుచుఁ జూచెద రా తలియుబెడపునో రణగండ్లఁ (కకు 3 9 ) ఇచ్చట గుసగుస- రహస్యసంభాషణము-అని దీని కర్థ మిచ్చినది సూ ని అన్యోన్యము ప్రీతితో బరపుసంభాషణము-అనుటయు ఇట విరుద్ధము గాదు సంలాపో భాషణం మిథః అని అమ సంలాపమే-సల్లాపము వా పదాన్తస్య (8 4 59 )అని (పాణినీయము ) ఇట ప్రీతిచేతఁ బరస్పరము భాషించుట- అని (గురు )

రుశతి — రుశతీ వా గకల్యాణీ' అని అమ దీనికే రాక్షసవాక్కని పేరు ఒకకవి వాక్కునుగూర్చి ఇట్లను చున్నాడు- ఋషయో రాక్షసీ మాహూర్వాచ మున్మత్తదృప్తయో సా యోని స్సర్వవైరాణాం సా హి లోకస్య నిర్వృతి (ఉ 5 30 ) కల్యాణాత్మిక యగువాక్కునకు సూనృతవాక్కని పేరు స్యాత్కల్యాణీ తు శుభాత్మికా అని (అమ ) దీనివిగుణించియు ఈకవి ఇట్లు వర్ణించినాఁడు- కామాన్ దుగ్ధే విప్రకర్షత్యలక్ష్మీం కీర్తిం సూతే దుష్కృతం యా హినస్తి తాం చాప్యేతాం మాతరం మఙ్గలానాం ధేనుం ధీరా స్సూనృతాం వాచ మాహుః (ఉ 5 3 ) ఈసూనృతతవాక్కునే ఈతడు సూక్తి' యనినా డనిపించును (చూ ) వేఱు గా దీనికి నామములను అంభా వచింప లేదు సూక్తి - అనుదానిచే ఈతఁడు సుప్రలాప స్సువచనమ్ స్యాత్కల్యాణీ తు శుభాత్మికా అను-అమరోక్తుల రెండిటిని సంగ్రహించినాడని తోఁచు చున్నది

సాన్త్వము — అత్యర్థమధురం సాన్త్వమ్ అని (అమ )

ఇష్టోక్తి — సంగతం హృదయంగమమ్ అని (అమ) ఇట మనస్సునకు ప్రియమైన మాట-అని గురు యుక్త్యా మిళితస్య వచనస్య అని సుధ ఆం భా గురు వ్యాఖ్య ననుసరించిన దిట

తుచ్ఛవచనము — ఈత డు దీనిచే య స్సనిన్ద ఉపాలమ్భ తత్ర స్యా త్పరిభాషణమ్ తత్ర త్వాక్షారణా య స్స్యా దాక్రోశో మైధునం ప్రతి గ్రామ్య మశ్లీలమ్ అను వాని నన్నిటిని సంగ్రహించినా డనిపించును రామాభ్యుదయ మి ట్లను చున్నది- రఘు వరుల సచ్చరితంబు లుచ్చరించుచు దొచ్చెంబుల తొచ్చుసేయుచు (6 99) మొ తుటారము-(సం తురాక) వార లాడిన తురాకంబులు కర్ణకఠోరంబు లగుటయు (వరాహ 37) సూ ని పరుష వచనము నిష్ఠురోక్తి అని దీనికి (తుటార మునకు) అర్థ మని ఈ ఆం భా ను ఉదాహరించినది ఇది ప్రమాదము నిష్ఠురోక్తికి ఆం భా వేఱు గా నామము లిచ్చినది ఈ పద్యమునసే వీని కది అర్థము కాదు తుచ్ఛ వచనములు-దుర్వాక్యములు-చెడ్డ మాటలు- ఆడ రానిమాటలు-అని ఇచ్చట దీని కర్థము రామా తురారముగూడ ఇట్ట యర్థము కలదే అనవచ్చు నేమో కొన్ని గొణింగి కొన్నినిసి కొన్ని తుటారము లాడి మాన రా కెన్నికి విన్నినాళ్ల కివి యి న్నని కూటికి బిచ్చపాటి కొ న్మన్న మహాప్రసాద మని హర్షరసోల్ల సదాననాబ్జ యై యన్నలినాక్షి భర్త యిడి నన్నియ కైకొను ముక్కధాన్యముల్ (పాండు 4 47)- ఇచ్చటి తుటా రము నకు నింద తిట్టు-అని వేఱు గా అర్థమును ఇచ్చు చున్నది సూ ని ఆం భా తుటారము న కిది లక్ష్యమే వేఱుపఱుప వలసిన యావశ్యకత లే దనిపించు చున్నది తుటారములు- తుచ్ఛవాక్యములు-నిందావాక్యములు అవియే తిట్టులు పైపద్యమున గొణింగి అని సూ ని దీని ననుసరించియే కావలయు ఇటీవలి వ్యాఖ్యాత లును గొణింగి అనియే పాఠ మిచ్చి వ్యాఖ్యానించు చున్నారు గొణు గు ధాతువు కానరాదు అస్మదృ మిది గొణంగి అనియే ఉనవలయును శ ర పా ఇట్లే యున్నది ముక్క- ధాన్యముల్ అని (శ ర) ముక్కు- ధాన్యముల్ అని సూ ని ముక్క- ముక్కుట అని ముక్కపురుగు మొ వానిని ఉదాహరించినది (బ్రౌ) ఇచ్చట పిచ్చ పాటి అనియే పెద్దలందఱు అనుచున్నారు బిచ్చపాటి బిచ్చము కొలఁది బిచ్చ మెంతయో అంత-అనఁగూడదా?

స్ఖలితోక్తి — అథమ్లిష్ట మవిస్పష్టమ్ అని (అమ) తబ్బిబ్బు మాటలలో అక్షరవిభాగ మేర్పడక యుండుట ఒకకవి ఇట్లు వర్ణించు చున్నాఁడు- సిబ్బితిపేరు పో దుడిచి

సీధుమదం బిపు డస్నుకొల్పుచుం బ్రబ్బ గ మాట అక్షర విభాగము చాలక యేమొ యేమొ తబ్బిబ్బులు గా గ వెల్వడియె (కిలా 6 28) చి ని పా (మా సూ వి.) నోరు జాఱి వచ్చినమాట అని బ్రౌ (చూ అు గెంటిసము)

గెంటసము — కంటసము వంటిది [గెంటిసము-బ్రౌ, వావి అపమంత్రి ఏమో] ననవింటి పెనుదంట నాడ రాని గెంటసము లాడి (వసు 4 44 మొ) ఇచ్చట గెంటసము నకు మాటలు అని అర్థము ఆం ఖా గెంటసము నకె బ్రాహ్మణ వసిష్ఠ న్యాయమున ఐవ-అర్థ మిది ఇట వ్యాఖ్యాతలు కంటసములు (విరోధోక్తులు) అని దీని కర్థ మొసఁగినారు పరుషవచనము అవి (శ ర సూ ని)

డ్రాబ — ప్రయోగ మి ట్లున్నది దు ష్కవితలు లక్షణం బెఱు గ జాలక డ్రాబలు గూర్చి యల్లుచున్ (కవిసర్ప అ) (చూ శ ర) డ్రాప (సం) డ్రాప అనునది యొకటి- ఒకవిధ మగు కవిత్వ దోషమును చెప్పునది గా ఉదాహరింప బడు చున్నది డ్రాప ఛన్దోవిరుద్ధం బాది యగునప లాపప్రలాపోక్తి లాఘవం బనకే అని (పండితా 6పొ) ఇది దీనికి (రూపాం) అనఁ దగినది డ్రాబ కు నిర్ధారక ప్రయో గ మి ట్లున్నది- గూఢలచే ని ట్లయితిమి డ్రాబల మై (నా పంచ 3 2) (చూ సూ ని) దేశె దీనినుండి ఏర్పడినదే పై ప్రయోగమునందలి డ్రాబ అన్వర్థక మైనను దీనికి నిదాన మనఁ దగినది

సీ ఒడ్డార మం చన నొఱగొడ్డె మనఁగను
నడుగు నా వక్రోక్తి యడరు చుండుఁ
జతురోక్తి సంజ్ఞ యై చనుఁ జదు రం చనఁ
ద్వరితోక్తి వెలయును ఖద, రనంగ
గచ్చు కొతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు
సొల్లురనం బొప్పు నుల్లస మన
బూతు నా బూమె నా బూక నా బూటక
మ్మనఁగను వేడబ మనఁగఁ గొడిమె

గీ యనఁగను నబద్ధ సంజ్ఞ యై యలరు చుండు,
నిజ, మనఁగ నిక్కువం బన నిక్క మనఁగ

నేటు నాఁగను సత్యంబు నెగడు చుండు
మాతృభూత జగత్త్రయీమాతృభూత

ఒడ్డారము ఒఱగొడ్డెము సడుగు—ఇది వక్రోక్తికి (మనస్సు నొప్పించెడి వంకర మాటకు) పేర్లు
చదురు—ఇది చతురోక్తికి (సరసపుమాటకు) పేరు
పదరు—ఇది త్వరితోక్తికి (త్వరగా పలుకఁబడెడి మాటకు) పేరు
గచ్చు కొతుకు— ఇది గ్రస్తమునకు (అశక్త్యాదులచే అసంపూర్ణము గా వచించు మాటకు వర్ణపదలోపము గలమాటకు) పేరు
ఉల్లసము—ఇది సోల్లుంఠనమునకు (ఎత్తిపొడుపుమాటకు) పేరు
బూతు బూమె బూక బూకటము వేడబము కొడిమె— ఇవి అబద్ధమునకు (అనర్థకవాక్యమునకు సముదాయార్థశూన్య మగుమాటకు) పేర్లు
నిజము నిక్కువము నిక్కము నేటు—ఇవి సత్యమునకు (ఉన్న దున్నట్లు చెప్పెడిమాటకు) పేరు

ఒఱగొడ్డెము —శ ర (వఱ + గొడ్డనము) అనువ్యుత్పత్తితో వఱగొడ్డము గ్రహించి వరునితో నేఁబొద్దు వఱగొడ్డ మాడుట ధర్మమార్గంబు లేర్పఱచు చుంట (భల్లా 4) ఉదాహరించినది సూ ని వఱగొడ్డెము (ఒఱగొడ్డెము నకు రూపాం) అని వఱగొడ్డె మాడుట (భల్లా 4) శ ర అను చున్నది (భల్లా ప్రయోగము- వఱగొడ్డెమో వఱగొడ్డ మో తెలియుట లేదు వఱగొడ్డము కడ శ ర ఈప్రయోగ మిచ్చి ఇట్లు వ్రాసినది ఇందు వకారము యతియం దుండుటవల్లను అది వ్యుత్పత్తికి కొంచెము సరిపట్టి వచ్చుటవల్లను ఈపద మి ట్లుండుటయే సరి యని తో చు చున్నది అప్పుడు ఒఱగొడ్డెము దగ్గఱ నుండునుదాహరణమునందు భీము డు వఱగొడ్డెము లాడంగ అని పద్యమును దిద్దుకొని యాపదము నెత్తివేయవలెను అని ప్రౌ ఒఱగొడ్డెము అనియె అం బా పార మను చున్నది (చూ అను) యతిలో స్పష్టము గా గానవచ్చుచు

ఇది యిట్టిదే యని ఆం భా విస్పష్టము గా వచించు చున్నది భాగవతము ప్రయోగమును చూపు చున్నది శ ర ఒఱగొడ్డెము గ్రహించి వఱగొడ్డియము యొక్క (రూపాం) అనినది ఎఱగొడ్డెము (రూపాం) అనుటయే భల్లా ప్రయోగమునుబట్టి సముచితము శ ర ఆం భా కు చక్కనిలక్ష్య మైనభాగవతప్రయోగ మేవ్యుత్పత్తి యొ సరితట్టు నవి దిద్దఁ జూచుట యుచిత మనిపింపదు దీనినిఁబట్టి పై భల్లా ప్రయోగమునందు గూడ వీరిసంస్కారమువలననే వఱగొడ్డెము వఱగొడ్డ మైన దని మన మూహింప వచ్చును ఇట్టిదిద్దుబడులకు గురి యై ఆం భా లక్ష్యము లెన్ని మటుమాయము లైనవో చెప్పఁ జాలము అందులకే అవి నేఁడు ఎంతగానో పరిశీలించిన -ని తెలియ రానిదుస్థితిలో నున్నవి శ ర దిద్దు మనినభాగవతపద్య మిది- బిడ్డలకు బుద్ధి సెప్పని గుడ్డికి బిండంబు వండికొని పొం డిదె పై బడ్డా దని భీముం డొఱ గొడ్డెము లాడంగ గూడు గుడిచెద వధిపా (భాగ 13) సూ ని శ ర మాటలను త్రోసిరాజని వఱగొడ్డెము ఒఱగొడ్డెము రెండును గ్రహించి తదనుగుణములు గా ప్రయోగములిచ్చుట ఈపట్టున చాల సముచిత మనిపించును ఇక్కటరి నాపంచినయుడిగ మే మైన గోరి సేయుచు నొఱగొడ్డెంబు లేక కొలిచెదవేని (ద్వి హరిశ్చ ఉ 40) మొ ప్రయోగములు ఆం భా కు లక్ష్యములు గా దగినవిగానే ఉన్నవి ఇచ్చట- సూ ని చెప్పెడి మరియాద మీఱినమాట మొ అర్థములు ఋజువులు గానిమాటలు అడ్డదిడ్డపు మాటలు- అనువాని కైనపర్యవసితార్థములె అన దగి యున్నవి

త్వరితోక్తి — విరస్తం త్వరితోదితమ్ అని (-మ)- శీఘ్రోచ్చారితస్య వచన అని సుధ

అబద్ధము — అబద్ధం స్యా దనర్థకమ్ అమ ఇట- సముదాయార్థశూన్యస్య వచనస్య అని (సుధ)

కొతుకు —(కొతుకుట) వోట తగిలీ తగలక మాట్లాడుట అని (బ్రౌ) (చూ అను)

గ్రస్తము — లుప్తవర్ణపదం గ్రస్తమ్ (అమ)- అశక్త్యాదినా అసంపూర్ణోచ్చారితస్య అని (సుధ)

కొఁడిమె — అనృతము అసత్యము- అని అర్థ మిచ్చి ఈ ఆం భా ను ఉదాహరించినది (సూ.ని) అసత్యమునకు వేఱు గా పర్యాయముల నిచ్చినది ఆం భా (చూ 9) అబద్ధ శబ్దము చూచి భ్రమించినది (సూ ని)

బూమెలు — బూమె-ఇ యమాటలు-అని యా ని ప్రయోగ మి ట్లచ్చినది - ఆమాట ల్విని నవ్వి పంక్తి నెదుటం దె లౌర యీబూమె లే లా మీయేలిక నా ప్రయాణకథ యెల్లన్ విన్నవా ద్దై వధూ స్తోమంబుం గొని వా గ వే గె ంబళీకుం జేరి పోతాడునే భూమిన్ రావణు డంచు వారి నగుచుం బోమెన్ మదోద్రేకి యై (ఉ రా 3 88) ముందుపద్యము- (కార్తవీర్యార్జునుని మంత్రుల మాట లివి రావణునితో)- నే దే వచ్చు నొ రెపె వచ్చునొ వనిన్ స్త్రీయుక్తి క్రీడించుచున్ రా దో రాజుల చిత్తముల్ దెలి యునే రక్ష కు-రాధ్యక్ష అతండు వచ్చినను బాళిన్ రమ్మ మె లౌ ననన్ (3 87) ఉద్ధము లేని మాటలు అనన్వితము లైన మాటలు - అయెయు ఇట సంగతమే అం భా కు ఇది లక్ష్యము కా దగినదే

నేటు — నేటు గా నీ కల్లనిజములు రెండు తేట గా నిప్పుడు తెలుపక యున్న (సారం 7) (చూ శ ర) ఇచ్చట నేటు నిశ్చయము అని (శ ర సూ ని) ఇచ్చట- నేటు గా-సత్యము గా యథార్థము గా ఉన్నది యున్నట్లు గా -అనిన అం భా ఉర్థ మిట సుసంగతమే అని తో చు చున్నది అప్పు డిది అం భా లక్ష్య మనఁ దగినదే కాని నేటు గా వచింప వలెనని కాదు పెద్ద లె మందురో

సత్యము —దీనినిఁగూర్చి మను వి ట్లను చున్నా డు- సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయా న్న బ్రూయా త్సత్య మప్రియమ్ ప్రియం చ నా ఽ నృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః (4 38)

ఆ జల్లి బురుడ బొంకు బొల్లు దబ్బఱ కల్ల
డబ్బు తక్కు టక్కు తవళి తవళి
తసుకు నసుకు దుద్దు తటవట రవరవ
సట హుళిక్కి నా ననత్య మభవ 19

జల్లి బురుడ బొంకు బొల్లు దబ్బఱ కల్ల డబ్బు తక్కు టక్కు రవళి తవళి తసుకు నసుకు దుద్దు తటవట రవరవ సట హుళిక్కి—ఇవి అసత్య మునకు (నిజము కానిదానికి) పేర్లు

బురుడ — బురుడ బురడా బురుడా -అని బ్రౌ (చూ అను) హుళికి (రూపాం) అని శ ర అప్పాదితో షణమా దబ్బఱ సత్య మా హుళికి (హంస 6) అనినది ఇట-

హంసవింశతిలో సత్యమా హుళి గణించన్ వాని క్రిదిస్తని (౨- ) అనియే అగపడు చున్నది ఇం శ ర ఏ హా హుళికి యెంచన్ అని యుండ వచ్చును దాని నెవరో గణియించన్ అని సంస్కరించి యుందు రని తోచు చున్నది హుళక్కి కూడ గ్రహించి సంగ్రామ ఖంబున నొట హుళక్కి యట్టిదో గృపణ విధంబు నా ఉన్న (D R ౪౦ ) అని ప్రయోగ మిచ్చు చున్నది త్రౌ హుళిక్కి ఇది అనుటకు నిర్ధారక ప్రయోగ మి ట్లున్నది- కైదువు సున్న పూజ్యము సుం కింకిట ఖేట శిరస్థ (స్త)ల్రత్రమ్ ె దరదంబు తత్తడి హుళి- సహాయము సర్వమంగలం బీదనుజుండు చిక్కె (స్వా 4 ౦౦ ) దీనికి -భావము అనర్థము అసత్యము ను ఆధారము - గొని ఏర్పడినదే అం సం గూడ- బద్ధు నా బొంకు నా గ దబ్బఱ యనంగ గల్ల నా గ హుళి- నాఁ జెల్లు బేళ్ల (మన ౦౮ ) అను చున్నది హుళక్కి కై సూ ని ఇచ్చిన-ఏసు కాశీ లలో హుళి- యే (నాచూచినవానిలో) కానవచ్చినది

అసత్యము — ఇది వితథం త్వనృతం వచ (అమ ) అనుటనేకాః అహతం తు మృషార్థకమ్ (అమ ) అనుటనుగూడ ఇది సంగ్రహించిన దన వచ్చును అహతము అనుదానికి అత్యంతాసంభావితార్థము అని (గురు )

గీ శ్రీలు వెలయంగ నీపేఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గను వాగ్వర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 20

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68 ]

ఇది

వాగ్వర్గము

———

# శబ్దాదివర్గము

సీ. మ్రోఁత నాదు రవళి మ్రోఁగుడు వాఁగుడు
సద్దులి వలికిడి చప్పు డలుకు
డనఁగ శబ్దం బొప్పు నతిదారుణధ్వని
జంపన జంతన జంపి యనఁగఁ
గ్రందన విలసిల్లుఁ గలకలధ్వని దోఁచు
నలబలం బన హాళాహళి యనంగ
గొల్లన గొలకన గెల్లన రొద యనఁ
దనరు దిముకు నా మృదంగరవము

గీ. వెలయు నార్తారవంబు గీపెట్టు నాగ
గంరనినదాఖ్య యెలుఁగు నా గను జెలంగు
నదియ సూక్ష్మతరంబు గా నైనఁ బరఁగు
సీరెలుం గటం చనఁగ బాలెందుమౌళి

121

మ్రోఁత నాదు రవళి మ్రోఁగుడు వాఁగుడు సద్దు ఉలివు అలికిడి చప్పుడు అలుకుడు—ఇవి శబ్దమునకు (ధ్వనికి) పేర్లు

జంపు జంతు జంపి క్రందు—ఇవి అతిదారుణ ధ్వనికి (మిక్కిలి భయంకరమగుధ్వనికి) పేర్లు

అలబలము హాళాహళి గొల్లు గొలక గెల్లు రొద— ఇవి కలకలధ్వనికి (గుంపునుండి పుట్టిన పెద్ద మ్రోఁతకు) పేర్లు

దిముకు—ఇది మృదంగరవమునకు (మద్దెల ధ్వనికి) పేరు

గీపెట్టు—ఇది ఆర్తారవమునకు (ఆర్తు లొనర్చు పెద్ద...



ఎలుఁగు—ఇది కంఠనినాదమునకు (కంఠధ్వనికి) పేరు

ఈఁరెలుంగు— ఇది సూక్ష్మతరకంఠనినాదమునకు (మిక్కిలి సన్ననైన కంఠ ధ్వనికి) పేరు

ఈఁరెలుఁగు — సూక్ష్మకంఠధ్వని వానస్వామ ౘని బ్రౌ (మా ఒను) ప్రయోగ మి ట్లున్నది- కను గవ ప్రూన్పశంగ నెఱక ల్విరియంబడ బోర మోవ నెం డిన వదనం బులం దెఱచి నిక్కినయట్టులు దల్లడించుఁ ల్గన బడ సూరుపు ల్దళము గా నిగుడఁ వడ గుంది యీరెలుం గున దమవాని బిల్చుచు శకుంతము లమ్యోడ నిల్చె మ్రా కు లఁ (పారి 4 2 ) ఇచ్చట ఈఁరెలుంగునఁ- సన్నని ధ్వనులతో అని (వ్యాఖ్య ) సన్నని ఁను చాలు మిక్కిలి సన్నని అనవలయుచు వేంకనార్యుని ప్రయోగపరి శీలనాసూక్ష్మజ్ఞత యెంతగాఢ మైనదో షన కిది తేటతెల్లచేయు చున్నది

సీ ఆర్త కంఠ రవాఖ్య యలరు నేడు పనంగ
 వెలయు ఖేదధ్వని ములుగు నా గ
గగ్గు నా వెలయు గద్గదిక దగ్గుత్తిక
 యున గ గద్గదకంఠ మలరు చుండు
దత్పాధుకృద్ధ్వని దనరును గ్రే టన
 ఱంకె నా వృషభవిరావ మొప్పు
నఱపు నాఁగఁ బకకంఠారవంబు చెలంగు
 ఘనకారవము మొఱు గనఁ దొరుచ్చు

గీ నూళ యన జంబుకధ్వని యొప్పు నీల
యనఁగ దస్కరసంకేతనినద మెస గు
జలవిహ్వాతికాలశబ్దంబు వెలయు నోల
యన ప్రతిధ్వని మఱు మ్రో త యన దగు భవ 22

ఎడుపు—ఇది ఆర్తి కంఠరవమునకు (ఆర్తు లగువా రొనర్చు కంఠధ్వనికి)
పేరు



ములుగు— ఇది ఖేదధ్వనికి (రోగాదిబాధలవలన కలిగెడి—ఒకవిధ మగుధ్వనికి) పేరు

గగ్గు—ఇది గద్గదికకు (ఆనంద బాష్పాదులచే నగు గొంతుతడుపునకు) పేరు

డగ్గుత్తిక— ఇది గద్గదకంఠమునకు (గాద్గద్యముతోడి కంఠస్వరమునకు కంఠమూలమం దుండి కొంచెము స్ఫుట మై బాగుగా వినరాని (కంఠ) ధ్వనికి) పేరు

క్రేఁటు—ఇది గద్గద కంఠమును బాగుచేసికొనుటకై చేసెడి ధ్వనికి (సకిలింతకు) పేరు

అంకె—ఇది వృషభవిరావమునకు (ఆఁబోతుల కంఠధ్వనికి) పేరు

అఱపు—ఇది పశువుల కంఠధ్వనికి పేరు

మొఱఁగు—ఇది శునకారవమునకు (కుక్క యఱపునకు) పేరు

ఊళ—ఇది జంబుకధ్వనికి (నక్క యఱపునకు) పేరు

ఈల—ఇది తస్కర సంకేత నినదమునకు (దొంగలు సంకేతము గా నోటితో నది చేయుధ్వనికి) పేరు

ఓల—ఇది జలవిహృతికాలశబ్దమునకు (జలక్రీడాకాలమందు పట్టుకో చూత మని ఇతరులను ప్రేరేఁచుటకు గుఱుతు గా ఉపయోగించెడి శబ్దమునకు) పేరు

మఱుమ్రోఁత—ఇది ప్రతిధ్వనికి (మాఱుమ్రోఁతకు) పేరు

ములుగు — బలదేవుమేను సోఁకిన వెలిమిడిచె వే కీ సఱచి విటతాటమౌ గా నిలుగుటతో ముఱుగుటతో నలమటతో నావులింత లంతంతకు గాఁగా (ఉ హరి 6 77) (చూ సూ ని) మూలుగు మూల్గు (రూపాం) తలనొప్పి కడుపుకుట్టుం బలుగుఱుపుం గాలితీవు పాటించుచు న చ్చెలి మూల్గఁ బొప్పు మీదం జెలువుఁడు తత్తచ్చికిత్స సేయ న్నగుచుఁగా (శుక 2 205) ఈ క్రియలమీ ది ఉవర్ణకాన్తములు పై (రూపాం)

గగ్గు — గద్గదిక డగ్గుత్తిక -అని (సూ ని) డగ్గుత్తిక వేఱుగా ఇచ్చుచున్నది (ఆం ఖా)

క్రెటు — గ్రేటు -ని ప్రౌ వా (చూ ప్రౌ -ను)

తే పాట యన గను గానాఖ్య పరగు చుండు
నాలతి యనంగ నాలప్తి యలరు చుండు
దద్విశేషాభిధానముల్ దనరు నేల
జోల సువ్వాల యన గను సోమభూష 23

పాట—ఇది గానమున పేరు

ఆలతి—ఇది ఆలప్తికి (రాగాలాపమునకు) పేరు

ఏల జోల సువ్వాల—ఇవి గానవిశేషములకు (ఈ పేరులు గల వేఱు వేఱు పాటలకు) పేర్లు

ఏల — శృంగారపు పాట అని శ ర ప్రౌ దీనిని ఇట్లుదాహరించినది ఏరిగట్టు గుడిసె వేతాం ఏరు వస్తే కూడా పోదాం ఓ ఓ గొల్లభామా

జోల —జోలపాట జో జో ముకుంద అని ఆలపించుచు శిశువుల నిద్రపుచ్చుటకై ఉయ్యాల ఊచుచు పాడుపాట

సువ్వాల —(సువి + ఆలతి) ఆడువారు పెండ్లిండ్లయందు సువ్వి ఉనుపదముతో ఆలాపము చేసి పాడెడి పాట (మా శ ర పెండ్లిండ్లయందేకాక కొన్నెల నమ్మల యందును ఒమ్మిరి త్రొక్కుచు ముత్తైదువలు ఈ పాట పాడుట సుప్రసిద్ధము సువ్వి సువ్వాల ఉనుపదములు ఆలాపవిశేషములు మఱికొన్నియు ఇట్టిపాట లున్నవి- అలల నామణి కాగ య్యాళి యొకనొక్కవేళ నక్కఱతో సువ్వాలయు సోబానయు ధవళాయును మొదలైనపాట లాదట వేర్పున్ (శుక ౧23) (మా శ ర) సువాల (మాపాం) నీకె వచ్చు సువాలయున్ ధవళమింతీ యల్లొనేరేళ్ల గౌరీ కల్యాణము లంచు (పాంచా 4) (మా శ ర ఉల్లొ నేరెడు)

[జోల ఏల సువ్వాల-అనువానియందు జో లు + ఎల + సువ్వాయి + ల

అనురీతిని వ్యుత్పత్తి ఉకారము- మత్వర్థీయము జోలు- (జొ బ) జొ+జొ ఉను శబ్దములు (ఉంతమందు) -లది (పాట) ఇట్లే తక్కినవానికిని ఉప్పుడు ఏల పాట పై చూపనది కాం ఏల ఆలప్త ిలపెఱుపాట కావలయును ]

క చంచం యన బింబిం యన
జఱజఱ యన నిట్లు కొన్ని శబ్దానుకృతుల్
పరఁగుచు నుండును జగతిని
స్ఫురితగుణావేశ మాతృభూతమహేశా 124

చంచం బిరబిర జఱజఱ—ఇవి శబ్దానుకృతులకుఁ (ధ్వన్యనుకరణములకు) పేర్లు

చరచర — బాణాదుల వేగమువలన కలుగుధ్వని గుంటిక్రోవులదబ్బుడుబ్బులు తుపాకీల ఫెళఫెళలు బాణముల చరచరలు లకోరీల రింగురింగులు (ప్రబంధ ~8) (చూ సూ ని)

బిరబిర — గదాదులు త్రిప్పుటవలనిధ్వని గదాదండంబు బిరబిరఁ ద్రిప్పి యానురవ రేణ్యు (దశా 2 427) (చూ యా ని) బిఱబిఱ అని శకటరేఫముతో ఉదాహరించు చున్నది సర్వ బఱబఱ నీడ్చుటయును దబ్బఱ బిఱబిఱ ద్రిప్పుటయు ణాయ (3 ౧) ఉప్పకవిగూడ ఇట్లే అనినాడు రెండును సాధువు లన వచ్చును బిరబిర అనుటకు (చూ శ ర వి వ్యు 7 ప్ర)

జఱజఱ — ఉండ్చుట జఱుట జరగుట లో నగుానివలన అగుధ్వని తెలవను జూప కున్న దొలిదేవరప్రేవులు ప్రేవు లై ఎడం బెటికెచ నొదల ల్దల గఁ బెట్టెద జుట్టులు వట్టి నేలపై జిఱజఱ ద్రిప్పి కొట్టి మెయిఁ జిప్పిలి నెత్తురు లుబ్బి వాలు గా జఱజఱ నీడ్చి వైచెద నెసంగ దొసంగుల నెల్ల ముంచెదఁ (ఉచ్ఛ రా కిష్కిం 83) (చూ సూ ని) జరజర అని వావి పా శకటరేఫప్రకరణమున ఉప్పకవి జఱజఱ అను చున్నాడు

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు చుండును శబ్దాదివర్గ మిట్లు

గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత

[చూ వ్యాఖ్యకై స్వర్గ 68 ]

ఇది

శబ్దాదివర్గము

---

# నాట్యవర్గము

సీ. వీణె వీణియ యన వీణాఖ్య రాజిల్లు
వాయింపు నా దన వాదన మగుఁ
గొడుపు నా విలసిల్లు గోణాభిధాన మై
యొళవు నాఁగ బ్రవాళ మొప్పు మండుఁ
గరివె యం చనఁగను గకుభంబు విలసిల్లుఁ
దంతి యనంగను దంత్రి వెలయు
నలరును గుబ్బకాయ యన నలాబువు
జవినన మనఁగ దద్బంధన మగుఁ

గీ. బరఁగు నుపవాహనామంబు బిరడ యనఁగ
సారె మె ట్లన సోపానసంజ్ఞ దనరు
మేరు వనఁగను విలసిల్లు మేరుసంజ్ఞ
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 26

వీణె వీణియ—ఇవి వీణకు (ఒకవిధ మగుతంత్రీవాద్యమునకు విపంచికి) పేర్లు

వాయింపు నాదు—ఇవి వాదనమునకు(వీణె మొద లగువానిమీఁద పాడెడిపాటకు) పేర్లు

కొడుపు—ఇది కోణమునకు(వీణాదివాద్యములను వాయించుసాధనమునకు) పేరు

ఒళవు—ఇది ప్రవాళమునకు(వీణాదండమునకు) పేరు

కరివె—ఇది కకుభమునకు(ఇత్తడి లో నగువానితో చేసి వీణాదండమును పొదివికొని యుండునట్లు సొఱకాయపై నమర్చెడి దానియవయవమునకు) పేరు

తంతి—ఇది తంత్రికి (తీగెకు) పేరు

గుబ్బకాయ—ఇది అలాబువునకు (వీణె కమర్చినసొఱకాయకు) పేరు

బవిసనము—ఇది తద్బంధనమునకు(వీణెదండెకును సొఱకాయకును వేసెడికట్టునకు) పేరు

బిరడ—ఇది ఉపవాహమునకు (వీణె లో నగువాని-తంతి (తీగె) చుట్టెడితటిమెన కొయ్యకు) పేరు

సారె మెట్లు—ఇని సోపానములకు (వీణెమెట్లకు) పేర్లు

మేరువు—ఇది మేరువునకు (వీణాగ్రమునకు) పేరు

వీణ —ముఖవీణ రుద్రవీణ కిన్నెర-మొద లగునవి వీణభేదములు వారు వారు ధరించు వీణలకు గల విశేషనామములను పైజ- ఇట్లు పేర్కొను చున్నది వీణా స్థాణో రనాలమ్బి గణానాం తు ప్రభావతీ విశ్వావసో స్తు బృహతీ తుమ్బురో స్తు కలావతీ మహతీ నారదస్య స్యాత్ సరస్వత్యా స్తు కచ్ఛపి (భూమి శూద్రా)

వీణె —(సం వీణ) వీణియ (రూపాం) శర వీణియకు (రూపాం) వీనియ అని క్రిందియయాత్రప్రయోగము నుదహరించు చున్నది కన్నియ లన్న చూపంబూ దేవియ లాని వీనియలయందుం బాడునేర్పులకు మెచ్చి (4 3) ఇట తీనియలందుం బాడు అను పాఠ మగపడు చున్నది (తిన్నె కు తీనె తీనియ రూపములు ప్రయోగదృష్టములు మఱియొకప్రయోగ మేదియు దీనికి లేదు కేవల మిచ్చటియనుప్రాసమే దీని కాధారము కనుకనే ఆంధ్రభా దీనిని గ్రహింప లేదు ఆంధ్రభా కు శర పాఠము గాక ఈపాఠమే ఇట కానవచ్చి యుండును వీణావాద్యమును వేదికలపై కూర్చుండి స్త్రీలు బరపుట పెద్దనాదుు వర్ణించు చున్నారు అమల మణిమయ నిజమంది రాంగణస్థ తరుణసహకారమూలవితర్దిమీద శీతలానిల మొలయ నాసీనయైన యన్నిరింపాక్షముఖియు (స్వా 2 26) మొ పాడునేర్పులకు మెచ్చి పచ్చవిల్కాడు గురియించువిరివానలుంబోలె గరువలివే దొరగు పరువంపుననలుం గలిగి అని పైయర్థా వాక్యశేషము - (పాడు-పాటపాడు) ఈపాట వీణావాద్యముగూడ కావచ్చును ఐనను వనమం దిట సాధారణగాన మనుట సమంజస మనిపించును

నాదు —వీణానాదమేకాక తక్కిన నాదధ్వనులును నాదు లన దగినవే ప్రయోగ మి

ట్లున్నది- శ్రోత్రభావ మొంది సొలయక శబ్దంబు నాలకించి యంత కంఠి కుబ్బి వేఁట
కాని నాదు విన నాసచేఁ లో బడిన మృగము వోలె జెడకు మనస (వా రా 4 44)
(చూ సూ ని)

వాయింపు — వాయింపు వాదన అని యా ని అపపా (చూ వాయింపు)

కిరివె — కలివె వావి అపముద్రి

కకుభము — కకుభ స్తు ప్రసేవక ఆని అమ శబ్దము గంభీరము గా పలుకుటకై చర్మ
ముతో బంధించిన దారుభాండము- (చూ సుధ) వీణా దండమునకు క్రింద ఉండెడి
యొకవిధ మైన వక్రకాష్ఠము అని (గురు)

బవిసనము — బవిసనము -అని బ్రౌ వావి వా

'శద్వంధనము —అనగా వీణకు వేసే సొఱకాయయొక్క బంధనము అని బ్రౌ వివ
రణము (చూ అను) బవిసనము - శ ర (ఆం ఖా ప్రాంతప్రతి వా - ఇది) శ ర
దైసణ బయసణ దీనికి పర్యాయపదము లనియు ఉను చున్నది

సీ దండె దండియ యన దండవాద్యం బొప్పుఁ
దంబురా యనఁగను దుంబు దగు
డక్క డక్కి యనంగ ఢక్క విరాజిల్లు
నావజం బన నొప్పు నారజంబు
దవిణ యం చనఁగ నుల్లసిలు డిండిమసంజ్ఞ
డమరుగం బనఁగను డమరు వెసఁగుఁ
దమ్మటం బనఁగను దమటం బనంగను
దమరాభిధానంబు దనరు చుండుఁ

గీ దుడు మనంగను దముకు నా గిడియ యనఁగ
నరగజం బనఁ దద్భేద నామము లగు
డోలు నాఁగను విలసిల్లు ఢోల పేరు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ

దండె దండియ—ఇవి దండవాద్యమునకు (దండాకారము గల యొక వాద్యము నకు) పేర్లు

తంబురా—ఇది తుంబరకు (తుంబరమునకు శ్రుతికై వాయించు తంత్రీ వాద్యము నకు తంబురకు) పేరు

డక్క డక్కి—ఇవి ఢక్కకు (యశఃపటహమునకు డంకాకు) పేర్లు

ఆవజము—ఇది ఆరజమునకు (ఈపేరు గలయొక చర్మవాద్యమునకు) పేరు

డవిణ—ఇది డిండిమమునకు (జయాదులను సూచించు ఒక చర్మవాద్యమునకు) పేరు

డమరుగము—ఇది డమరువునకు (యోగికాపాలాదికులు వాయించు చర్మవాద్య విశేషమునకు) పేరు

తమ్మటము తమటము—ఇవి తమటమునకు (గంభీర మగు మహాధ్వని గలపెద్ద చర్మవాద్యమునకు) పేరు

తుడుము తముకు గిడియ నరగజము—ఇవి తమరవిశేషములకు పేర్లు

డోలు—ఇది ఢోలకు (వివాహాదులయందు వాయించెడి మద్దెలవంటి యొక చర్మ వాద్యమునకు) పేరు

దండియ — ఆము ఈవాద్య విశేషమూను ఇట్లు పేర్కొనినది మృదంగం బుపాంగం బావజంబు దండె తాళం బురుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణ వాసెగ్రోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబు డక్క డుక్కి చక్కి చుయ్యంకి లో నగున సంఖ్యాత వాదిత్రత్రితయ పరంపరలు మొరయ (4 35) ఇచ్చట దండె-తంబుఅ- అని వేద వ్యా వెనువెంటనే ఆం భా తంబుర వచించు చున్నది ఇది తంబుర అనుట యెట్లు? ఆం భా ఇందులకు ప్రమాణ మగుం యెట్లు ప్రయోగములుగూడ- దండె తంబుర వే అను చున్నవి తంబుఅలు కిన్నెరలు రావణహస్తంబులు రజాబులు మీటు సురతానులు కామాక్షులు ముఖవీణలు పిల్ల గ్రోవులు దండెలు డక్కిలు

(ప్రబంధ 60౦) (సూ ని) ఆవజం బన నొప్పు నావజంబు అను పాఠముతో ఆం భా ు ప్రమాణీకరించి ఆవజము- రుంజ అనియు వేద వ్యా రుంజ ను వేఱుగా వచించు చున్నది ఆం భా ( చూ 28 ) ఆవజము రుంజ కాదు వేఱు

ఢక్క — స్యాద్ యశఃపటహో ఢక్కా అని (అమ) నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపఞ్చవారమ్ (నందికా) మున్నగుచోటులందలి ఢక్క- డమరువు అది అర్థాంతరము దీనికి (చూ సూ ని)

తంబురా —(సం తుమ్బురమ్ ి తంబూర త తంబురు) తంతి+బుఱ్ఱ అని వ్యుత్పత్తి చెప్పి శకట రేఫముతో శ ర చి ని గ్రహించినవి నిర్ధారకము లేదు' అని (సూ ని) తంబురా యన గను దంబుర దగు ఆం భా (ప్రా తప్రతిపా) అనియు (సూ ని) ఇది (పాతాం) తంబుర (రూపాం) ప్రయోగ మి ట్లున్నది- వెనుకం బురుహూతు దెసం దన తంబురవలన గెలిచె నానాగతులకా మనతుంబురు నీ వెన్న డు విన ఎంబురుహాక్షి వే డు విను మని పలుకన్' (కువల 4 07) (చూ సూ ని)

ఆరజము — ఆవజం బన నొప్పు నావజంబు అని వావి పా ఇట్లే ఆము వ్యాఖ్యాతలు- మొ గూడ గ్రహించి తమవ్యాఖ్యానముల సాగించినారు ఆవజము సం పదము గా నిఘంటువులందు లేదు శ ర ఆరజము సం పదము గా గ్రహించి- కాంస్యమర్దలమురజారజాదివివిధధ్వను లేపున అనుభాగవత ప్రయోగ ముదాహరించి ఈపద ప్రయోగ మపూర్వము ఇంకను విచార్య మను చున్నది సూ ని - ప్రా- ఆరజ్జ అం చి ని ఒని తె ు గుపదమె ఇది అనినది పై నుదాహరించిన- (భాగ 0 ఉ 00) ప్రయోగము నుదాహరించి తత్సమ మనుటకు మఱి వేఱుప్రమాణ మేదియు గాన రా దనియు ననినది పల్లక్యాదులు గొన్ని సంస్కృతము తెలుగు- రెండును గల వని తెలుగువ్యాకర్త లుదాహరించు చున్నారు ఆం-భా కర్త ఇట్టివి గ్రహించి నా డు అట్టిదే యిది యగు నని ఆవజంబు ను ఆరజంబు' ను గా ఒనర్చితివి ఆరజము ప్రకృతి ఆవజము- వికృతి అని కూడ ఒకరు

తమ్మటము — వా తప్పెట తమ్మటము అని చి ని శ ర లు (చూ సూ ని డప్పు) తప్పెట వేఱు గా ఇచ్చు చున్నది వాద్యవిశేష మని ఆం భా (చూ 28)

తమ్మటమునుగూర్చి ఒకకవి ఇట్లు వర్ణించుచున్నాడు- అతితుములతమ ఢమామికా తమ్మట భేరికా పటహ తుత్తుంభి కాదివాదిత్ర గంభీరఘోషసంరంభంబు (వసు 6 9) (చూ సూ ని)

డవిణ — రవిణ (రూపాం) గ్రహరాజుటథముమంగల జయాంకంబుగా చాకొల్పు వజ్రంపురవణ యనగ (భాను 3 83) (చూ శ ర) ఇచ్చట డవిణ అనినను సరిపడును (శ ర పా) ఇది యనుచు సూ ని పాఠాంతర ముండుట సూచించినదన వచ్చును ఇంతకంటె దీని కాధారము వేఱుగా ఏమియు లేదు ఆం భా కిస్త్ర కిట- డవిణ లనుపాఠమే ఉపలబ్ధమై ఉండును అందులకె ఆతడు రవిణ గ్రహింపక వదలినాడు

డిండిమము — రాయిడిగిడిగిడి అనువాద్యవిశేషము-అని శ ర ఢమామా అని బ్రౌ పగుల గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క- అని శ్రీనాథుడు దీనిని బట్టి ఇది ఢక్కా-విశేష మని తెలియవచ్చును చర్మవాద్యములు లోహవాద్యములు గా గూడ కవులచే వర్ణింపబడుచున్నవి- క్రొక్కారుమెఱుగు లుక్కున స్రుక్క గాఁజేయు వెలదుకల్ బంగారువీరణములు (యయా 4 59) మొ

డమరుగము — సూ ని డమారము (వి డమరుగము సం డమరుక ప్రా డమరు ఓ క డమరుగ త డమరుకం) డమరువు చర్మవాద్యవిశేషము అని ఆం భా ను ఇచ్చినది డమరువు అనువానికి డమ్మని మ్రోగునది-డమరుగము బుడుబుక్కలవాడు వాయించువాద్యము అని అర్థమిచ్చినది బుడుబుడుక్క ముందు వచింపబడుచున్నది అది వే అనవలయును

తమటము — (త తంబట్టమ్ క తమటె తప్పటె) అని సంస్కృతనిఘంటువులందెందును ఈపదము కానరాదు కాని ఈక్రిందిప్రయోగములలో సంస్కృతసమాసమధ్యమున కనఁబడుచున్నది-అవి ఆప్రయోగముల నుదాహరించినది సూ ని శ ర తమ్మట తమట శబ్దములు రెండును సంస్కృతశబ్దము లని రాజకన్యావివాహే తు కేవలం తమ్మట ధ్వని అనుచాటువును శంఖకాహళభేరీపటహఝల్లరీపణవమర్దళతమ్మటప్రముఖనిఖిల వాద్యనిర్ఘోషంబులును (కిలా 7ఆ 69) తమటనిస్సాణమృదంగభేరీశంఖరవములు బోరన రహిఁ జెలంగ (రుక్మాం 2) ప్రయోగముల నిచ్చె ప్రయోగములిట్లున్నవి కొందఱు తమట తమ్మట శబ్దములను దేశ్యములుగా వ్రాసియున్నారు

అనినది ఈ త్రావా త అం భా ను లక్ష్యీకరించినదే కావచ్చును తమరాభిధానంబు అని అం భా పా ఇచ్చియు తమర శబ్దమును గ్రహింప లేదు (సూ ని) అం భా ఇచ్చిన సంస్కృతపదము లెన్నో నేటినిఘంటువులందు కానరావు అంతమాత్రమున అవి లేవనుటకువీలు కాదు ఎన్నోనిఘంటువులు నష్టమైనవి మననిఘంటువిజ్ఞాన మసమగ్రము తమరము-తప్పెటయే ఐనను ఎటహము ఇది సమానములు కావు పై ప్రయోగము లలో రెండును వేఱు గా గ్రహింప బడు చున్నవి భిన్నము లనక తప్పదు భేదము చెప్పవలయును ఎందులకె పటహ మన లేదు లం భా పటహాడంబరా యుద్ధ అని వైజ విశేషవాచకము గా ఎటహమును ఉదాహరించు చున్నది నిస్సాణము-పటహము అన్యము తమరము అనవచ్చు నేమో

ఢోల — ఢోలపేరు అని (వావి పా) ఢోలు అనుదానికి ప్రకృతి గా సంస్కృతమున ఢోల అను శబ్ద మున్నది (చూ సూ ని) అదియే ఇట ఉండి యుండును డోల అనుట వ్రాయసకాండ్ర ప్రమాద మన దగినది డోల శబ్దమునకు ఉయ్యేల అనెడి యర్థమే ప్రసిద్ధము డోలా యానాన్తరె నీల్యాం అని (విశ్వ) అర్థాంతర కల్పనకై ప్రాకులాడుట సముచిత మనిపింప లేదు అందులకే ఢోల గా దీనిని నేను గ్రహించుకొంటిని

తముకు — తుముకు అని బ్రౌ (అప పా) తరలి ర మ్మనిన జే తమ కొక్కటియ కాని పేర్కొన వెఱుతురు పెదదమాయి (చంద్రా అ) (చూ శ ర) తముకు వేయు మొ ప్రయోగ వ్యవహారదృష్టములు టముకు అని వాడుక

నరగజము — నరగ యొక్క (రూపాం) అని శ ర నరగ- దే వి వాద్య విశేషము భేరి అనికూడ అనినది శ ర నరగ- ఆనద్ధ భేదము అని బ్రౌ సూ ని నరగజము నకు మురువుతో ఘోటకములమీద వచ్చు నరగజంబులు మీఱు నన్నూఱు కోట్లు రం రా యు (చి ని)- అని ఒక ప్రయోగము విచ్చినది

దవిణ నుల్లసిలు ఇచ్చట రలయో ర్డలయో స్తద్వ త్స్యా దభేదేన కల్పనమ్ అని డ-ల ల కభేదము పాటించి యతి చెల్లింప బడినది అప్పకవి దీనికి లక్షణ మిట్లు వచించినా డు- పెద్దలాకును దనకు నభేద మగుట ళకలకు నభేద మట్లన కలుగుకతన

క్షితిని మూఁడవసరళంబు యతుల బ్రాసములను లఘ్వలఘులకారములకు నిలుచు

(3 ఆ)

సీ. డుబుడక్క యనఁగ బుడుబుడుక్క యనఁగ హు
డుక నాఁ దనర్చు హుడుక్క పేరు
గుమ్మెత యనఁగను గుంభవాద్యము దోఁచు
మద్దెల యనఁ దగు మర్దళంబు
జమళిగ యంచన యమళిక విలసిల్లు
బంబ యంచనగను బణవ మెసగు
బరగుచు నుండు డంగుర మన రుంజ నా
వీరాణ మనఁగను వీరణంబు

గీ. కవడె యన నురుమ యనఁగ గరిది యన గఁ
దప్పెట యనంగ వాద్యభేదములు చెల గుఁ
దనరుఁ జుయ్యంకి కైముడి యనఁగఁ దాళ
ముజ్జ్వలతరాంగ శ్రీమాతృభూతలింగ 28

డుబుడక్క బుడుబుడుక్క హుడుక—ఇవి హుడుక్కకు (వాద్యవిశేషమునకు ఉడుక్కకు) పేర్లు

గుమ్మెత—ఇది కుంభవాద్యమునకు పేరు

మద్దెల—ఇది మర్దలమునకు (మృదంగమునకు) పేరు

జమళిగ—ఇది యమళికకు (చర్మవాద్యవిశేషమునకు) పేరు

పంబ—ఇది పణవమునకు (ఒక చర్మవాద్యమునకు) పేరు

డంగురము రుంజ వీరాణము వీరణము కవడె ఉరుమ కరిది తప్పెట—ఇవి (చర్మవాద్యవిశేషములకు వేఱువేఱు చర్మవాద్యములకు) పేర్లు

చుయ్యంకి కైముడి—ఇవి తాళమునకు పేర్లు

గుమ్మెత — చిన్నచర్మవాద్యము తుడుము (దీపిక) అని బ్రౌ తుడుము అనియే అర్థమనినవి (శ ర నూ ని) తుడుము మద్దువు వాద్యవిశేషము- అని (సూ ని) మద్దువు-పెద్దడమరువు-లని (గుణ) తుడుము-గుమ్మెత వే అను చున్నది హంస వింశతి- గుమ్మెత ల్గిన్నెరల్ గూడి వాయించు భై రవ జోగిజంగాలు ప్రబలి కదల (3- 89) కుంభవాద్య మిది యని ఆం భా అను చున్నదికాన కుండవంటి యాకారము గల వాద్య మిది యన వచ్చును తుడుము ఇది యనుటకు పై (హంస) లంగీకరింపదు గుమ్మెట దీనికి పర్యాయము- తటపెట దిమికిటధ్వను లోలి బుట్టింప జాలుగుమ్మెట చంక వ్రేలు చుండ (క్రీడా 276) మొ ఇట గుమ్మెత అనినను బాధ లేదు దీని కగు ప్రయోగము లన్నియు ఇట్లు సరిపడునవియే గుమ్మెతకాడు గుమ్మెతగుడారము ప్రయోగములందు దృష్టములు గుమ్మెటకాడు అనురీతి ప్రయోగములు మృగ్యములు (త కుమ్మటం) అనునదియే గుమ్మెట లనుటకు ఆధారము ఆం భా కర్త పైయభిప్రాయముతోనే గుమ్మెట గ్రహింప లే దేమో ఆతనికి ఈ ప్రయోగములకిడ గుమ్మెత అనియే పార మగపడి యుండె నేమో

హుడుక్క — (సం హుడుక్క త హుడుక్కై) ఉడుక్క ఉడుక (రూపాం) (చూ బాలవ్యా ప్రకీ 08 సూ) విన సొంపగుధ్వని కలిగి దేవతావేశాదులయందుపయోగింప బడెడి చర్మవాద్యవిశేష మిది ఒకకవి దీని నిట్లు వర్ణించినాడు తాలకరి చూపు లిం పొసగు ధూమము లై పయి బర్వ గంధరో జ్జ్వలకలనిస్వనం బుడుక చాల్రొద యై విన వేడ్క దార్ప బూవిఱ గలవేల్పురాసివము వేగమె పూనికి రేచి మత్కుచా చలయుగరంగవీథి ఘనసంభ్రమతన్ నటియింప నూన్చెదన్ (చంద్రికా 2 47) (చూ సూ ని) హుడుకు అని వావి అపపా బ్రౌ హుడుకు హుడుక్క రెండును గ్రహించినది సూ ని దీని స్వరూపము నిట్లు వివరించినది-సన్న మగునడిమి భాగము కలిగి విరివి యగు రెండు తుదలందు తోలుతో గప్ప బడిన చిన్న వాద్యవిశేషము (అని) తప్పెట అని బ్రౌ

జమళిగ — సూ ని దీనికి- జమలిక జమళిక జమళిగ జమిడిక జమిళిక అను (రూపాం) ఉదాహరించు చున్నది ఇందు జమిడిక కు మాత్రము ఒంటికంటి యురమ పంబ జమిడిక తప్పెట గిడిబిడి తుడుము చక్కి చుయ్యంకియును (హంస 3 29) అని ప్రయోగ మిచ్చినది జమలిక జమిలికె-అనద్ధము కంజరివంటిచర్మ వాద్యము అని బ్రౌ

పంబ — గొల్లవాండ్లు వాయించే ఒక తరహా చర్మవాద్యము ఒని బ్రౌ (చూ అను)

వీరణము — వివాహాదులయందు ముఖ్యము గా ఉపయోగింపవలసిన ఒక చర్మవాద్యము ఆనద్ధవిశేషము సుమతిశతకము దీనిని గూర్చి ఇట్లను చున్నది- కారణము లేని నగవును బేరణమును లెని లేమ పృథివీస్థలిలో బూరణము లేని బూరెయు వీరణములు లేనిపెండ్లి వృథరా సుమతీ (37)

తప్పెట — ఇది పటహము కాదు వే ఱొక వాద్య విశేషమో పటహవిశేషమో (ఇది) కావలయును ఇట్లను చున్నది హంస పటహ ఢక్కా హుడుక్కా నిస్సా ణ పంబ జమిడిక తప్పెట (హంస 3 29)

ఉరుమ — (త ఉఱుమి) తప్పెటవలె గుండ్రము గా ఉండెడిదియు చుట్టు వంపఁబడిన పట్టెకు సందు ల్చేప్పబడి యాసందులలో కంచుతే కుల బిళ్లలు రెండు మూడు గూర్చి నదియు నైన చర్మవాద్యవిశేషము (ఖంజరీ) అని (సూ ని)

చయ్యంకి — తాళము చయ్యంకి వేఱు గా వచిం౧ తాళవిశేషము చయ్యంకి అను చున్నది-హంస తప్పెట గిడిబిడి తుడుము చయ్యంకియును తాళము మహోత్తాళంబు లును (3 29) ఇది డోలు క్రోలు గుమ్మెట తమ్మట తప్పెట గిడియ తుడుము అవి గుమ్మెత-తుడుము కూడ వే అను చున్నది

సీ చిటితాళ మనఁగను జెంగు నా జేగంట
యన వాద్యభేదంబు లలరు చుండుఁ
గాశె కాళ యనంగఁ గాహాళి విలసిల్లుఁ
బూరుగ యం చన బూరు వనఁగఁ
గాహాళీ భేదముల్ గ్రాలుఁ బిల్లనగ్రోవి
వానెగ్రో లనఁగను వంశనాళ
మలరు నాగస్వరం బగు నాగసర మన
గంట యనంగను ఘంట యొప్పు

గీ సుతి యనఁగఁ దిత్తి యనఁగను శ్రుతి దనర్చు
నాటకత్తె యనంగను నాటరి యనఁ

బాతర యనంగ నర్తికి పరఁగు చుండు
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 129

చిటితాళము చెంగు జేగంట—ఇవి వాద్యవిశేషములకు పేర్లు

కాళె కాళ—ఇవి కాహళికి (ఊఁదెడి యొకవాద్యమునకు (బాకాకు) పేరు

బూరుగ బూరువ—ఇవి కాహళీభేదమునకు పేర్లు

పిల్లనగ్రోవి వానెగ్రోలు—ఇవి వంశనాళమునకు (వేణువునకు) పేర్లు

నాగసరము—ఇది నాగస్వరమునకు (పాముల కానందము కలుగునట్లు పాములవాఁ డూఁదుబుఱ్ఱకు) పేరు

గంట—ఇది ఘంటకు పేరు

సుతి సుత్తి—ఇవి శ్రుతికి (శ్రుతికై ఊఁదెడి చర్మకృత మైన యొక గానసాధనమునకు ఉపాంగమునకు) పేర్లు

ఆటకత్తె ఆటరి పాతర—ఇవి నర్తకికి (నటికి) పేర్లు

కాహళి —విశ్వ మి ట్లను చున్నది- కాహళీ తు తరుణ్యాం స్యా త్కాహళం భృశ శుష్కయోః వాద్యే భాణ్డవిశేషే తు కాహళా కాహళ ఖలే (అని) ఇట వాద్యభాణ్డే అని (వావి 968ప్ర అప పా) కాహళా అని టాబన్తము గా ఇది ఉదాహరించు చున్నను జీషన్తము గా గూడ ప్రయోగములందు నిఘంటువులందును ఇది దృష్టము కదళీలలితస్తమ్భ సుకుమారోరు మీశ్వరీమ్ లావణ్యకాహళీతుల్య జఙ్ఘాయుగళమణ్డితామ్ (చూ ప్రౌ (కాహళము) తెలుగుకవులు గూడ త్రికవులకు జతుష్కవులకు ప్రకటంబు గ నెందు నీవ రాజ వనుచు గౌ తుకమునఁ గాహళికువి పో లికఁ దాదద్బిరుదకాహళిక పూరించెన్ (పరమ 6 9 ) (చూ సూ ని ) శ ర తెలుగు కావ్యములందు వాద్యార్థమున పుంలింగము గా గూడ ఇది ఉపయోగింప బడు చున్న దని పణవ మర్దళ శంఖ పటహ కాహళ వేణు భేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగ (భాగ 0స్కం పూ ) మొ అను చున్నది

చిటితాళము — వాయించుట కుపయోగించుచిన్నతాళము ప్రమానితో చెనతాళవిశేషము అని శ ర చిన్నకంచుతాళము - అని చి ని చిటితాళములు చెంకపుటికి నొక్కొక మాటు గతిరయంబున దా కి కలం మొఱయ (ఆము 6 6-) (చూ సూ ని)

చెంగు — వాద్యభేదము దీనిని మోర్చెంగు ఉంటారు -అని బ్రౌ (చూ అను)

జేగంట — జయాదులు ప్రకటింప వాయించుగంట వెల్వులు సాట నెత్తుజేగంట తెఱంగునం దొలిచె గైరవబంధు డు బంధురద్యుతిన్ (భా రా యు 274) అని (సూ ని) గెలుపులో నగుసమయములందు కొట్టెడుపెద్దఘంట అఽయ వెన్ను దె దేవ రని వేల్పుగమి చాట గా నెత్తుపై డిజేగంట యన గ (యు 2 0౨) అని శ ర

బూరుగ — బూరగ -అని శ ర తెలు గునిఘంటువు లొంటకి రెం డి ట్లను చున్నవి- బూరుగు నా గను బూరుగుప్రమానికి నూ దెడి బూరకు నొనరు (వేంక నానా 23) బూరుగు నా నూ దువాద్యమును శాల్మలియుఁ (ఆం సం నానా 2) బూరుగ బూరువ - అనియే ఆం భా అను చున్నది వనౌ వర్గమున గూడ బూరుగ -ఉనియే శాల్మలికి నామ మొస గిన దిది- బూరు గం చన గను గొండబూరుగ యన (2 47) కొండ బూరుగ యనునది బూరుగ అనియే పదవిభజన మను చున్నది బూరువు (శాల్మలి) అని శ ర (ఆం సం మొ) ఇట బ్రౌ బూరగ-బూర అని గ్రహించి విగ్రహకాగ్రవోదగ్ర హయగ్రీవ గ్రీవా మహోగ్ర హేషా భీషణతా క్రూరంబులైనబూరంగలరవంబును అని (తారా 5 2) ప్రయోగ మిచ్చు చున్నది శాల్మలి అనునర్థమునఁగూడ- బూరగచెట్టు బూరగమాను బూరగదూది ఉనియే అను చున్నది బూరుగు గ్రహింప లెదు ఇచ్చటమాత్రము- బూరువు కాహళిభేదము తుతారా ఆం భా అను చున్నది (చూ అను) ఇది సరి యనిపించుట లేదు బూర బూరగొమ్ము ఇత్యాదులు ప్రయోగదృష్టములు (సూ ని) బూర బూరగ-(సం పూర ప్రా వూరో) అని అపుడు కో తులతే డు వాయనికదంక నారెకులచేత వడగమ్మ లనిచి యెల్ల కోనత్రిమ్మరిమూ కల గూడ బెట్ట రీవి మెఱయంగ బూరవట్టించి తరలి (అచ్చ రా కిష్కి 7) ఉదాహరించు చున్నది తారలు బూరగొమ్ములును దప్పెటలుం బటహంబులుఁ బదుల్ నూఱులు వేలు మ్రోయ (రామా 8 69) మొ ఇది యంతయు జూడ- బూరుగ కు (రూపాం) బూరుగు బూరగ కూడఁ గల వనిపించును బూర అనునది ఆం భా కు తరువాతికవులప్రయోగమునకు చెందినదే

అనిపించును శ ర సూ ని ఉదాహరణములనుబట్టి వేంక బూర పేర్కొను చున్నది ఈనిఘంటువును తరువాతిది ఎందులకే ఆం ధ్రా దీనిని ఏతత్పర్యాయముగా గ్రహింప లె దనిపించు చున్నది

నాగసరము — సూ ని పాముల కానందము కలిగించెడు స్వరవిశేషము -అని అర్థమిచ్చి ఈ ఆం ధ్రా ఎందులకు ప్రమాణ మను చున్నది ఇది ప్రమాదము నాగ సింధు ప్రభేదనానావరాట రాగగంధర్వలహరికారంభణముల మిహిపదంబు గ౯ బాములమెంగ దూ దె భోగిరాజులు నర్తింప నాగసరము (క్రీడా 224)మొ ఈ ఆం ధ్రా కు ఉదాహరణములు [నాగసరము- పాములవా దూ దెడుబుఱ్ఱ 2 సన్నాయి- కంచుకొమ్ములు మూరగలు నాగసరము లంచితపటహ కాహళములు సరుమ (నల 2భా) -అని శ ర సన్నాయి అనునది దీనికి (అర్థాం)]

సీ ఆట యం చన౯గ నాట్యం బొప్పు౯ గోలాట
మన౯గ హల్లీసకం బలరు చుండు
నాట్యభేదంబులనామము ల్దనరు జ
క్కిణి గుజరాతి పేరణు లనంగ౯
గంట యం చన౯గను గట్టర మన గను
నాట్యబంధం బొప్పు నాట్యయోగ్య
శబ్దసంతతిపే౯ జను జతు లం చన
నుగ్గళిం పన గ౯ దదుక్తి వెలయు౯

గీ గోపు లన సారు లన౯ దీరుకు లన వెలయు
నాట్యగతిభేదములపేళ్ల నాగవాస
మన౯గ భోగపు౯జెలులగుం పైనమేళ
జతకు౯ బే రై చెలంగును జంద్రదమాడ 130

ఆట— ఇది నాట్యమునకు పేరు

కోలాటము—ఇది హల్లీసకమునకు(స్త్రీలు పాడుచు చేతికోలలతో తాళము వేయుచు గుండ్రము గా తిరుగుచు ఆడెడిఒకయాటకు) పేరు

జక్కిణి గుజరాతి పేరణి—ఇవి నాట్యవిశేషములకు పేర్లు

కంట కట్టరము—ఇది నాట్యబంధమునకు(నాట్యమునందలికట్టునకు) పేర్లు

జతులు—ఇది నాట్యమునకు యోగ్య మగుశబ్దసంతతికి పేరు

ఉగ్గళింపు—ఇది తదుక్తికి(అశబ్దములను(నాట్యయోగ్యశబ్దములను-తద్దిత్తాదిపదములను) పలుకుటకు) పేరు

కోపులు సారులు తీరుకులు—ఇవి నాట్యగతివిశేషములకు(నాట్యమునందు నడచునడకలలోని భేదములకు) పేర్లు

నాగవాసము—ఇది బోగమువారు గుంపు గా ఏర్పడిన మేళముజతకు(బోగపు మేళమునకు) పేరు

హల్లీసకము—ఇది రెండువిధములు కోలాటము 2 తాండవము- నారీణాం మండలం నృత్తం హల్లీసక ముదాహృతమ్ ఆడంగులు వర్తులము గా నిలిచి ఆడేఆట కోలాటము- అని బ్రౌ హల్లీసకం తు తత్రోక్తం బాహూ ముద్యమ్య తాణ్డవమ్ చేతులు పొడుగు గా ఎత్తుకొని ఆడేతాండవము అని బ్రౌ

కోలాటము—క్రిందిప్రయోగమున పురుషులయాట గాఁ గూడ ఇది తెలియవచ్చుచున్నది కోలాటములు పిల్లగ్రోవులు గుమ్మడి క్రోవికూతలు నూదు గ్రోవులు ఆడుకొనుచు జదువుపై సంధ్యపై నాస్థ చాల లేక పొలతి యీరీతి నే ట్రొద్దుపుచ్చుచుండ (హంస 3 46)

జక్కిణి—లాగు మైసిరియు బల్లటియు గత్రియు బెళుకు విలసిల్లు జక్కిణీవిధ మొకర్తు (ఉ రా 6 39) లాగు మైసిరి పల్లటి కత్రి బెళుకు-అనునవి జక్కిణీనాట్యమునకు అంగములని తెలియ నగును ఇచ్చట- మైసరి అని సూని గ్రహించి పైఉ రా ప్రయోగమునందును మైసరి యే పారమను చున్నది నిర్ధారకమేమియు లేదు

గుజరాతి — కులిశాయుధుని నిండు గొలువులో గుజరాతి మేలుకోపుల గొంతమెప్పు వడస (ఉ రా 4 70) ఇందువలన అందము లైనగతివిశేషములు వెలువరింప నైననాట్యవిశేష మిది యని తెలియ నగును

కంట కట్టరము — నాట్యభేద మర్థము- అని బ్రౌ (చూ ఆను) బంధ మనుట కైనప్రమాదము భేద మనవలయును

జతి — గాననాట్యయోగ్యశబ్దసంతతి అని శ ర అర్థ మిచ్చి మొరడులు చిగిరింప గ జాల్ తెరల గ జిత్తరువుబొమ్మ తెగ దల లూ ఎగ తెలవలతలమానిక మే డ్తె ఆ బాడుచు వీణపై జతిం బలికించెగ (చెన్న 2 237) అనుప్రయోగ ముదాహరించి నది గాన యోగ్యశబ్దసంతతి-అనునది అర్థాం ఇందుల కిది ఉదాహరణము-అని సూని బ్రౌ ఇట నాట్యయోగ్యశబ్దసంతతి నాట్యార్థశబ్దములు- పాత్ర ఆడ గానట్టువుడు చెప్పేమాటలు-అని అర్థ మిచ్చి-ఆం భా కి (చెన్న) ప్రయోగము లక్ష్య మను చున్నది

ఉగ్గళింపు — ఉగ్గడింపు (రూపాం) ఉగ్గడించు క్రియకు( నాట్యమునందు అయను సూచించుశబ్దములను) పలుకు - అనునర్థ మిచ్చి తొలుత సుతి కోయిల మొసంగ దోడ గోరు వంక తాళము లుగ్గడింపంగ నెమిలి సకియ నటియింప మరునాట్యశాలలీల బంతువగ( బొల్చు గేళిగృహాంతరమున (ప్రబంధ 706) (శశాం 3 2) (చూ సూ ని) తాళము ఉగ్గడింపన్-తాళానుగుణము లగునాట్యోక్తులు పలుక గా అని వచించిన ఆం భా కిది లక్ష్య మన నగు నని తో చు చున్నది శశాంక ప్రయోగమున నాట్యప్రసక్తి కలదు నాట్యములందలిగానములే యివి వేఱు గానోక్తు లిట అర్థ మనవలసియున్న అది అర్థాంతర మనవలయును

పేరణి —ఇది ఛాందోపరినృత్యము ఉత్తరహరివంశము దీని నిట్లు వర్ణించినది- వడ( కుపన్నగరాజుపడగలమీ ద స ర్వంసహాకాంత పేరణము సూప నుఱ్ఱూ త లూ(గెడు నుదయాస్తగిరులతో నాకాశలక్ష్మి కొలాట మాడ దెర లెత్తి సప్తసాగరములు బొరల(గ వరుణుండు గొండిలి పరిఢవింప మొకములచాయ వే తొకచందము గ నిల్పి కమలసంభవుడు పెక్కణ మొనర్చ (4 2 6) (ప్రేంఘణ మొనర్చ అని (96 వావి ప్రతి) వాల్మీకి చరిత్ర- నృత్యముల నిట్లు పేర్కొను చున్నది- పే

రణి దండలాస్యమును బెక్కణి కుండలి నా జతుర్విధోదారము లైన నాట్యముల (వాల్మీ 3 5 ) (చూ హూ ని ) పెక్కణ మొనర్ప అనియె ఉ హరి (శ ర పా ) (భార విరా 240) పద్యమున గూడ ప్రెక్కణ మనియే (సూ ని ) శ ర లోమాత్రము ఒందుపనులకు సెలవు లె కునికి జేసి యభ్యసించితి శైశవ మాది గా గ దండలాసకవిధమును గుండలియును బ్రెంఖణంబుతెలంగును బ్రేరణియును ఒని అగపడు చున్నది సం ప్రేంఖణము వికృ ప్రేంకణ శిరముల గిలశముల్ చేర్చి కొందఱు భక్తు లొక్కొడ బ్రేంకణవ్ ద్రొక్క గాను (వేంక పా 2 ˜ ) (చూ హూ ని ) ప్రేంఖణము గూడ కుంభనృత్య మను చున్న దిది అభినయము తోడి భావసూచకనృత్యము గా ఉ హరి దీనిని వర్ణించు చున్నది ఆం భా కు అదియే అర్థము

కోపు —దీని కొకచక్కని ప్రయోగ మి ట్లిచ్చినది సూ ని లాస్య మొనరించె నక్కమ లాస్య యపుడు కోపు కోపున దొర లెల్ల దోఁపు లౌస గ (వై జ 29 )

సారులు — సారు (ఏ )

నాగవాసము — నాగవాస మన గ నామ మౌ వేశ్యాజ నంబు మేళమునకు (ఆం సం మాన 8 )

సీ మాతంగనాట్యనామం బగుఁ జిందు నా
　　　దరు వనంగను ధ్రువ దనరు చుండు
గరగరిక యన సింగార మనంగను
　　　శృంగారనామంబు చెలఁగు చుండు
బీర మనంగను వీరము విలసిల్లు
　　　నక్కటికం బన నక్కస మన
నిబ్బరిక మన గ నికరం బనంగను
　　　గారుణ్యసంజ్ఞయై మీఱు చుండు
గీ నగవు నవ్వు కేరింత నాఁ దగును హాస
మలఁతినగ వన లేనగ వన ముసిముసి
నగ వన ముసినగ వనఁ జిర్నగ వన నెల
నగ వన స్మితంబు రాజిల్లు నాగభూష 31

చిందు—ఇది మాతంగనాట్యమునకు (మాతంగు లొనర్చెడి నృత్యమునకు) పేరు

దరువు—ఇది ధ్రువకు (గీతివిశేషమునకు) పేరు

గిరగరిక సింగారము—ఇవి శృంగారమునకు (శృంగారరసమునకు) పేర్లు

బీరము—ఇది వీరమునకు (వీరరసమునకు) పేరు

అక్కటికము అక్కసము నిబ్బరికము కనికరము—ఇవి కారుణ్యమునకు (కరుణరసమునకు కృపకు దయకు) పేర్లు

నగవు నవ్వు కెరింత—ఇవి హాసమునకు (హాస్యరసమునకు నవ్వునకు) పేర్లు

అలఁతినగవు లేనగవు ముసిముసినగవు ముసినగవు చిర్నగవు ఎలనగవు—ఇవి స్మితమునకు (మందస్మితమునకు చిఱునగవునకు) పేర్లు

ధ్రువ — ఇది ఒక గీతివిశేషము గా నిఘంటువులందు పేర్కొన బడు చున్నది- ధ్రువా గీతిస్రుగ్భేదయో ఽం ఽని (విశ్వ) ము ధ్రువ కైన తద్భవమే దరువు— పనివడి నిచ్చలుం బరమభాగవతేంద్రులు తాన మాడి పో వునపుడు శౌరిమీ ది దరువుల్ సరసం బుగఁ బాడ (వరాహ 9 40) (చూ సూ ని)

చిందు — ఆవనీస్థలిలో జిందును మాదిగ ద్రొక్కను (వేమ 904) (చూ ప్రౌ అను) చిందులు ద్రొక్కుచు జెలగి నవ్వుచును గ్రందు గా గరతాళగతుల నాడుచును (ద్వి హరిశ్చ పూ 000 పం) చండాలకన్యకలనాట్యమే ఇది (మా సూ ని) కేవల నాట్యమునం దిది ఔపచారికము గా ప్రయుక్తము చిందులు ద్రొక్కు మొ-ఇట్టివే ఒకవిధ మైనపాటగూడ అర్థాంతరము దీని కని గీతంబు దరువు జక్కిణి చిందు మొదలు గా నొక్కొకవర్ణంబు సగ్గడించి (వి పు 7 277) మొ ఉదాహరించినది (సూ ని)

సింగారము — శృంగార వీర కరు ణాద్భుత హాస్య భయానకా అని ఈఁపట్టున అమరము రసముల బెర్కొనినది అంబా అమరమట్లే శృంగారవీరముల బే రెత్తి వచించినది అన్యముల నట్లు పేర్కొనక పోవుటవలన ఆయాకడ పేర్కొన బడినస్థాయి

భావములై వానికి వాచకము లగు నని ఆం భా భావించినట్లు తో చు చున్నది భావిసంజ్ఞా శ్రయణమున(సూత్రశాటకన్యాయమున) స్థాయిభావములయందే రసవ్యవహారము ఆలంకా రికసంమతము ఏకో రస కరుణ ఏవ ఇత్యాదులకడ అభిజ్ఞు లగువ్యాఖ్యాత లిట్లే యను చున్నారు అథ భైరవమ్ దారుణం భీషణం భీష్మం ఘోరం భీమం భయాన కమ్ భయంకరం ప్రతిభయమ్ అను-అమరమును వ్యాఖ్యానించుచు సుధ- నవ భయానక రసస్య భేదేన కీర్తనం త్వేషాం ధర్మమాత్రపరత్వాత్ భైరవాదయ స్తు ధర్మే ధర్మిణి చ వర్తన్తే ఇతి భేద అను చున్నది కారుణ్యం కరుణా ఘృణా కృపా దయా ఽనుకమ్పా స్యా దనుక్రోశో ఽప లో నగుచోట్ల గూడ సప్తకరుణరసస్య ఽనురీతివి వ్యాఖ్యానించు చున్నది దయాదులకును ఇవే నామములు ఇట్లే ఈపట్టున ఆం భా పద్య ములకును వ్యాఖ్యాన ముచిత మనిపించినది (గస) స్థాయిభావములను పైజ ఈపట్టున ఇట్లు వివరించినది స్థాయిభావాత్మకో రస శృఙ్గార హాస్య బీభత్స వీరా ఽద్భుత భయానకా రౌద్ర శ్చ కరుణ శ్చాష్టౌ రసా శ్శాన్తో ఽపి చ క్వచిత్ స్థాయిభావా క్రమా దేషాం రతి ర్హాసో జుగుప్సనమ్ ఉత్సాహో విస్మయో భీతిః క్రోధ శ్శోక శ్శమో ఽపి చ (భూమి శూద్రా ) గరగరిక వీరము-అనువానికడ సూ ని బ్రౌ శృంగారరసము వీరరసము-అర్థ మను చున్నవి తక్కినవిగూడ రసపరములు గా ఆయాభావములకడ నాచే వ్యాఖ్యాతము లైనవి

సీ వెక్కురు నాఁగను వికృతంబు విలసిల్లు
నాశ్చర్యసంజ్ఞ యై యలరు సోద్య
మచ్చెరు వక్కజ మబ్బురపా టబ్బ
మరు దరిది వెగడు వెఱఁగు సోద్దె
ము తటకాపాటు నాఁ బొలుపారు చుండును
నిర్భరాశ్చర్యంబు నివ్వె అనగ
ఘోరాభిధానంబు గొంరి మసంగను
బెట్టిదం బన గను వెలయు చుండు
గీ గోరగింత యనంగను ఘోరత దగు
సిగ్గు నా లజ్జ యనఁగను సిబ్బితి యన

నాన యనఁ బుచ్చడీ కనఁగాను లజ్జ
పొలుచుఁ గడ ధర్మి యౌ నొక్కపొంత నభవ 32

వెక్కురు—ఇది వికృతమునకు (వికృతికి బీభత్సరసమునకు జుగుప్సకు ఎవగింపునకు) పేరు

అలరు సోద్యము అచ్చెరువు అక్కజము అబ్బురపాటు అబ్రము అరుదు అరిది వెగడు సోద్దెము తటకాపాటు —ఇవి ఆశ్చర్యమునకు (అద్భుతరసమునకు విస్మయమునకు) పేరు

నివ్వెఱ—ఇది నిర్భరాశ్చర్యమునకు (మిక్కిలియాశ్చర్యమునకు) పేరు

గోరము—ఇది ఘోరమునకు (భయానకరసమునకు భయంకర మగుదానికి) పేరు

బెట్టిదము గొరగింత—ఇది ఘోరతకు (భయంకరత్వమునకు భయము కలిగించుటకు)పేరు

సిగ్గు లజ్జ సిబ్బితి నాన పుచ్చడీక—ఇవి లజ్జకు పేర్లు [ఇందు కడది-అనఁగా చివరిది ( పుచ్చడీక అనునది) ధర్మినిఁగూడ (సిగ్గరిని సిగ్గుకలవానినిఁగూడ) చెప్పును పుచ్చడీకతనంబు పోఁ బెట్టి గిరికన్య (మనుచ 2 9 ) మొ ]

వెక్కరు —గౌరన ఇట్లను చున్నాడు- కడ గి పేరడవుల గాయపం డ్లెరి కుడిచి వర్తించు వెక్కురుతాపసులకు బొడలకళాసంబొ బూదిబొక్కణమొ జడలొ రుద్రాక్షలో సంపద లేల (ద్వి హరిశ్చ పూర్వ 38 ) (చూ సూ ని ) వికార మైన అవి దీనికి అర్థము చెప్పి వెక్కురుబానిసె యైనన్ మక్కువతో దివ్యభామ (వేమ 285) అనిప్రయోగ మిచ్చినది బ్రౌ పైప్రయోగమట్లే వికృతి దీనికి అర్థ మనినను రోఁతకల దాసియే ఐనను అని అర్థము చెప్పవచ్చును జవ్వాదిసెట్టి-మొ వంటి దిది

గోరము — (సం ఘోరమ్) అథ భైరవమ్ దారుణం భీషణం భీష్మం ఘోరం (అమ ) ఇచ్చట సుధ- భయానకరసస్య అని వ్యాఖ్యానించిన దనుట పూర్వ ముక్తము- (చూ 3 )

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు
జళుకు జంకెన జంకు జడుపు జాలి
పుయిలోట జలదరింపు దిగులు వెఱ పఱ్కు
వెఱ యుత్తలము బీతు బెదరు బెగ్గి
లుట యంజిక యుదిల యటన నధృతి యగు
ముఖభీతి దగు మొగమోటనంగ
నదరు రన భయచలనాఖ్య యై విలసిల్లు
గరువము పొగరు కావరము గెబ్బు

గీ. త్రుళ్లు క్రొవ్వు తిమురు త్రుళ్కు మల్లరమ్ము
పోతరం బేపు నా గర్వ మొప్పు చుండు
నాము నాఁగ విరాజిలు నాఁకరంబు
పుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 33

తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి పుయిలోట జలదరింపు దిగులు వెఱపు అఱ్కు వెఱ ఉత్తలము బీతు బెదరు బెగ్గిలుట అంజిక ఉదిల—ఇవి అధృతికి (అధైర్యమునకు భయమునకు) పేర్లు

మొగమోట—ఇది ముఖభీతికి (సంకోచమునకు) పేరు

అదరు—ఇది భయముచే నగుచలనమునకు (వణఁకునకు) పేరు)

గరువము పొగరు కావరము గెబ్బు త్రుళ్లు క్రొవ్వు తిమురు త్రుళ్కు మల్లరమ్ము పోతరము ఏపు—ఇవి గర్వమునకు (మదమునకు) పేర్లు

ఆము—ఇది ఆఁకరమునకు (అహంకారమునకు నాయంతవాఁడు లేఁడను చిత్తౌన్నత్యమునకు మానమునకు) పేరు

ఆఁకరము—ఆకరము-వావి అపముద్రి (సం అహంకారము త అంకారం) (చూ సూ ని) గర్వో౽భిమానో౽హంకారో మానశ్చిత్తసమున్నతి అని ఉమ గర్వమునకు

మానమునకు వివరణ మి ట్లొసగినది గురు- గర్వో నామ కులైశ్వర్య రూప విద్యాబలాదిభి ఇష్టార్థవిషయ ప్రాప్తే నీచగోచర ఇత్యాచార్య పరతి ఉత్కర్షేణ చేతస ఉన్నతి ర్మాన యథా-ళూహో ఽస్మి అర్థవా న న్మతి ప్రణతియోగ్యేషు ఉన్నతి కథనం వా మాన ఇతి గర్వమానయో ర్భేద (మానము)నే నుత్కృష్టుఁడ ననుచిత్తోన్నత్యము పేరు ) (అని )

సీ మన్నన మన్నిక మన్నిం పనంగను
 బహుమానసంజ్ఞయై పరఁగు చుండు
నలు చన నెల్లిద మనఁ జౌక యనఁ దిర
 స్కారంబు రాజిలు నోరు పనఁగ
సైరణ యనఁగను సైఁపు డనంగను
 దాలిమి యనఁగను దాల్మి యనఁగఁ
దాళిక యన క్షాంతి దనరారు నోర్వమి
 యీరసం బనఁగను నీరస యన

గీ నీసు నా నూఁద నాఁ దగు నీర్ష్య వేర
మనఁగ బగ టన నొంటమి యనఁ బగ యన
నొప్పమి యనంగఁ గంటు నా నొప్పు వైర
ముద్ధృతకురంగ శ్రీమాతృభూతలింగ 34

మన్నన మన్నిక మన్నింపు—ఇవి బహుమానమునకు (గౌరవమునకు) పేర్లు

అలుచు ఎల్లిదము చౌక—ఇవి తిరస్కారమునకు (అగౌరవమునకు) పేర్లు

ఓరుపు సైరణ సైఁపుడు తాలిమి తాల్మి తాళిక—ఇవి క్షాంతికి (శాంతరసమునకు శాంతికి శమమునకు సహనమునకు) పేర్లు

ఓర్వమి ఈరసము ఈరస ఈసు ఊఁద—ఇవి ఈర్ష్యకు పేర్లు

వేరము పగటు ఒంటమి పగ ఒప్పమి కంటు—ఇవి వైరమునకు పేర్లు

చౌక —చవుక (యాపాం) (క చవుక త చవుక్కై) చులుకి చవు- యుఁ
మెల్లిద మన నొనరు లఘుత పేళ్లు (సాంబ మాన 24) చూ సూ ని)
ఊఁద —మనసున గల మెలోర్వనికాపట్యము- అని బ్రౌ (వివ)
యన నీరసం బన నీరస యన అని వావి పా (అపపా)

సీ. ప్రతివైరనామంబు పరఁగు సూడన గను
గరకరి చలము మచ్చర మనంగ
మాత్సర్యసంజ్ఞలై మనుఁ జుమ్మ కుతి జాలి
చూకురు కస్తి నా శోక మొప్పుఁ
గన లన బైడాల మనఁగను గిను పనఁ
గినుక యనంగను గిన్క యన గ
నలుక యనంగఁ జిం దనఁగఁ గాంతాళ మ
న గ రోస మనఁగఁ జిందఱ యనంగఁ

గీ. గన రనంగను గస రనఁ దనరుఁ గోప
మదియె చుఱుకైన రవరవ యనఁగ వెలయుఁ
బ్రణయకోపంబు పొలయల్క యనఁ దనర్చు
మోడి యనఁ గోపమౌనంబు పొలుచు నఖవ 35

సూడు—ఇది ప్రతివైరమునకు (మాఱువైరమునకు పగ సాధింపునకు) పేరు
కరకరి చలము మచ్చరము—ఇవి మాత్సర్యమునకు(పట్టుదలకు వదలనిపట్టునకు అభినివేశమునకు) పేర్లు
చుమ్మ కుతి జాలి చూకురు కస్తి—ఇవి శోకమునకు(దుఃఖమునకు) పేర్లు
కనలు బైడాలము కినుపు కినుక కిన్క అలుక చిందు కాంతాళము రోసము చిందఱ కనరు కసరు—ఇవి కోపమునకు పేర్లు
రవరవ—ఇది చుఱుకైనకోపమునకు(రౌద్రరసమునకు తీక్ష్ణమైనక్రోధమునకు) పేరు

పొలయల్క—ఇది ప్రణయకోపమునకు పేరు

మోడి—ఇది కోపముచే నైనమౌనమునకు పేరు

సూడు —బ్రౌ ప్రతివైరము విద్వేషము -అని అర్థ మిచ్చినది దీనికి (చూ ౹అను ) పగకు పర్యాయములను ఇదిఎలకు వేఱు - ఇచ్చినది ఆం భా (చూ 34 ) కావున ఇది వే అనవలయును మాఱువైరము కక్ష అన దగిన దిది

మాత్సర్యము — మత్సరము నకే స్వార్థికష్యఞ్ఞన్త రూప మిది మత్సరా మక్షికాయాం స్యా న్మాత్సర్యక్రోధయో ఎమాఞ అసహ్యాపరసంపత్తౌ కృపణే చా ఽభిధేయవత్ అని (మేదిని ) (చూ సుధ )

బైడాలము — పైడాలము అని బ్రౌ బైడాలము-బయిడాలము (రూపాం ) అని సూ ని శ ర లు ఇద మిత్థ మ్మనునిర్ధారకప్రయోగము లేదు

రవరవ — అవఅవ అని శకటరేఫముతో గూడ గ్రహించినది దీనిని సూ ని రెండిటికి (పారి 42 ) పద్యము నుదాహరించినది ఆపద్య మిది- కులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నీ వల నలరుక్మిణీరమణి వాం జెలంగ గ సత్యభామయుం గులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నా వల బచ రింప గా రవరవ ల్పొడమెఞ మది వారి కెంతయుఞ పరస్పరవిరుద్ధము గా దీని నుదా హరించుట యెట్లో అప్పకవి- శకటరెఫయుతమే ఇది యను చున్నా డు- అవఅవల్ అంపము అంతు (2అ ) అవఅవ అనియే శ ర ఐనను ఉన్నపారమును మార్చునంతటి ప్రమాణము కాన రాలేదు

మోడి — మూడవే కి న్నెత్తి పీడవే మోడిని పీడవే రావె సీపా డ నేను (శకాం 4 84 ) ఆం భా నానా వర్గమున కోపరీతులు మోడి నా గొఅలుచుండ (3 58 ) అని దీనిని సాధారణవాచకము గా ఉదాహరించు చున్నది విశేషవాచకములు గా ఇతరవర్గములం దుదాహరించినవానిని సాధారణవాచకముల గాఁ జాలవఅకు నిర్దేశించుట ఆం భా పద్ధతి ఇది గుఱుతింపక కా బోలు సాధారణవాచక మను చున్నవి దీనిని ఇతరనిఘంటువు ఐ మోడి యలుక కినుక కిన్క నా గ గోపాఖ్య లగు (సాంఅ మాన 22 ) సూ ని

గూడ మోడి కి కోపము - అనునర్థమును సైతము ఇచ్చుచున్నది ఆం భా (3
58 )ఉదాహరించి ఇచ్చినప్రయోగము లన్నియు ఈ విశేషార్థముచే గతార్థము లగునవియే

సీ తనరు వేళాకోళ మనఁగఁ ద్రిక్క యనంగ
రిమ్మ యనంగను రింబ యనఁగ
వెఱ్ఱి యనంగను బిచ్చి యనంగ ను
మ్మాద మనంగ నున్మాదసంజ్ఞ
యాలుడి యనఁగను శీలంబు విలసిల్లు
బత్తి యనంగను భక్తి చెలఁగు
నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన
రెలమి మే ల్కూరిమి చెలిమి యరితి

గీ బాళి ప్రేముడి మచ్చిక మక్కువ యనఁ
బ్రేమ దోఁచును దీఱనిప్రేమ యైన
మరు లనఁగఁ జెల్లు వలపు నాఁ బరఁగు చుండు
యువయువతిసంభృతప్రేమ యుగ్రమూర్తి 36

వేళాకోళము త్రిక్క రిమ్మ రింబ వెఱ్ఱి పిచ్చి ఉమ్మాదము—ఇవి ఉన్మాదమునకు పేర్లు

ఆలుడి—ఇది శీలమునకు (మంచినడతకు) పేరు

బత్తి—ఇది భక్తికి (పెద్దలయందలి భయముతోడి ప్రేమమునకు) పేరు

నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెనరు ఎలమి మేలు కూరిమి చెలిమి
అరితి బాళి ప్రేముడి మచ్చిక మక్కువ—ఇవి ప్రేమమునకు పేరు

మరులు—ఇది తీఱనిప్రేమకు (అత్యధికప్రేమమునకు) పేరు

వలపు—ఇది యువతీయువకుల నిండుప్రేమమునకు పేరు

వేళాకోళము — దీనికి పరిహాసము అనెడియర్థము వ్యవహారమందే యెక్కువ గా కాన వచ్చు చున్న దనిపించును ప్రయోగ మొకటిమాత్రము సూ ని ఇట్లు ప్రదర్శించు చున్నది- నే నేమి చెప్పిన వేళాకోళం బయి తోఁచు బరిహాసకుని దేలు పొడిచె నన్నసామెతి (మృ వి 3 95)

మరులు వలపు —వీనిని విశేషవివక్ష లేక తమకము మేలు మరులు బాళి తమి వలపు విరాళి మమత నా మోహ మౌ (మాన 33) అని సాంబ పేర్కొను చున్నది ఇందు మమత అనునది సంస్కృతము జనవ్యవహారమునందు ప్రహతము గా కాన వచ్చు నిట్టితత్సమములు కొన్ని (అన్యార్థములు గాకకూడ) అచ్చతెలుగులు గా ఈ- ఆధునికనిఘంటువులందు చేరి యున్న వనవచ్చును జనవ్యవహారమునుబట్టి

బాళి మక్కువ అనియే పాఠ మగపడు చున్నది సూ ని కూడ ఈపాఠము నిట్లే ఉదాహరించినది (చూ అరితి) యతి విచార్యము రేచన వర్గాక్షరము లై దిటికి పరస్పరము యతి చెల్లు ననినట్లు దాని కభిప్రాయము వే త్తైనట్లు ఉప్పకవి వచించు చున్నా డు వెలయ గకారాదులు భూ తలమున నైదైదు వళులు దా మగు ననుచున్ లలనామదను డు రేచన నలినభవనిభుండు గుణవతంసుఁడు చెప్పెన్ - ఈపద్యములోఁ జెప్పిన యయిదువర్గములందును మొదలివర్ణములు నాల్గింటికి వర్గవళ్లు గనుకఁ జెల్లు బడి యవి యన్నియు దాపల బూర్ణబిందువు లే కుండిన ననునాసికములకుం జెల్లవు అబిందువు లున్న ట్లాయెనా బిందుయతులుగనుక నవియు జెల్లును ఈభేదము చెప్ప నందుచేత నీపద్య మగ్రాహ్యము (అప్పకవీయము 3 262 263) ప్పకవి తన యాశయమున కనుకూలము గా నే డు అగ్రాహ్య మీపద్య మనినను- అప్పకవికి ముందు రేచనమతము గా వర్గాక్షరములు కేవలానునాసికములతో యతి చెల్లుట జరగు చున్న దనవచ్చును పై పద్యమునందు నలిన తంసు డు అని ఉదాహరణము గూడ ఇంధులకు చూప బడినది నే డిది కవిజ లో కానరా కుండుటకు కారణము అప్పకవి ఇది అపరిగ్రాహ్య మనుటయే కావచ్చును వేంకనార్యుఁడును ఈయొక్క-చోనే దీని నుపయోగించుటవలన ఆతనికిని ఇది అంతగా సమ్మతము కా దనియే తెలియ నగును

సీ అర్మిలి యం చన నరులు నా న ర్లన
వాత్సల్యసంజ్ఞ యై పరఁగు చుండు

నిచ్చ కాయువు కోర్కి యేఁకట కోరిక
యాస యంచనఁగఁ జెన్నలరుఁ గాంక్ష
యర్థాశ విలసిల్లు నడియాస యనఁగను
నంగలార్పంచన నంగద యన
నెంజిలి, యనఁగ మనికితం బనఁగఁ దుందు
డు కనం దగు మనోవ్యధకు సమాఖ్య

గీ. తలఁపనంగను స్మృతిపేరు దనరు చుండు
స్మృతివిశేషంబు సోదె నాఁ జెలఁగు మఱపు
మఱకువ యనంగ విస్మృతి పరఁగు చుండు
నగ్గలిక యన నుత్కంఠ యలరు నభవ 37

అర్మిలి నరులు నర్లు—ఇవి వాత్సల్యమునకు (పుత్త్రాదులయందలి ప్రేమమునకు) పేర్లు

ఇచ్చ కాయువు కోర్కి ఎఁకట కోరిక ఆస—ఇవి కాంక్షకు (ఇచ్ఛకు) పేర్లు

అడియాస—ఇది అర్థాశకు (ద్రవ్యమందలియాశకు రానిద్రవ్యము వచ్చు ననెడి-ఆసకు (ప్రత్యాశకు) పేరు

అంగలార్పు అంగద నెంజిలి మనికితము తుందుడుకు—ఇవి మనోవ్యథకు పేర్లు

తలఁపు—ఇది స్మృతికి (స్మరణమునకు విషయము జ్ఞప్తికి తెచ్చుకొనుటకు) పేరు

సోదె—ఇది స్మృతివిశేషమునకు పేరు

మఱపు మఱకువ—ఇవి విస్మృతికి (మఱచుటకు) పేర్లు

అగ్గలిక—ఇది ఉత్కంఠకు (ఇష్టవస్తుప్రాప్తికైన వేగిరపాటునకు) పేరు

కాయువు — కాయ్వు (రూపాం) రాగోత్కటమున సైరణ లేక మానిని గాయ్వున బై బడి కవయ దలచు (కుమా 6 64) కామము (సంభోగేచ్ఛ) ఇట అర్థము ఇది అర్థాంతర మన నక్కఱ లేదు ఇచ్ఛా కాజ్ఞా స్పృ హేహా తృ ద్వాఞ్ఛా లిప్సా మనోరథా కామో ఽభిలాష స్తర్ష శ్చ అని (అమ)

అడియాస —భారతప్రయోగ మి ట్లున్నది తొల గి పొం డడియాస దొద్దకుఁ జొచ్చిన దల లేఁటి యుర్వికి బలి యొనర్తు (భార మౌ 85) [ లందనికోరిక (దీపిక) వట్టియాశ దురాశ ఆం భా అర్థాశ విలసిల్లు నడియాస యనఁగను ఎక్కడి నీలాద్రివిభుం డెక్కడియడియాస వలపు లివి గూడ వి కన్ గుక్కిన పేనుతెఱం గునఁ గిక్క మనక చనుము నైజగేహంబునకున్ అని బ్రౌ ] అర్ధాశ అని (వావి పా) అసంపూర్ణ మగునాశ సిద్ధింపనియాశ వ్యర్థాశ అన వలయును ఇట ఆం భా పా వ్యర్థాశ విల్లసిల్లు అయి యుండు నని తోఁచు చున్నది

తుందుడుకు —దుందుడుకు (రూపాం) అని సూ ని ఈలింగములోఁ బ్రాణము కాలము గడ దా క నోడ గట్టినదూలం బై లంకె నుండ జేసితి నేలా దుందుడుకు పల్లె కే గుఁడు మీరల్ (కాశ 3 80) మొ ప్రయోగము లిచ్చినది ఇచ్చినప్రయోగములు తుందు డుకు అనినను సరిపడునవియే దీనికి నిర్ధారకములు గా లెవు అందులకే శ ర బ్రౌ దుందుడుకు గ్రహింప లేదు ఆం భా ఇ క నెందులకు గ్రహించును·

సోదె —(స్మృతివిశేషము) అదృష్టమును (రాఁ గలకీడుమేళ్లను) జ్ఞప్తికి తెచ్చుకొనుట రా గల కీడుమేలుల గూర్చి అడుగుప్రశ్నము అని (శ ర)

అగ్గలిక యన నుత్కర్ష యలరు అని (వావి అ౦ పా) అగ్గలిక యన నుత ౼ంర యలరు అని బ్రౌ ఇదియే (సాధుపా) ఉత్కర్షమునకు (అతిశయమునకు) పేర్ల వచించినది ఆం భా (చూ 66) ప్రకరణ మిది వేఱు- ఉత్కణ్ఠోత్కలికే సమే అని (అమ)

అంగలార్పు —ఆపన్మాత్రవాచకముఁ గా వచించు చున్నది దీనిని ఆం సం 'బెడ ద దెస చేటు చేడ్పా్ౕగాడ వాత్రం బంగలార్పు గోరంబు దొసం గిడుమ వెత కస్తి యంగద కిడగం డ్లన జను విపత్తు (మాన 69)

సీ హాళి జతన మన నడరు నుత్సాహంబు
 కపటాఖ్య విలసిల్లు గబ్బి గౌరు
గబుసు కైపు కిటుకు కాఁడు డబ్బు కవుడు
 దం బనంగ నపదేశంబు వెలయు
నెపము నెవ మనంగ నిష్కపటాభిధ
 నిక్కపు డం చన నెగడు చుండు
నేమఱిపా టన నేమఱిక యన మో
 స మనఁ బరా కనఁ జనుఁ బ్రమాద
గీ మెచ్చరిక యెచ్చరిం పేవ యేద పదిల
ము హావణిక పోఁణిమి యన నొప్పు నవధాన
మలరు వే డ్కన వేడుక యనఁగ వెంట
మనఁగను గుతూహలంబు సూర్యావతంస 38

హాళి జతనము—ఇవి ఉత్సాహమునకు (గొప్పయత్నమునకు పూనికకు) పేర్లు

గబ్బి గౌరు గబుసు కైపు కిటుకు కాడు డబ్బు కవుడు దంబు—ఇవి కపటమునకు (మోసమునకు వంచనకు) పేర్లు

నెపము నెవము—ఇవి అపదేశమునకు (వ్యాజమునకు సాకునకు మిథ్యాహేతువునకు) పేర్లు

నిక్కపుడు—ఇది నిష్కపటమునకు (మోసము లేమికి) పేరు

ఎమఱిపాటు ఎమఱిక మోసము పరాకు—ఇవి ప్రమాదమునకు (ఎకాగ్రత లేమికి) పేర్లు

ఎచ్చరిక ఎచ్చరింపు ఏవ ఎద పదిలము హావణిక పోఁణిమి—ఇవి అవధానమునకు (ఎకాగ్రతకు చిత్తమొకచో లగ్నమై ఉండుటకు) పేర్లు

వేడ్క వేడుక వెంటము—ఇవి కుతూహలమునకు (అనుభవింపని వస్తువునుగూర్చిన యుబలాటమునకు) పేరు

హాళి — ఈతని తరువాతివారు దీని ని ట్లుపయోగించుకొనినారు దర్పకునితోడఁ గూడి చైత్రప్రభుండు విరివాణీపాంథ సందోహ విజయమునకు హాళి దైవాఱ నపుడు వా హ్యాళి వెడలె (రసి 27)- ఇచ్చట ఉత్సాహ మనెడియర్థ మెంతో సము చితము వెడలునది శత్రువిజయమునకు

ఉత్సాహము — ఉత్సాహో౽ధ్యవసాయ స్స్యాత్ అని (అమ) (సుధాపా) ఇది ఉత్సాహో వ్యవసాయ స్స్యాత్ అని (గురు పా)

దబ్బు — ధనము అనునది దీనికి అర్థం నాద బ్బేవారి త్రోవ భిక్ష జీవిక వర్థికిని విధి సృజించెనుగాదే (అము 4 67) (చూ సూ ని) నాదం బేవారిఁ ' (ఆము వేద పా)

అపదేశము — వ్యాజో౽పదేశో లక్ష్యం చ అని (అమ) స్వరూపాచ్ఛాదనన్య అని ఇట (సుధ) కపట వ్యాజము లకు భేద మిట్లు వచించినది గురు - పరద్రోహమే ఫలము గాఁ గలది కపటము తన ప్రయోజనమునకై ఒకటి నుద్దేశించి మఱియొకటి చేయుట వ్యాజము (అని)

నెపము నెవము —(సం నిభ ప్రా ణివ్వ క నెవ నెవను త నిపమ్)(చూ సూ ని) (నెపము)- ద్రుపదతనూజం బణము గఁ గపటద్యూతమునఁ జేయఁగాఁ దగునెూజ నా ధిప యిది దుష్టద్యూతము నెపమునఁ బరిభూత యయ్యె నిష్కారుణు లచేన్ (భార సభా 2 222) (నెవము)- చివురుఁగెమ్మోవిచిఱుగాటు నెవము గాఁగఁ దామరసనేత్ర కోపింపఁ గాదు సుమ్మ (నైష 8 47)

మోసము — ప్రయోగ మి ట్లున్నది- ముక్కు మొగంబు చూడ కొక మోసపుమాటకు విశ్వనాయకుం డెక్కడి కైన బొమ్మనుచు ధిక్కరణంబు చేయ (భీమ 3 8) ఇట- శ ర మోసము అపు దానికి వంచన అని అర్థ మిచ్చి పైప్రయోగ మందు లకు ప్రమాణ మను చున్నది ఇట వంచన అనుట సమంజసము కాదు ఆం భా చెప్పిన యర్థమే యెంతో స్వరసము గా ఔచిత్యమును పోషించుచు సందర్భానుగుణము గా నగపడు చున్నది నిజము గా ఆం భా ప్రయోగపరిశీలనమున కిది యొకమచ్చు దునుక యన నగును మోస (రూపాం) ముదితల నమ్మి యేమఱుట మోస సుమీ యని బుద్ధి చెప్పుచున్ (కాశీ 6 6) (చూ సూ ని) మోసము-వంచన- అనునది దీనికి (అర్థం) మోస గా కుండ నపరాధములకుఁ దగిన శాస్తి యన్నింటి

కిబ్బంగి సంభవించె (నైష 7 92) సుప్రసిద్ధార్థములు ప్రయోగజుష్టము లైనను వదలి విశేషార్థముల ప్రదర్శించుట అం ధ్రా పద్ధతి అనుట కిది యొకనిదర్శనము

పరాకు — అడిగిన చిరాకు ఒడుగ కున్న పరాకు -అని సామెత ఒయ్య పరాకు మాని తెలియన్ విను (సారం 66) హెచ్చరికను తెలుపుమాట -అనునది అర్థాంతరము దీనికి- రాజవర్య పరా కజారమున దొరలు కాచినా రని హెగ్గడికత్తె దెలుప (కువల 2 3) (చూ సూ ని)

ప్రమాదము —ప్రమాదో ఽనవధానతా అని (అమ)

ఏమఱిపాటు — ఏమఱుపాటు వావి పా చి ని బ్రౌ లు ఇన్మధ్యముఁ గానే దీని నిచ్చినవి శ ర ఉన్మధ్యము గా గ్రహించియు ప్రయోగముల నిన్మధ్యముల గానే ఇచ్చినది ఇది ఎగసిపాటు కునికిపాటు వంటిది

సీ బిత్తరము కులుకు బెడఁగు వెఱకు గును
పు గొనబు మురిపము మురుపు సొగసు
నిక్కు మిటారింపు నీటు మిటారము
తెక్కు తెక్కరమెమ్మె టెక్కు టీకు
హొరఁగు చె న్నే ఖోఱు హొయ్యారము బులుపు
హొయ యనఁగ విలాస మొప్పు చుండు
నవ్వయ మై యేతదర్థంబునందలి
లలి యన నొకశబ్ద మలరు చుండుఁ

గీ గ్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ మన
గేలి యన మేల మన మందెమేల మనఁగ
నాట యనఁ ద్రస్తరి యనఁగ హాళి యన గఁ
బొలుచుఁ బరిహాసములు మాతృభూతలింగ 139

బిత్తరము కులుకు బెడఁగు వెఱకు గునుపు గొనబు మురిషము మురుపు సొగసు నిక్కు మిటారింపు నీటు మిటారము తెక్కు తెక్కరము ఎమ్మె

టెక్కు టీకు హొరగు చెన్ను ఎపు ఒఱపు ఒయ్యారము బులుపు హొయలు—ఇవి విలాసమునకు పేర్లు

లలి—ఇదియు విలాసమునకు పేరు [ఇది విలాసమును చెప్పునొక—అవ్యయము ]

క్రేణి తచ్చన కేరడము గేలి మేలము మందెమేలము ఆట త్రస్తరి హాళి—ఇవి పరిహాసమునకు పేర్లు

ఒఱపు — సౌందర్యము-అర్థ మని శ ర క్రిందిప్రయోగ మిచ్చు చున్నది- ఒక్కతె భయశోకంబుల వెక్కుచు మెయి గలవిలాసవిభ్రమలక్ష్మల్ దక్కుటయును నొక యొఱ పై నెక్కొన ధరణీశునెదుట నిలిచి వినీతిన్ (మను 4 69 ) విలాసవిభ్రమ సంపదలు తొఱగుటయు (ఎడలుటయు లేకుండుటయు) ఒకవిలాసమే యై నెలకొనిన దని అర్థము విలాసము లేకుండుటయు ఒకవిలాసము గానే ఉన్న దనుటయు సముచితమే ఆం భా లోనివిలాస మనునది శృంగారచేష్టావిశేషమును జెప్పునదియే (చూ సూ ని ) విలాసో భావలీలయోః అని (విశ్వ )-ఇచటిసూ ని విలాస మనియే మనుచ ఒఱపు నకు అర్థ మనుచున్నది కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్ అనుటయే భంగ్యంతరాశ్రయణముతో ఇట్లు వచింప బడినది ఒయారము అనుదానికి-విలాసము సౌందర్యము-అనునర్థ మిచ్చి సూ ని ఆం భా ను ఉదాహరించు చున్నది ఆం భా సౌందర్యమునకు వేఱు గా పర్యాయముల నిచ్చినది (చూ 3 4 ) ఇచ్చటివిలాసమునకు సౌందర్య మర్థ మన రాదు హావవిశేష మన బడుశృంగారచేష్టావిశేషమే అర్థము స్త్రీణాం విలాస బిబ్బోక విభ్రమా లలితం తథా హేలా లీ లే త్యమీ హావాః క్రియా శృఙ్గారభావజా అని (అమ ) విలాసో ఒఙ్గ విశేషో య ప్రియప్రాప్తా వాసనాదిషు అని (సుధ ) శృఙ్గారభావజా ఉనుచోట సుధావివరణ మిట్లున్నది- శృఙ్గారా ద్రత్యాదే భావాన్మనోవికారా చ్చ జాతా (స్త్రీణాం) క్రియా చేష్టా అలఙ్కారాఖ్యవిలాసాదికా హావశబ్దవాచ్యా -(అని) మనుచ పద్యముకడ వ్యాఖ్యాతలు ఒకయొఱ పై-ఒకవిధ మైన సౌందర్య మై ఉని వివరించుట ఆం భా ను ఎఱుగమివలన గలిగినప్రమాద మనవలసి యున్నది ఆం భా కు ఇది చక్కనియుదాహరణము విలాసవిభ్రమలక్ష్మల్ దక్కుటయు- ఉని విస్పష్టము గా పైని వచింప బడు చున్నది విలాసవిభ్రమసంపద లేకపోవు

టయు-ఒకవిలాసవిభ్రమసంపదయె యై నెలకొవిన దని అర్థము ఆం భా ప్రయోగపరి శీలనసరణి చాలప్రశస్థ మైన దని ఇ క వేఱు గా చెప్ప నక్కఱ లెదు

బులుపు — శ ర దీనిఁ సుఖ మర్థ మని బులియు-సుఖించు అని అర్థ మిచ్చి ప్రయో గ మందుల కి ట్లిచ్చినది అలర జేయుచు నచ్చరలఎందు ముక్తి క న్యలను బెండ్లి యాడి బులియు చున్న క్రొత్త పెండ్లికొడుకు గొమరుల సయ్యాట లాడుతద్వధూవయస్య అన గ (కలా 8 223) ఇచ్చటి- బులియు-సుఖించు - అనునర్థమునకంటె-(బులియు చున్న)- కులుకుచున్న అనెడి ఆం భా అర్థమే సరి గా నున్న దనిఎంచు చున్నది

ఆట — నీకు నే నన్నఆట గా ఉన్న దే అని వ్యవహారము ఆం భా మాత్ర ముదాహరించు చున్న దిందులకు సూ ని సూ ని బిత్త రము కులుకు బెడ గు బెళుకు అని ఆం భా పా అనుచున్నది బెడకు- కులుకు సొగసు ఆం భా బిత్త రము కులుకు బెడకు వెళకు గునుపు గొనపు మురిపెము మురువు సొగసు నిక్కు- మిటారింపు నీటు మిటారము - ఉని బ్రౌ ఇట వెళకు అనుట ప్రమాదము వెళుకు అనియే గ్రహించి ఆం భా ఉదాహ రింపఁబడినది మఱియొకచో (చూ అను) [ తెక్కెఱ ప్రా తప్రతి పా అని సూ ని ]

సీ త్రుళ్లాట గొండ్లి నాఁ దోఁచును గ్రీడాఖ్య
యది మించఁ దగుఁ జెరలాట మనఁగఁ
జను సహక్రీడాఖ్య సయ్యాట మనఁగ స
య్యాట యనంగ సైయాట యనఁగఁ
జెమరు నాఁ జెమట నా స్వేదంబు విలసిల్లఁ
బరఁగుఁ గొం చనఁగను ముఱికిచెమట
ఱిచ్చపా టనఁగను ఱిచ్చ నాఁ బ్రబలయ మౌ
నొప్పు సంభ్రమసంజ్ఞ యుత్తలంబు ।

గీ తమకము తహతహ తమి తత్తఱము చిడిము
డి తరితీ పుత్తలమ్ము చిడిముడిపాటు
నాఁగఁ దనరారు హిక్కఁకు నామ మగుచు
వె క్కనంగ వెక్కిలి యన వేదవేద్య 40

త్రుళ్లాట గొండ్లి—ఇవి క్రీడకు (ఆటకు) పేర్లు

చెరలాటము—ఇది అధికక్రీడకు పేరు

సయ్యాటము సయ్యాట సైయాట—ఇవి సహక్రీడకు పేర్లు

చెమరు చెమట—ఇవి స్వేదమునకు పేర్లు

కొంచు —ఇది ముఱికిచెమటకు పేరు

ఱిచ్చపాటు ఱిచ్చ—ఇవి ప్రలయమునకు (మ్రాన్పాటునకు) పేర్లు

ఉత్తలము తమకము తహతహ తమి తత్తఱము చిడిముడి తరితీపు ఉత్తలము చిడిముడిపాటు—ఇవి సంభ్రమమునకు (త్వరకు ఆవేగమునకు ఇష్టము కాని అనిష్టము కాని ప్రాప్తించినప్పుడు మనస్సున కగుతొందఱకు) పేర్లు

వెక్క వెక్కిలి—ఇవి హిక్కకు (ఎక్కిలికి) పేర్లు

క్రీడ — ద్రవ కెళి పరీహాసా క్రీడా ఖేలా చ నర్మ చ అని అమ ఇట షట్ క్రీడాయా అని (సుధ) క్రీడా కేళిప్రకారే స్యాత్ ఖేగా ఉవజ్ఞానయో ఽపి అని (విశ్వ)

త్రుళ్లాట —ప్రయోగ మి ట్లున్నది- బవినీలజవని పాటల నిల్లాంధ్ర రమణు ద్రుళ్లా డించు రంతు కత్తె (క్రీడా 29)

గొండ్లి — గొండ్లి సలుప గ నను గు బూ బొండ్లు గారు తులువపొలయోగిరపు బొలం తుకలు గాని (ఆచ్చ రా అయో 77)

సహక్రీడ —స్త్రీపురుషుల విహారము పరిహాసము మొ శయ్యకు దార్చి యనంగుని సయ్యాటపు జిట్టకంబ జిదురుల కవు డా యయ్య దొర కొని (రామా 4 6) ఆ గోవర్ధనవేళ నీవు దరహాసాంకూరముల్ లోచనా పాంగప్రాంతములం దిగుర్ప నొక సయ్యాటంబు గల్పించి (కాశీ 4 03)

ప్రలయము — ప్రలయో నష్టచేష్టతా అని (అమ) సాత్త్వికభావస్య మూర్ఛాపరపర్యా యస్య హర్షశోకాదిభి సకలచేష్టానాశ స్యే త్యర్థః అని (సుధ)

చెరలాటము — చెర్లాటము చర్లాటము (రూపాం) దుర్లలితాతనువిలసన నిర్లజ్జ స్వాంత కాంత నేరు వ మెఱయం జెర్లాట మాడు మోహాము లే ర్లయి వర్తిల్ల నమ్మ

హేసురుతోఁడన్ (పాండు 3 63) వాఁడును మచ్చికఁ వచ్చి యప్పల్లతో జర్లాట మాడుచు సంచరించు (భార శాం 3 25)- ఇచ్చట తతో బాల్యా చ్చ యత్నేన తే నాక్రీడత పక్షిణా (సం భార శాం 3 245)- అని మూలము దీని నుదాహరించి (సూ ని) క్రీడించుటయే ఇట అర్థ మనవలయు నను చున్నది సంస్కృతమునకు మక్కికి మక్కి గా అనువాదము సలిపినవారు కవిత్రయమువారు గారు అధిక క్రీడయే ఇచ్చటి చర్లాటము నకు అర్థ మనవచ్చును మచ్చిక వచ్చి అనుట ఇట్టి యర్థమునకు ఉపష్టంభకము

వెక్కిలి —ఎక్కిలి (రూపాం)- దప్పి మొదల గువానిచే కలుగురోగవిశేషము గొంతు తడి తీయు నెక్కిట గొంతతడవు దాహమున నుదకము లేక తడపెనేని (దశా 2 36) (చూ సూ ని)

తమి — కాంక్షకు బేరు లాఁ గ్రమముతోడ గ్రచ్చ కోరిక తమి కొర్కి యిచ్చ యనఁగ (మాన 67) అని ఆం సం తమికి కాంక్ష అనునర్థముగూడ మోహము అనుటకంటె వేఱు గా వచించు చున్నది రం గగుతొడవుల బూతల నంగుగఁ గై సేసి యందు నాడెడితమిచే టొంగారెడువేడుకతో సింగారపు దోట కరిగె జెలువలు దానున్ (యయా 3 54) అని ప్రయోగ మగపడు చున్నది ఆం భా సంభ్రమమే ఇట అర్థ మనవచ్చును ఇట్టిచోటులలో ఇట్లే సరిపడు నవిపించు చున్నది

సీ పులక లనంగను బులకం మనఁగను
గగ్గు రనంగను గగు రనంగ
గరుదా ల్పనంగను బఁగు రోమాంచంబు
గొఱలు రోదన మేడ్పు గోడు నాఁగ
నావలింత యనంగ నావులింత యనంగ
జృంభణసంజ్ఞ యై చెలఁగు చుండు
గాత్రవినామంబు గనుపట్టు నీ ల్గనఁ
దుమ్ము నా క్షుత్సంజ్ఞ దోఁచు చుండుఁ
గీ జనుఁ బడక పవ్వళిం పనఁగను శయనము
నెగడుఁ గూ ర్కన నిదుర నా నిద్ర రన గఁ

గురు కనఁగ నిద్ర తూఁగు తందర యనంగ
మనును నిద్రావిశేషంబు మాతృభూత

పులకలు పులకరము గగ్గురు గగురు గరుదాల్పు—ఇవి రోమాంచమునకు (గగుర్పొడుపునకు గగుర్పాటునకు పులకాంకురమునకు) పేర్లు

ఎడ్పు గోడు—ఇవి రోదమునకు(కన్నీళ్లతోడిదు ఖమునకు) పేర్లు

ఆవలింత ఆవులింత—ఇవి జృంభణ నకు (ముఖభేదమునకు) పేర్లు

నీల్గు—ఇది గాత్రవినామమునకు (ఒడలు విఱుచుటకు) పేరు

తుమ్ము—ఇది క్షుత్తునకు (క్షుతమునకు) పేరు

పడక పవ్వళింపు—ఇవి శయనమునకు (పాన్పునకు) పేర్లు

కూర్కు నిదుర నిద్దుర కురుకు—ఇవి నిద్రకు పేర్లు

తూఁగు తందర—ఇవి నిద్రావిశేషమునకు (అత్యన్తశ్రమాదులచే మోహప్రాయ మగునిద్రకు ప్రమీలకు) పేర్లు

రోదనము — దు ఖజన్యబాష్పమోచనమ్ (రోదనమ్) అని (స త సి స ల సం) —మ రము- శోకము దు ఖము వేఱు గా వచించినది- ఎడా బాధా వ్యథా దుఃఖమ్ మన్యు శోకౌ తు శుక్ స్త్రియామ్ అని ఆం ధ్ర కర్త కూడ-దు ఖమునకు శోకమునకు వేఱు వేఱు గానే నామము లిచ్చినా డు (చూ - 50 - 36) ఇప్పుడు రోదనము గూడ వేఱుపఱచు చున్నా డు రసముల ఎచించి వాని కగుభావముల వచించుచు శోకమును వేఱుపఱచిన దమరము ఈత డు నట్లే శోకమునకు-కావ్యాలంకారమాడామణి లక్షణ మి ట్లు చెప్పు చున్నది- శోకం బన గను మదిలో నాకస్మికవిపదవాప్తి నలరెడుదు ఖవ్యా కులత ( - 2 ) ఇష్టజనవియోగాదినా ఆత్మని దుఃఖాతిభూమి శ్శోక అని (ప్రతా) సాత్త్వికవ్యభిచారిభావములు చాలవఱకు ఈప్రకరణమున వచింప బడినవి వీనిలక్ష ణములకై (చూ ప్రతా మొ) సాత్త్వికభావములలో 'అశ్రు వొకటి దానికి లక్షణ మిది- అశ్రు నేత్రోద్భవం వారి దు ఖరోషప్రహర్షజమ్ (ప్రతా) ఇదియే రోదన మనఁబడిన దనవచ్చును (స త సి ప ల సం) ఇట్లు లక్షణము చెప్పు చున్నది శోక

రోదనములకు దుఃఖజన్యబాష్పమోచనమ్ (రోదనమ్) ఇష్టవియోగా దుత్పద్య మానః రోదనచిన్తాదిహేతు మనోవైక్లబ్యమ్ (శోక) దీనిని బట్టి రోదనహేతు వగుమనోదైన్యము శోకమని రోగాదులవలని బాధ దుఃఖ మని వీనియన్నిటివలన గలిగెడికన్నీళ్లతోడిదుఃఖము రోదన మని మనము-ఆం భా కు అర్థము చెప్ప వచ్చును మన్యుశోకౌ తు శుక్ స్త్రియామ్ అనుదానిలోని మన్యు శబ్దమున కిగునర్థనిర్ణయము నకై సుధ ప్రమాణ మను చున్న నిఘంటు విట్లున్నది మన్యుర్దైన్యే క్రతు క్రుధి (హైమ) దీనివలన శోక శబ్దమునకు దైన్య మనియే ఉమ అర్థము చెప్పన దన వచ్చును

క్షుత్ — (క్షుత్) క్షుతము సమానార్థకములు స్త్రీ క్షుత్ క్షుతం క్షవ ౹ంసి (అమ)

నీల్గు — సూ ని ఈల్గు గా దీనిని గ్రహించి ఇట నీల్గు అనియు ఛేదింపవచ్చును-అని వ్రాసినది బ్రౌ పా నీల్గు అనియే (చూ అను) ప్రయోగములు ఇది నీల్గు అనియే అను చున్నవి- అనిలసుతుం డంతన మేల్కని నీల్గుడు నతనివ్రజఘనకాయము( బొందినలతికాజాలము లెల్లను ద్రెస్సె మృణాలబాలలతికలపోలెక (భార ఆది 5 72) (చూ సూ ని) హొదులయు నీలు గు లో నగువానితొలిహల్లునకు లోపంబు బహులంబు గా నగు (బాలవ్యా ప్రకీ 0)- బహుళగ్రహణముచే ప్రామాణికప్రయోగ మున్నప్పుడే యిట్టిది సంభవము

పడక — పడుక (రూపాం) (త పడుక్కై) ఒకనాటి రాత్రి పడుపడు కకు జెప్పక యిల్లు వెడలి గాఢ తరతమో నికరమ తనితగుతోడు గ నొకరు డు బేరడవిత్రోవ నూడవి బాడెక (పాండు 3 49) ఆం సం శయ్యకు మఱికొన్నినామముల నిచ్చినది- మెత్త సెజ్జ పఱుపు పాన్పన( దగుశయ్య (మాన 32)

పవ్వళింపు — దీనికి సాంబ పడుకటిల్లు అర్థ మను చున్నది- పవ్వళింపు బిడారు పడుకటిల్లన గేళి గృహ మగు (స్థా 68) శయనము అనుదానికి గల సురత మను నర్థమునే తెలగనార్యు డు తెలు గున ఎంతముచ్చట గా జాతీయతతో అవతరింప జేసినా(డో చూడు డు- కొమ్మ నిను నిచ్చునా డు శుక్రుండు నాకు నప్పగించుచు నొక్కటి యాన తిచ్చె బడక వెలి గా గ దీనిని నడుపు మనుచు (యయా 5 68) (చూ సూ ని) సూ ని ఈ ఆం భా ఉదాహరించి యిట శయనము పండు

కొనుట లర్థ మను చున్నది ప్రమాదము శయనము ను జూచి భ్రాంతి చెందిన దేమో శయనం సురతే నిద్రాశయ్యయో రపి భాషితమ్ అని (విశ్వ)

పులకలు —(సం పులక) పులకో ఽస్త్రీ రత్నరాజ్యాం రోమాఞ్చే హీరకే క్రిమౌ (వైజ త్ర్య పురి) బహువచననిర్దేశము బహువచనాంతము గానే దీనికి బహులము గా ప్రయోగ మనుటను దెలుపును పులక అని ఏకవచనాంతము గాఁ గూడ దీనికిప్రయోగ ము ఆం భా కు సమ్మతము మిన్ను విఱిగి పయిం బడినవడువున బెదంగువడఁ గలయం దలకొనుపులకమొలకపయిరునకుం బాఱుదుర్వారవారిపూరం బనఁగా (మనుచ 3 9) (చూ సూ ని) కేవలము బహువచనాంతప్రయోగమే ఆం భా కర్తృ కిష్టమైన కంఠోక్తము గా అట్టి దని ఈత డు వచించి యుండును ఇది వికృతి అనియే ఆం భా మతము తెలుఁగున స్త్రీసమము గాను బహువచనాంతము గానే దీనికి ప్రయోగ మని (శ ర)

సీ గుఱక యనంగను గుఱుపె ట్టనంగను
 శోభిలు చుండును సుప్త రవము
కల యన స్వప్నాఖ్య వెలయు నిక్కల యన
 నిశ్చయస్వప్నంబు నివ్వటిల్లుఁ
గలవరిం పనఁగను గలవరింత యనంగఁ
 గలవర మనఁగను గళవళ మన
స్వప్నభాషణము గా జరుగు చుండును మేలు
 కొంట యనఁగ మేలుకంట యనఁగ

గీ మేలు కాంచుట యనఁగను మెలకువ యన
నుపవడ మనంగ నవబోధ మొప్పు భ్రుకుటి
యలరు బొమముడి యన స్వభావాఖ్య చెల గు
సాజ మోజ యనంగను జంద్రచూడ 42

గుఱక గుఱుపెట్టు—ఇవి సుప్తరవము నకు (నిద్రించువా రొనర్చునిద్రాధ్వనికి) పేర్లు

కల—ఇది స్వప్నమునకు (స్వప్నదర్శనమునకు నిద్ర పోవునపుడు కలుగు-ఆయాపదార్థముల దర్శనమునకు) పేరు

నిక్కల—ఇది నిశ్చయస్వప్నమునకు (నిజ మగుకలకు) పేరు

కలవరింపు కలవరింత కలవరము కళవళము—ఇవి స్వప్నభాషణమునకు (స్వప్నమందలిసంభాషణమునకు) పేర్లు

మేలుకొంట మేలుకంట మేలు కాంచుట మెలఁకువ ఉపవడము—ఇవి అవబోధమునకు (నిద్రనుండి మేల్కనుటకు)పేర్లు

బొమముడి—ఇది భ్రుకుటికి (భ్రకుటికి భ్రూకుటికి కోపాదులచే నైనకను బొమలముడికి)పేరు

సాజము ఓజ—ఇవి స్వభావమునకు పేర్లు

స్వప్నము — స్వప్న స్స్వాపే ప్రసుప్తస్య విజ్ఞానే దర్శనే పుమాఞ (చూ సుధ)

కలవరింత — తనరుపులకలు కలవరింతలును మాట వీడుపాటులు చెలులకు వెలి గొనర్ప (కళా 6 24) ఉద్వాహనకేళిఁ జింతింపు చునికిఁజేసి పలుకు నిద్దురలో బెండ్లికలవరింత (శుక 2 6) ఇచ్చట-పెండ్లికలవరింతలు (నిద్రలో) పెండ్లిని గూర్చినమాటలు అనవలయును గోబలీవర్దన్యాయమున జాత్యేకవచనము

బొమముడి —బొమ్మముడి (రూపాం) బొమ కనుబొమ్మన భ్రూసమాఖ్యలు చెల్లు (వెంక మాన 42) 'బొమముడియే' ప్రయోగములందు కానవచ్చుచున్నది బహులముగా అందులకే వేంకన బొమముడి అనియే అనినాఁడు కోపాదులవలన ఇది కలుగును- కడు నవ్వించుచు జెలుగులు ముడి వెట్టం బేరటాండ్రు ముదిత కనుబొమల్ ముడివెట్టె నాలిసిగ్గున ముడివెట్టెఞ నారి చెఱకుమోసున మరుడుఞ (మనుచ 6 94)

ఓజ —సారంగధరచరిత్రలో నిపద్య మొకటి ఇ ట్లున్నది దారువనస్త్రీల దగిలె గానియ దేమొ నీవలె ముక్కంటి నేర దయ్యె వారికంటెను హెచ్చైనవాఁడవౌర నీకుఁ గలబుద్ధి వారికి లేకపోయె నీవు నాటికి లేక పోయితివిగాక చేరి వారల యోజలు చెఱుప లేవె? (2 20) ఇట జితకాశివ్యాఖ్యాతలు నాడు నీవే

యున్నచో-వారి ఓజలు= బుద్ధులు చెఱుప లేవె-చెడగొట్టి యుండవా (ఇట-వారి వారల ఒని చెడగొట్టి - చెడ గొట్టి అని ఉండ నగును) బుద్ధులు చెడ గొట్టుట అనుట సముచిత మనిపించుట లెదు ఓజ కు ఇట్టియర్థ మున్న దని వేఱుప్రమాణ మేమియు వీరు చూప లేదు బుద్ధి చెడ గొట్టుట ఒన రేమో వీరు వివరింపను లేదు నీకు గలబుద్ధి వారికి లేక పోయె అనుచోటి బుద్ధి యే ఇది యైన వివేకము చెఱచుట అర్థ మన వలయును అది యుచితమా ఇక దీనియర్థ మిది వారల-ఓజలు (వారి) స్వభావములు ప్రవర్తనలు చెఱుప రేవె- భంగపఱప జాలవా? జరగ కుండ జేయ జాలవా తప్పక అట్లు చేసి యుందు-వనుట ఇట పని చెఱుపు ఇత్యాదులలోని చెఱుచు వంటి చెఱుచు ఇది అం భా ఓజకు చెప్పినయర్థమే యిట పైరీతిని సరిపడు చున్నది అందులకే సూ ని అం భా ఓజ కిది లక్ష్య మనినది

స్వభావము — సంసిద్ధిప్రకృతీ త్వివే స్వరూపం చ స్వభావ శ్చ (అమ)

సీ జీరుకు నా గను జీరుకుపాటు నా
 దొట్రుపా టనఁగను దొట్రు నాఁగఁ
దొట్రిలుట యనంగఁ దొట్రగిల్లుట యన
 స్ఖలనసమాఖ్య యై వెలయు చుండు
జాఱుడు జరుగుడు జాఱుపు జా ఱన
 గళనంబు దనరును వలి వలిపిరి
వడ కనఁ గంపాఖ్య యడరును వడవడఁ
 కన నతికంపంబు దనరు చుండుఁ

గీ బర గుఁ బబ్బము పండుగ పండు వనఁగ
నుత్సవము తద్విశేషంబు లొప్పుఁ దేవ
తంతు సాకము నంపు జాతర కొలు పన
వెలయు సివ మన దేవతావేశ మభవ 143

జీరుకు జీరుకుపాటు తొట్రుపాటు తొట్రు తొట్రిలుట తొట్రగిల్లుట—ఇవి స్ఖలనమునకు పేర్లు

10)

జాఱుడు జరుగుడు జాఱుపు జాఱు—ఇవి గళనమునకు (చ్యుతికి స్వస్థాన మునుండి కదలుటకు) పేర్లు

వలి వలిపిరి వడఁకు—ఇవి కంపమునకు (వణఁకునకు) పేర్లు

వడవడఁకు—ఇది అధికకంపమునకు పేరు

పబ్బము పండుగ పండువ—ఇవి ఉత్సవమునకు పేర్లు

తేవ తంతు సాకము అంపు జాతర కొలుపు—ఇవి తద్విశేషములకు (ఆయుత్సవములలోనిభేదములకు అట్టిమఱికొన్నియుత్సవములకు) పేర్లు

సివము—ఇది దేవతావేశమునకు పేరు

స్ఖలనము — రిఙ్గణం స్ఖలనం సమే అని అమ ఇట సుధావ్యాఖ్య ఇట్లున్నది - ద్వే ధర్మాదే శ్చలనస్య ఇతి స్వామీ బాలాదే హస్తపాదగమనస్య ఇత్యన్యే ఎచ్చిలాదౌ పతనస్య ఇత్యపరే అని ఇట- జాఱుటకు గాని స్వధర్మమును వదలుటకు గాని పేళ్ల అని గురు సూని స్ఖలనము తొట్రుపాటు జాఱుట అనినది-(చూ జీరుకు ) ఆంధ్రా జాఱుటకు వేఱుగా పే ర్లిచ్చు చున్నందున ఈ జాఱుడు వే అనవలసి యున్నది సంభ్రమమువలనితడబాటు ఇచ్చటిస్ఖలనశబ్దార్థము ప్రయోగము లిట్లున్నవి- బెగ డంతకంతకు మిగిలిన నింతికి బదములనట దొట్రుపాటు బెరసె (భార విరా 2 06 ) అతివ భూధవునధరామృతం బానుచో దొప్పవాతెఱ యంటు తొట్రుపాటు (నిర్వ 8 80 ) మొ

జాఱుడు — ఊడుపువంటి దిది జార్పు (బూపాం ) పై టజార్పులును సోబానపాటలు కొప్పు సవరించునీటు చేసన్నవగలు (శుక 3 349 ) జాఱువాటు-దీనికి పర్యాయము గవుసెనల్ సడలించి కవవీణె లూని తంత్రులు దీటి మఱి బిరడలు బిగించి యనురాగమున రాగమునకును సారిక గా శ్రుతు లొనగూర్చి కరివె నివిరి జాఱువాటు గ నొక్కసారి మీటి యొకింత జాఱినసారెలు చక్కనొత్తి (సమీ 6 20) (చూ సూ ని ) జాఱువు-బ్రౌ పా (చూ అను )

కొలుపు — ఇది వ్రాతప్రతిపా అని గ్రామశక్తికి చేసెడియుత్సవవిశేషము -అర్థమనినది (సూ ని ) శర కొలుపు- ఉత్సవవిశేషము అనిమాత్రము చెప్పి- గీ తద్విశేషంబు

లొప్పు దేవి తంతు సాకిన నంపు జాతర కొలు వన (ఆం భా ప్ర నా ) అని ఉదా రించు చున్నది కొలువు అనుదానికి గ్రామశక్తికి చేసెడియుత్సవము అర్థ మనినది బ్రౌ కొలువు శబ్దమునకు గూడ గ్రామదేవతల కైనయుత్సవము అర్థ మన్నట్లు వ్రాయు చున్నది అంకమ్మకొలుపు పోలేరమ్మకొలుపు- అనురీతివ్యవహారమే సుప్రసిద్ధము అందులకె వ్రాఁత సా నాపాఠ మైనది దీనికి దోడు- ఆం భా కొలువు శబ్దమునకు సేవావృత్తి రాజసభ -అనెడి యర్థముల నిచ్చినది ఈయర్థము దీని కున్నట్లు వచించుట లేదు (చూ ఆం భా 2 7 2-228 )

సాకు —శ ర బ్రౌ లు సా కన నంపు జాతర అనియే ఇచ్చటిపాఠ మను చున్నవి ఐనను సాక మన గను వ్యాజ ముత్సవము తో చు అనినది (ఆం భా నానా ) సాకినంగను వ్యాజ ముత్సవము తో చు అనిన ఇదియు సరిపడును ఐనను వృథా సంస్కార ముచితము కాకుండుట బట్టి సాకము సాకు వంటి రూపాంతరములు ఆం భా ధోరణికి విరుద్ధములు గా కుండుటనుబట్టి 3-93-ఆం భా ను బ్రౌ గూడ సాకి మనియే ఉదాహరించు చుండ టనుబట్టి నాపాఠము-శ ర పాఠము కాలేదు

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ నాట్యవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 44

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68 ]

ఇది

నాట్యవర్గము

———

# పాతాలభోగివర్గము

సీ. పాతాలనామంబు పాఁపజగ మనంగ
నేలయడు గనంగ నెగడుచుండు
బిలనామధేయంబు బెల మనంగ సొరంగ
మనఁగ సొరంగ యంచనఁగ నొప్పు
దూము తూఁ టనఁగను దూపర మనఁగను
దొండి నాఁ జిల్లి నా దొలి యనంగఁ
గన్న మనంగను గనుమ యనంగను
గ్రంత యనం దగుఁ గందరంబు

గీ. సరియ యన గండి యనఁగను సరె యనంగ
బడిలి యన దుంక మన రంధ్ర మడరు లాఁగ
బొఱియ బొఱ్ఱ కలుఁగు బొక్క బొంద యన గఁ
బొలుచు గర్తంబు శ్రీమాతృభూతలింగ 45

పాఁపజగము నేలయడుగు — ఇవి పాతాలమునకు (రసాతలమునకు అధోభువనమునకు) పేర్లు

బెలము సొరంగము సొంరంగ — ఇవి బిలమునకు (గుహవలె తొలిచిన రంధ్రమునకు) పేర్లు

తూము తూఁటు తూపరము దొండి చిల్లి తొలి కన్నము కనుమ క్రంత — ఇవి కందరమునకు (వివరమునకు బెజ్జమునకు) పేర్లు

సరియ గండి సరె బడిలి దుంకము — ఇవి రంధ్రమునకు (రోఁతైనపెద్ద బెజ్జమునకు) పేర్లు

బిలము — అథ కుహరం సుషిరం వివరం బిలమ్ ఛిద్రం నిర్వ్యథనం రోకం రన్ధ్రం శ్వభ్రం వపా సుషి అని అమ బిలము వివరము రన్ధ్రము -మొ సమానార్థకము లని అమర మనినను ఆం భా వీనిని విశేషవివక్షతో వేఱుపఱచినది

సౌరంగము —(సం సురఙ్గా) సురఙ్గా సూచిమాథయ (అమ) ఇట-సుధ సు- బహు రజ్యతే ఉప్యాం రజసా తిర్యగ్భూఖాత అను చున్నది

దొండి — జలజాతభవశివాదుల గూడ బ్రమయుట దుర్గంధ మగునుచ్చదొండికె కద (వేఱు 86) (చూ సూ ని) కొండి (రూపాం) అని శర లొండి సూ ని కూడ గ్రహించినది తొండి కైన వ్యావహారికరూపము దొండి అని బ్రౌ

చిల్లి —(సం ఛిద్రమ్ ప్రా ఛిల్ల క జిల్లి త మ చిల్లి) ప్రయోగ మి ట్లున్నది- నల్లి గలశయ్య నిద్రయు జిల్లి గల ఘటంబు చేర్చిన నీరుం దల్లి గల వేశ్యఁ దగి లిన పల్లవుసుఖములను బోధిపల్లవసఖముల్ (వై- 3 23)

తొఱ — హంసము క్రౌంచముతొలి రా హంసలరుచి వచ్చె దాను మలయముశిఖఁ బా ల్హంస విఱుప నీ ర్వీడిచెను హంసమున కగస్తి పరమహంసం బగుటన్ (ఆము 4 78) తొలిక (రూపాం) (స్వార్థమున క ప్రత్యయము) పలుచని నెత్తురు మడువులఁ బొలిచెన్ రథనేమివలయములు హతరణవీరుల దూఱ గ రవిబింబము తొలికై రుచి దూల నీడ దో చినమాడ్కిన్ (కవిక 2 92)- (శ ౦ పా) అని (సూ ని) తొఱ తొఱి తొఱ్ఱ నా దరుకొటరం బొప్పు (సాంబ స్థా 59) తరురంధ్ర మగు తొఱ్ఱ రంధ్ర సామాన్యములోనిదే దీనిని తొలి -మొ వానికర్థమని వేఱు గా ఆం భా వచింప నక్కఱ లేదు ఈ తొలి కి సూ ని మొ సాంబ కంటె వేఱు — ప్రమాణ మేమియు చూపుట లేదు ఆం భా కోటరమునకు నామములు వేఱు గా వచిం చినది అందిది లేదు (చూ 2 38) తొలి కి రంధ్ర సామాన్య మర్థ మగుటవ లనయౌగికము గా ఇది తరురంధ్రము నుగూడ కా దనదు యోగరూఢ మిది అనవలసినప్రయోగము లుండి యుండవు ఉందులకే దీనిని ఆం భా కోటరపర్యాయము గా వచింప లే దనిపించు చున్నది

కందరము —దీనికి గుహ ఉని అర్థము చెప్పు టూమ మొ గుహాపర్యాయము లని నది సూ ని (చూ తూపరము) తొలి కి అర్థ మిచ్చుచు కందరము బిలము -అను చున్నది బ్రౌ (చూ ఉను) కందర శబ్దమునకు వివరము అను నర్థము గలదు

కన్దరో ఽ జ్ఞ్కా శే వివరే చ గుహాయాం చ అని (సుధ) గుహ కు పర్యాయము లను ఆం ధా వేఱు గా చెప్పినది- (చూ 2 32) ఇట వివరమే ఽర్థము కంద రము నకు గుహ -ర్థమనుటకాని బిలము అర్థమనుటకాని ప్రమాదము బిలము వివ రము పర్యాయము లని అమ అనినను ఆం ధా విశేషవివక్షతో వానిని వేఱుపఱచు చున్నది

సరియ —ప్రయోగ మి ట్లున్నది- హరిపదపీఠస్థలి గల సరియను జట్టెలుక డా గె (పాండు 4 245) (చూ శ ర) ఏదు పెనుముండ్ల బండ్ల సరియలు నెఱియలు వాఱి (స్వా 4 60)

గండి —దీనిఁ ప్రయోగము లి ట్లున్నవి- సన్నపుగండి యొక్కటి రసాతల మార్గము వోలె నిమ్నమై (భోజరా 5 75) నవ్య నారాచ భిన్న దేహంబు లయి దిగ్గన గ్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యందసందోహంబులతో భాగ 0 వ్యా 563) (గండి చేయు) త్రిపురసంహార మొనరించునపుడు హరు డు బండికల్లు గ నీమేను గండిచేసె నదియు సెలవాఱి తెగటాఱ పైతి చంద్ర యకట రోహిణియెడ నపథ్యమున జేఁ (మనుచ 3 40) ఈ గండి కి గలపై ప్రయోగముల బట్టి లో తైన పెద్దబెజ్జము అనునర్థము ఇచ్చటి రంధ్ర మునకు వచింప బడినది సందు ఽనునర్థము సరియ కు వేఱు గా(అర్థాం) అనవలయును రంధ్రము- బెజ్జము 2 సందు అని (శ ర)

బొఱియ కలుగు —ఇవి బిలమునకు పేర్లని వేంక - బిలముపేళ్లు బొఱియ కలుగు బొక్కయు లోయ బొంద నా (స్థా 87)

గర్తము — గర్తావటౌ భువి శ్వభ్రే (అమ)

సీ గాతము గవి యన ఖాతంబు కంటకా
వరణఖాతము తగు వది యనంగ
లొట్ట లొటారము లొత్త యం చనఁగను
శోభిల్లు చుండును సుషిరసంజ్ఞ
చీకటి యిరులు నాఁ జెలు వొందు నంధకా
రముపేరు గా నంధతమససంజ్ఞ
కటికిచీకటి యనఁగను దనరారును
జిమ్మఁజీకటి మునిచీకటి ముఱి

గీ చీకటి మసక ముఱిముఱిచీకటి యన
నవతమసనామధేయ మై యలరు చుండు
నాగములపేరు వెలయును నాగు లనఁగ
భూషిత భుజంగ శ్రీమాతృభూతలింగ 46

గాతము గవి—ఇవి ఖాతమునకు (త్రవ్వినగుంటకు గోతికి)పేర్లు

వది—ఇది కంటకములతో (ముండ్లతో) కప్పఁబడిన ఖాతమునకుపేరు

లొట్ట లొటారము లొత్త—ఇవి సుషిరమునకు (సరంధ్రమునకు రంధ్రము కలదానికి గుంటపడినదానికి) పేర్లు

చీకటి ఇరులు—ఇవి అంధకారమునకు పేర్లు

కటికిచీకటి—ఇది అంధతమసమునకు (గాఢాంధకారమునకు)పేరు

చిమ్మఁజీకటి మునిచీకటి ముఱిచీకటి మసక ముఱిముఱిచీకటి—ఇవి అవతమసమునకు (తక్కువ చీకటికి) పేర్లు

నాగులు— ఇదినాగములకు(నాగుఁబాములకు)పేరు

గాతము —(సంఖాతమ్ క గాతాము ) ఆత డు సంబడించుకొని యాకరిచొప్పున నే గి యే గి తా నాతతగుల్మమధ్యమున నారసి కన్గొని దానిఁ జుట్టి రా గాతము త్రవ్వి యాకలము గప్పిన గానక కూలె వారణం బాతతపక్షముల్ దునుమ నంబుధి గూలినకొండకై వడిన్ (వాఁ 5 60 )(చూ శ ర ) ఆత డు వెంబడించుకొని అని(ముద్రి పా ) శ ర పాఠమే ఇట చాల సముచితము

సుషరము — సరన్ధ్రే సుషిరం త్రిషు ఒని అమ సుధావ్యాఖ్యాన మీసందర్భమున బరిశీలనీయము గా నున్నది సుషిరం వివరె వాద్యే సురన్ధ్రే సుఃరో ఒన్యవత్ ఒని (విశ్వ ) సురన్ధ్రే అనుట ముద్రణప్రమాదము సరన్ధ్రే ఒని [illegible] చున్నది



లొట్ట లొటారము లొత్త —నిఘంటువులు వీనికి రంధ్రము కన్నము అనురీతిని అర్థము వచించుచున్నవి సుశర శబ్దమునకు రంధ్రము అనునర్థము అమ ఇచ్చినను అది ఇట ఉచితము గాదు రంధ్రపర్యాయములను ఆం భా ఇదివఱకు వచించినది లొట్టపోవు టకు ప్రయోగ మి ట్లున్నది — వామనుడు దర్భగిండిలో వారిధార కడ్డమై యున్న శుక్రునియక్షి బొడువ మిట్టిపడి కన్ను పోయిన లొట్టవోయె ననుచు జే సా చి యడుగుటయును (దశా 5 08) (చూ సూ ని) ఇట- లొట్టవోయెను- కన్నము కలది గా ఆయెను-అని అర్థము ఇది ఆం భా కు సముచిత మగు చక్కని లక్ష్యము ఇట్టివే లొత్త మొ) అంధతమసము అవతమసము — ధ్వాన్తే గాఢే ఒన్ధతమసం క్షీణే ఒవతమసం తమ అని (అమ)

నాగులు — నాగా కాద్రవేయా అని అమ ఫణాలాఙ్గలవత నరాకారసర్పస్య అని(సుధ) నాగువు (ఏ) పాతకము చేసి యైనను బరితపించి ధరణిదానంబు చేసినధన్యు డద చు నయ్యఘము దథ్య మిది నిర్జరాధినాధ కుబుస మూడ్చినమేటి నాగువుసు కోలె (భీమ 5 70) (చూ శ ర) నాగులచవుతి నాగులమ్మ నాగులచీర మొ దృష్టములు

చిమ్మ జీకటి — చిమ్మచీకటి అని శ ర బ్రౌ శ్రీ కాళహస్తీశ్వరశతక మి ట్లను చున్నది- నా కిమ్మై దల్లియు దండ్రియున్ గురుడు నీవే కాన సంసారపుం జిమ్మం జీకటి కప్పినం గడపు నన్ శ్రీకాళహస్తీశ్వరా (కాళ శ 26) (చూ సూ ని) చిమ్మని చీకటి (రూపాం) చిమ్మని చీకటి (ముకుంద 3 63) (చూ సూ ని)

సీ తగు సీదరపుఁబెద్ద తడవులనిడుపఁడు
పాఁపతేఁ డన శేషఫణికి సంజ్ఞ
కొండచిలువ యన గోనసం బగుఁ బెనుఁ
బాము నా నజగరాహ్వయము వెలయు
నీరుపా మనఁగను నీరుకట్టె యనంగ
జలభుజంగముపేరు చెల గును మను
డిండి యం చనఁగను డుండుభం బగు నాగు
బా మనఁ ద్రాఁ చన ఫణి దనర్చుఁ

గీ జెలఁగు సర్పభేదంబులు జెట్టి పెంజె
ర పసిరికపా మనంగ క్షుద్రాహిసంజ్ఞ
తుట్టెపురు వని పల్కఁగఁ దోఁచి యుండుఁ
బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 47

సీదంపుఁబెద్ద తడవులనిడుపఁడు పాఁపఱేఁడు—ఇవి శేషునకు (ఆదిశేషునకు) పేర్లు

కొండచిలువ—ఇది గోనసమునకు (కొండపామునకు) పేరు

పెనుఁబాము—ఇది అజగరమునకు (ఒకజాతిపెద్దపామునకు) పేరు

నీరుపాము నీరుకట్టె—ఇవి జలభుజంగమునకు (నీటిపామునకు) పేర్లు

మచుదిండి—ఇది డుండుభమునకు (విషము లేనియిరుదలలపామునకు) పేరు

నాగు బాము త్రాఁచు—ఇవి ఫణికి (పడగ గలఒకజాతిక్రూరసర్పమునకు) పేర్లు

జెట్టి పెంజెర పసిరికపాము—ఇవి సర్పవిశేషములకు పేర్లు

తుట్టెపురువు—ఇది క్షుద్రాహికి (తుచ్ఛసర్పమునకు చిన్నది గా ఉండి విష మెక్కువ గా ఉండు-ఒకపామునకు) పేరు

శేషఫణి — శేషో ఽనన్తో నాగరాజ స్సర్పరాజ స్తు వాసుకి నాగా బహుఫణా స్సర్పాః సర్పో ద్విరసనో వ్యాల అని (వైజ పాతా సరీ) శేషు డు-వాసుకి ఇట్లు వే ఱైనను గతానుగతిన్యాయమున గవు లభేదమునే పాటించు చున్నారు అమరసుధాటిప్పణి యొకటి ఇ ట్లను చున్నది- ఇహ యద్యపి శేషవాసుక్యో ర్భేద తథా ఽపి గతానుగతి కతయా ఽవయో ఽభేదేన ప్రయుజ్యతే యథా-స్వమివ భుజఙ్గవిశేషం వ్యవధాయ స్వపితి యో భుజఙ్గవిశేషమ్ ఇతి బృన్దావనే వలయీకృతశేషశాయిన స్సఖితా మాదిత పీతవాసస -ఇతినైషధే- ఇతి మకుట (అని) తడవులనిడుప డు తరిగట్టుత్రా డిన నహిపతి కగు (సాంబ తిర్య 80) హరవిలాసము వాసుకిని తరిత్రాడు గా వచించు చున్నది- వాసుకి దరిత్రాడు గా జుట్టి తో కయు శిరంబును బట్టి మందరాచల మంథానంబున దుగ్ధసింధువు మథింపం దొడంగిరి (హర 6 59) మొ ఇట్టివే

తడవులనిడుపడు — (తడవులు + నిడుపు + అడు) అని (శ ర) చిరకాలముండి యుండు దీర్ఘశరీరము గలసర్పము ఉనంతుడ శేషుడు (చూ హూ ని) దైర్ఘ్యము గలవాడు. శేషుడు- నీతోడ్పాటున నే త్రివిష్టపముల నెల్లంగ నూఁకింతు నా చేతం గర్ణుడు రూపు మాలి చను మెచ్చింతుగా విసుం జూడుమీ దైతేయాంతక యచు శేషనిభహస్తం బుద్ధతిం జాచి నిర్ధారిబలుండు పుచ్చికొనియెగా దుర్దాంతకోదండముగా (భార కర్ణ 3 30)

ఎదరపు బెద్ద —సర్పరాజు సీఁద్రంపు బెద్ద (రూపాం) క్షితిని బెట్ల దనరు ఎద్రంపు బెద్ద బల్ పాపతేడు వెన్నుపాను పనగ బుడమితాలు పనగ దడవులనిడుపడు చిలువతే డనంగ శేషునకు (ఉం సం దేవ 27) ఎద్రము (సర్పము)- తరిత్రాడు సీఁద్రంబుపొర అంటి -ాలిచే జడియుచందమున నంచలు భ్రమింప (పాండు 2 208) (చూ శ ర)

పెనుబాము — భయంకరాకార మగునాగ మిది ఇది పెనుబాముచందమున నెంతయు భీషణమై జనంబులం జెదరగ జేయు (భార విరా 60 మహానాగమిది- అశనాయావివృతాస్యగహ్వరు గృతాంతాకారు నిశ్వాసధూమశిఖాధూసరితాగ్ర దగ్ధతరుగుల్మవ్రాతు హరిద్రవర్ణశరీరుగా భృశరూక్షదర్శను మహానాగప్రవరం గాంచెన ర్ధశశాంకద్యుతిహారిదారుణచతుర్దంష్ట్రుగా జగత్త్రాసకుగా (ఆం భార ఆర 4 05) ఈ అజగరము నకైనవర్ణము హారిద్రావర్ణమని కూడ తెలియనైనది ఈపద్యమువలన కొండచిలువ కొండపాము అజగరము-అని (శ ర) కొండచిలువ అజగరము వే అని వేఱుపఱచినది వీనిని (ఆం భా) అజగరము అనుదానిఁ గిరతి-గృ-నిగరణే పచాద్యచ్ అజస్య గర ఉజౌ నిత్యో గర విషం య స్యేతి వా అని వ్యుత్పత్తి వచించినది (సుధ) వాహసో ఉజగరశ్శయు (వైజ పాతాళ సరీ) దీనికి ఆదిశేషుడనునది ఉర్ధ్వం పెను పొంద బఱచినపెనుబాముచాప దనచంక నిఱికి పద్మాయతుం దగుచు (ద్వి ప-మ 2 4 పౌ) (చూ హూ ని) కొండచిలువ-అజగరము వేఱు వేఱుఁబఱచినది గురు ఆం భా తోపాటు

త్రాచు — అన విని వ్రేటువడ్డయురగాంగనయుంబలె నేయి వోయ భగ్గన దరికొన్నభీషణహుతాశనకీల యనంగ లేచి హెచ్చినకినుదోయికెంపు దనచెక్కుల గుంకుమపత్త్రభంగసం జనితనవీనకాంతి వెదచల్లగ గద్గదభిన్నకంఠియై (పారి ఆ 82) ఇది

(కేవల) సర్పవాచకముగా గూడ కనఁబడు చున్నది కరువలిమేఁతరి కంటివినుకిరి పాము పుట్టకాఁపరి త్రాఁచు చుట్టువ్రుడు గు విసముతాలుపు చిల్వ బుసపుర్వు నా భోగి వెలయు (సాంబ తి 80) ప్రయోగములుగూడ ఇట్లున్నవి — స్ఫటల మణు ల్గాం శాంత మై శ్వేత మై నట్టిత్రాఁ చొక్కటి చుట్టి యుండు (ఆము 4 200) నహుషభూధవు డు గాఁడె పెద్దత్రా చు (N 8 48)- అని త్రౌ (ఇచటపెద్దత్రాఁచు -పెను బాము-ంజగరము అనుట వచింప బడినది)

జెట్టి — జెట్టిపోతు అనియు (వ్య) విషపూరిత మైనయొకపాము మగత్రాఁ చనఁ దగిన ఓది

పెంజెర — పెంజరు అని వావి పా త్రౌ శ ర సూ ని పెంజెర అనియె గ్రహిం చినవి (పెను + జెట్టి) ఒకదినుసుకొండచిలువ దీనిభేదములు- తుస్సుపెంజెర పొట్ట పెంజర రక్తపెంజర --యనవి సర్పవిశేషము ఒకజాతిపాము-అని (సూ ని) శంఖ పాలకులును జాతినాగులు నుర్లు పెంజరలును నెట్టపెంజెరలును' (ద్వా 8 100) (చూ సూ ని)

తుట్టెపురువు —సాధారణసర్పము- అని (శ ర)

పసిరికపాము —పచ్చగా ఉండి హాని కలిగింపనియొకపాము ఉశీతి స్సర్పజాతయః అని పైజ ఈసర్పజాతులను ఎనుబది గా పరిగణించినది-(పాతా నరీ)

సీ పడగదాలు పనంగఁ బా మన విసదారి
యన గాలిదిండి యం చనఁగఁ జిలువ
యనఁగ సర్పసమాఖ్య లలరు నాహేయ మొఁ
బాముది యనఁగను బాఁపది యనఁ
గుప్పస మనఁగను గుబుసం బనంగను
గంచుకనామంబు గాఁ జెలంగుఁ
బడిగె నాఁ బడగ నా స్ఫట దనరారు వి
సము నాఁగఁ జిలు మనఁ జను విషంబు

గీ వ్యాళసంగ్రాహినామ మై వఱలు గార
డీఁ డనంగను బాములవాఁ డనంగ

గారడి యనంగ హస్తసంగతకురంగ
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 48

పడగదాలుపు పాము విసదారి గాలిదిండి చిలువ—ఇవి సర్పమునకు పేర్లు

పాముది పా పది—ఇవి ఆహేయమునకు (పామున కైనవిషము ఎముక-మొద లగుదానికి) పేర్లు

కుప్పసము కుబుసము—ఇవి కంచుకమునకు పేర్లు

పడిగె పడగ —ఇవి స్ఫటకు(పాముపడగకు)పేర్లు

విసము చిలుము—ఇవి విషమునకు పేర్లు

గారడీఁడు పాములవాఁడు గారడి—ఇది వ్యాలసంగ్రాహికి (వ్యాలగ్రాహికి వ్యాలగ్రాహునకు అహితుండికునకు పాములవానికి పాములఁ బట్టుకొనువానికి) పేర్లు

గాలిదిండి — స్వ ర్భిన్నా దేవ తస్మా త్తే వినా ద్వన్ద్వం హరె ర్మతే అని అథర్వ ణు డు ఎరుషా వా స్వరూపేణ ప్రథమాన్తోపరి స్థితా కకౌ సంబోధనే చాఽఎ వ్యా వ్యయే కర్మధారయే అచేతనార్థకె శబ్ద ఇతి శృఙ్గారభూషణ అని మతాంతరము వెలిదమ్మి తెలిదామర-మొద లగునవి రెండవకారికచే సాధువులు ఇచ్చటి కర్మ ధారయే ఽనునది ఇతరసమాసోపలక్షక మనిన నలుగడలు నలుదెఱగులు మొ సాధువులు పరిశీలించి చూచిన నన్నయ గసడదవా స్స్యుః పదా ద్ద్వన్ద్వే ఽని విశేషించి వచించి యుండుటనుబట్టి వెలిదమ్మి ఇత్యాదులు వెలితమ్మి అను రీతివే వీని సాధుత్వము చింత్య మని కొందఱు విమర్శకు లను చున్నారు కాని తెగి మన కగ్గ మై యరుగుదెంచినవా డిత డల్క నింక నొం డుగడకు బోవ కుంతగ (భార కర్ణ 3 293) మొ ప్రయోగము కర్మధారయమునందలియీ యాదేశములు ప్రామాణికులు సాధువు లనను చున్నవి శృంగార భూషణునిమత మిందులకే యున్నాతృత మైనది అథర్వణాచార్యునిచే నల్గడ లిత్యాదుల నథర్వ ణాదులు ప్రయోగించినట్లు వచించి నలుగ డాదులు సాధువులే యను చున్నాఁ

డహోబలపతి (మా ఆం చిం సంధి 32సూ వ్యా) అప్పు డివియును సాధువులే నుగాగమము లేని నజ గడాదులు సాధువులు — వని బాలవ్యా నలుగడాదుల నీయాగమంబు లే దండ్రు అని అహోబలపతిమతమును దా నంగీకరింప నను చున్నా డు ఉప్పు డివి గాలితింది ఉనురీతివి కావలసి యున్నవి

చిలువ — (చిలుము-వాయి) నోటియందు విషము గలది విషధరము పాము - అని (సూ ని) నలువ వంటి దిది చిల్వ (రూపాం) చిల్వలక్రియ గానరానిగతు లన్ మయిమైఁ బెనుచున్ (మనుచ 3 62)

ఆహేయము — త్రి షా్వాహేయం విషాస్థ్యాది అని అమ అహౌ భవమ్ అనివ్యుత్పత్తి దృతి కుక్షి కలశి బ స్త్యే స్త్యహే ర్ఢఞ్ (4 3 56)

కుప్పసము — (సం కూర్పాస ప్రా కుప్పాసో క కుప్పస త కుప్పాయమ్) కుపసము (రూపాం)- తనరారు నాయంపతండంబు జూడు కుపసంబు లూడ్చినక్రూర సర్పముల షమింప ననువు లై యొడియుగాఘవుని (రం రా యు 384పొ 9పం) (చూ సూ ని)

కుబుసము — చౌక్కాయ అనునది దీనికి (అర్థాం) పుణ్యపాపకర్మపుంజనిబద్ధ మై తొడిగినకుబుసంబువడువు దాల్చి జీర్ణ మగుచు నుండుచెన టిదేహంబున యందు నీవు మమత బొంద వలదు (మార్క 3 04) ఈ యర్థమున ఆం భా కర్తయు దీనిని ప్రయోగించినా డు (మా 37)

కంచుకము — సమౌ కఞ్చుకనిర్మోకౌ అని (అమ)

వ్యాలసంగ్రాహి — వ్యాలగ్రాహి యే వ్యాలసంగ్రాహా వ్యాలగ్రాహ్యాహితుణ్డిక అని అమ ఉహే తుణ్డం ముఖమ్ తేన దీవ్యతి (4 4 2) ఠక్ సంజ్ఞాపూర్వకత్వాత్ వృద్ధ్యభావే అహితుణ్ణికొ ఽపి వ్యాలగ్రాహో ఽహితుణ్డికః అని (అమరమాల) (చూ సుధ)

గారడీ డు — (గారడి + ఈ + డు) స్వార్థమునందు ఈ ప్రత్యయము ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు (బాలవ్యా తద్ధి 6సూ) గారుడ మన్త్ర ము తెలిసినవాఁడు, పాములవా డు అను వెఱింగిభూపు డనుపాము బట్టి యా డించు మంత్రిగాండీవికరణి (ద్వా 94) (చూ సూ ని)

గారడి — (గారడము + ఇ) (సం గారుడమె కి గారడ త కాండం) గారడము-
విషమంత్రము ఇవర్ణకంబొయారాచులకు మతుబర్థంబునం దగు (బాలవ్యా తద్ధి 8)

పాతాలభోగివర్గము — గురు పాతాలవర్గము భోగివర్గము-అని వేఱు వేఱు గా విభజించి
నది సుధ- అధోభువన అని ఆరంభించి వ్యాలగ్రాహ్యాహితుణ్డిక అనునంతవఱకు
(మొత్తము) అంతను గలఁ పాతాలభోగివర్గ మనినది ఆం భా సుధనే- ఇట నను
సరించినది

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతన
బరఁగుఁ బాతాలపన్నగవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగద్భ్ర యీమాతృభూత 49

పన్నగవర్గము — పన్నగము భోగి పర్యాయములు పాతాలపన్నగవర్గ మనుట పాతా
లభోగివర్గ మనుటయే

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68]

ఇది

పాతాలభోగివర్గము

———

# నరకవర్గము

సీ బిద్దె బిస్త యనంగ వెలయు దుర్గతి వంత
గాసి వెతారము కాఱియ వెత
బారి నొగులు నొప్పి బాద నెగులు నొవ్వి
వందురు దురపిల్లు కొందలంబు
సలుపు నోవి యనంగఁ జను వ్యథ యేఁ పన
నదనంబు దగుఁ గ్రుక్కు డదుము డొత్త
డ మొత్తు నాఁ బీడనమ్ము విరాజిల్లు
వెట్టి యనంగను విష్టి దోఁచుఁ

గీ జోద పల్లట మల్లట చోడుమ బడ
ప యిడు మగచాటు బా మనఁ బరఁగుఁ గష్ట
మామనస్యంబు బిడ్డకు ట్టనఁ దగుఁ డిను
కనఁగ గుదవేదనంబు గాఁ దనరు నభవ 50

బిద్దె బిస్త—ఇవి దుర్గతికి (నరకమునకు) పేర్లు

వంత గాసి వెతారము కాఱియ వెత బారి నొగులు నొప్పి బాద నెగులు నొవ్వి వందురు దురపిల్లు, కొందలము సలుపు నోవి—ఇవి వ్యథకు (బాధకు) పేర్లు

ఎఁపు—ఇది అధిక మైనవ్యథకు (తీవ్ర మైనబాధకు యాతనకు) పేరు

క్రుక్కుడు అదుముడు ఒత్తడము ఒత్తు—ఇవి పీడనమునకు (నొక్కుడునకు అదుముటకు) పేర్లు

వెట్టి—ఇది విష్టికి (కూలి లేనికష్టమునకు) పేరు

చోద పల్లటము అల్లట చోడుమ బడప ఇడుమ అగచాటు బాము—ఇవి కష్టమునకు ఆపదకు దురవస్థకు) పేర్లు

బిడ్డకుట్టు—ఇది ఆమనస్యమునకు (ప్రసూతిజ మగుబాధకు ప్రసవవేదనకు) పేరు

తినుక—ఇది గుదవేదనకు (ప్రసవాదులయందు ముక్కుటవలన కలుగుముడ్డి తీపునకు) పేరు

దుర్గతి — స్యా న్నారక స్తు నరకొ నిరయో దుర్గతి స్త్రియామ్ (అమ)

వ్యథ —పీడా బాధా వ్యథా దు ఖ మామనస్యం ప్రసూతిజమ్ స్యా త్కష్టం కృచ్ఛ్ర మాభీలమ్ (అమ) ఇట- పీడాదులు (6) మన ఃడకు కష్టాదులు (3) శరీరపీడకును పేళ్లు ఈ (9) దు ఖమునకే పే ళ్లని కొందఱు అని (గురు)

విష్టి — హరా దభృతికి క్లేశో విష్టి రాజూ శ్చ కీర్త్యతే అని (కోశాన్తరము) (చూ సుధాటిప్పణి) జీత మీయక కొలువు చేయించుకొనుట పేళ్లు భద్రకరణముపే ళ్లని కొందఱు బలాత్కారము గా నరకమున ద్రొబ్బుటపే ళ్లని కొందఱు - అని విష్టి రాజూ అనెడి అమరమును వ్యాఖ్యానించినది గురు

పీ ప —సూ వి పి చునుబట్టి సబిందుకము గా గ్రహింప బడినది కాని సపనాథ వి పు ప్రయోగములు నిర్బిందుక మిది యనుటకు సాధకములు గా నున్నవి ఇంకను విచార్యము అను చున్నది

చోద —తనువు భరం బని వీడ్కొని తనలో దలపోయు మూఢతముచందమునన్ జెన టిపతి చోద కోర్వక చని రాజ్యము మంత్రికై వసము గావించున్ (వేం పంచ 1 382)

అగచాటు —(అగము+చాటులు) దే వి బ అని శ ర హ ని బ్రౌలు అగ బాటు -వావి (అప ముద్రి)

తినుకు — తిమ కన గ వావి (అపముద్రి)

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు *నిచ్చలును నరకవర్గ మిట్లు
గై కొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 151

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68]

ఇది

నరకవర్గము

---

* నిచ్చలు-నిత్యము-శాశ్వతము గ—అనుటయే

# వారివర్గము

క. వననిధి యొప్పును బ్రాయే
అన మున్నీ ౦న౯గ౯ గడలి యన సంద్ర మనం
గను బాలవెల్లి యన౯గా
విన బడ నౌ క్షీరజలధి వృషభతురంగా 52

ప్రాయేఱు మున్నీరు కడలి సంద్రము—ఇవి సముద్రమునకు పేర్లు

పాలవెల్లి—ఇది క్షీ౦సముద్రమునకు పేరు

వననిధి — జలనిధి వనము-జలము ఎనం కొనననీరయో (విశ్వ) అం సం సాంబ - (సముద్రమునకు) నామములను ఇట్లు వచించినవి- జడధిపే ళ్లగు మున్నీరు కడలి సంద్ర మన గ (అం సం స్థా 9) వేల్పుసువారంపువిడిది వెన్నునిటెంకి ఠత నాలపంట సంద్రంబు కడలి ౣడమిమద్దియకోక మున్నీరు ప్రాయేఱు మణ్బుప్వ్వుల వెల్లి మామమామ గట్టురాకొమరుని ౕచిననేర్పరి యేఱులమగ డు రెయింతిమామ ముక్కంటయమ్ములపొది మింటిలాయంబు తో ట దొడ్డి యెనర్చునీటుకా డు చందు వయ లచ్చి తండ్రి నా జలధి పర గు (సాంబ దేవ 7) సాంబ-పేర్కొనినయీ నామములు చాలవఱకు యౌగికములు గా ఏర్పఱచుకొనినవి కనుకనే వీనిని గ్రహించి శ ర సూ ని మొ ప్రయోగము లిచ్చుట లేదు పుడమిమద్దియకోక -మొ సంస్కృతము లోని సాగరామ్బరా ము న్నగువానిని అంద గా గొని ఏర్పఱప బడినవి ఉండిన ఏయాధునికకవిప్రయోగములో వీని కుండఎచ్చును ప్రాచీనప్రామాణికప్రయోగము లిందులకు శూన్యములు అందులకె అం భా వీనిని గ్రహింపలే దేమో సంస్కృతము న గూడ అమరము సాగరాంబరాదుల బేర్కొన లెదు తరువాతివై జ మొ వీనిని గ్రహించినవి - అబ్ధివస్త్రా నాధారా వేది నీలా (వై జ భూమి దేశా) భూమిధాత్రీ రత్నగర్భా విపులా సాగరామ్బరా ఇతి కోశ అని ఒకచో (మల్లినాథవ్యా) వీని

ని గూర్చి వామనుఁ డిట్లను చున్నాడు- విశేషణమాత్రప్రయోగో విశేష్యప్రతిపత్తౌ' (కావ్యా ౦ 0 సూ )- విశేష్యస్య ప్రతిపత్తౌ జాతాయాం విశేషణమాత్ర స్యైవ ప్రయోగః యథా- నిధాన ర్భా మివ నాగరామ్బరామ్ అత్ర హి పృథివ్యా విశేషణ మాత్ర మేవ ప్రయుక్తమ్ ఏతేన క్రుద్ధస్య తస్యా ఽథ పురామరాతే ర్లలాటపట్టా దుదగా దుదర్చిః గిరే స్తడిత్వా నివ తావ దుచ్చకై ర్జవేన పీఠా దుదతిష్ఠ దచ్యుతః ఇత్యాదయః ప్రయోగా వ్యాఖ్యాతాః (అని ) పరిశీలించి చూచిన కేవలవిశేషణమాత్రములు గా ఇవి ముందు ప్రయుక్తము లై అనన్యసాధారణవిశేషణము లగుటను ఉత్తరోత్తరకాల మున విశేష్యాభిధాయకములు గా రూఢిఁ బొంది నిఘంటువుల కెక్కిన వన వచ్చును అట్లే తెలుఁగునం దివియును ఆం భా అమరమువంటిది తెలుఁగునకు ఆం సం సాంబ వేంక -మొ దీనితరువాతివి వైజ మొ వానివలె నన వచ్చును దీనిని బట్టి

పాలవెల్లి —ఆం భా నానా. వర్గమున సస్యభేదాంబుధుల్ చను బాలవెల్లి నా (3 47 ) అని దీనిని సముద్రమాత్రవాచకముఁ గా పేర్కొనినది ఆం భా తాను విశేషవాచకములు గా వచించినవానినిఁ జాలవఱకు సామాన్యవాచకములఁగా నానా వర్గమున నిర్దేశించినది ఇందుల కిట్టివి కొన్ని నిదర్శనములు ఇది గ్రహింపక సూ ని దీనికి సముద్రము అను నది అర్థం అను చున్నది ప్రయోగము చూప లేదు ఇతరనిఘంటుసంవాదముగూడ ఆం. భా కి ట్లున్నది - పర గు నాఱవసంద్రంబు పాలవెల్లి జిడ్డుకడలి పాల్కడలి నా క్షీరజలధి' (ఆం సం స్థా 9 ) (అని ) జిడ్డుకడలి దీనికి పర్యాయము- జిడ్డుగడలి దొరయల్లుం డొడ్డుకొనం దొడ గెఁ గేలియొడ్డు న్నవలా నిడ్డతెలినిగ్గుటడ్డెన వడ్డనకు న్దొడ్డలడ్డు వాల్ వంచుటకుఁ (బహు 4 3 ) (చూ సూ ని ) పాలవంక , పాల వా గు- ఇవియు దీనికి పర్యాయములు ఇవియేకాక పాల శబ్దమునకు సముద్ర పర్యాయ ము లన్నియు జేరి దీనిని వచించు ననవచ్చును పాలమున్నీరు పాలకడలి -మొ ఇట్టివియే దిఙ్మాత్రము గా పాలవెల్లి నిఁ బ్రదర్శించి వీని నన్నిటిని సంగ్రహించి నది (ఆం భా ) అచ్చటచ్చట ఇట్లే ఉపలక్షణవిధితో పదసంగ్రహణ మొనర్చుచుండు నిది పాలమున్నీరు' మొ- విశేషవాచకములను సాధారణవాచకములఁ గా ప్రయోగించు టయుఁ గవులయందుఁ గానవచ్చును ప్రతి వచ్చు ననవచ్చుఁ బాలమున్నీటికి నక్షయం బగుజీవనాభివృద్ధి (భీమ 1 07 ) మొ అంభోధు లన్నిటికి ఐక్యము కవిస మ్మతము. ఇట్టివి అర్థాంతరము లనఁ దగినవి కావు

తే మొగులువిరి నీరు నాఁగను దగు జలంబు
మీఱును హిమాంబుసంజ్ఞ పన్నీ రనంగఁ
బచనయోగ్యజలాభిధ పరఁగు చుండు
నెస రనంగ నఖాంకవక్త్రేందుచూడ 53

మొగులువిరి నీరు—ఇవి జలమునకు పేర్లు

పన్నీరు—ఇది హిమాంబువునకు (పన్నీరమునకు) పేరు

ఎసరు—ఇది పచనయోగ్యజలమునకు (వంటకై కాఁగఁబెట్టిననీటికి) పేరు

మొగులువిరి —అమ్భో ఉర్ణ స్తోయ పానీయ నీర క్షీరా ఉమ్బు శమ్బరమ్ మేఘపుష్పం ఘనరస అని (అమ)

పన్నీరు —(సం పన్నీరము క ఎన్నీర్ త పణ్ణీర్ తు పనీర్ ) పద్మిని కన్నీరు పన్నీట దుడువుము (నై ష 2 4) (చూ సూ ని ) పన్నీరము (సం ) అనుటకు కర్పూర రేణుసికతాకమనీయగర్భే పన్నీరశీతలశిలాతలపుష్పతల్పే కేళీ ముశీరదళ కల్పిత కాయమానే ధారాగృహే రఘుపతి ర్విదధే నిదాఘే (సాహిత్య రత్నాకరము రస )
పన్నీరాది మిళత్సకుఙ్కుమరజోలిప్తాంగజాతాలయామ్ (ఉత్తరకాలామృతము- 8 204 ) కుంకుమపంకసంక రాలంకార పన్నీరనీర నిర్వృతోర్వీసేచన విధానం బునకు (కలా 7 69 )- ఇది గ్రాఁతప్రతిపా (చూ సూ ని )

సీ కర డనఁ గడ లనఁ గర యనంగఁ దరంగ
యనఁ దరఁగ యనంగ నల యనంగఁ
దెర యనంగను వీచి పరఁగును సుడి యన
నావర్తసంజ్ఞ యై యలరు బుగ్గ
యన బుద్బుదం బొప్పు మను బొ ట్లనఁగ బిందు
పరఁగు ఫేనము నుర్వు నురుఁ గనంగఁ
దూపరాణ పుటమ్ము ఘూ మొప్పరము జల
దారి యం చనఁగను దనరును జల

గీ నిర్గమము తన్ముఖంబున నీటితోడ
వచ్చుతృణములఁ జొర నీనిపలకపేరు
లాఁపరా యంచు జనులు పల్కగను వెలయు
మాతృభూత జగత్త్రయీమాతృభూత 154

కరడు కడలు కర తరంగ తరఁగ అల తెర—ఇవి వీచికి (తరంగమునకు) పేర్లు

సుడి—ఇది ఆవర్తమునకు (నీళ్లసుడికి) పేరు

బుగ్గ—ఇది బుద్బుదమునకు (బుడగకు) పేరు

బొట్లు—ఇది బిందువునకు (జలము మొదలగువాని చుక్కకు) పేరు

నుర్వు నురుఁగు—ఇవి ఫేనమునకు పేర్లు

తూపరాణ పుటమ్మ తూము ఒప్పరము జలదారి—ఇవి జలనిర్గమమునకు (ప్రణాళికి నీళ్లు బయటికి పోవుద్వారమునకు) పేర్లు

లాఁపరాయి—ఇది తూమునఁ బడి నీటితో వచ్చుచెత్త చెదారము చొర నీని పలకకు పేరు

కరడు —(బ కరడులు ) గగనంబుతో రాయుకరడులు గలజలం బివిరి పా దటినయర్ణవముకరణి (భార ద్రో 2 26 ) (చూ శ్కర )

కడలు —(ఏ ) కడళ్లు కడళులు (బ ) తూలెడు పయ్యెద దు ఖాంబునిధిలోన గడ బ చందంబున గడలుకొన గ (హరి పూ 9 44 ) జలధులు నలి రే గి కడళుల నభ మెక్కఁ గడఁగె ననఁగ (హరి పూ 7 63 ) ఇట్లే కడళ్లు - (చూ సూ ని )

బొట్లు —బహువచన మవివక్షితము- ఆతేనెబొట్టున కచఎ నీ గలు ముసిరిన (కేయూ 2 4 ) మొ

ఫేనము —హిణ్డీరో ఉబ్ధికఫ పేనః అని (అమ ) సముద్రపునురు గే ఫేన మని అమ అను చున్నది లాక్షణికము గా బుడగ యెల్ల దీని కర్థమే డిణ్డీరో ఉమ్బుకఫః

ఫేనా బుద్బుదస్థాసకౌ సమౌ (వై జ పాతా జలా) మొదవుల నోరి నురువులుం బెయ్యలరేణంబులును (హరి పూ 6 42) నెఱయుకుంకుడు బండులనుబువు లన గ బలపలని పాండురాంబుదపంక్తు లమరె (ఆము 4 67)

తరంగ —(సం తరంగ) నం దిని యన్నేటతరంగలం బెన గుచున్ దివ్యద్రుమాకీర్ణ నం దన సందోహము దూఱుచున్ (భార ఉది 8 79)

నురుగు — (త నురై) దీనిని ఓ ని నిరనుస్వారము గా గ్రహించెను నిర్ధారక ప్రయోగములు గానరావు ఇంకను విచార్యము ఫేనము కలకంఠిలోచనంబులు గండు మీలు కు సుమగంధివిమలహాసము నురుంగు (రాజ వి 84) (శ ర పా) హాసములు నురుగులు మత్రి పా అని (సూ వి) నురువు- (రూపాం) సాంబ - నుఱువు నుఱు గనంగ గొజలు ఫేనము (దేవ 2) అను చున్నది శకట రేఫముతోనె వేదమువారు ఆము లో నెఱయుకుంకుడు బండులనుఱువు లన గ (4 67) అనుదానిని ఉదాహరించు చున్నారు ఉప్పుకప్పు- నరవెంద్రుకలు పెద్దనరము నురుగు అను చున్నాడు నురు గనియే సూ ని శ ర లు ఆము నిర్ధారకము గాదు రేఫనిర్ణయమునకు

తూపరాణ —తూపరాణి (రూపాం) గుడి లాపరా తూపరాణికడ నిలిచి (ఆము 6 0) ఇట-బ్రౌ - తూపురాణి (లేక) తూపురాని అని గుడిలాపరాతూపురానికడ నిలిచి అని ఆము పాఠము గా ఉదాహరించు చున్నది (చూ అను) తూపురాణపుఁదమ్ము అని ఏకపదము గా బ్రౌ గ్రహించుట ప్రమాదము (చూ షటమ్ము బ్రౌ అను)

జలదారి — (జలకము+దారి) జలకము-నీరు జలకము లందు లే వనుచు సందియ మొప్ప గ నూర కున్న (యయా 4 97) (చూ సూ వి)

లా పరాయి — లా పరా (రూపాం) శ ర లాపరా- (లా ప+రాయి) సంధిని వర్ణలోపము ఒని జలద్వారముఖమున తృణాదికము చొర కుండ నమర్చెడి గండ్ల తొఱ అను చున్నది జలస్రోతములో కసువు చొర కుండా నిలిపిన నాగబంధపు పలక చిక్కుపలక అని బ్రౌ లా పరా ఒని ఇట పదవిభజన మనినను అం భా కా దనదు లా పరాయి అనుట యుచిత మనిపించినది

సీ తట్టన దరి యన దనరును దీరాఖ్య
దనరును బార మద్దరి యవతల

నాతల నావల నవ్వల నవ లన
మీఱుచు నుండు నవారసంజ్ఞ
యిద్దరి యీవల నివ్వల నివల నీ
తల నివతల యన నలరు చుండు
దీవి లంక యనంగ ద్వీపంబు సికతాఖ్య
యిసు మన నిసుక నా నెసఁగు చుండుఁ
గీ దద్విశేషంబు నెరసు నాఁ దనరు నసలు
తొంప్చ. వం డడు సుబ్బలి రొంపి బురద
యుమ్మలి యవుజు జవుకు నా నొప్పుఁ బంక.
మార్యచిత్త రిరంస సూర్యావతంస 155

తట్టు దరి—ఇవి తీరమునకు (ఒడ్డునకు) పేర్లు

అద్దరి అవతల ఆతల ఆవల అవ్వల అవల—ఇవి పారమునకు (ఆవలి యొడ్డునకు) పేర్లు

ఇద్దరి ఈవల ఇవ్వల ఇవల ఈతల ఇవతల—ఇవి అవారమునకు (ఈవలి యొడ్డునకు) పేర్లు

దీవి లంక—ఇవి ద్వీపమునకు (నీటినడిమిదిబ్బకు) పేర్లు

ఇసుము ఇసుక—ఇవి సికతకు పేర్లు

నెరసు—ఇది ఒకవిధ మైనయిసుకకు పేరు

అసలు తొంప్చ వండు అడుసు ఉబ్బలి రొంపి, బురద ఉమ్మలి అవుజు జవుకు—ఇవి పంకమునకు (కర్దమమునకు) పేర్లు

తట్టు —సాంబ వేంక - ఒడ్డు దరి గ ట్టనఁగఁ గూల మొనరు (సాంబ స్థా 60) దరి గట్టు నొడ్డు నాఁ గూల మొనరు (వేంక స్థా 86) - అని ఒడ్డు గట్టు' విశేషము గా వచించినవి తట్టు వదలినవి (తటఃసం తట్టు-వికృ) గట్టు'-ఆం భా ఇచ్చట

వచింపకపోయినను నానా వర్గమున గట్టు నాఁ చీరనగంబు లలరు (3 53) అని వచించినది ఒడ్డు - ప్రయోగజుష్టమే అడ్డము వోయినమంత్రుల జడ్డిగములు ద్రుంచె భటులసందడి మాన్చెన్ దొడ్డచలంబున నీ కెదు రొడ్డి విజృంభించె నవలి యొడ్డున నధిపా (ఉ రా 3 238) ఐనను ఆం భా వదలుటకు కారణము ప్రత్యేకము గా దీనికి ప్రయోగము లె కుండుటయో సుప్రసిద్ధము గా జనవ్యవహారమున ఇది ఉండుటయో యనిపించును ఆధునికులు దీనిని వేఱు గా (ప్రత్యేకము గా) ప్రయోగించు చున్నారు ఒడ్లపై బాఱుచు నుండిన నదిపెంపు దూలి పోవును స్వల్పకాలమునను (రామలిం 36) ప్రాచీన ప్రయోగములే ఇట్టివి యున్న రామలింగేశ్వరశతకము దా క సూ ని ఇందులకై పరువు లెత్తదుగదా ఈ యాధునికప్రయోగమునే సంగ్రహించినవి తరువాతి యీనిఘంటువు లనిపించును సూ ని శ ర మొ - తట్టు నకు ప్రయోగ మిచ్చుట లేదు ప్రయోగము లేక ఆం భా పదగ్రహణ మొనర్పదు అన్వేషణీయము

జవుకు —జౌకు (రూపాం) చలిమావిరసముల జౌకు లెత్తినచోట 7 లువవుపొ్పడి నించి బలసి బలఁ (చంద్ర 3 0) (చూ జౌకు సూ ని)

నెరసు — నలుసు రెణువు-అనునది దీనికి (అర్థాం) నలుసువంటిసన్నని యిసుకయే ఈ యిసుక యయి యుండును

దీవి — నడిమిదిన్నె దీవి యన ద్వీప మగు అని (సాంబ మాన 24) నడిమిలోకము వంటి దిది నడిమిలోకము వంటివి సూ ని గ్రహించి ప్రయోగము లిచ్చినది దీనిని వదలినది ప్రయోగములు ప్రామాణికములు లె కేమో ఆం భా అందులకే దీనిని వదలినదా అని సందేహము

మీఱు చుండును బారసంజ్ఞ యిద్దరి యన అవి వావి అపపా పారావారౌ పరార్వాచీతీరె అని (అమ)- పార అవారశబ్దములు- వరుస గా ఆవలిదరికిని ఈవలిదరికిని పేళ్లు-అను చున్నది (చూ గురు 922 వావి ప్రతి) ఇచ్చట-గురు వ్యా లో ఆవలి ఈవలి అనునవి తాఱుమాఱైనవి ముద్రాపకులప్రమాదమున పరతీరావరతీరయో అవి ఇట (సుధ) అందులకే ఆం భా పా మీఱుచు నుండు నవారసంజ్ఞ అనురీతిని నాచే సవరింప బడినది

ఆ పఱవ పఱద వఱద పఱితి పఱత వఱ్ఱు
నాఁగ నిటు ప్రవాహనామ మొప్పు
వెల్లి వెల్లువ యన విలసిల్లు నధికప్ర
వాహనామము గఁ జెవందిలింగ 156

పఱవ పఱద వఱద పఱితి పఱత వఱ్ఱు—ఇవి ప్రవాహమునకు పేర్లు

వెల్లి వెల్లువ—ఇవి అధికప్రవాహమునకు (పెద్దవఱదకు) పేర్లు

ప్రవాహము — వేణీ ర్ధారాప్రవాహౌఘే పూర స్తు జలబృంహణమ్ అని (వై జ పాతా. జలా ) ఈ వైజ ప్రవాహపూరములకు భేదము వచించు చున్నది దీని నాధారము గాఁ గొనియే ఆం ఛా కర్త వెల్లువ వఱద-మొ వానికి భేదము వచించినాఁడు తెలుగు కవులప్రయోగములనుబట్టి

చెవంది(లింగా ) — చెవ్వందికి (రూపాం ) ఇది ఈ చెవందిలింగ'ని క్షేత్రయ్య తన పదములందు గూడ పేర్కొనియున్నా డు తెలుగునాట సుప్రసిద్ధి నందినవాఁ డీదేవుఁడు

సీ. ఓడ నావ యనంగ నొప్పు చుండుఁ దరణి
పడవ యం చనఁగ నల్పతరణి దగుఁ
గల మనఁ బోతాఖ్య గనుపట్టుఁ బుట్టి,నా
నరిగోలు నాఁ గోల మలరు చుండుఁ
దేప నాఁ దెప్ప నాఁ దేటిక, యనఁగను
బ్లవనామధేయంబు పరఁగు చుండు
నుత్ప్లుతయవసాదికోక్తి యై విలసిల్లుఁ
దొట్టి నాఁ దొట్టు నాఁ దొట్టువ యన

గీ నబక యన నగప యనఁగ నబ్ధి దోఁచు
ద్రోణి యగు దోనె యనఁగను స్రోత మెసఁగు

జాలు నాఁగను విలసిల్లు గూడ యన గ
జలసముత్క్షేపపాత్రంబు చంద్రమౌళి 57

ఓడ నావ—ఇవి తరణికి (నౌకకు) పేర్లు

పడవ—ఇది అల్పతరణికి (చిన్ననావకు) పేరు

కలము—ఇది పోతమునకు (యానపాత్రమునకు వణిజు లెక్కి పోయెడియొకవిధమైనయోడకు జోగునకు) పేరు

పుట్టి అరిగోలు—ఇవి కోలమునకు (గంపవలె ఉండి యేఱు దాటుట కుపయోగపడు నౌక సాధనమునకు) పేరు

తేప తెప్ప తేటిక—ఇవి ప్లవమునకు (తృణాదులతో నిర్మితమైనయొకవిధమగుతరణసాధనమునకు) పేరు

తొట్టి తొట్ట తొట్టువ— ఇవి ఉత్ప్లుతయవసాదికమునకు (గాలిచే నీటియందు కొట్టుకొని వచ్చెడితృణాదులకు) పేర్లు

అబక అగప—ఇవి అభ్రికి (ఓడలోనిప్రాఁకుడు గోకి వేయుట కగుకొయ్యగుద్దలికి) పేరు

దోనె—ఇది ద్రోణికి (కఱ్ఱతోఁగాని తాలతోఁగాని చేయఁబడి పడవవలె నుండి ఎత్తుడునీరు పోయుట కుపయోగించెడి-ఒకసాధనమునకు) పేరు

జాలు—ఇది స్రోతస్సునకు (అకృత్రిమప్రవాహమునకు స్వయము గాఁ బాఱు నీటిప్రవాహమునకు) పేరు

గూడ—ఇది జలసముత్క్షేపపాత్రమునకు (ఓడలో చొచ్చిననీళ్లను దీసివేయు పాత్రమునకు) పేరు

ఓడ — ఆం సం - ఓడ-కలము సమానార్థకము లను చున్నది- పర గు నో డన గల
మన దరణి ధరణి (స్థా 24) ఆం భా వే అను చున్నది విశేషవివక్షతో

నావ —(సం నౌ ప్రా నావా క నావె త నావాయ్) ప్రాకృతసమ మై శుద్ధాంధ్ర మనిపించు కొనిన ఇది నావెడు మద్దనంబు గొని నా కిడ నొల్లక కార్యబుద్ధి యై (కేయూ 3 94) మానార్థక మగు ఎడు ప్రత్యయము ఆచ్ఛికములకంటెనె వచ్చు చున్నది మానార్థ న్నిత్య మేకత్వ ఎడు స్స్యాత్పరిమాణకే అని అథర్వణుఁడు మానార్థంబున కేకత్వంబునం దెడుపర్ణకం బగు (తద్ధి 25) అని బాలవ్యా కోపగాడు అంక కాడు మొ చోటులందు తత్సమములకంటె తద్ధిత ప్రత్యయము రానవచ్చు చున్నను అది వానికిమాత్రమే పర్యాప్త మనవలెనది కొందఱు- కోపకుడు అను రీతిని సంస్కరించి వీనికి సాధుత్వము చెప్పెద మను చున్నారు అది కేవలము సాహస మనక తీఱదు ఇక స్త్రో వావౌ రై నావోః (అజ 62) అం చిన్తామణి నౌశబ్దంబునకు నావ యగు (తత్స 63) బాలవ్యా - తత్సమ మని నిర్వచించిన నావ శబ్దము వేఱు అది యిది కాదు కవిసంశయవిచ్ఛేదము తద్భవములు గా వయసు తపసు మనసు మొ ఉదాహరించు చున్నది (చూ 77-80 పు) అట్టిదే యిది

కలము —(ఇది) ఓడ సమానార్థకము అని ఆం సం - పం గు నోడన గల మన దరణి ధరణి (స్వా 24) (చూ ఓడ) తులువలు గొందఱు నిన్మది దల పరు నెఱదంట లెల్ల దమి నీయడగుం గలమున బుట్టువుమున్నీ రలర గదిరి ముట్ట గడతు రన్నిట (టీ) తే వా (ఉచ్ఛరా యు 63) ఆం భా కిది లక్ష్య మను చున్నది (సూ ని) ఆం సంగ్రహమున కిది లక్ష్య మనుట యుచిత మనిపించు చున్నది

పోతము — సాంయాత్రికః పోతవణిక్ ఽని (అమ) ఇట- పోతేన ఉపలక్షిత వణిక్ ద్వీపాన్తరగామినో వణిజ ఽని (సుధ) వణిజులు పోత మెక్కి దేశాంతరము వెళ్లి వ్యాపారము చేయుటను వసు ఇట్లు వర్ణించినది నుమ గ్రంపుటనంటివిప్పుఁబొర యన్‌జొ గెక్కి మాధ్వీమహా వనధిం బుప్పొడిదీవికిన్ మధుకరవ్యాపారు లెతేర దద్ఘనకిల్పారపటంబు లందుకొని వేడ్కం గోరకవ్యూహమో హనముక్తావళి దారెచ్చ నీతఱు గుగా ద్రాక్షి వీక్షించితే (3 42) (చి ని శ ర పా జొగు) (చూ సూ ని) (ముద్రిపా జొకు)

కోలము — ఉడుపం తు ప్లవ కోలః అని కోలము ప్లవము-సమానార్థకము లనినది (అమ) ఆం భా వే అను చున్నది

పుట్టి అరిగోలు — ఇవి ఏకార్థకము లని ఆం భా అనినను అంబుతరణసాధనవిశేషముల నుదాహరించుచు భిన్నము లను చున్నది హంసవింశతి - ఈ దుకొయ్యలు తెప్పలు నీ దు కాయ లరడ లరిగోళ్లు పడవలు దరులు పుట్లు చేపడవ లాది గాఁ జెల గునట్టి యంబు తరణంబులకు నెల్ల నధిపు డత డు (4 82) అర్థాంతర మనవలసిన దిది

ద్రోణి — ద్రోణీ కాష్ఠామ్బువాహినీ (అమ) ఇట- ద్వే కాష్ఠపాషాణకృతనౌకాకారామ్బు సేచన్యా అవి (సుధ) అమ్బువాహిని-ఎత్తుడునీరు పోయుటకై తొలిచి కాలువ మొదట నుంచెడుతాటిపట్టె లో నగునది దోనె అని (సూ ని)

స్రోతస్సు — స్రోతో ఽమ్బుసరణం స్వతః అని (అమ) ఇట-అకృత్రిమజలవహనస్య అని (సుధ) స్రోతస్వతీ ద్వీపవతీ స్రవన్తీ నిమ్నగా ఽపగా అని నదీపర్యాయముల వేరొక్కటిమ చున్నది (అమ)

జాలు — స్రోతము ఆం భా కుల్య మొ నీళ్లు చల్లగా పారడము D P 4 57 మంద మరుత్కిశోరహతి మవ్వపుఁదేనెల జాలువాఱు -అని బ్రౌ (చూ అను) జాలు-అల్ప ప్రవాహము-అని ఈ ఆం భా కు అర్థము చెప్పు చున్నది- (సూ ని) శ ర జాలు- అల్ప ప్రవాహము -అనుటకు మనుచ ప్రయోగ మొకటి యిచ్చినది అది యిది- అనినం జిత్తము జల్లనఁ జొరుగునయ్యంభోజపత్రాక్షిలో చనగోళంబుల జిమ్ము లై చిలుప లై జా లై తరం గంబు లై చనుదోయిం గొన బౌ కురంగమదచర్చల్ జాఱి పో నొక్కయొ ద్దున బాష్పాం బుఝరంబు లుప్పతిలె బోటుం బాటు గా నెంతయుఁ (స్వా 3 ఆ 36) ఇట-తిన్నగా ప్రవహించుప్రవాహము(గాలితా కుడు మొ వానిచే దూ కుడు లేనిసహజప్రవాహము) అర్థ మనిన ఆం భా కిది లక్ష్య మన వచ్చును అల్పప్రవాహము-అని ఆం భా కు లక్ష్య మిది యనువారి కిదియే ఆశయ మేమో [ జాలు గూడ ర డ ల- కభేద మాశ్ర యించి ప్రాసయతి చెల్లింపఁబడినది ]

సీ మాలిమికాఁ డనఁ ఖీలికాఁ డన నోడ
వాఁ డన నావికాహ్వాయము చెలఁగు
నచ్చిక మన నచ్చ మనఁ దేఱినది యన
నలరుఁ బ్రసన్నాఖ్య కలఁత యనినఁ

గలఁగినది యనంగఁ గనుపట్టుఁ గలుషంబు
కాలుష్య మెసఁగును గలఁక యనఁగఁ
వెలయు లోఁ తనఁగ గంభీరము పల్లము
నవుకుఁ బ ల్లనఁగ నిమ్నంబు దనరు

గీ మెట్ట యన మిఱ్ఱు నాఁగను మెండు నాఁగఁ
దోఁచు నుత్తాననామంబు తూలికాఁడు
జాలరి యనంగఁ గైవర్తసంజ్ఞ పరఁగుఁ
బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ 58

మాలిమికాఁడు పీలికాఁడు ఓడవాఁడు—ఇవి నావికునకు (ఓడచుక్కాను త్రిప్పు వానికి) పేర్లు

అచ్ఛికము అచ్ఛము తేఱినది—ఇవి ప్రసన్నమునకు (నిర్మల మైనదానికి) పేర్లు

కలఁత కలఁగినది—ఇవి కలుషమునకు (మలిన మైనదానికి) పేర్లు

కలఁక—ఇది కాలుష్యమునకు (మాలిన్యమునకు) పేరు

లోఁతు—ఇది గంభీరమునకు (లోఁ తైనదానికి అగాధమునకు మిక్కిలిపల్ల మైనదానికి) పేరు

పల్లము నవుకు పల్లు—ఇవి నిమ్నమునకు (పల్ల మగుదానికి కొంచెములోఁ తైనదానికి) పేర్లు

మెట్ట మిఱ్ఱు మెండు—ఇవి ఉత్తానమునకు (లోఁతు కానిదానికి మెరక యైన దానికి ఎత్తు ప్రదేశమునకు పేర్లు)

తూలికాఁడు జాలరి—ఇవి కైవర్తునకు (ధీవరునకు చేఁపలఁ బట్టి జీవించుపల్లె వానికి) పేరు

మాఁలిమికాఁడు —(మాలిమి+కాడు) స్వార్థమున కా ప్రత్యయము మాలిమి- ఓడ నడుపుశాస్త్రము దాని నెఱిగినవాఁడు- శీలంబు నడిపించు మాలిమి సంచలింపని మానసంబది బరువుగా గ చేసిన మురారి చరణ రాజీవభక్తి గౌరవంబను పేరోడ గలిగెనేవి (వరాహ 6 76) (చూ సూ ని) పరిచయము స్నేహము- అనునవి దీనికి అర్థాంతరములు మాల్మి యలవాటు వాడుక యలవడుటన బొల్చు బరిచయాఖ్యలు (సాంబ మాన 6) చెల్మి నంటు మాలిమి పొందనంగ మైత్రి (సాంబ మాన 6) [మాలిమి-రూపాం మాల్మి]

పీలికాడు — (పీలి+కాడు) (పీలి-ఓడ నడుపుచుకాఁను) మంత్రి లేకున్న రాజ్యంబు మనుజపతికి బెక్కువది యెంత గలిగిన బీలికాడు లేనిపేరోడ చక్రంబు లేనిరథము (పి శ 4 49)

కలుషము — కలుషొ ఒనచ్ఛ ఆవిల అని (అమ) మలిన జలస్య ఒని (సుధ)

కలక — రాగహీనత మనోగ్రంథి ద్రెంపగ నీళ్ల కలక నిందువు రాచి తెలుచుభంగి విజ్ఞానవశమున వెలయు స్వభావంబు నిత్యప్రసన్నమై నెగడుచుండు (వాసి 3 32) (చూ సూ ని) కలకనీ రెంతయు గత కల్మషము జేసె గలకాఫలమురీతి గలశసూతి (పాండు 4 37) ఇచ్చట కలకనీరు -మాలిన్యము గల నీరు-బురదనీరు- అని అర్థము మధ్యమపదలోపిసమాస మిది వడిగుజ్జుము మొదలగునవి యిట్టివి వ్యాకర్తలచే ఉదాహృతములు

పల్లు — ఇక్కడికంటె ఆనేల పల్లుగా ఉన్నది ఒని వ్య (చూ బ్రౌ)

గంభీరము — నిమ్నం గభీరం గమ్భీరమ్ అని (అమ) ఐనను అన్వర్థకము గూడ గంభీరశబ్ద మని యనుచున్నది అంభా అగాధమతలస్పర్శే అనియు (అమ) ఆ అగాధమే ఇచ్చటి గమ్భీర శబ్దమునకర్థ మనిపించినది

లోతు —ఇది విశేష్యముగా గూడ ప్రయుక్తము- కడలిరాయలలోతు గన్నగబ్బి (మనుచ 6 47)

నవుకు —నౌకు (రూపాం) నల్లమబ్బుకు గ్రింద నౌకుదాపునను దెల్లని వాల్చుక్క తెగిపడ్డరీతి గనిపించె (ద్వి శ సా 237 38 పం) (నౌకు-ముద్రి) (చూ సూ ని) మొలికి యు ఒకవిధ మగుఁల్ల మన బడునదియే

మెట్ట —మిట్ట- (రూపాం ) మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయ (మనుచ 59 ) మొ

మిట్టు — మిఱు(రూపాం ) ముసిముసినవ్వులు నవ్వుచు మిసిమింతు డుగాక యొక్క-మిఱుత నిలిచి య క్క-సుమశరహరు డు తపసులు కసమస దను బట్టుకొన గ గడఁగిన జెలుచన్ (హర 5 58 )

ఉత్తానము — స్యా దుత్తాన మగమ్భీరె శయితోర్ధ్వముఖె ఽపి చ (నానా )ఇట తెలు గుటీక యి ట్లున్నది- ఇది మిట్ట యైనవానికిని వెల్లికిల పండుకొనినవానికిని పేర్లు (అని )

తూలికా డు — తూలి అనుదానికి చే పల బట్ట జీవించునొకానొకజాతివా డు -అని శ ర అర్థ మిచ్చినది అప్పుడు స్వార్థమున కా ప్రత్యయము

జాలరి — (జాల+అరి) (జాలమ్ సం ) జాల శబ్దభవము జాల ఒకటి గలదు జాలకా డు- చే పల బట్టువా డు అను చున్నది శ ర జాల వంటి దగుటను నాలీనిమగ్గము జాల ఐనది జాలకా డు చెల ది లూత పర గు (ఆం భా 2 87 ) తంతువాయ శ్చ జాలిక అని (వై జ- పాతా సరీ ) పూజరివంట దిది పూజాశబ్దభవము పూజ దాని కై నదే పూజరి (రూపాం )- పూజారి దొమ్మి గూడి పూజ యొనరించి యి ట్లని పొగడి రపుడు (నీలా 3 37 ) పూజావాజి మొద లగునవి దీనికి (రూపాం ) అగు పూజా అనుదానినుండి యేర్పడినవే 'జాలరి - అనునెడ (జాలము+అరి) అని కొందఱు విభజించుట ప్రమాదమే అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు (బాలవ్యా తద్ధి 7 )- సూత్రమునందు పఠింప బడినది జాలాదిగణము- జాల ఒఱపు -అనురీతిని దాని నై న వీరు గమనించి యుండవలసినది

సీ వల యన జాలంబు పరఁగు జాల యనంగఁ
దనరుచు నుండుఁ దత్సదృశసంజ్ఞ
తద్భేద మొప్పు నూఁ తనఁ గువేణి చెలంగుఁ
గొడిమె యం చనఁగను బడిశ మెసఁగు
గాల మం చనఁగను గనుపట్టు మీను మ
చ్చెము చేఁప యనఁగ మత్స్యము తనరుచ్చ
చొఱ చోఱ యనఁగను బరఁగురాజీవంబు
గెండె యం చనఁగను గండకంబు

గీ తూల యనఁ దూర యనఁగను దోఁచు ఝుషము
వాలసిప మౌను వాలుగు వాలుగ యన
బేడిస యనంగ గుల్మము వెలయుఁ బ్రోష్ఠి
మొట్ట యన మీఱు శ్రీమాతృభూతలింగ 59

వల—ఇది జాలమునకు పేరు

జాల—ఇది తత్సదృశమునకు(వలవంటిదానికి)పేరు

ఊఁత—ఇది జాలవిశేషమునకు(అడుగున లావుగను పైని సన్నముగను ఉండునట్లు రెండువైపుల మూఁత లే కుండఁగ వెదురుపేళ్లతో అల్లిన మత్స్యగ్రహణ సాధనమునకు)పేరు

కొడిమె—ఇది కువేణికి (చేఁపలబుట్టకు) పేరు

గాలము—ఇది బడిశమునకు (చేఁపలఁ బట్టుటకై ఉక్కుకమ్మితో వంకరం గా చేసిన సాధనమునకు) పేరు

మీను మచ్చెము చేఁప—ఇవి మత్స్యమునకు (మీనమునకు)పేర్లు

చొఱ చోఱ—ఇవి రాజీవమునకు(పెద్దకన్నులు గల-ఒకవిధ మగుక్రూరమత్స్యమునకు) పేరు

గెండె—ఇది గండకమునకు(మత్స్యవిశేషమునకు పొట్టి దైన-ఒకజాతిచేఁపకు) పేరు

తూల తూర — ఇది ఝుషమునకు(లా వైనయొకజాతిచేఁపకు)పేరు

వాలుగు వాలుగ—ఇవి వాలసిపమునకు(నిడు పైనపెద్దకన్నులు గలిగి సముద్రమునం దుండుపెద్దచేఁపకు)పేర్లు

బేడిస—ఇది గుల్మమునకు(ఒకవిధ మైనచేఁపకు)పేరు

మొట్ట—ఇది ప్రోష్ఠికి(శఫరికి మత్స్యవిశేషమునకు)పేరు

చోఅ — పారిజాతాపహరణము మత్స్యావతారమున నైనమత్స్యమును చోఅ అనియే వర్ణించినది ప్రామినుకులదొంగ బాతాళకుహరంబు జొరఁ బాటి చీటినచోఅ వీవ (-49) ఆము - మత్స్యావతారమున భగవానుని తిమింగిలము - వర్ణించు చున్నది - మిటి గడవం దిమింగిలతమెయ్మెయిఁ బెంచిననీదువాత గు త్సితపలలాశి యైనచిఱు జే పది ద్రెళ్లట నీవు మ్రింగుచే? క్రుతు లగునూయిపు ల్మగుద జొచ్చుతటిన్ భవదే ధనై ధసై ధితజవశక్తి నీడ్చికొని తెచ్చుటకాకి తదల్పతాల్పతన్ (4 9.) ఈతి మింగిలమునుగూర్చి రామాయణ మి ట్లను చున్నది- ఉస్తి మత్స్య స్తిమి ర్నామ శతయోజన మాయతః య స్తం గిలతి మత్స్య స్స తిమిఙ్గిల ఇ తీరిత (అని) ఈచోఅనుగూర్చి భార ఇ ట్లను చున్నది- (వాని నెల్ల ద్రుంచి) వల ద్రవ్చికొని లీల నిగుడుచోఅవోలె వెగడువడక తటిమి రక్తనదులు వఱపె (కర్ణ 3 08) ఈచొఅను రాజీవ మను చున్నది అం భా ఆమ - రాజీవము తిమింగిలము వే అను చున్నది ఆధో ఝుషా రోహితో మద్గుర శ్శాలో రాజీవ శ్శకుల స్తిమిః తిమిఙ్గిలాదయ శ్చ (ఉని) రాజివము-కొలువాసములమీను అని(గుణ శ్ర ) వీ మైనను పైవర్ణనల బట్టి యిది భయంకర మగుమహామత్స్య-మనుటకు సందియము లేదు

గెండె — ఒకకవి మత్స్యభేదముల నిట్లు వచించినాఁడు — కొఱ్ఱమీలను దంష్ట్రికొలువులెంకల కిచ్చె బేడసంబుల నిచ్చె వేడుకకాండ్రకు గెండెల బలుదుండగీల కిచ్చె పులిమొట్ట లను దండువులదలారుల కిచ్చె గొడిసెల బరిహాసకులకు నిచ్చె బొక్కె-మొట్ట రొయ్య పరిగ యింగిలికి ము చీరచింపు జెల్ల నారజెల్ల కుంటముక్కు మొదలుకొని కల వన్నియు బంటువారి కెల్ల నొంటి యిచ్చె (సం ద్వా 240) ఈవర్ణనుబట్టి యిదియు ఒక క్రూరమత్స్య మనవచ్చును ఇది పొట్టిచేప అని కాకగెండె (లేక) కాకిటి గెండె అన బడును -అని బ్రౌ

గండకము — గణ్డకా శ్శకులార్భకా అని (వైజ వాతా సరీ) గడక శ్శకులార్భకః అనియే గురు సుధల పారము గణ్డకము అని ఆం భా శ ర సూ ని గణ్డక మనియే గ్రహించి చే పపిల్ల దీని కర్థ మనుటకు నిర్ధారకము గా కన్నతల్లి కన్న గరుణ లే దొకవేళ బట్టిఁ బట్టి తివియుఁ బార్థివేంద్ర గండకముల కిట్టి గండము ల్గల వి కె మన గ వచ్చ నెట్లు మనఁగ వచ్చు (దశా 37)

అని ఉదాహరించినది గడకము నకు మత్స్యవిశేషము మత్స్యార్భకము అను రెండువ్యాఖ్యలు గలవు మతభేదమున (చూ సుధ) ప్రకరణమునుబట్టి సుధ స్వమతముగా ప్రదర్శించిన మత్స్యవిశేషము అనువ్యాఖ్యయే ఆం భా కర్తచే నిట నాదృతమైన దనవచ్చును గడకము నకు గలయర్థము గణ్డకము నకును గల దనవలయును గణ్డకె ఖడ్గఖడ్గినౌ అను వ్యాఖ్యాసందర్భమున ఖడ్గో గణ్డక శృఙ్గాఙ్గ బుద్ధభేదేషు గణ్డకె (ఇతి విశ్వమేదిన్యౌ) ఖడ్గః- శృఙ్గమత్స్యస్య అను చున్నది (సుధ) కొమ్ముచేప ఒకానొక యాడుమత్స్యము శృంగి అని శ ర అడు మత్స్య మిది యనుట లేదు సుధ

వాలుగ — దీనివివరణము కొంత బ్రౌ చూపినది (చూ బ్రౌ) వీనిలో రెండు మూడు తెగలుగలవు ఇందు సముద్రమునం దుండునొకజాతివి గొన్ని నద్యాదులయం దుండు నవి మఱికొన్ని వాలుగడాలు- మన్మథుడు ఈతని ధ్వజము వాలుగమీనే ఇది కవులవర్ణనల బట్టి మిట్టిపడుచు మిసమిసలాడు నొకవిడు పైనచెప అనవచ్చును- జలమానవుల్గు చిమ్ముజముదాడిచాలు నా మిసమివాలుగమీను మిట్టి పడగ (S 3 29) (చూ బ్రౌ) కనుకనే చాంచల్యము నుబట్టి దైర్ఘ్యమునుబట్టి స్త్రీలకన్నులతో సాదృశ్యము దీనికి లోలాక్షిచూపువాలు గలవాలుగమీల పంక్తిమధ్యమున గూర్పంగ మఱచె (భాను 4) తెలివాలుగలతాలు గలసోగకనుదోయి సొంపు గులెక్కడినిద్ర మంపుజూచి (శుక ఆ) మొ (చూ శ ర)

వాలసిపము — ఇది వేరినిఘంటువులందు గానవచ్చుట లేదు అన్వేషణీయము

బేడిస — వెండిఫలె దెల్లనై నీళ్ళలోపల ఎగిరెడిచెప శఫరము - అని బ్రౌ శ ర - బేడిస శకుల మనుమత్స్యము ఒని పాఠీనము అను మత్స్యము- అని కొందఱు శఫరి అనుమత్స్యము-అని కొందఱు - అను చున్నది మత్స్యవిశేషము ఎగిరెడిచేప పాఠీనము అని సూని పాఠీనము ను వేఱుగా వచించు చున్నది ఆం భా (చూ 60) ఇది అది కాదు బేడిసతిరుగుళ్ళ (బాలక్రీడావిశేషములు) అని సూని దీనిని బట్టి ఇది భ్రమణము చేయు (చాంచల్యము వహించు) స్వభావము గలమత్స్య మనిమాత్రము తెలియవచ్చును బేడస (రూపాం)- రవర కొక్కెరలు బేడసమీల దం గలు తెగ దాటి నడిమికి దెచ్చుకొనగ (కకు 2 80)

ప్రోష్ఠి — సహస్రదంష్ట్రస్తు పాఠీన ప్రోష్ఠీ తు శఫరీ ద్వయోః అని (అమ)

మొట్ట —వ్రాత్ప్రతిపా ఇది (చూ సూ ని) మొట్టె అని (శ ర)

సీ కొఱ కొఱ్ఱ యనఁగను బరఁగుఁ బాఠీనంబు
జెల్ల యం చనఁగను జిమము వెలయు
నలరు రొయ్య యన క్షుద్రాండజనామ మై
యులుచ నాఁ దిఱికి నా మలుఁ గనంగ
బొమ్మిడాయ యనంగఁ బొలుపారు చుండును
మత్స్యభేదంబులు మఱియు గొన్ని
యలరును శుష్కమత్స్యం బుప్పుఁజేఁప నా
వరుగుఁజేఁ పనఁ గరువా డనంగ

గీ నెండ్రి యన నెండ్రిక యనంగ నెండ్రకాయ
యన గఁ గర్కటకాభిధ యలరు చుండు
మొసలి యనఁగను మకరంబు పొలుచు మదన
భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ 160

కొఱ కొఱ్ఱ— ఇవి పాఠీనమునకు (బహుదంష్ట్రలు గలయొకజాతిచేఁపకు) పేరు

జెల్ల—ఇది చిమమునకు (ఒకజాతిచేఁపకు) పేరు

రొయ్య—ఇది క్షుద్రాండజమునకు (చిఱుచేఁపకు) పేరు

ఉలుచ తిఱికి మలుఁగు బొమ్మిడాయ—ఇవి మత్స్యవిశేషములకు పేర్లు

[ఇంకను గొన్నిమత్స్యవిశేషములు ఇట్టివి గలవు]

ఉప్పుఁజేఁప వరుగుఁజేఁప కరువాడు—ఇవి శుష్కమత్స్యమునకు (ఎండినచేఁపకు) పేర్లు

ఎండ్రి ఎండ్రిక ఎండ్రకాయ—ఇవికర్కటకమునకు (కర్కటమునకు) పేర్లు

మొసలి—ఇది మకరమునకు పేరు

పాఠీనము — సహస్రదంష్ట్ర పాఠీనః అని ఉమ ఇచ్చటి సహస్ర శబ్దము ఉనన్త వాచకము-అని (సుధ) వేయిసంఖ్యను దెలుపునది-అని(గురు) శ ర సూ ని గురు వ్యాఖ్యను అనుసరించి వేయికోఱలచేప అను చున్నవి

చిమము — నిఘంటువులం దిది కానవచ్చుట లేదు నడమీన శ్చిలిచిమ అని (అమ) ఈ చిలిచిమ షే నామైకదేశే నామగ్రహణమ్ ఉన్యాయమున చిమము గా ఐన దనిపించు చున్నది అప్పుడు కిక్కసకసవునం దుండెడి తెలువంటిచే ప తేలుమీను-అర్థము దీనికి సూ ని చిలిచీమము చిలీచిమము చిలీచిమి చిలీచీమము చేలిచీమము చేలిమము చిల్లిమము చిలీచీమి (రూపాం) (వాచ) అను చున్నది

ఉలుచ — ఉలచ వావిపా ూంస - ఉలస ఉని మత్స్యవిశేషము నొకదానిని వచించు చున్నది- కొరద దాసరికొయ్య కొఱ్ఱ మీ నులస ముచ్చంగి బేడిస జెల్ల చాఋమీను (4 87)

జెల్ల — చింతజెల్ల దిడ్డిజెల్ల నల్లజెల్ల ఆని వీనిభేదములు బేర్కొని ఇది యొక విషపుఁజేప ఉను చున్నది (బ్రౌ) ఉలూపి శిశుక స్సమౌ అని (అమ) శిశువు వలె చపల మైన ఉలస మీనుపేళ్లు అని (గురు)

తిఱికి — చి ని శ ర లు శకటరెఫయుత మిది యను చున్నవి తిరికి అని (ముద్రి వా) (చూ సూ ని)

కఱువాడు —(త కరువాడు) చి ని కఱువాడు అని శకటరేఫముతో దీనిని గ్రహించినది (చూ సూ ని)

మలుగు — పాపమీను అని శ ర మలుగుమీ న్పొలిచియుఁ దూఱె (ఆము 263) మల్గు (రూపాం) 'గొంగ కొరదయు గడిసె పాపర మల్గు ముచ్చంగి కుంటముక్కులు లొంపి గ్రుచ్చుకొనియె (వేం పంచ 294) (చూ సూ ని) [ మల గనంగ వావిపా (అపముద్రి ]

బొమ్మడాయ — నేల నడగి యుండుమత్స్యము మద్గురము (చూ శ ర) బొమ్మిడము బొమ్మడాయిచేఁప అనియు (బ్రౌ) బోమ్మిడాయ స్సూక్ష్మమత్స్య డాహ్యాట స్త్రీ క్షుమత్స్యకః అని (విశ్వ) మీ టగుమీల నెల్ల మును మ్రింగి క్రమంబున నానె నెండపె స్పి టిక వెంట దో చతొగవేరుబడి న్గొడుపైఁ జెలంగఁ గాఁ ద్రోటిక గర్దమద్ర

వముతో నెనయించనబొమ్మిడాయ డా తుక్కాటకులంపులేజెన బకోటకులం బజలప్రహదం బునన్ (ఆము 254) దేశ్య మిది యను చున్నది (ఆం భా) పైవిశ్వమిచ్చి పై పద్యముకడ (ఆము వేద వ్యా) ఇ ట్లను చున్నది. ఈబొమ్మడాయ శబ్దము అనేకసంస్కృతనిఘంటువులలో లేదు సంస్కృత మయినచో- బో అని దీర్ఘ ముండవలయును శబ్దరత్నాకరములో బొమ్మడాయ అనుదేశ్యరూపము ప్రౌ లో బొమ్మిడము బొమ్మిడాయి యుం గలవు (అని) వే టి (958) వావి విశ్వ నిఘంటువులో బోమ్మిడాయ సూక్ష్మమత్స్యః అనునది లేదు ఆము ప్రయోగమునుబట్టి జరపిన పరిష్కర్తల సంస్కారప్రభావ మేమో ఇది

కర్కాటకము — కులీర కర్కాఎ పృష్ఠచక్షు పార్శ్వోదరప్రియ బిల్వకో ఒన్దప్రహరణ షోడశాఙ్ఘ్రి ర్ద్విధాగతిః ఒని (వైజ పాతా సరీ)

సీ తామే లనంగను దాఁబే లనఁగ నల్ల
దాసరిగాఁ డనఁ దగుఁ గమఠము
వెలయు జలూకాఖ్య జలగ యం చన నెట్టి
యనఁగ మహీలత యలరు చుండు
మండూకనామంబు మనుఁ గప్ప యం చన
శంఖము చిందము సంకు బూర
గొ మ్మనఁ దనరారుఁ గొఁజలును దక్షిణా
వర్తశంఖాభిధ వలమురి యన

క్షుద్రశంఖము దనరారు గుల్ల యనఁగఁ
గప్పచిప్ప యనంగను గాకిచిప్ప
యనఁగ జలశుక్తి దగు గవ్వ యనఁగ వెలయు
చుండును వరాట మై బాలసోమభూష 161

తామేలు తాఁబేలు నల్లదాసరిగాఁడు—ఇవి కమఠమునకు(కచ్ఛపమునకు) పేర్లు

జలగ—ఇది(జలూకమునకు రక్తపకు జెలగకు) పేరు

ఎట్టి—ఇది మహీలతకు(గండూపదమునకు వానపాము నకు) పేరు

కప్ప—ఇది మండూకమునకు(భేకమునకు)పేరు

చిందము సంకు బూరగొమ్ము—ఇవి శంఖమునకు పేర్లు

వలమురి—ఇది దక్షిణావర్త శంఖమునకు పేరు

గుల్ల—ఇది క్షుద్రశంఖమునకు(చాలచిన్న శంఖమునకు)పేరు

కప్పచిప్ప కాకిచిప్ప—ఇవి జలశుక్తిక(నీటియందలిగుల్లకు ఆలిచిప్పకు)పేర్లు

గవ్వ—ఇది వరాటమునకు (వరాటికకు కపర్దకమునకు) పేరు

తాబేలు —(తాబేలు తాబేళ్ళు) (ఇది నీటితాబేలు మెట్టతాబేలు—అని రెండువిధములు అని (సూ ని)

జలగ — జల్గ(రూపాం) కప్పలు మీలు జల్గలు నీటిలోన (పంచతా దీక్ష 66పొ) (చూ సూ ని) జెలగ (ముద్రి) (పారాం) కిలలో బాములు దెళ్లను జెలగలు గలుచు టయుం జావుచే బొదవు (ద్వా 9 74) (చూ సూ ని) జలగ (ప్రా తప్రతి) పులికూనల దినుచందము గలిగిన నంతటన నిలుచు గాక ధనంబుల్ గలుగునె మీ దను గావున జలగ దిగిచినట్లు గొనగ జను నిల సొమ్ముల్ (భార శాం 2 493)

వలమురి —సాంబ వలమురి యనంగ శంఖము వెలయు (దేవ 4)అని శంఖపర్యాయములలో సాధారణవాచకము గా దీనిని ఉదాహరించు చున్నది ఇట్లే(వేంక)(చూ దేవ 20) వసుచ దక్షిణావర్త శంఖమును ఇట్లు వర్ణించినది- విలసత మౌక్తికంబులు సవిభ్రమరేఖల నుక్కు సాటి రాదలచి మహోద్ధతిన్ మొరసి తన్మృదునాదవిలాసకౌశలం బలపడమిన్ ముడింగి దర మై తనలోవివరం బెఱింగి యా వలమురి దా ప్రదక్షిణము వచ్చెనొ యాతని కంఠలక్ష్మికిన్ (2 43) దక్షిణావర్త శంఖము దక్షిణము వంకకు ఆవర్తము (సుడి-ముడి)గలది గా ఉండును ఇది చాల శుభకరము ప్రశస్తమైనది దక్షిణావర్త మిది యగుటయే ప్రౌఢోక్తి సిద్ధము గా ఇందు చమత్కరింపబడినది పాంచజన్యమే కాక మఱి యితరములును ఇట్టివి గలవు వలమురిజిగి నగుమెడకలు వలమురిపెము జూపుచూపు వనజాతము నా వల మురియించుమొగము కై వలమురిదిహ్రంచువేణి వనితకు దనరున్ (చంద్రా 4 44) (చూ శర) ఇట

ఆం భా కు అవియే అర్థము లచ్చిదొరబూరగొమ్ము వలమురి యనఁగఁ బాంచజన్యంబు దనరు ( ౬౨ ) అని ఆం భా పాంచజన్యనామములలో వచించినది సూ ని - (సం క్షుల్లక ) గుల్ల-జలజంతువిశేషము క్షుద్రశంఖము -అని ఈ ఆం భా నుదాహరించు చున్నది- క్షుద్రశఙ్ఖాశ్శఙ్ఖనఖా అని (అమ) ఇట ద్వే సూక్ష్మశఙ్ఖానామ్ అని (సుధ) శఙ్ఖవిశేష మనుటయే ఇచ్చటిప్రకరణమునుబట్టికూడ సముచితము

గవ్వ — శంఖముదినుసు కపర్దకము అని (శ ర) దీనిని చిన్ననాణెము గా వాడుదురు అని(సూ ని) గవ్వ కైనను గొఱగానివాడు అని(వ్య) శమ్బూక క్షుల్లక శ్శఙ్ఖ కపర్దస్తు వరాటకః అని (వైజ పాతా సరీ)

సీ నీరుటెంకి యనంగ మీఱు జలాశయం
 బడరును హ్రదసంజ్ఞ మడుఁ గనంగఁ
దనరును గాఁడి యం చనఁగ నిపానంబు
 చెలమ నా నుపకూప మలరు చుండుఁ
గనపట్టు నూయి నాఁగను గూపసంజ్ఞ
 నాహంబు తాగాఁడి నాఁ జెలంగుఁ
గలుఁజు తాకట్టు నాఁగను శిలాబంధ మొ
 నెగడుఁ బుష్కరిణి కోనే రనంగఁ

గీ జెఱు వనంగ దటాకంబు గొఱలు చుండు
నలుఁగు నా జలనిర్గమస్థలము వెలయు
గుంట గుంట యనంగఁ బేర్కొనఁగ వచ్చు
నల్ప మైనతటాక మార్యాసమేత 162

నీరు టెంకి—ఇది జలాశయమునకు (జలాధారమునకు నీటిపట్టునకు సరస్సు మొద లగువానికి) పేరు

మడుఁగు— ఇది హ్రదమునకు (అగాధ మగు (చాలలోఁతు గల) సరస్సునకు) పేరు

గాఁడి—ఇది నిపానమునకు (కూపసమీపమున ఏర్పఱచిన జలాధారమునకు) పేరు

చెలమ—ఇది ఉపకూపమునకు (నీరు ఊరుటకు త్రవ్వినగోతికి (కూపకమునకు కూపమువంటిదానికి) పేరు

నూయి—ఇది కూపమునకు (చేఁదుడుబావికి) పేరు

తాగాఁడి—ఇది పీనాహమునకు (ఇటుకలు లో నగువానితో కట్టినసూతివాతికట్టునకు) పేరు

కలుఁజు తాకట్టు—ఇవి శిలాబంధమునకు (నీళ్లు పోవుటకై ఒకచో దారి యేర్పఱచి అటు నిటు నీళ్లు పో కుండ నూతికి చుట్టు తాతితో కట్టినకట్టకు) పేరు

కోనేరు—ఇది పుష్కరిణికి (చుట్టు మెట్లు కట్టిన నలుచదరపుఁజెఱువునకు) పేరు

చెఱువు—ఇది తటాకమునకు (తామరలతోఁ గూడి మిక్కిలి లోఁతైన జలాధారమునకు పెద్దగుంటకు) పేరు

అలుఁగు—ఇది జలనిర్గమస్థలమునకు (చెఱువు నిండినపుడు నీళ్లు పోవుట కగు దారికి) పేరు

కుంట గుంట—ఇవి అల్ప మైనతటాకమునకు పేర్లు

జలాశయము — జలాశయో జలాధారః అని (గురుపా) నీ రుండెడి తావు పేళ్లు అని (గురు వివ) జలాశయా జలాధారా అని (సుధాపా)- ద్వే తడాగాదీనామ్ అని (సుధావివరణము) వీని భేదములను హంస ఇట్లు పేర్కొనినది- తిరుకొళము నూయి లోటయు జెఱువు మడువు లొందు కుంట చెలమ పడియ కోనెఱు బుగ్గ వా గు దొన తల వరి గుండము కాల్వ డిగియబావి దొరువులన్ (4 2 0) (చూ శ ర)

మడుగు — ఏటిలోఁడుమ లోఁతు గల చోటు అనునది దీనికి (అర్థాం) రఘుప్రవీరు చెవు లారగ నింతయుఁ దెల్పు నాడు మే మున్నది చెంత గంగమడుఁ గున్నది యైనటు

లయ్యెడిం దుదన్ (ఉ రా 6 282) పై యర్థమునకు ఈ ఆం భా ప్రమాణ మని సూ ని అను చున్నది హ్రదమునకు రెం డర్థములును- ( ) ఏటినడుమ లో తు గల చోటు (2) లో తు గల నిడుపాటి నీటిపల్లము- అనునవి గల వని శ ర అను చున్నది ఉమ వైజ అ ట్లనుట లేదు రెండర్థములు గల వనుట యుచిత మైనను నానా వర్గు వేఱు గా వచించు చున్న ఆం భా కు ఇట్టిధోరణి లే దనుటయే సముచితము ఇ క హ్రదమునకు ఆమరాదులు వచించు చున్నయర్థమే ఆం భా కిట సమ్మత మైన దనిపించు చున్నది పరిశీలనమున ద్వైపాయనహ్రదమును మడు వని హ్రద మని జలాశయ మని ఆం భార వ్యవహరించు చున్నది (భార శల్య 2 6 2 48 మొ) సూ ని రెండవయర్థమునకు ఉదహరించిన ప్రయోగము ఈయర్థమునను సంగత మగు నదియే గంగమడు గు- గంగానది అని అర్థము అగాధత్వాదుల స్ఫురణమునకై మడుఁ గనినా డు నదిని రెండవయర్థమే యిట జెప్పవలయు నన్న (అర్థాం) అది

నిపానము — ఆహావ స్తు నిపానం స్యా దుపకూప జలాశయే (అమ) ఇట- కూపర చితజలాధారస్య అని (సుధ) పశ్వాదులు నీరు ద్రావుటకై నూతి యొద్దన ఉంచిన నూతితొట్టి మొద లగువానిపేళ్ల ఎని (గురు) నూతివద్దిగాడి అవి (బ్రౌ)

పీనాహము — పీనాహో ముఖబన్ధన మస్య యత్ అని కూపముఖే ఇష్ట కాదిభిర్బద్ధస్య అని (సుధ) పీనాహో ముఖ ఎని గుఫ షా ఎాంసపాది మొద లగునూతి వాయికట్టు పేరు అని గురు వివరణము కూపముఖబన్ధనము నూతివాయికట్టు తల్లి వారం అని బ్రౌ (చూ అను)

తటాకము — పద్మాకర స్తటాకో ఒ స్త్రీ (అమ)- సపద్మాగాధజలాశయస్య అని (సుధ) తామరలు గల చెఱువుపేళ్ల అని (గురు)

చెఱువు — తటాకము కొలను అనుచున్నది సూ ని ఆం భా కొలను కొల కు నాఁగ సరసి వెలయును ఎని పైపద్యమున వచించు చున్నది ఆం భా మతమున చెఱువు కొలను పర్యాయములు గావు అల్ప మైన తటాకము- గుంట అనుట గూడ దీనినే తెలుపును కొలను గుంట పర్యాయము లను చున్నది సాంబ - గుంట కొలను కొల కు తిరుకొళం బన సరసికిఁ బర గు - (స్థా 65) సర స్తో యతటాకయో అని (విశ్వ) ఇది (అర్థాం) భార ప్రయోగ మి ట్లున్నది- చెఱువునడు మవిఁసను బెన వెఱ మెకములు సెదరినను వివేకనిధీ యు క్క-టి బహులసైన్య మతిముటి బఱ

చిన నా గంగ రాదు బలియుర కైనన్ (భార శాం 3 6) దీనిని బట్ట ఉగాధ మిది యనుట తెలియ నగును

[శిలాబంధము — కలు జు శిలాబద్ధ మౌ వావి పా]

సీ. తొట్టు నాఁ దీగ నాఁ దోఁచు చుండుఁ దటాక
పూర్వదేశాభిధ బొలుచుఁ గొలను
కొలకు నాఁగ సరసి వెలయును మెచ్చు నాఁ
బడియ యం చనఁగను బడె యనంగఁ
బల్వలనామంబు బావి డిగ్గియ యన
నగు వాపి యాలవాల మలరుఁ బాది
యనఁగఁ గ్రీడాఖాత మై కనుపట్టు గే
ళాకూళి యనఁగఁ గేళాకుళి యనఁ

గీ. జెలఁగు నే అన నది తద్విశేషసంజ్ఞ
యమరుఁ బెన్న యనంగను జమున యనఁగఁ
దనరు రే వన సలిలావతారమార్గ
ముద్ధృతకురంగ శ్రీమాతృభూతలింగ 63

తొట్టు తీగ—ఇది తటాకపూర్వదేశమునకు (చెఱువుకట్టలోపలిపొలమునకు) పేర్లు

కొలను కొలఁకు—ఇవి సరసికి(సరస్సునకు) పేర్లు

మెచ్చు పడియ పడె—ఇవి పల్వలమునకు (అల్పసరస్సునకు) పేర్లు

బావి డిగ్గియ—ఇవి వాపికి(దిగుడుబావికి) పేర్లు

పాది—ఇది ఆలవాలమునకు(పాదునకు) పేరు

కేళాకూళి కేళాకుళి—ఇవి క్రీడాఖాతమునకు(కీడాసరస్సునకు నాలుగువైపుల దిగుటకు పీ లైనబావికి) పేర్లు

ఎఱు—ఇది నదికి పేరు

పెన్న జమున—ఇవి నదీవిశేషములకు (పినాకినికి యమునకు- క్రమముగా) పేర్లు

రేవు—ఇది సలిలావతారమార్గమునకు(నీళ్లకై దిగునద్యాదులమార్గమునకు) పేరు

తీగ — తొట్టు కడ తీగ తో అం భా పా ఉదాహరించియు తీగకు ఈయర్థమిచ్చుట లేదు సూ ని శ ప్రౌ యుగూడ ఈయర్థము తీగ కీయ లేదు సబిందుకము నిర్బిందుకముగూడ ఇది యని ని (చూ సూ ని ) ఇట్లనుటయె యుక్త మనిపించినది

సరసి — కాసారః స్సరసీ సరః అని ఉమ శ్రీణీ కృత్రిమపద్మాకరస్య అని (సుధ )

మెచ్చు — మెచ్చ నా వావిపా మెచ్చు అని ప్రౌ పా (చూ అను )

పల్వలము — వేశన్త పల్వలం చాల్పసః అని (అమ )

వాపి — ద్వారవానో భవేత్పుష్కరిణీ ద్వారే ణైకేన వాపికా నైకద్వారా పుష్కరిణీ దీర్ఘాకారా తు దీర్ఘికా కుల్యా విధుతతోయ శ్చ తటాక పరికీర్తిత (అర్థరత్నాకరము) చి ని అని (సూ ని )

అవాలము —ఆలవాలమునకు(రూపాం ) ఉలవాల మలరు బాది సూ ని అపపా (చూ పాది )

పాది —పాదు(రూపాం ) నీ రెత్తువేళల నీ రెత్తు బాదువాదునకు గాలువలు పొందుగ నమర్చి కలా 4 78 )

కేళాకూళి —కేళకూళి కేళకుళి కెళాకుళి కెళాకూళి- కెళకుళి- అనునవి వీనికి (రూపాం ) ఈ కెళకుళిలోన నెలనాగ ప్రౌఢిరా యంచలకవల నిందించి యాడె (షోడ 8 38 ) (శర పా ) ఆ కెళాకుళిచెంత రాకేందుబింబాస్య తివిరి యంచకు నడ ల్దిద్దుచుండె (గక 3 7 ) (చూ సూ ని )

సీ కయ్య కాలువ యనఁ గనుపట్టు గుల్య కూ
డలి యన సంభేద మలరు చుండుఁ
దొగ తొవ కలువ నాఁ దోఁచు నుత్పలము తా
మర తమ్మి యనఁగఁ బద్మమ్ము చెఱ గు

జెంగల్వ కెందొవ చెందొగ యనఁగను
హల్లకసంజ్ఞ యై యలరు చుండు
గెందమ్మి చెందమ్మి కెందామర యనఁ ర
క్తోత్పలసంజ్ఞ యై యొప్పు చుండుఁ

గీ. గైరవాభిధఁ గాఁ దెల్లగల్వ యనఁగ
వెలయు దెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి
తెల్లదమ్మి యనంగను దేజరిల్లుఁ
బుండరీకంబు శ్రీమాతృభూతలింగ 64

కయ్య కాలువ—ఇవి కుల్యకు పేర్లు

కూడలి— ఇది సంభేదమునకు (నద్యాదులు కలయుచోటికి) పేరు

తొగ తొవ కలువ— ఇవి ఉత్పలమునకు (కల్వకు) పేర్లు

తామర తమ్మి— ఇవి పద్మమునకు (కమలమునకు అరవిందమునకు) పేర్లు

చెంగల్వ కెందొవ చెందొగ— ఇవి హల్లకమునకు (ఎఱ్ఱగలువకు) పేర్లు

కెందమ్మి చెందమ్మి కెందామర— ఇవి రక్తోత్పలమునకు (ఎఱ్ఱదామరకు) పేర్లు

తెల్లగల్వ— ఇది కైరవమునకు పేరు

తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి తెల్లదమ్మి — ఇవి పుండరీకమునకు (తెల్ల దామరకు) పేర్లు

కుల్య — కుల్యా ఽల్పా కృత్రిమా సరిత్ అని (అమ) ఇట మనుష్యులచే ద్రవ్వఁబడినచిన్నకాలువ అని (గురు వివ)

కయ్య — క్రయ్య (రూపాం) అధికజలము గెల్చి యవనీపతులు గొంద అతివిహారిపుల యాక్రమఘున మడిఁ రకట జలధి వెడలి సన్నపు గ్రయ్య ముని గి ర్రూ

పడంగు జమలమాడిక్క (భార శా 2 7) సన్నపు గ్రయ్య - ఎల్లకాల్వ అని అర్థము దీనిని బట్టి - గురు చిన్నకాలువ యనుటకంటె చిన్ననది అనుట సము చితము -మ - అల్పసరి త్తను చున్నది అందులకే సుధ - కృత్రిమస్వల్పనద్యా అని వ్యాఖ్యానించిన దీయమరము

కూడలి — కూడలి యన దద్భేద మలరు చుండు లని వావి (అపా) సంభేద స్సింధుసంగమః అని (అమ) (చూ సూ ని కూడలి)

సీ నల్లగల్వ యనంగ జెల్లు నీలోత్పలం
బలరు నుత్పలభేద మల్లి యనఁగఁ
బ్రాచి నీరాకు నా వారిపర్ణి చెలంగు
నాచన శైవలనామ మెసఁగు
నంతందామర యనఁగఁ దద్భేద మొఁ
దోచు మృణాళంబు తూఁడు నా గ
గ్రోవి యనంగను గ్రోలు నా నాళ మొఁ
దనరును దామరతంపర యన

గీ గమలషండంబు కేసరం బమరు నకరు
వనఁగ రేకన సంవర్తికాఖ్య చెల్లుఁ
బొలుచు గర్ణిక దుద్దు నా ముద్దె యనఁగ
బుంగవంతురంగ శ్రీమాతృభూతలింగ 165

నల్లగల్వ— ఇది నీలోత్పలమునకు (నల్లగలువకు) పేరు

అల్లి— ఇది ఉత్పలవిశేషమునకు (ఒక జాతి కలువకు) పేరు

ప్రాచి నీరాకు—ఇవి వారిపర్ణికి (చిన్నయాకులు గల యొకజాతినాఁచునకు) పేరు.

నాఁచు— ఇది శైవలమునకు (నీటియందు పుట్టెడి ఒకతీగకు పెద్ద ప్రాఁచికి) పేరు

అంతఁదామ — ఇది శైవలభేదమునకు (వేరు లేకుండ నీళ్లలో ఉండెడి యొక మొక్కకు ఆకాశతామరకు) పేరు

తూఁడు — ఇది మృణాళమునకు (తామరతూఁడునకు తామరాకుకాడకు) పేరు

క్రోవి క్రోలు — ఇవి పద్మాదుల నాళమునకు (కాడకు) పేరు

తామరతంపర — కమలషండమునకు (పద్మములసమూహమునకు) పేరు

అకరువు — ఇది కేసరమునకు (కింజల్కమునకు దుద్దుచుట్టు ఉండు సన్నని రేకలకు) పేరు

నల్లగల్వ — నల్లగలువ (రూపాం) నల్లకలువ యనియే అహోబలపతి. నివర్ణక స్వా దృహుల మద్వా ద్గుణవాచకాత్ నల్లనికలువ తెల్లనికలువ తెల్లకలువ తెల్లనితమ్మి తెల్లదమ్మి (చూ అం చిం అజ 81 సూ వ్యా) గణపవరపువేంకటకవియు గుణిపదముపయిగ గుణ మున్న నవ్విశేషణముమీఁదనికార మగు గఁగు నలువుగా నొకచోట నల్లనికలువ నా నల్లకలువ యన జల్లతావి తెల్లకిరి నా (అం కా) అహోబలపతి. నల్లకలువ - అన్నను వెల్లనితమ్మిని వెల్లదమ్మి యనియే అనుచున్నాఁడు నిర్ధారకప్రయోగము లేదు సూ ని నల్లగల్వ అనియే అం భా పా ఇచ్చి అవనిజచూపులకా రవికులాగ్రణిమైఁజగి నల్లగల్వలుం గువలయనేత్రనవ్వులు రఘుప్రభుచూపులు దెల్లగల్వలె క్కువ యయి నిండె నీట మును గోనపువ్వులకంటె రెట్టిగా (ఉ రా 6 0) మొ ప్రయోగము లిచ్చుచున్నది శర గూడ నల్లగలువ అనియే అనుచున్నది శృంగారభూషణునిమత ముదాహరించి ఉట్టివానిని అథర్వణుడు సాధు వనినాఁడని పూర్వము వ్యాఖ్యాతము మతభేదమున రెండును సాధువులే

అల్లి — సూ ని దీనికి తెల్లగలువ అర్థ మని ఈ అం భా ను ఇందులకు ప్రమాణ మనినది దీనితోపాటు క్రిందిప్రయోగము నుదాహరించుచున్నది ఒకతెల్లగలువలో నున్నపూఁబోఁడి సుకుమారి యగువేల్పుఁ జూలి నీక్షించి అల్లిలో నుదయించె నని యెన్ని కుముదవల్లి నామం బిడి వారనిప్రేమ (ద్వి పరమ 6402 పొ 2పం) (చూ సూ ని) అం భా తెల్లగలువ ను పేఁరుగ ఉదాహరించినది ఇది అది కాదు ఒకజాతికలువ అనుటయే అం భా అల్లి కి సమ్మత మైన అర్థము తెల్లగలువ అనునది దీనికి అర్థాంతర మన దగినది

వారిపర్ణి — వారిపర్ణీ తు కుమ్భికా (అమ) జలకుమ్భికాయా౦ అని (సుధ) నా చు నకు అని (గురు) నా చు- తీ గపా చి- కుమ్భి॰- అని (శ ర)

శైవలము — జలనీలీ తు శేవాలం శైవల అని (అమ) పా చికి అని (గురు) శైవ లస్య అని (సుధ) నీటిపాచి అని (శ ర) నా చు పా చి యన గ శైవలం బగు (సాంబ 65) ఉమితకృశానుదగ్ధ మగునయ్యమరేంద్రువనంబులోనియు త్తమసలిలాశయావళుల తప్తజలంబులయం దపేతజీవము లయి తేలు చుండె వరవారి చరంబులు వావిపక్షులం గమరె నశేషకోకనదకైరవవంక్తులు శైవలంబులౌ (ఆం భా ఆది 8 266) శైవాల వల్లికిం దల్లి యై చెలువారునూ గారును (పాండు 3 79) త వర్ణనల బట్టి శైవాలము ఒకతీగ యనుటకు సందేహము లేదు నీటిపాచి అనునది అర్థాంతరము మఱి దగినది శ ర కుమ్భిక ఇది యనుట అంధ్రా సమ్మతిం౯ుదు వారిపర్ణి ఇది యని శైవలమునకంటె వేఱు గా పేర్కొనుచు చున్న దిది (బ్రౌ శైవాలము- నీటయందలియొక మొక్క లేక కలుపుమొక్క అని వచించు చున్నది అమ జలనీలి అని దీని నను చున్నది నీళ్లయందలినీలిచెట్టువంటి యొకమొక్క ఇది యన వచ్చును

అంతరదామర —అము పద్య మి ట్లున్నది- ఉలరు బుకంబునం దొగల నంతరదామర (బ్రౌ చి గప్రపు న్వలపులు మీఱ లో వలు దవాలగ మొత్తము వోర నీరుకో క్కాలకొల మంచు గ్రుంకు మెదగుంపులవంపులు దో ప మావితో వుల విరుల న్పయి న్నడువ టొల్లుచుపురాతనతీర్థకుండముల్ (ఆము ఆ 7) ఇచ్చు వేద వ్యా ఇట్లను చున్నది అంతరదామర అనునది వేరు నేలకు తగులక నీటిమీ దనే మొలచి నీటమీ దనే తేలు చుండునీటియాకుమొలక (అని) బ్రౌ వేరు లేనిమొలక అని యూవివరణమే యిచ్చినది చాలవలు

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ వారివర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 66

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68 వ్యా]

ఇది
వారివర్గము

శా॥ శ్రీకైలాసనివాస వాసవనతాంఘ్రిద్వంద్వ ద్వంద్వాదిదూ
రీకారాంచితభావ భావభవభూభృద్వజ్ర వజ్రప్రభో
ద్రేకస్పర్ధి వపుష్క పుష్కలదయార్ద్రీభూత భూతావనా
లోకా లోకహితప్రచారణ రణాటోపస్ఫురన్మానసా 67

ప్రబంధములయం దాశ్వాసములట్లు వెలసినవి యిందలి కాండములు అందు ప్రథమ కాండ పరిసమాప్తినిఁ గృతిపతికి సమర్పించుటకై యాతనిని సంబోధించి స్తుతించు చున్నాడు కవి —

అర్థ —శ్రీకైలాసనివాస —శోభావంత మైన కైలాసపర్వతము గృహముగా కలవాఁడా వాసవనత + అంఘ్రిద్వంద్వ—నమస్కరించు చున్న యింద్రుఁడు గల పాదములజంట కలవాడా (ఇంద్రు డైశ్వర్యవంతు డు ఆతని కీత డు సేవ్యుడనుటనుబట్టి ఈశ్వరశబ్ద మీతనియందు నిజముగా అర్థవంత మని తెలుపఁబడు చున్నది ) ద్వంద్వ + ఆది దూరీకార + అంచిత భావ — శీతోష్ణములు సుఖదుఃఖములు- మొద లగుప్రకృతి(గుణ) వికారములను దూరీకరించుటచే పూజ్యమైన(పవిత్ర మైన) మనస్సు గలవాఁడా (వశీకృత ప్రకృతి వై ద్వంద్వాతీతుఁడవుగా ప్రవర్తిల్లువా డా పరమాత్మ యనుట) భావభవభూభృత్‌వజ్ర – మన్మథుడనెడి పర్వతమును భేదించుటయందు వజ్రాయుధము గా ఐనవాఁడా (ఈశ్వరు డు మన్మథదాహకుఁడు (కామారి) జితేంద్రియ చక్రవర్తి యగుట ఇందు మూలమున వచింప బడు చున్నది ) వజ్రప్రభా + ఉద్రేక స్పర్ధి వపుష్క – వజ్రమణులయొక్క కాంత్యతిశయమును తిరస్కరించు శరీరము (శరీరకాంతి) కలవాడా (మిక్కిలి తెల్లనివా డా యనుట) పుష్కలదయా + ఆర్ద్రీభూత- సమృద్ధ మగుదయారసముచే తడిసినవా డా (అంతు పొంతు లేనిదయచే చల్లనివాఁడా ప్రసన్నుఁడా సంతోషకరు డా యనుట) భూత + అవన +

ఆలోక - ప్రాణులన రక్షించుటకు ఉపకరించునవి యైనచూపులు గలవాఁడా (సూర్యచంద్రులు అగ్ని - పరమేశ్వరుని నేత్రములు అవి లోకరక్షకము లగుట ప్రత్యక్షదృష్టము) లోకహితప్రచారణా – జనులకు మేలు కలిగించెడిప్రవర్తన గలవాఁడా (లోకహితమున కై నయీదేవుని గరలభక్షణాదు లిందుమూలమున తెలుపఁబడినవి) రణ + ఆటోప స్ఫురత్ మానసా – యుద్ధసంరంభముచే ప్రకాశించెడి మనస్సు గలవాఁడా (మహావీరుఁడా అనుట ఇందుమూలమున జగదేక వీరుఁ డనుట సూచిత మై అనన్యసాధ్యము లగు త్రిపురసంహారాదులు తెలుపబడిన వన వచ్చును) [ప్రథమకాండము సంపూర్ణము - అనుపైవచనముతో వీనికి (ఈ సంబోధనములకు) అన్వయము]

వాసవ ద్వంద్వ — ఈశ్వర శబ్దవాచ్యు డు మహేశ్వరు డే యని కాళిదా సట్లు వచించుచున్నా డు - అణిమాదిగుణోపేత మస్పృష్ట పురుషాన్తరమ్ శబ్ద మీశ్వర ఇత్యుచ్చైః సాన్వర్ధచన్ద్రం బిభర్తి యః (కుమా 6స 75శ్లో) (వాసవనత)– నతవాసవు డనుట వాహితాగ్న్యాదిషు (2 2 37) అని పూర్వనిపాత వికల్పము

వజ్ర వపుష్క — శివు డు తెల్లనివా డు సుధాం శూచ్చైశ్శ్రవ శ్శమ్భు కీర్తి జ్యోత్స్నా శరద్ఘనా అని శ్వేతవస్తుపరిగణనమున దేవేశు డు (చూ కవి శ)

భూతావనాలోకా — (అవన) అవ(రక్షణే) అను ధాతువునకంటె కరణాధికరణయోశ్చ (3 3 7) అని కరణార్థమున ల్యుట్ప్రత్యయము

లోక ప్రచారణా — పరమేశ్వరుని ప్రవృత్తి యంతయు ప్రజాహితమున కై నదే విదితం వో యథా స్వార్థా న మే కాశ్చి త్ప్రవృత్తయ నను మూర్తిభి రష్టాభి రిత్థంభూతో ఽస్మి సూచిత (కుమా 6స 26శ్లో) ఈ మహాదేవుని లోకహిత ప్రవర్తన నుగురించి యొకమహాకవి యిట్లు వర్ణించినా డు- దృష్ట్వా కౌస్తుభ మప్సరోగణ మపి ప్రక్రాంతవాదా మిథో గీర్వాణా కతి వా న సన్తి భువనే భారా దివ కేవలమ్ విక్రాన్తే గరలే ద్రుతే సురగణే విశ్వేష్టితే విష్టపే మా భైష్టేతి గిరాఽఽవిరాస ధురి యో దేవ స్త్వ మేవ స్తుమ (నీల చం 2శ్లో)

అలం —( స్పర్ధి ) స్పర్ధయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి ఆక్రోశత్యవజానాతి కద ర్థయతి నిన్దతి త మన్వే త్యనుబధ్నాతి తచ్ఛీలం త న్నిషేధతి తస్య వా ఽనుకరో తీతి శబ్దా స్సాదృశ్యవాచకా ఉపమాయా మిమే ప్రోక్తా కవీనాం బుద్ధిసౌఖ్యద (కావ్యా దర్శము) ఉపమ రూపకము ముక్తపదగ్రస్తము-(శబ్దాలంకారము) కాఞ్చీయమక మనునొకజాతి యమకము గలదు దాని కైనక్రమక్రమాభివృద్ధియే యీముక్తపదగ్రస్త మనిఎంచును కాఞ్చీయమకమును భట్టికావ్య మి ట్లుదాహరించు చున్నది ఎశితాశినా మనుదినం స్ఫుటతాం స్ఫుటతాం జగామ పరివిహ్వలతా హ్వలతా జనేన బహుధా చరితం చరితం మహత్త్వరహితం మహతా (భట్టి 10స 8 శ్లో) ముక్తపదగ్రస్త మను దానిలోని పద శబ్దము యథాశ్రుతార్థక మనునప్పుడు పదాంతము పదాంతము పున పున గ్గ్రహిత మగుటయే దీని కైనలక్షణము దాని కైన లక్ష్యమే ఇది ఇచ్చటి పదము నకు పాద మనియు నర్థము లక్షణము దీని ట్లు వచించినా డు నరసభూపా లీయకర్త- ప్రస్తుత మగుముక్తపద గ్రస్తం బన నదియు గృతుల బర గు బదాన్తో దస్తము పాదాద్యన్త ను విస్తృతము పదాన్తసింహావీక్షణ మన గా (కావ్యా సం 4 82)

నిరతిశయైకభక్తిమదనీకరమాకర మారమారకా
సరసముఖేందుకాంతిజితసారసవార సవాసవాదిఖే
చరభుజగాలయాంతపృథుచాపకలాప కలాకలాపసుం
దర కరుణాసుధాముదితదాసవనా సవనావనాదరా 68

అర్థ —నిరతిశయ + ఎక భక్తిమత్ + అనీక రమాకర-తనకంటె అధిక మైనది లేనిది (అందువలననే) శ్రేష్ఠ మైనది ఐన-భక్తి గలవారిసమూహమునకు (మహోత్తమభక్తి గల(భక్త)జనమున కనుట) లక్ష్మిని- సంపదను కలిగించు వాఁడా మారమారకా—మన్మథుని సంహరించినవాఁడా సరసముఖ+ఇందు కాంతి జిత సారసవార —హర్షముతో-(లేక) సౌందర్యముతో కూడిన ముఖము అనెడి చంద్రునియొక్క-కాంతిచే పరాభవింప బడిన (సంకుచింపఁజేయఁబడిన ముకుళింప జేయ బడిన-అని అర్థాంతరము) పద్మసమూహము గలవాఁడా (చంద్రుఁడు పద్మ ములను ముకుళింపఁ జేయు చున్నాఁడు ముఖము తనవికాసమున వానిని సిగ్గుపడఁ

జేయు చున్నది తల వాంచుట మొద లగునవి సిగ్గుపడినవారి కగులక్షణములు) స (సహ)వాసవ+ఆది ఖేచర భుజగ+ఆలయ+అంత పృధుచాప కలాప-ఇంద్రుఁడు మున్నగుదేవతలతోఁ గూడిన దై నాగలోకము (పాతాళము) చివరిభాగము గాఁ గలది ఐనగొప్పధనువు (మేరువు)భూషణము గా కలవాఁడా (స్వర్గము మొదలు పాతాళమువఱకు వ్యాపించి చాలనిడివి కలది గా ఉన్న (మేరు) మహాధనువును అందము గఁ జేపట్టినవాఁడా యనుట) కలా కలాప సుందర—చంద్రుని పదునాఱవభాగ మనెడిశిరోభూషణముచే అంద మైనవాఁడా కరుణా సుధా ముదిత దాస వనా —దయయనెడి యమృతముచే సంతోషపఱప బడిన దాసు లనెడి వృక్షలతాదులు గలవాఁడా (చంద్రకిరణప్రసారమున వృక్షలతాదులు వికాసము గలవగుట లోకదృష్టము అట్లే ఈదేవుని దర్శనమున భక్తలోకమును) సవన+అవన+ఆదరా యజ్ఞరక్షణమునందు- పూనిక (ప్రబలప్రయత్నము) గలవా డా (శివుని యెనిమిదిశరీరములలో (యజ్ఞము చేయు) యజమానుఁ డొక డు [పూర్వపద్యమునందువలెనే పైవచనముతో వీనికిని (ఈసంబోధనములకును) అన్వయము ]

నిరతిశ యైక భక్తిమ దనీక రమా కర — (ఏక) శ్రేష్ఠము- ఏకం సంఖ్యాన్తరే శ్రేష్ఠే కేవ లేతరయో స్త్రిషు (మేదిని) (భక్తి) -ఇది రాగాత్మకము అహైతుకము ఏకాంతము - అని త్రివిధము పూజ్యు లగువారియం దుత్తమ మగుప్రేమము మొదటిది ఏ ప్రయోజన మర్థింపక సహజము గా నెఱపు భగవంతునియందలి యతిశయితప్రీతి రెండవది తైలధారయ ట్లవిచ్ఛిన్నము గా భగవంతునియందు నిరంతరము సాగుతాదాత్మ్య భావన మూ డవది ఇచ్చట- నిరతిశయ ఏక అను విశేషణములచే మూ డవభక్తి గ్రహింప బడిన దనుట యుచితము ఈయర్థమున రమా శబ్దము మోక్షలక్ష్మి ని (మోక్షసంపదను) వచించును శుద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతి శ్రీలక్ష్మీ ర్వరలక్ష్మీ శ్చ ప్రసన్నా మమ సర్వదా అని లక్ష్మిభేదములు వచింప బడినవి మోక్ష లక్ష్మి గూడ ఇం దొకట- సా హా శ్రీ రమృతా సతామ్ అని శ్రుతి (లక్ష్మిసంపదల కైక్యము కవిసమయసిద్ధము ) ( భక్తిమత్)- సర్వధనీ అను మహాభాష్యప్రయోగ

మునుబట్టి ఇది సాధువు (అనీకము) సమూహము- నవామ్బుదానీకము హూర్తిలాఞ్ఛనే నవామ్బుదానా మనీకస్య బృన్దస్య అని (మల్లి వ్యా) (చూ రఘు 3స 53శ్లో)

సరస వార — (సరసము) -హర్షముతో కూడినది- రసో జలం రసో హర్షో ౦స శృఙ్గారపూర్వక (అనెకార్థధ్వనిమఞ్జరి) సుందరము అని యైనను అర్థి మనవచ్చును సరసోరుకాండముల్ సౌకుమార్య మేపార (హరి ద్వి 27 మొ) సరసత - లాలిత్యము అని బ్రౌ మేఘరాజులు సరసత మీఱ దమ్మ ఇట లాలిత్యము అనునది (అర్థాం) (చూ బ్రౌ) (జిత)- జి (అభిభవే) అనుధాతువునకంటె కర్మార్థమునందు క్త ప్రత్యయము జి- అభిభవే అభిభవో న్యూనీకరణమ్ అని (మాధవీయధాతు వృత్తి) జయి ఞ్గియాభిభవయో రాద్యే ఽర్థే ఽసా వకర్మక ఉత్కర్షప్రాప్త రాద్యో ఽర్థ ద్వితీయే ఽర్థె సకర్మక అని (దైవము)

సవాస కలాప — (అన్తము) అన్తో జఘన్యం చరమ మన్త్య పాశ్చాత్త్య పశ్చిమమ్ (అమ) (కలాపము) - కలాపో భూషణే కాఞ్చ్యాం సంఘాతే (వైజ త్ర్య పుం) [మేరువు సకలభువనములను అధిష్ఠించి రాజువోలె నున్నది- మేరు స్తు శుభే దివ్యో రాజవ త్సమధిష్ఠిత యోజనానాం సహస్రాణి చతురశీతి రుచ్ఛ్రిత ప్రవిష్ట ష్షోడశాధస్తా దష్టావింశంతివింశతి విస్తారా త్త్రిగుణ స్తస్య పరివాహ స్సమన్తత స తు మేరు పరివృతో భువనై ర్భూతభావనై (మత్స్యపు) మేరురివ సకలభువనోప జీవ్యమానపాదచ్ఛాయ అని (కాదం శూద్రకవర్ణన)

కలాకలాపసుందర —(కలా) కలా స్యా దంశశిల్పయో షోడశాంశే విధో రపి (హైమ) శివు డు శిరోభూషణము గా చంద్రునిపదాఱవకలను ధరించును- పదియేనుది నంబులకుం బదియేన్కల లెక్క మేను పరిపూర్ణము గా బదియాఱవకల యితనిది మదిరాక్షి వృషధ్వజుండు మౌళి ధరించు (శృం నై 8 200)

సవనావనాదరా — (ఆదరము)- పూనిక- గృహయద్రస్తపతాకాశ్రీ రపౌరాదర నిర్మితా (కు సం 6 4) (చూ సూ ని) శివునియష్టమూర్తులలో యజ్వ యొకడు- భక్త్యా పరమయా ధ్రువాగీతిగర్భా మవని పవన వన గగన దహన తపన తుహానకిరణ యజమానమయీ ర్మూర్తీ రష్టా ఽపి ధ్యాయన్తీ (హర్షచ ఉచ్ఛ్వా)

అలం —ఉపమ రూపకము (శబ్దా)యమకము దీనిని గూర్చి దణ్డి యిట్లను చున్నాడు— అవృత్తిం వర్ణసంఘాతగోచరాం యమకం విదు తత్తు నైకాన్తమధురం (కావ్య

దర్శము ) ఇది ఆద్యన్తయమకము మధ్యాన్తయమకము ఆదిమధ్యాన్తయమకము అనురీతిని నైకవిధము ఇట- ( 2 3 పాదములందు) మధ్యాన్తయమకము (4పాదమున) ఆదిమధ్యాన్తయమకము సాగినవి

## గద్యము

ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాదికతిపయగుణ స్వసామ్య తదితరసకలగుణనిరౌప మ్యాసేతుహిమాచలఖ్యాతమహోద్దండకవి బిరుదప్రశస్త సీతారామార్యవర్య తనూజాత శౌర్యధైర్యస్థైర్యాదిసకలగుణచిరత్న రత్నరత్నాక రాశ్రితజనశ్రీకర కొటిసమాఖ్యవంశసుధాపయోధిరాకాశశాంక ఘంటికాతురగ నీలాతపత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధభేరి కాదినిఖిల బిరుదాంక బృహదంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాట చోళ పాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీనాథ సభాంగణబిరుదాయమా నార్యనుతచర్య వేంకటార్యప్రణీతం బైన

యాంధ్రభాషార్ణవంబునందు

ప్రథమకాండము

సంపూర్ణము

---

(ప్రథమ) కాండము ముగించుచు స్వవృత్తాంతకథనముతో గవి తత్పరి సమాప్తిని గృతిభర్తకు నివేదించుకొను చున్నా డు —

అర్థ —శ్రీమత్ పరమ + ఈశ్వర కరుణాకటాక్ష సంప్రాప్త సర్వజ్ఞత్వ + ఆది కతిపయగుణ స్వసామ్య తద్ + ఇతర సకలగుణ నిరౌపమ్య + ఆ సేతుహిమాచల ఖ్యాతమహోద్దండకవిబిరుదప్రశస్త సీతారామార్యవర్య తనూజాత- ఈకవి సీతారా మయ్యకుమారుఁడు- (ఆయన) అణిమాద్యష్టైశ్వర్యములు గలపరమేశ్వరునిదయ

తోఁ గూడినక్రేగంటిచూపులవలనఁ బొందఁబడిన సర్వజ్ఞత్వము మున్నగు కొన్నిగుణములచే పరమేశ్వరునిఁ బోలినవాఁడు (పరమేశ్వరునికి గలకొన్ని విశిష్టగుణములునైత మాతనియనుగ్రహమున ఈతనికి గలిగెన వనుట) వానికంటె వేఱగుకొన్నిగుణములచే(అణిమాద్యైశ్వర్యాదిగుణములచే) సామ్యము లేనివాఁడు సేతువు—రామసేతువు రామేశ్వరము అది మొదలు హిమవత్పర్వతమువఱకు (భారతదేశమునం దంతట ననుట) ప్రసిద్ధి చెందిన మహోద్దణ్డకవి అనుబిరుదముచే కొనియాడఁబడెడివాఁడు (ఇవి సీతారామయ్యకు విశేషణములు) ఇఁక రఘునాథరాయఁడు వర్ణింపఁబడుచున్నాఁడు—(ఈతఁడు) శౌర్య ధైర్య స్థైర్య ఆది సకలగుణ చిరత్నరత్న రత్నాకరుఁడు—పరాక్రమముచే శత్రువులను ఆక్రమించుటయందలిసామర్థ్యము(శౌర్యము) భయాదులచే చిత్తము వికలము గానిమనస్థైర్యము (ధైర్యము) (ప్రతిజ్ఞాపరిపాలనాదులయందు తిరుగు లేనినిర్ణయము (స్థైర్యము)- మొదలగునెల్లసుగుణము లనెడిచాలకాలమునాఁటి మణు

అనర్ఘము లగు మహారత్నములకు (గుణపక్షమున— చిరత్న శబ్దము క్షణజన్మసిద్ధము లనుట సూచించెడి నన వచ్చును) సముద్రుఁడైనవాఁడు సుగుణనిధి యనుట వచింపఁబడుచున్నది) శ్రితజన శ్రీకరుఁడు—ఆశ్రితులందఱకు సంపద కలిగించువాఁడు (దయానిధి యగుమహాదాతయనుట) కోటి సమాఖ్య వంశ సుధాపయోధి రాకాశశాంకుఁడు- కోటి అనుపేరు గలది (రాయ) వంశము అదియే పాలసంద్రము దానికి పూర్ణిమాచంద్రుఁడు- (చంద్రోదయమున సముద్రముపొంగునట్లు ఈతనియుదయముచే ఈవంశమెల్ల ప్రబలసంతోషమున ఉక్కిరిబిక్కిరి యగుచున్న దనుట) (ఇఁక ఈతని(రఘునాథరాయని) బిరుదులు వచింపఁబడుచున్నవి) ఘంటికాతురగ నీలాతపత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప ననవిధభేరిక- (ఇవి ఈతనిబిరుదులు) ఆది (ఇవి) మొదలుగాఁ గల నిఖలబిరుద+అంకుఁడు— అన్నిబిరుదులు (పౌరుషమునకు) చిహ్నములుగాఁ గలవాఁడు (సార్థకబిరుదుఁ డనుట) బృహత్+అంబికాకటాక్ష సంజాతసామ్రాజ్యధురంధరుఁడు- (గోకర్ణేశ్వరస్వామి సతి బృహదంబిక రాయవం

శమువారి కీమె యిష్టదైవము) ఈమెకటాక్షముచే కలిగిన సామ్రాజ్యమును వహించి యున్నవాడు ఈతడు విమలయశ + బంధురుడు- స్వచ్ఛ మగుకీర్తిచే అంద మైనవాడు (నిర్దుష్టము లగుతనసుగుణములవలన అందఱను సంతోషపఱచు చున్నవా డనుట) కర్ణాట చోళ పాండ్య మహీపాల + ఆది సంస్తూయమాను డు- కర్ణాటరాజు చోళరాజు పాండ్యరాజు-మున్నగువారిచే పొగడ బడు చున్నవాడు (సామంత రాజు లై వా రెప్పు డీతనిని సేవించుచు ఈతని ప్రతాపాదులను వంది మాగధులట్లు గానము చేయు చున్నా రనుట వచింపఁబడు చున్నది) (ఇవి విశేషణములు) శ్రీరాయరఘునాథమహీనాథు డు (విశేష్యము) (అట్టివా డీత డనుట) ఇక ప్రకృతకవి వర్ణింపఁబడు చున్నా డు సభా + అంగణ బిరుదాయ మాన (బిరుదాయమాను డు)- (అట్టిరాయలయొక్క-) సభాస్థలమందు కూరు డట్లు ప్రవర్తించువా డు (అతనిసభలయందలిసకలవిద్వద్గోష్ఠులందు అడ్డు లేని (అప్రతి హత మగు) వీరవిహారము సలుపువా డీత డనుట) ఆర్య నుత చర్యుఁడు పూజ్యు లచే ప్రస్తుతింప బడిన ప్రవర్తనగలవా డు (సాధుశీలుఁ డనుటతెలుపఁబడుచున్నది) వేంకనార్య (వేంకనార్యుఁడు విశేష్యము)(ఆతనిచే) ప్రణీతంబు ఐన-రచింపఁబడిన దైన ఆంధ్రభాషార్ణవమునందు ప్రథమకాండము- మొదటికాండము ఇది- సంపూ ర్ణము (దీనిని గైకొనుము-అనుట అర్థాక్షిప్తము) [ఇదే తక్కినకాండముల యందలిచివరిగద్యములకు గూడ అర్థము (కాండనామములుమాత్రము వేఱు)

నిఖిలబిరుదాంక —రాయల బిరుదములలో- ఘంటికాతురంగ నీలాతపత్ర అనునవి రాజ చిహ్నములను దెలుపునవి నీలాతపత్రమునుగూర్చి బిల్హణు డి ట్లను చున్నా డు- నీలచ్ఛత్రోన్నదగజఘటాపాత్ర మత్రస్తచోళా చ్ఛాళుక్యేన్ద్రా దలభత కృతీ యో ఽత్ర విద్యాపతిత్వమ్ అస్మి న్నాం తద్దను నిబిడాశ్లేషహేవాకలీలా వేల్లద్బాహు క్వణితవలయా సంతతం రాజ్యలక్ష్మీ (విక్ర 8 00) హనుమద్ధ్వజ మకరకేతన -అనునవి స్వరూపకథనమునకు జెందిన వనవచ్చును దివాదీప నవవిధ భేరిక అనునవి మహారాజత్వమున కగు మహావైభవమును దెలుపునవి దేవతోత్స వాదులం దిప్పటికిని (దేవుని యూరెగింపునం దధి) పగటియందు దివిటీలు పట్టుట

ప్రత్యక్ష దృష్టము (ఘంటికాతుంగ) చిఱుగంటలు గల గుఱ్ఱము (ఉత్తమాశ్వ మైన- ఔపవాహ్యము) గలవాడు సీలాతపత్ర నల్లనిగొడుగు గలవాడు హనుమత్ ధ్వజ- ఆంజనేయుడు పతాకయందు గలవాడు ( సంగ-సవ్యసాచి అనుట దీనిచే సూచింప బడిన దనవచ్చును) మకరకేతన-మన్మధునివంటిసౌందర్యము గలవాడు దివాదీప-పగటిదీపములు (దివ్వటీలు) గలవాడు నవవిధభేరిక -తొమ్మిది విధము లగు దుందుభులు గలవాడు ]

పరమేశ్వరుడు — శివుడు- కామారీ పరమేశ్వర (శివనామప్రసంగమున) (వైజ)

మహోద్దణకవి — (మహత్ + ఉద్దండకవి)- చాల భయంకరు డగు మహాకవి కింక వీరన్నఘటాపఞ్చానన అనుట కిది పర్యాయోక్తమనిఎంచును

రత్నరత్నములు — చాలకాలమునాటిమణులు (ప్రాతవి) చాలశ్రేష్ఠములు-ఉనర్ఘ్యములు ఒకకవి యిట్లనుచున్నాడు- అవ్విద్వన్నికరంబును దనయంత పురంబునకుం దోడ్కొని పోయి రంగళరారుబంగారుపళ్లెరంబుల జిరత్నంబు లగు నవరత్నంబు లుంచి (ఆనంద రం ఛం ఎరి 39) [తాత ముత్తాతలనాటినుండి జాగరూకతతో దాచి యుంచినవి అందువలననే చాలవిలువ గల వివి ) పద్మరాగము ల్లు ప్రాగ్రెంపు అని నామము చిరత్నంబు లగునవరత్నము లనుటవలన ఈ రత్నరత్న శబ్దార్థ మది కాదనివచ్చినది

సమాప్తిద్యోతకము సంస్కృతమునందలి ఇతి వంటి దిది ద్యోతకమిది యగుట పునరుక్తము గాదు శిశుపాలవధముప్రథమసర్గాంతమున మాఘకవి- ఇతి శ్రీమాఘ కృతౌ శిశుపాలవధే మహాకావ్యే శ్ర్యఙ్కే ప్రథమ స్సర్గ అనినాడు దీనికి మల్లినాధవ్యాఖ్య యిట్లున్నది ఇతిశబ్ద సమాప్తౌ ప్రథమ సర్గ ఇతి సమాప్త ఇతి శేష (అవి) ఇతి హేతు ప్రకరణ ప్రకాశాది సమాప్తిషు (అమ) ఇట్టిదే ఇది ప్రబంధవ్యాఖ్యాత లెవరును ఇట్టి చోట్ల ఇట్లు దీనిని సమన్వయించుట లేదు (చూ అమ వ్యా ) మొ

వేంకనార్యుడు — ఆర్యామ్నాదికశబ్దా స్స్వ శ్రేష్ఠతావాచకా యత తత స్తదన్త శబ్దేభ్యో నైవ శ్రేష్ఠత్వగోచరా అని అథర్వణుడు ఐనను కవులు వీనిని యథేచ్ఛము గా ప్రయోగించుచునే యున్నారు అక్కమాంబకుమారా తిమ్మమాంబశ్రీరామునకున్ మొ వేంకన అనుచో-అన్నకు- (రూపాం ) అన పూజ్యతా వాచకము గా ఇది అవి

వక్షితము కేవలసంజ్ఞాకోటిప్రవిష్ట మిది. తదనుకరణమే యిది యనినప్పు డిట్టివి దొస గులు కాఁ జాలవు కోనమాంబాతనూజా ఇత్యాదు లహోబిలపతి తప్పు లనుట అప్పటి అంబామయి పూజ్యతావిశేషకుఁ జెందిన వనునాశయముతోడనే

ఇది

శ్రీ వెంకటప్పార్య వేంకటసుబ్బమాంబాగర్భశుక్తిముక్తాఫల కావ్యకలానిధి
మహీశూరమహారాజాస్థానమహావిద్వత్కవి' శ్రీ చిదంబరకవీంద్రభాగినేయ
శ్రీపరమేశ్వరీకృపాసముపలబ్ధశాస్త్రసాహితీ వైదుష్య, మధురావిజయ
కాశీఖండాది సంస్కృతాంధ్రమహాకావ్యవ్యాఖ్యాన సత్కావ్య
రచనాసువిదితప్రజ్ఞావిశేష, 'సాహిత్యాలఙ్కార'
సహస్రావధాని' విద్వత్కవివతంస'
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి
విరచితంబైన
చంద్రికావ్యాఖ్యానమున
ప్రథమకాండము
సంపూర్ణము



# అచ్చ తెలుఁగు కోశము

# ద్వితీయ కాండము

## భూమివర్గము

క. శ్రీ రఘునాథాఖ్యాకమ
హీరమణమనోబ్జభృంగ హీరనిభాంగా
వారణదైత్యవిభంగా
భూరిగుణనివేశ మాతృభూతమహేశా

కవి ద్వితీయకాండము నారంభించుచు కృతిపతిని సంబోధించు చున్నాఁడు తచ్ఛ్రవణమునకై —

అర్థ —శ్రీరఘునాధ+ఆఖ్యాక మనః అబ్జ భృంగ—ఐశ్వర్యప్రద మైన రఘునాధుడు అనెడిపేరు గల భూపతియొక్క మనస్సు అనెడిపద్మమునందలి మధుపమా తుమ్మెదా (రఘునాధరాయల హృదయపుండరీకమునందు ఆతని భక్తి యనుమరందమునకు మఱఁగి ఎల్లప్పుడు అటనే సంచరించు చుండువాఁడా - అనుట ఇందుమూలమున రాయల యిష్టదైవము మాతృభూతేశ్వరుఁ డగుట భక్తిచే ఆపరమేశ్వరుని వశీకరించినమహాభక్తవతంసము రాయఁ డగుట తెలుపఁబడినది ). హీరనిభ+అంగా – వజ్రమణితో సమాన మగు (తెల్లని కాంతి గల దైన) శరీరము కలవాఁడా భూరిగుణనివేశ అధికము లైన (అనన్తము లైన) సుగుణములకు గృహ మైనవాఁడా వానికి ఆశ్రయ మైనవాఁడా (సుగుణము లన్నియు తాము గాఁ గోరి యీమహాదేవునియందు కాఁపుర ముండుట యిందు మూలమున వచింపఁబడి అనన్త కల్యాణగుణగణాశ్రయుఁ డీతఁ డనుట తెలుపఁ

బడినది ) మాతృభూతమహేశా -మాతృభూతేశ్వరా ( ఈకృతిని విను మనుట అర్థాక్షిప్తము )

శ్రీ భృంగ —(శ్రీ)- లక్ష్మీ సరస్వతీ ధాత్రి వర్గ సంప ద్విభూతి శో భాసు ఉపకరణ వేశరచనా విధానేషు శ్రీ రితి ప్రథితా ఇతి వ్యాడి - (చూ సుధ) శోభావంతుడు మహీరమణు డనుటయు సంగతమే. అఖ్యకు విశేషణ మిది అనుట సముచిత మని పించినది (భృంగ)- లిఙ్గభృఙ్గాదికబేభ్యో మ్యాది రామన్త్రణే తు న అని ఒభర్వ ణుడు

హీరనిభాంగా — (హార) హారా పిపీలికాలక్ష్మీ క్షీర శ్మశ్రు-రవల్లయో (విశ్వ)

వారణదైత్యవిభఙ్గా —(వారణ) మతఙ్గజో గజో నాగ కుఞ్జరో వారణ కరీ (అమ) (వి+భఙ్గము) భేదనము సంహారము తరఙ్గభేదయో ర్భఙ్గ అని రుద్రనిఘంటువు (చూ సుధ) గంధసింధురాది దనుజ కంధరాపీర దమనగలిత రక్తధారాభిషిక్త ప్రచండఖణ్డపరశు భిణ్డివాల శూలప్రముఖ బహువిధప్రహరణపరంపరాభీల మహాకారా (భీమ 3 2 2) అని భీమేశ్వరుని వర్ణించినాడు కవిసార్వభౌముడు

భూరిగుణనివేశా —(భూరి) ప్రభూతం ప్రచురం ప్రాజ్యం మదభ్రం బహులం బహు భూయ శ్చ భూరి చ (అమ) (నివేశ) నివేశ శ్శిబి రోద్వాహ విన్యాస సదనే ష్వపి (విశ్వ)

క ధరణీ పుర శైల వన మృగ
నర వర్ణచతుష్క-వర్గ నద్ధత నాచే
విరచిత మగు నీకాండము
స్ఫురితగుణనివేశ మాతృభూతమహేశా 2

అమరము పేర్కొనినట్లే- ఆంధ్రామర మన దగిన ఆంధ్రభాషార్ణవ మును ఈ కాండమునందు వచింప బోవు నాయావర్గములను నామగ్రహణము చేసి ముందుగా పేర్కొనుచున్నది తన కృతిపతిని సంబోధించి వీని నాతనికి నివేదించుచున్నది గూడ ఈ (ఆంభా) —

అర్థ —(స్ఫురితగుణనివేశ మాతృభూతమహేశా) ధరణి నద్ధతన్-భూమివర్గము పురవర్గము శైలవర్గము (వన)-(ఇది ఓషధులకు ఉపలక్షణము) వనౌషధివర్గ మనుట (మృగ) ఇది ఆరణ్యపశువులకు పక్షికీటాదులకు ఉపలక్షణము- సింహాదివర్గ మనుట (నర)- మనుష్యవర్గము వర్ణచతుష్కము- క్రమము గా నాలుగువర్ణములకు సంబంధించిన వర్గములు నాలుగు బ్రహ్మవర్గము క్షత్రియవర్గము వైశ్యవర్గము శూద్రవర్గము- అనుట (వీనియొక్క) సంఘటనతో నాచేన్ (అం భా కర్తచేత) విరచితము- (గ్రంథము గా) ఎర్పఱపఁబడినది అగున్- కాఁగలదు (చిత్తగింపు మనుట (అర్థాక్షిప్తము)

ధరణి వర్గ —వర్గశబ్దము ద్వంద్వాన్తే శ్రూయమాణం పదం ప్రత్యేక మభిసంబధ్యతే అనున్యాయమున సమాసమునందలి యన్నిపదములతోను సంబంధము గలది ఈ కాణ్డారంభమున వర్గాః పృథ్వీ పుర క్ష్మాభృ ద్వనౌషధి మృగాదిభిః నృ బ్రహ్మ క్షత్ర విట్ఛూద్రైః సాఙ్గోపాఙ్గైః రిహోదితాః అని (అమ) ఇచ్చటి సుధావ్యాఖ్యాన మిట్లున్నది ఇహ-ద్వితీయ కాణ్డే వర్గా ఉక్తాః- వదితు మారబ్ధాః ఆదికర్మణి క్తః (3 4 7) కీదృశాః - సాఙ్గోపాఙ్గైః పృథివ్యాదిభి రుపలక్షితాః తత్రాఙ్గాని మృదాదీని ఉపాఙ్గాని శిలాదీని ఆపణాదీని విపణ్యాదీని శైలాదీని మనశ్శిలాదీని వృక్షాదీని పుష్పాదీని మృగశబ్దః ఆరణ్యపశుమాత్రపరః ఆరణ్యాః పశవో మృగాః' ఇతి శ్రుతేః ఆదిశబ్దేన పక్షికీటకాదీనాం గ్రహణమ్ తస్య చాఙ్గోపాఙ్గాని పక్షిపక్షాదీని యద్వా మృగ మత్తుం శీల మస్య మృగాదీ సింహాః (అని) ప్రథమకాణ్డపరిసమాప్తియందుఁ గూడ (అమ)- ఉక్తవర్గసంగ్రహణ మొనర్చినది ఉక్తం స్వర్వ్యోమ దిక్కాల ధీ శబ్దాది సనాట్యకమ్ పాతాల భోగి నరకం వారి చైషాం చ సంగతమ్ (అని) అం భా కర్త ప్రథమ కాండోపసంహారమునందు వర్గసంగ్రహము ను వదలినాఁడు ప్రతివర్గసమాప్తియందును ఆతఁ డాయావర్గములను పేర్కొని పరమేశ్వరునికి నివేదించి యుండుటనుబట్టి మరల వానినిఁ జర్వితచర్వణము గాఁ బేర్కొన కుండుటయె సముచిత మని వదలినాఁ డనిపించును అదిగాక అమర మైనను ప్రథమ కాండ పరిసమాప్తియందే వర్గసంగ్రహకథన మొనర్చినది ద్వితీయ తృతీయ కాండపరిసమాప్తులయం దట్లు చేయ లేదు ఈ అర్ధజరతీయము మన కేల? యనికూడ ఈత డు

దీనిని వదలియున్నా డనిపించును మఱియొకవిశేషము ఈ వర్గనామగ్రహణ ము ఆరంభమునం దైనను ద్వితీయ తృతీయ కాండములందే (అమ) జరపినది ప్రథమ కాండారంభమున జరపలేదు అం భా కూడ ఈయెడ అమరమట్లే ప్రథమకాండారంభ మున వర్గనామగ్రహణము జరపక వదలినది ఇందులకు కారణము వస్తునిర్దేశాదిరూప మగుమంగలాచరణమునందలి సంభ్రమము కావచ్చును అగ్నిపురాణము-ప్రథమ కాండ పరిసమాప్తియందు ప్రధానము గా రెండువర్గములనే పేర్కొని తక్కిన యవాం తరవర్గములను ఆదిపదముచే సంగ్రహించినది మకుటవ్యాఖ్యానము- స్వర్గాదికాణ్డ ప్రథమ స్యాన్ఙ్గ ఏవ సమర్థిత అనుచోట- ఆదిశబ్దేన పాతాలస్య గ్రహణమ్ అనినది ఈమకుటవ్యాఖ్యను సుధాటప్పణి ఇట్లు వివరించినది- అత్రా ఽయం భావ - అస్మిన్ కాణ్డే ద్వావేవ ముఖ్యవర్గౌ-స్వర్గ పాతాల శ్చ తత్ర నాట్య వర్గపర్యన్తం స్వర్గ సాధారణపదార్థానాం నిరూపణాత్ స్వర్గవర్గత్వమ్ తదుత్తరం పాతాల సంగతార్థ నిరూపణా త్పాతాల వర్గత్వమ్ అతఏ వా ఽగ్నిపురాణే ప్రథమకాణ్డే ఏతానేవ పదార్థా నుక్త్వా ఉపసంహృతమ్- స్వర్గపాతాలవర్గాద్యా ఉక్తా ఇతి త త్రా ఽఽద్యశబ్దే నా ఽవాన్తరవర్గగ్రహణమ్- ఇ త్యపి మకుటే ఉక్తమ్ (అని)

ఆ పుడమి నేల యనిన భూవాచకం బగు
బొల మనంగ నూరిపొత్తునేల
కృష్ణభూమి వెలయు రేగడ రేవడ
యన గ విమలకీర్తి సాంబమూర్తి

పుడమి నేల—ఇవి భూమికి (పృథివికి ధరణికి ధాత్రికి) పేరు

పొలము—ఇది ఊరిపొత్తునేలకు (గ్రామాన్తమునకు ఉపశల్యమునకు ఊరికి సమీపమున నుండుభూమికి) పేరు

రేగడ రేవడ—ఇవి కృష్ణభూమికి (నల్లభూమికి) పేరు

పొలము — గ్రామాన్త ఉపశల్యం స్యాత్ అని సమసిమే భ్రయా మబౌ అని (అమ) ఇట సుధ- గ్రామాదిసమీపదేశస్య అని మొదటిదానికి ద్వే సమాసూ అని రెం డవదానికి వ్యాఖ్యానము వ్రాసి చత్వా ర్యేకార్థా నీ త్యన్యే అనినది అం భా కర్త

మొదటి వ్యాఖ్యనే అనుసరించుచు పొల మనంగ నూరిపొత్తునేల అని (ఇటను) పొలిమే రన గడి యన గా బొలిమెర యన నెల్ల యన గ బోలును సిమా స్థలనామ ధేయములు (2 24) అని (ముందును) వచించు చున్నా డు శాసనములు పొలిమేర ను పొలమేర అను చున్నవి- కాకాండి పొలమేర ఖ నర నంబూరిపొలమేర ఖ1 (కా శా 00 మొ చూ సూ ని పొలము) [మేర-గరుసు మొ వానితో సమాన మేర్పడినప్పుడు ములోపము]

పొలమేర — (పొలము+మేర) (చూ సూ ని) ఈ 'పొలమేర లోని పొలము ఊరి పొత్తునేల అను నీయర్థము ంల దనుట యుక్తము గా గాన్పించును దీని కైన రూపాంతరములే పొలిమేర పొలిమెర అన వచ్చును పొలికలను లో నగునవి గూడ ఈయర్థమున సంగతములే కావచ్చును పొలమేర అనునది శాసనమాత్ర దృష్టము కవిప్రయోగము లిందులకు మృగ్యములు అందులకే ఆం భా పొలమేర' గ్రహింప లే దనిపించును శ ర పొలి- బలి కైన వికృతి యని దానినుండి యేర్పడి నది పొలిమేర అను చున్నది అప్పుడు పొలిమేర కైన అపభ్రంశము పొల మేర అనవలయును అది ఉచిత మనిపించుట లేదు దీనికి- ఆం సం మెట్టచేను- అను నర్థము నొకదాని నిచ్చు చున్నట్లు- నంజె యన మడి యనంగను మంజులకేదారభూ సమాఖ్యలు వెలయుం బుంజె యనఁ జేను పొల మగు గం జన మరుభూమి పేళ్లు' అను చున్నది బ్రౌ శ ర లు నంజ పుంజ అనురీతివారమే ఇచ్చటి దనునట్లు- నంజ పుంజ గ్రహించు చున్నవి బ్రౌ 'గంజ గ్రహించి కృషికి యోగ్య మైన భూమి అను చున్నది మరుభూమి యనుట కైన- అర్థ మిది కావచ్చును శ ర గూడ దీనికి అట్లే ఉర్థ మిచ్చినది ఇందువలన పైఆం సం (వావి ప్రతిలో) మగుఁ గంజ అనుట ప్రమాద మనిపించును నంజె పుంజె గూడ నంజ పుంజ అన వలసినవి గా కాన్పించును బనను ప్రమాణ మేమియు ఇందుల కీనిఘంటువులు ప్రద ర్శింప నందున శబ్దస్వరూప మిద మిత్థ మ్మన రానిది గా నున్నది పొలము నకు పంటనేల (క్షేత్రము)- అను నర్థము ప్రసిద్ధము ప్రయోగజుష్టము భారతప్రయోగ మొకటి ఇట్లున్నది- వల నేర్పడఁగ దున్నఁ బొలములో నైన వ ర్షంబు లే కున్న ధాన్యంబు లగునె? (సౌ 3) ఇరువదియేడులు దినపొల మొరుఁడు గుడుచు చునికి మెఱిగి యున్నేనియుఁ దా దొంలక యున్నేనియుఁ ద త్పరిభోగము గుడిచినతనిపా

లై పోవుఁ (విజ్ఞా వ్య కాం) (చూ శ ర) పొలమరి గ్రహించి కా ప్ప అను-అర్థ మిచ్చినది ఆం భా (చూ నానా 3 49) వేను లో నగునవి క్షేత్ర పర్యాయము లనినది ఆం భా అం దిది లేదు (చూ 2 230) పొలమరి వే ఇది సంగృహీత మైన టీక డు భావించినా డనిపించు చున్నది ఆం భా గ్రహింప లే దని కా బోలు సాంబ లో నగునవిగూడ దీని నీయర్థమున గ్రహింపక వదలినవి ఇట్టి సంగ్రహణముగూడ ఆం భా లో అచ్చటచ్చట గాన్పించును

కృష్ణభూమి — కృష్ణభూమి అని వావి (అపపా) కృష్ణభూమ పాణ్డుభూమః కృష్ణా పాణ్డుశ్చ యత్ర మృత్ అని (వైజ భూమి దేశా) కృష్ణోదక్పాణ్డుసంఖ్యాపూర్వా యా భూమే రజిష్యతే (5 4 75) అని విహిత మైన సమాసాన్తము (అచ్) బహు వ్రీహివిషయకము ఇది (కృష్ణభూమి) కర్మధారయము

ఊరిపొత్తునేల — గ్రామాన్త ఉపశల్యం స్యాత్ అనుచోటి అన్త శబ్దము సమీపార్థకమ. ఇచ్చటి గ్రామ మనునది శైలాదులకు ఉపలక్షణము కనుకనే మాఘకవి- శైలోపశ ల్యనిపతద్రథనేమిధారా అనుచున్నా డు (చూ సుధాటిప్పణి) ఇట (సుధ) ఇందు లకే గ్రామాదిసమీపదేశస్య అని వ్యాఖ్యానించినది గ్రామాన్తము అనుచోటి అన్త శబ్దము సమీపార్థక మని గ్రామస్య అన్తం-సమీపమ్ అని (సుధ) (గురు) అమర మున పురవర్గమునం దిది ఉదాహరింప బడినది ఆం భా దీనిని భూమివర్గము నం దుదా హరించినది దీనివలన ఉపలక్షణవిధి ఇట ఆం భా కు ఇష్టము కాని దనిపించును గురు ఇట- గ్రామసమీపప్రదేశము పేళ్ల అనియే వ్యాఖ్యానించినది ప్రకరణమునుబట్టి-ఇది పంటనేల నే పొల మనుచున్నదా అనిపించును అందులకే కావలయు బ్రౌ శ ర సూ ని ఈయర్థమును పొలము నకు ఇచ్చుట లేదు ఆం భా ఇట్టి వర్గవినిమయము (అమరమునకంటె భిన్నము గా) అచ్చటచ్చట జరపుచునే యున్నది పొలము నకు పంటనేలయే ఇచట ఆం భా కు అభిప్రేత మైన ఊరిపొత్తునేల అనవలసినయావశ్య కత గాన్పింపదు

గరువు గరుసు నాఁగ ఖరభూమి విలసిల్లుఁ
దువర తుస్సి నాఁగఁ దువరభూమి
విఱిగి నాఁగ స్ఫోటపృథివికి సంజ్ఞ యౌఁ
జదును నా సమోర్వి సాంబమూర్తి

గరువు గరుసు— ఇవి ఖరభూమికి (కఠిన మైనభూమికి గట్టినేలకు) పేర్లు

తువర తుస్సి— ఇవి తువరభూమికి (ఒగరయిననేలకు) పేరు

విఱిగి— ఇది స్ఫోటపృథివికి (పగుళ్లువాఱినభూమికి) పేరు

చదును— ఇది సమోర్వికి (సమమగు భూమికి మిట్టపల్లములు లేనినేలకు) పేరు

గరుసు — పైవిఱు గులకఱాలచేత గట్టియైనది (నేల) అని (శ ర) (గరుసు-గులకరాళ్లు - అని బ్రౌ)

గరువు — గరువు గర్వు గరుపనేల ఖరభూమి రాతిమొరము ఇసుక గలనేల అని బ్రౌ (చూ అను)

చదును — సూ ని వి సమ మగుభూమి సమప్రదేశము (శ ర) అని ఈ ఆంధ్ర భా ను ఉదాహరించి నేలచదును=నేలమట్టము నేలతో సమము సౌధయోధము నేల చదును చేసెడివారు వనభూజములు పీఁకి వైచువారు (అని 4 40) అను చున్నది

సీ మృత్తికాహ్వయము లౌ మిత్తిక యంచన
మట్టి యంచనఁగను మన్ననంగ
శుద్ధమృత్తిక యొప్పు శుద్ద యంచన మీఁఖు
బంకమన్ననఁగఁ గుంభకరమృత్తు
చౌడు కారపుమన్ను చవుడన నూషర
మృత్సంజ్ఞ దోఁచుఁ దత్పృథివిపేరు
లు ప్పనఁ జౌడన నూసర యన నొప్పు
జేడె నా నమరుఁ బిచ్చిలధరిత్రి

గీ ధరణి విస్తారనిమ్న యై తనరెనేని
బాడువ బడువ యనఁగను బరఁగు చుండు
మెట్ట మెరక యనంగను మెఱయు చుండు
స్థలికి సంజ్ఞలు మాతృభూతాభిధాన

మిత్తిక మట్టి మన్ను—ఇవి మృత్తికకు పేర్లు

సుద్ద—ఇది శుద్ధమృత్తికకు (ప్రశస్తమైనమృత్తికకు మృత్సకు మృత్స్నకు) పేరు

బంకమన్ను— ఇది కుంభకరమృత్తునకు (కుమ్మరి కుండలు చేయుమట్టికి జిగురు గలమట్టికి) పేరు

చౌడు కారపుమన్ను చవుడు—ఇవి ఊషరమృత్తికకు (ఉప్పుమట్టికి చౌటిమట్టికి) పేర్లు

ఉప్పు చౌడు ఊసర—ఇవి ఊషరభూమికి (చవుటినేలకు) పేర్లు

జేడె—ఇది పిచ్ఛిలధరిత్రికి (జాఱుడు గలభూమికి బురదనేలకు) పేరు

బాడువ బడువ—ఇవి విస్తారనిమ్న యగుధరణికి (చాలపల్లము గలభూమికి) పేర్లు

మెట్ట మెరక—ఇవి స్థలికి (అకృత్రిమభూమికి సహజముగా చదునై నీటియాధారము లేక పండెడి నేలకు) పేర్లు

శుద్ధమృత్తిక —ఈసందర్భమున అమ ఇట్లనుచున్నది- (మృన్మృత్తికా) ప్రశస్తా తు మృత్సా మృత్స్నా చ మృత్తికా (అని) తెలుగున సుద్ది కు గలయర్థప్రసిద్ధిని బట్టి కా బోలు సుద్దబావి మొ ఉదాహరించి శ్వేతమృత్తిక (తెల్లమట్టి) అని యర్థమిచ్చుచున్నారు బ్రౌ శ ర మొ నిఘంటుకర్తలు సుద్దము నకు (యూపాం) సుద్ద సుద్దము నకు ఆం భా శుద్ధము అనునర్థమునే ఇచ్చుచున్నది (చూ 3 5) దీనిని బట్టి ప్రశస్తమృత్తిక అనునర్థమే యిట ఆం భా కు అభిప్రేత మనిపించి అట్లే నాచే వ్యాఖ్యాత మైనదిది

జేడె — (జేడ- బ్రౌ జేడి-ప్రాతప్రతిపా) అని (సూ ని) జేడె-దేవి బురదనేల జేడియ యొక్క (రూపాం) అని (శ ర) వేనికిని నిర్ధారకము లేదు

పిచ్ఛిలధరిత్రి — సజమ్బాలే తు పఙ్కిల అని అమ పిచ్ఛిలా శింశుపాయాం చ పిచ్ఛిలో విజిలే ఽన్యవత్ (విశ్వ) (విజిలము-జిడ్డు గలది-అని టీక) (జిడ్డు-మొద లగువానిచే) జాఱుడు గలది- నేల) అని (సూ ని)

మెట్ట —ఇట శ ర నీరాసరా లేక పండెడిచేను అని ఒకయర్థము దీని కిచ్చు చున్నది మెట్టపంట గ్రహించి మెట్టచేనిపంట అర్థ మనినది సూ ని - ఈ అం భా ను దాహరించి దీనికి- నీరు లేనిచేను అనునర్థ మిచ్చినది విషరాశివిష మాను విషధరం బుల రోసి మెట్టకు నరుగుక్రొమ్మెఱు గు లన గ (దశా 2 238 ) అను ప్రయోగ మిందులకు ప్రమాణ మనినది మెట్టపంట గ్రహించి జల మక్కఱ లేకయే పండు పంట అర్థ మని సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వా డు పుట్టు గానని మేనిమెట్టపంట (మనుచ 8 ) అనినది ఇట వ్యాఖ్యాతలు పుట్టు కానని మేనిమెట్టపంట మొల కెత్తుట తెలియనిదేహరూప మయినమెరకినేల ఎంట హో (మెట్టపంట-అనుటచే వర్ష ప్రతిబంధముచే చెడ దని సూచితము) లని నారు. ఇట ఆము వేద పా పుట్టు కామని లేని మెట్టపంట ( అ 9 ) అనునదిగా ఉన్నది పుట్టుక= మొలచుటయు అమని= నుఱిపిడియు లేని (చల్లక నుఱవక సిద్ధము గా నున్న యనుట) అని వేద వ్యా (మా ఆము 9 ) బ్రౌ మెట్ట కఠ అం భా ఉదహరించి దీనికి లక్ష్యమనుచు సకలదైవతబుభుక్షాస్ఫూర్తి కెవ్వాని పుట్టు గానని మేనిమెట్టపంట అని ఆము ప్రయో గ ముదాహరించి టీ అనాయాసప్రాప్త సస్యము అర్థ మనినది దీనిచేకాక ఆము మఱియొకప్రయోగమునుగూడ పిపాస బడుతేటులకు మెట్టపంట గలిగె (8 66 ) అని ఉదాహరించి సులభ మైనపంట గలిగెను అని అర్థము వ్రాసినది వీని నన్నిటిని బాగుగా పరిశీలించి పైయర్థ మొస ´ బడినది దేవమాతృక (వర్షాధారము గా పండుభూమి)- అనునది దీనికి (అర్థాం ) అమ - దేశో నద్యమ్బువృష్ట్యమ్బుసమ్పన్నవ్రీహిపాలిత స్యా న్నదీమాతృకో దేవమాతృక శ్చ యథాక్రమమ్ అను చున్నను వ్యవహార మాత్రప్రసిద్ధ మై ప్రయోగజుష్ట మిది కా దనియో ప్రయోగజుష్ట మైనను సుప్రసిద్ధ మిది యనియో అం భా ఏడలి యుండు నని ఎంచు చున్నది

గీ పరగు నెద్దడినే లన మరుధరిత్రి
కొఱఁ కనంగను బీడు నాఁ గొఱ ననంగఁ
గంచె యన వప్రహతభూమి కాఖ్య లెసఁగు
బడిగ మడి యనఁగా నదీప్రాంత మభవ

ఎద్దడినేల—ఇది మరుధరిత్రికి (నిర్జలభూమికి) పేరు

కొఱఁకు బీడు కొఱను కంచె—ఇవి అప్రహతభూమికి (దున్ననిభూమికి) పేర్లు

పడిగ మడి—ఇవి నదీప్రాంతమునకు (ఎటిదగ్గఱ ఉండు భూమికి) పేర్లు

పడిగ — పడిగ లని ఇట బ్రౌ పా (చూ అను) ఇదియె (సాధుపా) ఎడగ వావి సూ ని పా (అపపా) ఆం భా పడిగలు మడిలోఁ బడినమెన్నులు నేట కడనేల లొప్పును (3 62) అను చున్నది పఱిగ అని వ్యవహారము ప్రయోగము గూడ ఇట్లున్నది- ఎఱు గరుగాక లోకమున నెవ్వరికైనను మేలు సేయగా నొఱ పగునాశ్రమంబున సమున్నతమైనగృహస్థధర్మముం బఱగడ వైచి వెఱ్ఱిగొని పాఱెడి పొల్లకు ముక్తిగల్గునే పఱిగరి యేఱినం గొలుచు వాతఱకుం గలదే తలంప గన్ (ఉ హ 4 48) (శ ర పా ఇది) పఱిగల నేఱినన్ అని (ము ద్రి పా) పఱిగ కు ఆం భా వే అర్థము నిచ్చు చున్నది- ద్వ్యర్థకకాభిధ పఱిగ యం చనినను (చూ 2 230) పఱిగరి పఱిగఁబట్ట పఱిగబ్రతుకు అనునవి దృష్టములు పడిగ కు (రూపాం) పఱిగ ఆం భా పదమునకు సుప్రసిద్ధార్థము ప్రయోగజుష్టమైనను లోకవిదిత మని యుపేక్షించి దానికి గల విశేషార్థమునందే శ్రద్ధ వహించుట బహుశో దృష్టము ఇది దీని పద్ధతికి జెందినది అందులకే పఱిగకు గల ప్రసిద్ధార్థమీయక వదలిన దనిపించును

కంచె — పసులు మేయుటకై దున్నక నిలిపిన పొలము వివీతకము - అని (శ ర వివ) జెముడు బలుసు లో నగువానిచే నేర్పఱుప బడిన వెలుగు వృతి అనునది దీనికి (అర్థాం) కంచెయే చేను మేసిన కా పేమి చేయును అని సామెత సూ ని మొ ప్రయోగములు చూపుట లే దీయర్థమునకు అందులకె ఈ యర్థమును ఆం భా ఈ యలే దనిపించును ఆం భా గ్రహింప లే దనియో యేమో ఆం సం మొ గూడ గ్రహించుట లేదు దీనిని

సీ పాండవబీడు నా బరఁగు బిరాప్రహ
తము పాడు నా గను దనరు నప్ర
హతవిశేషము జగం బన లోక మొప్పారు
నాఱె మం చన గ దేశాహ్వయంబు

నాడు నా జనపదనామధేయం బగు
సీ మన దుర్గాఢ్యభూమి వెలయు
వంటె మం చనఁగను వణిత మం చనఁగను
సీమైకదేశ మై చెలఁగు చుండు

గీ మన్నె మన మండె మనఁగను మాడె మనఁగ
దుర్గమస్థలనామ మై తోఁచు చుండు
నీరుముం-పనఁ గ్రీనీరునేల యనఁగ
ఖ్యాతి గాంచు ననూపంబు మాతృభూత 7

పాండవబీడు—ఇది చిరాప్రహతమునకు (చాలకాలమునుండి దున్నని బీటి నేలకు) పేరు

పాడు—ఇది అప్రహతవిశేషమునకు (ఒకవిధ మైనదున్ననిభూమికి) పేరు

జగము—ఇది లోకమునకు పేరు

అణెము—ఇది ఒకదేశమునకు పేరు

నాఁడు—ఇది దేశమునకు పేరు

సీమ—ఇది దుర్గాఢ్యభూమికి (కోటచే నొప్పుభూమికి రాజధానికి) పేరు

వంటెము వణితము—ఇవి సీమైకదేశమునకు (రాజధానిలోని కొంతభాగము నకు) పేర్లు

మన్నెము మండెము మాడెము—ఇవి దుర్గమ మగుస్థలమునకు (చొర రాని ప్రదేశమునకు) పేర్లు

నీరుముంపు క్రీనీరునేల—ఇవి అనూపమునకు (నీరు అధికము గాఁ గల ప్రదేశమునకు) పేరు

పాండవబీడు —పాండవులనాఁటిది (అనాది గా ఉన్నది) బనదున్ననినేల మి గ్రా ఇది

పాడు —సాగుబడికి రానినేల (పోరంబోకు) అనవచ్చు ననిపించు చున్నది ప్రయోగ మొకట ఇట్లున్నది- పోవంగ రాము డు పుణ్యశీలుండు లీల నున్నది యూరు (యూరు) లేనిది పాడు (రం రా అయో 2 పౌ ‾పం) (చూ సూ ని) జనులు కాపుర ముండి పాడుపడిననేల ఈ ప్రయోగములోని పాడు న కర్థ మనుట సముచిత మైనను- ఉటువంటి యుపయోగము లేనినేల- పాడు- అనుటయు దోషము కానిదే యనిపించును సూ ని ఈ ఆం భా ఉదాహరించి దున్నని నేల దీని కర్థ మను చున్నది ఆం భా అప్రహతవిశేషము అర్థ మనుట గమనింప లేదనిపించును ద్వే ఖిలాప్రహతే సమే అని (అమ)

నాడు —(క త నాడు) దేశము ఉనునర్థమున శ ర ఉర్ధానుస్వారరిహితము గా దీనిని గ్రహించినది సూ ని దినంుకులుం డైన త్రిభువనమల్లండు కమ్మనాండును గుండికట్టు మొట్ట వాడియుం జేకొని యాధి గా వేలంగ్గ (శా ప మ 30) చ ఇల వెలనాంట్ది చోడినృపునిచ్చినదత్త ము (శా ప మ 42) అను వానిని ఉదాహరించి పబిందుక మను చున్నది కారణము లిందుల కిట్లు వచించినది కాలవాచక మగునపుడు సబిందుక మనుట నిర్వివాదాంశము ఇ కి దేశవాచక మైనప్పుడు సైతము ముద్రితప్రతులందు సబిందుకమే యయి యుండుటచేతను దేశకాలార్థములకు సన్నిహితసంబంధ ముండుటవలనను నిర్బిందుకమునకు నిర్ధారకప్రయోగములు లేక పోవుటచేతను శాసనముల ననుసరించియు నీయాపమే యెల్లెడల గ్రాహ్య మనుట యుక్తము (అని) ఐననూ ఆం భా పా నిరనుస్వారము గానే కానవచ్చు చుండుటనుబట్టి భాషాంతరసంవాదమునుబట్టి శ ర నే ఇట నే ననుసరించి ఉన్న దున్నట్లే వావి పా గ్రహించితిని నాడిక (రూపాం) ఉన్నాతియు నొడయ డు నటు లన్నా రని నీవు కొన కరు దెంచినచో నన్నా యన్నాడికి య న్ననాా యా గుకొన జాలునట్టిదె చెపుమా (అచ్చ రా ఉయో 0) (చూ సూ ని) ఆం భా కు తరువాతిప్రయోగ మిది

సీమ —ఇది (వాకు-పదవి) మొద లగువానివంటది ఎమలు గాని సీమలకు (శశాం 2ఆ 33) (చూ శ ర) సీమసున్నము సీమలత్తుక -మొ వ్యవహారదృష్టములు దేశము అనునర్థము- ఎమ శబ్దమునకు సంస్కృతమున గానరాదు ఉందులకే అచ్చతెలు గనినది ఆం భా ఎమా ఉఉఘూచే స్థౌ క్షేత్రే మర్యాదావేలయో రపి అని (విశ్వ) మొ

సీమైకదేశము — ఆమ పురవర్గమున ఉన్యత్తు యన్మూలనగరాత్పురమ్ త చ్ఛాఖానగరమ్ అనినది ఈ శాఖానగరము నే అం భా సీమైకదేశ మను చున్నది బ్రౌ సీమామూలము రాజ్యము- అను చున్నది వంటెముకడ- బ్రౌ తాలూకా అని విస్పష్టము గా దీనిని వచించినది [శ ర కూడ ఒకని క్రింద కొంతరాజ్యము దీనిని తాలూకా అందురు--ని మొదటిరూపము వంటియము అనినది ] యూ ని మాత్ర ఒట- వణితము నకు మొదటయర్థము గా రాజ్యభాగము (జిల్లా తాలూకా మొ ) ఉని ఇచ్చి ఈరీతి జిత్రసేనధ రాటిమణుం డల్లునకు వరణ మొస గి కుమా రీరత్నమునకు బసుపున కారసి యొకవణిత మొస గి యనిమెన్ సతికిన్ (చంద్రా 6 93 ) ప్రయోగ మిచ్చినది దీనికి రెండవయర్థము — సమైకదేశ మును వేఱుపఱచి ఈ అం భా ను ఉదాహరించు చున్నది పైఅమరము ను వ్యాఖ్యానించుచు గురు - మూలనగర మన గా రాజధాని అందు చోటు చాలక నదీసమీపమందు గాని సంస్సమీపమందు గాని కట్టబడిన వేఱొకపట్టణము శాఖానగరము అను చున్నది సుధావ్యాఖ్య- మూలనగరం రాజధానీ తతో ఉన్యత్ యత్తు పురమ్ శాఖేవ నగరమ్ అను చున్నది ఒకకవయిత్రి- విజయనగరమునకు ఎంప శాఖానగర మని వర్ణించు చున్నది యచ్ఛాఖానగరీం పమ్పామనేకధనదాశ్రితామ్ అధితిష్ఠన్ విరూపాక్షో న స్మరత్యలకాపురీమ్ (మధు . 66 ) రాజధాన్యేకదేశమే శాఖానగర మను చున్నది పై ప్రయోగము రాజ్యైకదేశ మని సిమా మూలము మొ వాని నుదహరించి బ్రౌ మొ అనునది గూడ నాదృశ్య లక్షణచే సుసంగతమే ఇం కొకమాట- అం భా శాఖానగర మనుట లెదు సీమైకదేశ మను చున్నది అందువలన అతనికి బ్రౌ శ ర ల యర్థము సంమతమే అనిపించును చంద్రా ప్రయోగము- అం భా కు లక్ష్యము కా దగినదే వేఱుపఱపవలసినదిగా లేదు అమరమునకు సర్వవిధానుకరణము గా అం భా వెలయ లేదు కొన్నిపట్టుల హేతుబద్ధము గా ప్రయోగాదుల బట్టి వేఱుపడుచు వచ్చినది అట్టిదే యిట జరిగిన దనిపించును

అనూపము — జలప్రాయ మనూపం స్యాత్ అని అమ నీరు తఱచు గాఁ గలనదీసరస్సుల సమీపప్రదేశము అని గురు జలాధికదేశస్య అని (సుధ )

సీ మొంపనేల యనంగ మొరసునేల యనంగ

శర్కరిలావనీసంజ్ఞ వెలయు

గోష్ఠంబు దొడ్డి నాఁ గొమరారు బెంట నాఁ
బర గు గోష్ఠినంబు పఱగడ యన
బరిసరంబు గ దో చు వఁసంది చేరువ
కట్ట కత్తువ కర గనిమ యన గ
సేతువిశేషంబు చెల గును మడువ నా
బు ట్టన వల్మీక మొప్పు చుండు

ఆ గోమ యనఁ దదగ్రభూమి యౌ మార్గంబు
తెరువు త్రోవ దారి తెన్ను సరవి
చనుప నడవ చొప్పు జాడ డొంక యనంగ
బొలుచు చుండు మాతృభూతలింగ

మొరపనేల మొరసునేల—ఇవి శర్కరిలభూమికి (గులకఱాలనేలకు) పేరు

దొడ్డి—ఇది గోష్ఠమునకు(పసులసాలకు)పేర్లు

పెంట—ఇది గోష్ఠీనమునకు(ముందు గోవులమంద ఉండినప్రదేశమునకు)పేరు

పఱగడ—ఇది (గ్రామనగరాదుల) సమీపభూమికి పేరు

వరసంది చేరువ కట్ట కత్తువ కం గనిమ మడువ—ఇవి సేతువిశేషమునకు (మడికి చుట్టు ఎర్పఱచినచిన్నకట్టకు)పేరు

పుట్ట—ఇది వల్మీకమునకు పేరు

కోమ—ఇది వల్మీకాగ్రభూమికి (గోపురమట్లు పెరి గినపుట్టచివరిభాగమునకు) పేరు

తెరువు త్రోవ దారి తెన్ను సరవి చనుప నడవ చొప్పు జాడ డొంక—ఇవి మార్గమునకు పేర్లు

గోష్ఠము — గోష్ఠం గోస్థానకం తత్తు గౌష్ఠనం భూతపూర్వకమ్ అని (అమ)

వంసంది —దీనిని శ ర గ్రహింప లేదు బ్రౌ గ్రహించి పరిసరము అం భా గవిమ అను చున్నది

పఱగడ — పరగడ -ఊరి బైటిపొలము-అని బ్రౌ సూని పరిసరము గ్రామనగరాదుల సమీపభూమి-అని ఈ అం భా పా ఇచ్చి గట్టురాపఱగడ నిచ్చయుఙా నగము బాహుల నూఁప్పచు మంచుగట్టు నా మెఱయుకపీంద్రుఁ జూచి ' (దశా 8 2) ప్రయోగ మిచ్చినది పర్యన్తభూః పరిసరః అని(ఉమ) నద్యాదిసమీపభూమేః లని (సుధ) గ్రామనగరాదులయొక్క సమీపభూమి అని (గురు) అన్తరం గ్రామయో ర్మధ్య ముపఘ్నం త్వన్తికాశ్రయః పర్యన్తభూః పరిసరః కటౌ గ్రామేయకః పునః అని (వై జ పాతా పురా) గురు పరిసరమున కిచ్చినయర్థమే పఱగడకు వర్ణింపవలసినట్లు నాచనసోమనాధుని ప్రయోగ మొకటి ఇట్లున్నది సమున్నత మైనగృహస్థధర్మ ముం బఱగడ వైచి గోఁచి గొని పాఱెడు పొల్లకు ముక్తి కల్గునే?' (ఉ హరి 4 48) ఇచ్చట సమున్నతమైన గృహస్థధర్మమును (గార్హస్థ్యమును) పఱగడను- గ్రామనగరముల పరిసరమున (ప్రాంతమున) వైచి- పడవైచి-వదలి- తనవెంట రానీక ఊరి వెలుపలనే వదలి- అనుట పాఱెడుపొల్లకు- ఏయరణ్యమునకో పరువు లెత్తెడువ్యర్థునకు (ఎవరికిని ఉపకరింపనివానికి) ముక్తి గల్గునే? (కల్గదు)-అని సమన్వయ మనిపించు చున్నది దశా ప్రయోగము పర్వతప్రాంత మనుగూడ పఱగడ అను చున్నది ఇందువలన ప్రాన్తభూమాత్రము దీని కర్థ మనుట యుచిత మనిపించును ఆయా ప్రాంతములు ప్రకరణాదులఁబట్టి జ్ఞాతము లగును అందులకె పర్యన్తభూః పరిసరః అని అమ గ్రామనగరాది అనురీతిని ఆది శబ్దముతో ఏతద్వ్యాఖ్యలును ఇటఁ గాన వచ్చు చున్నవి

సీ బాట యనంగను బండిబా టనఁ దగు
ఘంటాపథము దోఁచుఁ గాలిత్రోవ
యన నేకపది గిర్యయన మొప్పు నరవ నా
నుపనిష్కరం బొప్పు నుక్కళ మనఁ
బరఁగు మె ట్టనఁ గూఁతపట్టునేల యనంగఁ
గూఁతనేల యనంగఁ గ్రోశ మదియె

పరువునేల యటంచుఁ బలుకుదు రీకవు
లిరుపర్వునేల ముప్పరువునేల

గీ. యనినఁ గ్రోశద్వయత్రయాఖ్యలు చెలంగు
నామడ యనంగ యోజనం బగును గనుమ
యనిన గాంతార మగు లవణాకరంబు
వెలయు నుప్పల మనఁగను వేదవేద్య

బాట బండిబాట—ఇవి ఘంటాపథమునకు(రాజమార్గమునకు) పేర్లు

కాలిత్రోవ—ఇది ఏకపదికి(ఒక డుమాత్రము నడచి పోవుటకు వీలైనమార్గమునకు) పేరు

నరవ—ఇది గిర్యయనమునకు(కొండత్రోవకు) పేరు

ఉక్కళము—ఇది ఉపనిష్కరమునకు (పట్టనమునకు పోవురాజమార్గమునకు) పేరు

మెట్ట కూఁతపట్టునేల కూఁతనేల—ఇవి క్రోశమునకు (కోసుదూరమునకు) పేర్లు

పరువునేల—ఇదియును క్రోశమునకు పేరు [కవులవ్యవహారమునకు చెందిన దిది]

ఇరుపర్వునేల—ఇది క్రోశద్వయమునకు (రెండుకోసుల దూరమునకు) పేరు

ముప్పరువునేల—ఇది క్రోశత్రయమునకు (మూఁడుకోసులదూరమునకు) పేరు

ఆమడ—ఇది యోజనమునకు(నాలుగుకోసులదూరమునకు) పేరు

కనుమ—ఇది కాంతారమునకు(రెండుకొండలనడిమిసందుత్రోవకు) పేరు

ఉప్పలము—ఇది లవణాకరమునకు(ఉప్పు పండుపొలమునకు) పేరు

ఘంటాపథము — పదిబారలవెడల్పు గలబాట- (రాజమార్గము) దశధన్వన్తరో రాజమార్గో ఘణ్టాపథ స్మృత (కౌటిల్యుడు)

ఉపనిష్కరము — ఉపనిష్కరము (రూపాం) అని శ ర ఉపనిష్కరం బొప్పు (వావి శ ర పా) (పాతాం)

మెట్ట — ఈయర్థమునందు శ ర సూ ని దీనిని గ్రహింప లేదు బ్రౌ గ్రహించి క్రోశము పరువుదూరము- అని అర్థ మిచ్చినది క్రోశపరిమితి యి ట్లున్నది చతుష్కాధిక వింశత్యా అఙ్గులై ర్హస్త ముచ్యతే సహస్రై రష్టభిః ఖ్యాతం హస్తకం క్రోశమానకమ్ ఇరువదినాలుగంగులములు ఒకహస్తము ఎనిమిదివేలహస్తములు ఒకక్రోశము (చూ గురు) చతుర్హస్తో ధనుర్దణ్డః క్రోశో ధనుస్సహస్రేణ' (వాచ) నాలుగు వేలహస్తములపరిమితి గల దనిన దిది ధన్వన్తరసహస్రం తు క్రోశః' అని (వైజ భూమి దేశా)

నరవ — కలాపూర్ణోదయమునం దొకపద్య మి ట్లున్నది- కూఁకటివేణితోఁ గురులు గూడక మున్నఁ గుచప్రరోహముల్ పోఁకలతోడిసామ్యమును బొందకమున్న నితంబసీమకుఁ బ్రేఁకఁదనం బొకింత ప్రభవింపక మున్నఁ బ్రసూనబాణుఁ డ ట్టాఁకలఁ బెట్టెఁ దా నరవనామెతకై విటావళిన్ (కలా 27) (ఇచ్చట) నరవయామెత అనిన ఆం భా కు లక్ష్య మిది యగును నరవయామెత- కొండత్రోవయందలిభోజనము దానివంటిది (బాలిక) యని అర్థము అచ్చటిభోజనము ఆఁకలిచేఁ దినవలయు నను తహతహ ఉన్నను సరిగా భుజింప వీలు గానిదై (అధ్వాన్న మై) ఆ తహతహ తీర్ప లేనిది గా ఉండును అట్లే (విటాళి) అనుభవింపఁ దహతహ చెందు చున్నను సరిగా అనుభవింప రాని దై వారితహతహ తీర్పలేనిది గా ఇది ఉన్న దనుట దీనిచే చెప్పఁబడు చున్నది అట్టిదానికై అట్టాఁకలఁ బెట్టు చున్నాఁడు విటాళిని ప్రసూనబాణుఁడు-అని సమన్వయము 'నరవయామెత' అనుట ఇంచుమించు గా అధ్వాన్న' మనుటయే అధ్వాన్నం శత్రు మధ్యమ్ అని తెలుఁగువారినానుడి న న్నతిదుఃఖాన్వితఁ డించి పోవఁ దగవా యధ్వాన్నపుంబట్టునన్ (హర 3. 88) ఇది అధ్వాన్నపుఁబట్టు కాదు అధ్వానపుఁబట్టు అధ్వానము- (న+ధ్వానము) (ధ్వానము- ధ్వని) అది లేనిది చోటు- నిర్జనారణ్యము- దిక్కు లేనిచోటు- అనుట అందు డించి పోవఁ దగవా? కాదు- అని

సమన్వయము ఇచ్చట కొందఱు విమర్శకు లేమేమో వ్రాసినారు ఒది పరిశీలనీయ మనిపించు చున్నది ప్రకృత మనుసరింతము కొండత్రోవయందలిభోజన మనుట సరిగా కూర్చుండుటకు నిలుచుండుటకు గూడ వీలు గా కుంటను బోధించి భుజింప వీలు గా లే కుండుట కు మఱింతపుష్టినిఁ జేకూర్చు చున్నది నరప పదసాంనిధ్య ముచే అమెత కు భోజనముమాత్ర మర్థము ఇది ఇచ్చటిసమన్వయము చిరకాల మునుండి ఈ పద్యసమన్వయమునకై విమర్శకులు పడు చున్నపాట్లు దైవమున కెఱుక వేంకనార్యునిధర్మమా యని యీనా టి కవి తీఱిన వనవచ్చును

కూఁతనేల — [ కూడనేల (వావి అపపా )]

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జెయుకతనఁ
బరఁగు శాశ్వతము గ భూమివర్గ మిట్లు
గై కొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత

ఇది

భూమివర్గము

---

# పురవర్గము

ఆ. ప్రోలు వీడు నాఁగఁ బురసంజ్ఞ లై యొప్పుఁ
గంచి నాఁగ నోరుఁగల్లు నాఁగఁ
దిరిచినాపలి యనఁ బురవిశేషము లగు
వాడ యనఁగ వాటి వఱలు నభవ

ప్రోలు వీడు—ఇవి పురమునకు (పత్తనమునకు పట్టనమునకు) పేర్లు

కంచి ఓరుగల్లు తిరిచినాపలి—ఇవి పురవిశేషములకు (వరుస గా- కాంచికి ఏక శిలానగరమునకు త్రిశీర్షపురికి)పేర్లు

వాడ—ఇది వాటికి (వీథికి) పేరు

కంచి —(సం కాంచీ ప్రా కంచీ) మోక్షదాయకము లగు-ఏడుపురములలో ఇది యొకటి- ఉజ్జయిని కాశి మాయ యయోధ్య కాంచి మధుర ద్వారక యనెడునామములు గలిగి పట్టనము లేదు కీర్తిసంపద వహించు మహితకైవల్యలక్ష్మికి మందిరమౌలు (కాశీ 3 87) ఈపట్టనమునకు కాంతి అనియు పేరు కాంతి యందురు గొంద ఱక్కాంచి పేరు కమకురువిందరత్నసకాంతి కలిమి (కాశీ 3 0) కాంచీపురస్త్రీలు చాల సుందరులు గాను జాణలు గాను శ్రీనాధునిచే వర్ణింపఁబడినారు (చూ కాశీ 3 09) ఈపట్టనము-విష్ణుకంచి శివకంచి యని రెండువిభాగములు గలిగి చాలవిస్తృత మైన మహాపత్తనము- కాఁపుకోడలు కంచంతకా పురంబు బాలవంటికులంబుఁ గీడ్పఱచి యుఱికె మగని నటు పెట్టి రెండవ మగనివెంట నువిదలకు బుద్ధి పెడతల నుండుఁ గాదె (పాండు 3 81) కంచిమేఁక మొద లగునవి దీనినుండి ఏర్పడినవియే

ఓరుఁగల్లు —(క ఓర్-ఏకము)- ఓరుంగల్లటి పురంబు సౌధములపై నొ ప్పారెడిని (క్రీడా 64) (చూ సూ ని)

తిరిచినాపలి — తిరుచినాపలి అని (వావి పా)

వాడ —(సం వాట క వాడె) అవ్వాడం బౌరజనంబు లెల్ల నిత దెవ్వా డొక్కొ నేత్రోత్సవం బై డాయం జనుదెంచె నంతటను మాయం బయ్యె (శృం నై 3 82) (చూ సూ ని) వాడ కుఱికి తిట్టవల దన్న మొరవెట్టు ముంది మగని దిట్టు ముసుకు వెట్టు గడుసురాలు మగని గంపఁ బె ట్టమ్మ రా (వేమ 73) (వాడ కుఱికి—వీథి కెక్కి) అని బ్రౌ (ముసు గు అనియే శ ర సూ ని మొ అను చున్నవి (ముసుకు క) (కన్నడ) తత్సమ మిది కావచ్చునేమో బ్రౌ పా ముసుకు గానే ఉన్నది) వాడవదినె- మొ దీనినుండి యేర్పడినవే వాడవదినె కేల వావివర్తనములు చాడిగాని కేల జాడబుద్ధి మూఢమతుల కేల ముదముతొ జ్ఞానంబు (వేమ 689)(చూ బ్రౌ)

సీ అంగడి మలిగ నా నాపణసంజ్ఞ లొఁ
బేఁట యం చనఁగను విపణి యొప్పు
రచ్చ నా రథ్య యొఁ బ్రాకార మగుఁ గోట
యన నుపసాలాఖ్య యగు నరాబు
నా నలంగం బన నలవరి నా వప్ర
మగును సాలావయవాఖ్య కొత్త
ళ మ్మన వరణశృంగ మ్మగుఁ గొమ్మ నాఁ
బ్రాచీనసంజ్ఞలు పరఁగు చుండు

గీ వెలుఁగు కల్ల యనంగను వలవ యనిన
వల్లికాస్యూతవృతి భిత్తి పరఁగు గోడ
యనినఁ దృణముఖ్యకృతభిత్తికాఖ్య చెల్లు
దడి తడిక తడు కనఁగను దడశిష 12

అంగడి మలిగ—ఇవి ఆపణమునకు (సరకు లుంచి అమ్మెడుదుకాణమునకు) పేరు

పేఁట—ఇది విపణికి (అంగడివీథికి) పేరు

రచ్చ—ఇది రథ్యకు(పెద్దవీథికి)పేరు

కోట—ఇది ప్రాకారమునకు (రాజధానిచుట్టు ఉండుప్రహరికి) పేరు

అరాబు—ఇది ఉపసాలమునకు (ఫిరంగులు పెట్టునట్టికోటబురుజునకు) పేరు

అలంగము అలవరి—ఇవి వప్రమునకు (కోటచుట్టు వేసినమట్టిదిమ్మెకు) పేర్లు

కొత్తళము—ఇది సాలావయవమునకు (కోటవాకిలికి) పేరు

కొమ్మ— ఇది వరణశృంగమునకు (కొమ్మనకు కోటప్రహరియొక్క అగ్ర భాగమునకు) పేరు

వెలుఁగు కల్ల—ఇవి ప్రాచీనమునకు (ఊరి చుట్టు వేసినయావరణమునకు)పేర్లు

వలవ—ఇది వల్లికాస్యూతవృతికి (తీగలతో కుట్టి ఎర్పఱచిన యావరణమునకు) పేరు

గోడ—ఇది భిత్తికి (కుడ్యమునకు) పేరు

దడి తడిక తడుకు—ఇవి తృణముఖ్యకృతభిత్తికకు(గడ్డి మొద లగువానితో నిర్మించినగోడకు) పేర్లు

అరాబు — వరాబు అని బ్రౌ పా అరాబు అని సూ ని వెలుపటిమందుతిత్తులఁ గూరిన యరాబు కొఱ కమర్చినపచ్చిగోడగుంపు (కువల 3 18) (చూ సూ ని)అరాబా-బండి ఫిరంగిబండి-అని (బ్రౌ మిశ్రవి) లక్షణచే ఫిరంగు లమర్చు కోటవంటి చుట్టుగోడ గూడ దీని కర్థ మనవలయు ననిపించు చున్నది ఆం భా ఉపసాల మను చున్నది (కువల) పైప్రయోగముగూడ దీనికిఁ గొంతవఱ కుపష్టంభక మనఁ దగి యున్నది

అలంగము — వప్రము కోటలోపల చుట్టూ ఉండేజగతి - అర్థ మని కోటలమీ దఁ జుట్టుఁ జని గొప్పయలంగపుటిండ్లు చూ డి య వ్వీటికి నెల్ల (D R 6 2 44) 'బంగరపు గోటలతుదం గలుగుమానికపుశృంగముల కెక్కుచు నలంగములపై కిఁ జంగునను దా టుచు (N 8 67) ప్రయోగముల నిచ్చినది (బ్రౌ)

అలవరి —ప్రయోగములయందు అళవరి అని యున్నది- అని (శ ర) అలవరి అనియే సూ ని బ్రౌ ప్రయోగములు మాత్ర మిచ్చుట లేదు

వప్రము — స్యాచ్చయో వప్ర మస్త్రియామ్ అని అమ ప్రాకారాధారస్య పరిఖోద్ధృతమృత్తికాకూటస్య అని (సుధ) అగడ్తలోనుండి యెత్తి ప్రాకారమునకు జుట్టును బలకరము గా బోయ బడినమట్టిదిన్నె అని (గురు వివరణము)

కొత్తళము — కొత్తడము (రూపాం) తఱు చైనయట్టికొత్తడములతోడ నిర వైన ముందఱి యిట్టికకోట పడమటివాకి లేర్పడఁ గాచి యుందు రెడపక రాక్షసు లేనుబది కోట్లు (రం రా యు 303పొ 8పం) కొత్తళమునకు- బురుజు అనునర్థమునే నిఘంటువు లిచ్చు చున్నవి ఆం భా బురుజు నకు నామము వేఱు గా వచించు చున్నది (చూ 2 8) కొత్తళమును సాలావయవ మను చున్నది పై ప్రయోగమునుబట్టి కోటవాకిలి దీని కర్థ మనిపించు చున్నది బ్రౌ అట్టళ్లు కోటవాకిటి మీ దియిల్లు (కోటకొత్తడము D) అను చున్నది నాచనసోమన కోట సింగారించి కొత్తళంబుల నెల్ల నట్టళ్లు వన్నించి (ఉ హ 2 92) అను చున్నా డు మఱియొక ప్రయోగ మి ట్లున్నది తల కున గోటనగ్గడలఁ దలుపులు వేల్పులు మూసి డాసి కొత్తళములపై నలంగముల దార్కొని మార్కొని (ఉ రా 4 272) బురుజు అనునది దీనికి అర్థాంతర మనవచ్చును కొత్తళమునకు ఇట్టియర్థము చెప్పిన ఆం భా బురుజునకు వచించు చున్న మూలకొత్తళము నకు గూడ వ్యుత్పత్తి సరి గా ఉండు నని తో చు చున్నది

ప్రాచీనము —వెదురు పేము లో నగువానిచే గోటకు జుట్టు నేర్పఱప బడిన ఆవరణము (ప్రాచీనము) అని (శ ర) ప్రాచీనం ప్రాన్తతో వృతి ఊరిచుట్టు వేసిన వెలుగు—అని వ్యాఖ్యలు ప్రాకారో వరణ స్సాల ప్రాచీర న్త్వేష ఎచ్ఛది (వైజ పాతా పురా) ప్రాచీనము నకే ప్రాచీరము (రూపాం) అని (శ ర) కాని వైజ ఉదాహరించు చున్న ప్రాచీరము ప్రాచీనార్థకము కా దనిపించు చున్నది

వెలు గు — నిరనుస్వార మని శ ర చి వి వెలు గు-అని సానుస్వారము గానే గ్రహించినది ఘటకు డ పంప గా నరిగి కంపవెలుంగు తలంగ ద్రోచి - (శుక 3 423) (చూ సూ ని)

వలవ —ఇది యేనిఘంటువును గ్రహింప లేదు బ్రౌ వళవు గ్రహించి జాడ-మొ అర్థముల నిచ్చు చున్నది

సీ. ఘౌరకటి యిడుపు నాఁ బొసఁగు ద్వారప్రాంత
కుడ్యము మదురు మగు లనఁ గుడ్య
పాలిక యై యొప్పు భాసిల్లు గృహసంజ్ఞ
దీము దీమం బిల్లు గీ మనంగఁ
దా వన రా వనఁ దానకం బనఁగను
దావలం బనఁగను దలముపేరు
లిరవు ప ట్టిమ్మ చో టిక్కువ నెల విక్క
నెప్పు కంగవ టెంకి నిట్ట యనఁగ

గీ. స్థాన మగు నగ, రనఁగ రాజగృహనామ
ధేయ మౌ, రాణివాస మంతిపుర మనఁగ
నలరు శుద్ధాంత మట్టడి యనఁగ నట్ట
మలరుఁ దగు శాల కొట్ట మం చనఁగ నభవ 13

ఘౌరకటి ఇడుపు—ఇవి ద్వారప్రాంతకుడ్యమునకు(వాకిటిచేరువగోడకు) పేర్లు

మదురు మగులు—ఇవి కుడ్యపాలికకు (గోడమీఁదికప్పునకు) పేర్లు

దీము దిమము ఇల్లు గీము—ఇవి గృహమునకు పేర్లు

తావు తావు తానకము తావలము—ఇవి తలమునకు(ప్రదేశమునకు) పేర్లు

ఇరవు పట్టు ఇమ్మ చోటు ఇక్కువ నెలవు ఇక్క నెప్పు కంగవ టెంకి నిట్ట—ఇవి స్థానమునకు (ఉనికిపట్టునకు నివాసమునకు) పేర్లు

నగరు—ఇది రాజగృహమునకు (రాజు లుండెడునింటికి) పేరు

రాణివాసము అంతిపురము— ఇవి శుద్ధాంతమునకు (అంతఃపురమునకు రాజస్త్రీ లుండుగృహమువకు) పేరు

అట్టడి—ఇది అట్టమునకు (కోటవాకిటిమీఁదియింటికి) పేరు

కొట్టము—ఇది శాలకు(గుఱ్ఱము మొదలగువానిని ఉంచెడిపశువులశాలకు) పేరు

కంగవ —సూ ని శ ర లు గ్రహింప లేదు కంగవ తో ఆం ఖా పా ను ఉదాహరించినది సూ ని (చూ నెప్పు) బ్రౌ గ్రహించినది ఇరవు పట్టనంగ నిక్కయనంగను నెగడు కంగ మనికి నెలవు చోటు టెంకి మనికి నిట్ట తెంకి యిక్కువ యన స్థానమున కభిఖ్య లౌ నుమేశ (ఆం పద అచర ౧)

టెంకి — తెంకి (రూపాం) తెంకులు వేదముల్ రఘుపతీ శరణాగతవజ్రపంజరా (వజ్రపంజరశతకము)

అట్టము —మేడవెనుకటియిల్లు-అని కొందఱు- అని (శ ర)

సీ హాజారము హజార మనునివి రెండును
మోసాల మొగసాల మోస లనెడి
నివి మూఁడు నం తైదు నెసఁగును ముఖశాల
కలరఁ ద్రిశాలాఖ్య యగును జేట
కొల్లా రనఁగఁ జుట్టుకొల్లారు నలుసాల
యనఁ జతుశ్శాల యౌ నల్పగృహము
కొంప లాం పనఁ దగు గుడిసె నా గుడుసు నా
నీరెండు వెలయుఁ గుటీరమునకు

గీ నలకుటీరంబె యానేయ మైన నిలువ
ర మన నిలువార మనఁగాను రహికి నెక్కుఁ
జవికె యనఁ జవిర యనఁగఁ జనుఁ జతుష్క
మాకుటి ల్లనఁ బర్ణగేహము దగు భవ

హాజారము హజారము మోసాల మొగసాల — ఇవి (ఐదు) ముఖశాలకు (తలవాకిటిచావడికి) పేర్లు

చేటకొల్లారు—ఇది త్రిశాలకు (మూఁడుప్రక్కలను చేరికకట్టడము గలయింటికి) పేరు

చుట్టుకొల్లారు నలుసాల—ఇవి చతుశ్శాలకు (నడుమ బయలును నాలుగు ప్రక్కలను కట్టడము గలయింటికి) పేరు

కొంప లొంప—ఇవి అల్పగృహమునకు (చిన్నయింటికి) పేర్లు

గుడిసె గుడుసు—ఇవి కుటీరమునకు పేర్లు

ఇలువరము ఇలువారము—ఇవి ఆనేయ మైనకుటీరమునకు (ఒకచోటినుండి మఱియొకచోటికి కొని పోఁ దగినగుడిసెకు) పేర్లు

చవికె చవిర—ఇవి చతుష్కమునకు(చుట్టును నడుమను మఱుగు లేక స్తంభములు నిలిపి కట్టినకట్టడమునకు(మండపమునకు) పేరు

ఆకుటిల్లు—ఇది పర్ణశాలకు పేరు

చేటకొల్లారు — మూడిండ్లు కలిపి కట్టినది అని బ్రౌ

కొంప —సాధారణవాచకమును గానే దీని నుదాహరించుచున్నది సాంబ పల్లె యూరు కుప్పం బనఁగ గ్రామ మొప్పును బ్రోలు వీడ దన బట్టణముపేరు లలరు చుండు ఇరవు టెంకి యునికి యిక్క యిల్లు గీము మనికి పట్టు బిడారు కొంప యిఱ నెలవు నట్టు తావన మందిరనామము లగు (సాం 56)

సీ బొమ్మరి ల్లనఁగను బుత్రికాగృహ మొప్పఁ
గుంజంబు పొదరి ల్లనం జెలంగు
నజ్జార మనఁగను సామజాగార మా
లాయ మంచన మందురాఖ్య వెలయు
బండరు వంచన బండార మంచన
బొక్కస మంచనఁ బొసఁగు చుండు
నల్లభాండాగార మల శిల్పశాలాఖ్య
దనరును డంకసా లనఁ గొటారు

గీ కొట్ట మని పల్కఁ గాఁ దగుఁ గోష్ఠగృహము
ప్రపకు నభిధాన మగుఁ జలిపందిరి యనఁ
బంది లనఁ బంది రనఁగను బరఁగుఁ గాయ
మానసంజ్ఞలు విఖ్యాతమాతృభూత

బొమ్మరిల్లు—ఇది పుత్త్రికాగృహమునకు (ఆడుపిల్లలు బొమ్మ లుంచి ఆడు కొనెడియింటికి) పేరు

పొదరిల్లు—ఇది కుంజమునకు (ఇంటివలె నుండుపొదకు) పేరు

నజ్జారము—ఇది సామజాగారమునకు (గజశాలకు) పేరు

లాయము—ఇది మందురకు (అశ్వశాలకు) పేరు

బండరువు బండారము బొక్కసము—ఇవి భాండాగారమునకు (కోశాగారము నకు ధన ముంచుగృహమునకు) పేర్లు

టంకసాల—ఇది శిల్పశాలకు (స్వర్ణకారాదుల కొట్టమునకు) పేరు

కొటారు కొట్టము—ఇవి కోష్ఠగృహమునకు (కొట్టునకు) పేర్లు

చలిపందిరి—ఇది ప్రపకు (దాహమునకు మంచినీళ్లు పోసెడిచోటికి) పేరు

పందిలి పందిరి—ఇవి కాయమానమునకు పేర్లు

బొమ్మరిల్లు —(బొమ్మ-ఇల్లు) రుగాగమ మిట తెలుగువ్యాకర్తలు విధించుకో వలసి యున్నది (బ బొమ్మరిండులు బొమ్మరిండ్లు )- శ్రీ వనజాక్షికిన్ జననబంధువు తత్పురి బొమ్మరిండ్లు నా నావసథంబు లాత్మసఖు లంబుజలోచన లాటపట్లు ధా త్రీవర మార్గముల్ (కాశ 4 4 ) బొమ్మరిండ్లు - (చూ వాల్మీ 6? ) (చూ సూ వి )

శిల్పశాల — ఆం భా క్షీరస్వామిపాఠము ననుసరించి శిల్పశాల అనినది ఆవేశనం శిల్పిశాలా అని అమరము శిల్పస్య శాలా-ఇతి తు స్వామీ - అని సుధ వైజ గూడ ఆవేశనం శిల్పిశాలా - లనియే అనినది కంసాలికొట్టముపేరు - అని గురు

కోష్ఠగృహాము — దగు గోష్ఠగృహము (వావి) అపముద్రి)

చలిపందిరి —చలివిందలి చలివెందర చలివెంద్ర చలివేందలి చలివేంద్ర చలివంద్రి- అనునవి (రూపాం) చలువచప్పరములు చలివిందలలు నెడ నెడల గలుగ జేయు మెప్పటికిని విపణివీధులందు (ఉ రా 8 5) ఇట్లే తక్కినవి (చూ సూ ని)

సీ చప్పరం బనఁగను జనుఁ గాయమానవి
 శేషంబు కురుఁజు నా స్థిరరథ మగు
దోరపా కనఁగను నోరపా కనఁగను
 బాదలి యం చనఁ బరఁగు చుండు
భిత్త్యధఃకృతగృహాభిధ దేవళంబు నా
 దేవాలయాఖ్య యై తేజరిల్లు
గుడి కోవెల యనంగ నడరు వర్తులదీర్ఘ
 దేవాలయము లల్పదేవవసతి

చనును దద్దళ మన గ వాసగృహసంజ్ఞ
నఱ యనఁగ నోవరి యన గ నలరు సూతి
కాగృహాభిధ పురిటిల్లు నా గఁ దనరు
మంటపము మండపాహ్వయ మగును నభవ 16

చప్పరము— ఇది కాయమానవిశేషమునకు (చౌకము తీర్చి వేసినపందిరికి) పేరు

కురుఁజు—ఇది స్థిరంథమునకు (రథమువలె ఎత్తుగా కట్టిన యొకవిధ మైనకట్టడమునకు) పేరు

దోరపాక ఓరపాక బాదలి— ఇవి పంచను దూలములు లేక గోడపైనుండి ప్రక్కకు దింపి రాడులయాధారమునఁ గట్టినశాలకు) పేర్లు

దేవళము—ఇది దేవాలయమునకు పేరు

గుడి—ఇది గుండ్రని దేవాలయమునకు పేరు

కోవెల—ఇది దీర్ఘము గా ఉన్న దేవాలయమునకు పేరు

దద్దళము—ఇది చిన్న గుడికి పేరు

అఱ ఓవరి—ఈ రెండును వాసగృహమునకు (లోపలిగదికి) పేర్లు

పురిటిల్లు—ఇది సూతికాగృహమునకు పేరు

మంటపము—ఇది మండపమునకు(కొలువుచావడి మొద లగువానికి)పేరు

కురుజు—కురుజు-అని వావి అపమ్రుది పసండికురుంజులన్ మెల గు (వసు 5 66) మొ మంచె - అర్థ మనినది(శ ర)

గుడి — దేవాలయాహ్వయంబులు కోవెల యన దేవళంబు గుడి నా వెలయున్ (దేవ 26) అని దేవళముతోపాటు గుడి కోవెల సమానార్థకము లనినది-(ఆం సం)

వాసగృహము — గర్భాగారం వాసగృహమ్ అని అమరము కొందఱు వ్యాఖ్యాతలు-గర్భాగార మనుదానికి పడుకటి ల్లని మఱికొందఱు దేవతాగృహ మని అర్థము చెప్పు చున్నారు (చూ గురు)

మండపము — మణ్డపో స్త్రీజనాశ్రయ అని అమరము స్త్రీవాసోచిత మగుమండపము మండప శబ్దార్థ మని కొందఱు వ్యాఖ్యాతలు (చూ సుధ) (మణ్డప స్త్రీజనాశ్రయ - అని వీరిభేదము కావలయును

మంటపము —దీనిని సంస్కృతపదము గా భ్రమించి సంస్కృతసమాసమధ్యమున ప్రయోగించినారు కొందఱు కవులు— చివురాకుదిండ్లపల్లవ మంట కెస గుప ల్లవమంటపమున నిల్వంగ నునిచి (చందో (చంద్రా) 4 9) (చూ సూ ని) దేవతావిగ్రహము లుంచుటకై చుట్టును దెఱపి గ నుండునట్లు స్తంభముల మీ ద గట్టినకట్టడము చవికె-(ఆం ఖా 2 6)-అని సూ ని [ మంటపం బన మండపాహ్వాయ మగు భవ అని వావి పా యతి విచార్యము అందులకై పైవిధమున ఆం ఖా నాచే సవరింప బడినది సూ ని పై యతిభ్రంశముతోడి పాఠమునే ఇచ్చినది ]

ఓవరి — ఓవర వావి పా (సం అపవరక ప్రా ఓవరఅ క ఓవరి) చంద్ర

శాలలఁ గేళిసౌధవీథికల జంద్రకాంతశిలావిశాలవేదికల గాజుటోవరుల బంగరుపడు కిండ్ల (రం రా బాల 83పొ 1పం)

సీ. హర్మ్యాఖ్య మిద్దె నా నలరు నట్టిక యన
మచ్చు నా నల్పహర్మ్యంబు వెలయు
మే డన స జ్జన మేలు మ చ్చనఁగను
నుప్పరి గన సౌధ మొప్పు చుండుఁ
గంకర బెందడి గార సోద యనంగ
లేపవిశేష మై తోఁపఁ దగును
మాడుగు మాడువు మాలె యం చనఁగను
బ్రాసాదభేద మై పరఁగు చుండు

గీ. నేలమాలె నా భూమ్యంతరాలయమ్ము
దనరు సోరణగండి నాఁగను గవాక్ష
మగును లం కనఁగాఁ బ్రకోష్ఠాఖ్య మీఱు
గడప యన దేహళీసంజ్ఞ యడరు నభవ 17

మిద్దె—ఇది హర్మ్యమునకు(ధనవంతులగృహమునకు ఒకవిధ మగు మేడకు) పేరు

అట్టిక మచ్చు—ఇవి అల్పహర్మ్యమునకు (డాబాకు) పేర్లు

మేడ సజ్జ మేలు మచ్చు ఉప్పరిగ—ఇవి సౌధమునకు (రాజగృహమునకు పెద్దభవనమునకు) పేర్లు

కంకర బెంటడి గార సోద—ఇవి లేపవిశేషమునకు (గోడ లో నగువానిపూఁతకై ఇసుక చేర్చి దంచినసున్నమునకు) పేరు

మాడుగు మాడువు మాలె—ఇవి ప్రాసాదభేదమునకు (ఒకవిధ మగుప్రాసాద మునకు) పేరు

నేలమాలె—ఇది భూమ్యంతరాలయమునకు (భూమిలోపలియింటికి) పేరు

సోరణగండి—ఇది గవాక్షమునకు (కిటికీకి) పేరు

లంక—ఇది ప్రకోష్ఠమునకు (తలవాకిటిప్రక్క నుండుగృహమునకు) పేరు

గడప—ఇది దేహళికి పేరు

హార్మ్యము — హర్మ్యాది ధనినాం వాస అని (అమ)

సౌధము — సౌధో ఽస్త్రీ రాజసదనమ్ అని (అమ) సదనానాం రాజా (రాజసదనమ్) రాజదన్తాది అని సుధ రాజు లుండుభవనమునకు అని కొందఱు వ్యాఖ్యాతలు సౌధము- రాజగృహము నగరు- అని శ ర (నగరు- రాజగృహము అవి ఆం భా ఇదివఱ కుదాహరించినది కాన సుధావ్యాఖ్యయే ఇట ఆం భా వ్యాఖ్య)

ప్రాసాదభేదము — ప్రాసాదో దేవభూభుజామ్ అని (అమ) రాజులయు దేవతలయు నివాసస్థానము (తద్విశేషము)

మేడ — సజ్జ యుప్పరిగయు మహలు మేడ యనంగ హర్మ్య మగు (స్థావ 67) అని భేదము పాటింపకయే సాధారణము గా ఉదాహరించినది సాంబ

మచ్చు — మచ్చు లన మిద్దె లన గను మాడుగు లన దారునిర్మితగేహము ల్దనరు చుండు బరఁగు సౌధంబు మేడ యుప్పరిగ యన గ అని ఆం సం (స్థావ 3) మంచెలు మిద్దెలు మాడుగు లన దారు నిర్మితగృహము లౌ వేంక (స్థావ 88)

ప్రకోష్ఠము — ద్వారప్రకోష్ఠమునకు (వాకిలిలో గలికి వెలుపల ద్వారమునకు ముం దుండుచావడికి) పే రని కొందఱు

తే సిగం మనఁగను విలసిల్లు శిఖరసంజ్ఞ
పొలుచు శిఖరపుఁగొనపేరు మోరు నాఁగ
మూలకొత్తళములు చెల్లు బురుజు లనఁగ
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 18

సిగరము—ఇది శిఖరమునకు (సౌధాదులశిఖరమునకు) పేరు

మోరు—ఇది శిఖరపుఁగొనకు పేరు

మూలకొత్తళములు—ఇది బురుజులకు పేరు

సిగరము —మరల ఆం భా (2-30) పద్యమున శిఖరాఖ్య మొప్పను సిగరము గుబ్బ పే టన అని వచించు చున్నది ఇది పురవర్గము అది శైలవర్గము కొండకొన ఇచ్చటి సిగర మునకు అర్థ మనుట ఉచిత మనిపింప లేదు అమ - వనౌషధివర్గమున శిరో ఽగ్రం శిఖరం వా నా అనినది ఇచట-త్రీణి శిఖరస్య అని సుధ శిఖరో ఽస్త్రీ ద్రుమాగ్రే చా ఽద్రిశృఙ్గ పుల కాగ్రయో అని నిఘంటువు (చూ సుధ) ఇచ్చటి అగ్రశబ్దార్థమే ఈ సిగరము న కర్థ మనిపించినది

మోరు —పర్వతపుశిఖరము- అని అర్థ మిచ్చి అందులకు ప్రయోగములను ప్రదర్శించినవి (శ ర సూ ని) సూ ని ఆం భా ను ఉదాహరించి దీనికి పర్వతశిఖర మర్థ మనినది గూడ సూ ని ఆం భా సమన్వయమున ప్రమాదపడిన దనిపించు చున్నది దీనికి సూ ని చెప్పినది (అర్థాం )అన వలయును

బురుజు —కోటగోడయం దుండుదిబ్బ గడి-అని శ ర (రంగా 2 27) ప్రయోగము-గడి బురుజు వె అను చున్నది కోటగోడయం దుండుదిబ్బ-బురుజు గడి-చిన్నకోట-అని అనవచ్చును (చూ సూ ని గడి ) అటొచ్చిలిగడిపైతెటఁ గా బురుజులపై నెసంగు నాగ్నేయ కళా శీబదయోమయ మైనయ రాబాసొం పన్న నెన్న రా దెవ్వరికిఁ (రంగా 2 27) గడి దుర్గ ము అని (సూ ని) చిన్నకోట- అని ద్రౌ రంగా ప్రయోగ మొకటి శౌర్యంబు దీపింప గోటబురుంజు లగ్గదియంగ డాసరి గరిష్ఠం బై నవే గంబునఁ ఽని బుఋజు సానుస్వార మను చున్నది గూడ (చూ సూ ని)

క పెర డనఁ బెడ లనఁ బె ళ్లనఁ
బరఁగున్ గృహపృష్ఠసీమ పంచ యన న్మరం
దిరనికట మొప్పు నంగణ
మెఱుఁగం దగు ముంగిలి యన నిందువతంసా 19

పెరడు పెడలు పెళ్లు—ఇవి గృహపృష్ఠసీమకు (గృహమునకు వెనుక ఉండు ప్రదేశమునకు దొడ్డికి) పేరు

పంచ — ఇది మందిరనికటమునకు (గృహసమీపమునకు ఇంటిప్రక్కలను ఉండుస్థలమునకు) పేరు

పెళ్ల — సూ ని దీని కిట్లు ప్రయోగ మొనగినది- నీ కేల పలవింప నీకుమారునకు నీకును గాఁ జేరె నేఁ డిల్లుఁ బెళ్ల (ద్వి హరి ఉ 896) (ఇల్లు బెళ్ల-జాతీయము సర్వమును- అనుట) (చూ సూ ని)

అంగణము — పృషోదరాదిపారమున ణత్వము సాధువు అధ్యాస్య సౌరభేయం ప్రోక్తిక రుచి రజ జేషు విహితమతిః అను రసికరంజనకావ్యమున శృఙ్గారవైరాగ్యపరము లగు రెండర్థముల సంఘటనమునకై ణకారము తోడిరూపమును అంగీకర్తవ్యము (చూ అమరసుధా టిప్పణి) అఙ్గనము (రూపాం)

సీ దూల మం చన గృహస్థూలతిర్యగ్దారు
సంజ్ఞ యై విలసిల్లు స్తంభసంజ్ఞ
మను చుండు రాడు కంబ మ్మన మొగరాడు
మొగరంబు నాఁగను దగు నికేత
నాగ్రిమస్తంభాఖ్య యాలయాధారదీ
ర్ఘస్తంభసంజ్ఞ నిట్రాడు నిట్ట
రా డనఁ దగు ఛదిరాధార మగు వాస
మనఁగాను బెండె యం చనఁగ గేహ

గీ తిర్యగాబద్ధదండంబు తేజరిల్లుఁ
జిలుకకొ య్యన వడె నాఁగఁ జెలఁగు చుండు
నాగదంతక మెలిసె నా నలరు భిత్తి
కాచ్ఛదిసన్ధిసంజ్ఞ యై యచ్ఛదేహ 20

దూలము — ఇది గృహస్థూలతిర్యగ్దారువునకు (స్తంభములమీఁదఁగాని గోడల మీఁదఁగాని అడ్డము గా వేసెడిపెద్దదూలమునకు తనాబికి) పేరు

రాడు కంబము—ఇవి స్తంభమునకు (గుంజకు) పేర్లు

మొగరాడు మొగరము—ఇవి నికేతనాగ్రిమస్తంభమునకు (గృహమునకు ప్రధానము గా ఆధార మైనగుంజకు) పేరు

నిట్రాడు నిట్టరాడు—ఇవి గృహమున కాధార మగుదీర్ఘస్తంభమునకు (కహారమునకు దూలము లేనియింటినడిమిపొడువుకంబమునకు) పేరు

వాసము—ఇది ఛదిరాధారమునకు (కప్పునకు ఆధారము గా ద్వారముపై నుండెడి అడ్డకమ్మి కి) పేరు

పెండె—ఇది గేహతిర్యగాబద్ధదండమునకు (ఇంటివాసములమీఁద అడ్డము గా వేసి కట్టెడికొయ్యకు) పేరు

చిలుకకొయ్య వడె— ఇవి నాగదంతకమునకు (వస్త్రాదు లుంచుటకుఁగాను గోడయందు కొట్టిన (చిలుకవంటియాకారము గల) కొయ్యకు పేరు)

ఎలిసె—ఇది భిత్తికాచ్ఛదిస్సంధికి (గోడకు ఇంటికప్పునకు నడుమ ఉండుతెఱపకు) పేరు

వాసము — నాసము (వావి పా ) దీనిని నిఘంటువు లుదాహరింప లేదు నాసా దారూపరి స్థితమ్ అని (అమ ) నాసా ద్వారోర్ధ్వదారు చ అని రుద్రుడు నాన కు ద్వారముమీ దిలక్కికమ్మి అని (త్రౌ వివ ) అడ్డకమ్మి - గడపయందు త్రొక్కుడు కమ్మికి సరిమీ దు గా నడ్డము గా నేర్పఱప బడినదారువిశేషము అని (శ ర వివ ) పై వావి పారమున నాస కైన తద్భవము నాసము -అగువలయును ఇట్టివి కొన్ని అం ధ్రా లో ఉన్నవి ఐనను వాస మనుటయే యిట సముచిత మనిపించినది వ్రాతలలో వా 'నా అయి యుండును

ఎలిసె —వెలిసె- (రూపాం ) ఇంటిచూరులోపలిభాగము అని సూ ని (చూ వెలిసె ) ఇంటిచూరు- అని (శ ర )

[ భిత్తికాచ్ఛదిస్సంధిసంజ్ఞ వావి అపముద్రి ]

16)

సీ దోఁపుమా రనఁగను దోఁచు నంతశ్ఛది
కౌణిగచూ రనఁగ నగు న్వలీక
మలరుఁ దోవ యనంగ వలభి టా కనఁగను
దనరు విటంకంబు దారబంద
మన ద్వారబంధ మొప్పును దోరణ మనంగ
నవు బహిర్ద్వారంబు గవని గవిని
గవఁకు గవను నాఁగఁ గలవు గోపురసంజ్ఞ
లరఁ గరుఁ గన వేది యై తలిర్చుఁ

గీ దిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు
దలు పనఁ గవాట మౌ బోరుతలుపు నాఁగ
దళయుగకవాటసంజ్ఞ యై తనరు గంద
పట్టె నా స్కంధపట్టిక వఱలు నభవ 21

దోఁపుచూరు— ఇది అంతశ్ఛదికి (అరుఁగులు మున్నగువానికి జల్లు కొట్టకుండ తాటియాకులు మొదలగువానితో పెంచిన చూరునకు)పేరు

కౌణిగచూరు—ఇదివలీకమునకు(చూరుముందటిభాగమునకు ముంజూరునకు)పేరు

తోవ—ఇది వలభికి (ముంజూరుపట్టెకు) పేరు

టాకు—ఇది విటంకమునకు (వసారాకు) పేరు

దారబందము—ఇధి ద్వారబంధమునకు పేరు

దోరణము—ఇది బహిర్ద్వారమునకు(వెలుపలి గుమ్మమునకు వాకిలికి)పేరు

గవని గవిని గవఁకు గవను—ఇవి గోపురమునకు (పురద్వారమునకు)పేరు

అరఁగు అరుఁగు—ఇవి వేదికకు పేర్లు

తిన్నె దిబ్బ—ఇవి హస్తినఖమునకు (శత్రువులు గొబ్బున రాకుండ గవని వాకిట వాటముగా ఎర్పఱచిన మట్టిదిబ్బకు)పేరు

తలుపు—ఇది కవాటమునకు పేరు

బోరుతలుపు—ఇది దళయుగకవాటమునకు (నగరు మొద లగువాని వాకిటి పెద్ద తెక్కతలుపునకు)పేరు

గందపట్టె—ఇది స్కంధపట్టికకు (తలుపుమీఁద అమర్చెడియడ్డుకొయ్యకు)పేరు

కొణిగచూరు — కొణిగెకు ఆధార మైనపట్టె దానిని గప్పు చున్నవంకరబ్రమా కు గోపానసి గృహమునకు క ప్పైనవ్రకిదారువుపేళ్ల-అని కొందఱు - అని గురు గోడలయందు ఛాదనార్థము అమర్ప బడిన వంకరకొయ్య (చూ సుధ) ఇంటిచూరుపట్టె-అని బ్రౌ

టాకు — టం కన గను —వాని అపపా గంధర్వభామినీ గాంధర్వసంగతి ఘు మ్మను పసి డిటాకులు వొసంగ (వాల్మీ ౩ ) మొ

దోరణము — తోరణం తు బహిర్ద్వారమ్ అని అమ (సం తోరణమ్ ప్రా తోరణ క తోరణవు) తోరణో ఽస్త్రీ బహిర్ద్వారం ప్రచ్ఛన్నద్వార మాన్తరమ్ అని వైజ ద్వారబాహ్యప్రదేశము తోరణము (చూ సుధ) ఇచ్చట గురు పుష్పమాలి కాదులు గట్టుటకైఱ గృహములకు వెలుపల స్తంభద్వయముచేత ద్వారమువలె గట్ట బడునది తోరణ మనంబడును అని దీనిని వివరించినది

గవిని —ఇది నిఘంటువులు గ్రహింప లేదు

గవఁకు — బాలవ్యా కలన్వాదులనువర్ణంబు కు జగు బహువచనంబు పరం బగునపుడు నిత్యము గ నగు (అచ్చి 8) కలన్వాదిగణమునందు గవను పఠితము చిన్నయ ఇట్లు సూత్రించు చున్నను అం చి న్వన్తా న్నామ్న కు జ్నో ర్బహువచనే (అజ 68) అని ఏకవచనమున గవ కు అసాధు వను చున్నది అథర్వణుఁడు మాత్రము కేషాంచి న్న్వన్తశబ్దానాం కు స్స్యా ద్గ స్స్వార్థ బిన్దుక అను చున్నా డు ఈయథర్వణవచనమున బహువచనే అని లేనందున గో గుచెట్టు లో నగుసమానరూపములు సాదువు అని (అహోబలపతి) ఏకవచనమునఁగూడ ఈయాదేశము విరుద్ధము కా దథర్వణునిమతమున బహువచనగ్రహణము లేమిచే ననిపించును ఐనను వికల్ప మథర్వణునకును సమ్మతము కాదు అం భా గవ కు గవను ఉదాహరించి ఏకవచనమునందు కుజ్వికల్పమును సమ్మతించు చున్నది కాదనక సూరి ఈ అం భా ను అనుసరించి పైసూత్రరచన సాగించి యేతత్ప్రామాణ్యమును లోకమునకు వేనోళ్లఁ జాటి చెప్పు చున్నా డు కొంద ఱి ట్లను

చున్నారు- సూరిఏకవచనపరకత్వమున కుజ్జు వికల్పముగా నగు నని సూత్రించెను ఇందులకు మహాకవిప్రయోగప్రామాణ్యము లేదు చింతామణివిరుద్ధము (ఆంధ్రభాషార్ణవ క్రి శ కోశమున మాత్ర మేకవచనమున కుజ్జు కలదు (సూ రా ని) (శ ర) (అని) (చూ బాలవ్యా ఉ 64పు) ఇవి వజ్జల (ఒజ్జల) వారి మాటలు ప్రయోగము లిట్లున్నవి కొలం కభినుతిభాజన మై (కలా 6 232) ఆటకొలంకునం గర గి (వసు ౪ 64) మొ మహాకవుల ప్రయోగములే యివి చిన్నయకాని ఆం భా కర్త గాని ఏకవచనమున కుజ్జు సాధు వనుట దోష మనరాదు కొల కు కెల కు-మొ గూడ ఆం భా గ్రహించినది- (చూ - 63 2 38)మొ గవనులు అనికూడ ప్రయోగించు చున్నాఁ డొకకవి- తారలు బూరగొమ్ములును దప్పెటలుం బట హంబులుం బదుల్ నూఱులు వేలు మ్రోయ గవనుల్ వడి వెల్వడి హత్తి యుత్తర ద్వారమువంకఁదార యిరువంకల బొ జులు దీర్చి రయ్యెడన్ (రామా 8 69) (చూ సూ ని) వసు గూడ మ్రానులు ప్రయోగించు చున్నది- భజిం తురు నమ్రమత్వము కానలో ముసలిమానుల్ గా వితర్కింప గన్ (44) ఈ రెండును నిర్ధారకములు గాఁ గానవచ్చుచు బహువచనము న గూడ కు జ్వికల్పమును బోధించు ననున ట్లున్నవి చిన్నయసూరి బహులదృష్టతో నిత్య మనినా డనిపించును

బోరుతలుపు —బోర్తలుపు (రూపాం) నిరతంబు కృపావిభవంబు నింటిబోర్తలుపు దలంపు సేయుచు నురంబు గరంబు పరిస్ఫురింప గన్' (పాండు 2 36)

[దళయుగ — గళయుగ వావి అపముద్రి ]

[కళవు — తివురు -అని (వావి పా) (పారాం) ]

సీ తోలుమ్రా నుదుక నాఁ బోలుఁ గవాటమూ
లాలవాలాభిధ యర్గళాఖ్య
గడియ నాఁ దగును, బీగము తాళ మనఁగ న
యోమయార్గళవిశేషోక్తి యొప్పుఁ
దదవయవాఖ్య యై తనరు గొండ్లె మనంగఁ
దాప మెట్టిక తంతె తాపరంబు

మెటిక మె ట్టనఁగను మెఱయు సోపానంబు
నిశ్రేణికాఖ్య యౌ నిచ్చెన యనఁ
గీ బొరక చీఁపురుఁగట్ట చీఁపు రని పల్కఁ
దగును సమ్మార్జనికిని౯ జె త్తనఁ జెదార
మనిన నవకర మొప్పును నలు కనంగ
నమరు నుపలేపకద్రవ్య మమరవంద్య 22

తోలుమ్రాను ఉదుక—ఇవి కవాటమూలాలవాలమునకు (తలుపుకుసి తిరుగుటకై తలుపుక్రింద అమర్చిన గుంటతోడికొయ్యచిప్పకు) పేరు

గడియ—ఇది అర్గళమునకు పేరు

బీగము తాళము—ఇవి అయోమయార్గళవిశేషమునకు (ఒకవిధ మగు- ఇనుపగడియకు) పేర్లు

గొండ్లెము—ఇది తదవయవమునకు (తలుపుచిలుకునకు) పేరు

తాప, మెట్టిక తంతె తాపరము మెటిక మెట్టు—ఇవి సోపానమునకు పేర్లు

నిచ్చెన—ఇది నిశ్రేణికి పేరు

పొరక చీఁపురుఁగట్ట చీఁపురు—ఇవి సమ్మార్జనికి పేర్లు

చెత్త చెదారము—ఇవి అవకరమునకు పేర్లు

అలుకు—ఇది ఉపలేపకద్రవ్యమునకు (అలుకుటకు ఉపయోగపడెడివస్తువునకు) పేరు

ఉదుక — ఉతక అని (వ్య ) శ ర ఉదుకొ గ్రహింప లేదు ఉతక యే గ్రహించినది

తాళము — తలుపు లో నగువానికి వేసెడితాళము అనునర్థము సుప్రసిద్ధము తాళము తాళపుఁ జెవి బీగ పుజెవి అని (వ్య ) అది యిది కాదు తాళము బీగము- అనునర్థమున (సం ) అవి (అ ని ) అను చున్నది (సూ ని )

గొండ్లెము —గొండెము (రూపాం) కొట్లు బేహారుల గొనబుటంగడులంద తఱచు గా గొండెముల్ తలుపులంద (అచ్చ రా బాల 47) (చూ సూ ని) ఈప్రయోగమును శ ర కొట్లు తఱచు గాఁ గొండెముల్ అను చున్నది సూ ని తఱచుగా గొండెముల్ అను చున్నది గొండెమునకు (రూపాం) కొండెము గల దనియో లెక కొండెము (చాడి యనునర్థముకలదానికి) (గొండెము) (రూపాం) అనియో అనక తీఱదు

[ఇట తనరు గొల్లె మనంగ వావి పా గొల్లెము అని ఆం భా పా గా గ్రహించి బ్రౌ (తారా 4 8) ప్రయోగ మిచ్చు చున్నది ఆ ప్రయోగ మిది పద నూపురము ల్సడలించి తల్పునే రుపు తగ బట్టి గొల్లె మిడి రూపవతీమణి సంభ్రమంబు నన్ (అని) ఐనను ఆం భా పా గొండ్లె మనునదియే అగు ననిఎంచినది(చూ 25) (వావి పారాం)

సీ కలవడంబు కలాఁపి కలయంపి చానపి
యన గోముఖాఖ్య లై యలరు చుండు
రంగవల్ల్యాఖ్య యై రాజిల్లు ముగ్గన -
మొగవాళ మనఁగను దగును నిస్స
రణము మెల్లన నికర్షణ మొప్పు లోఁగిలి
యన వాస్తుసంజ్ఞ యై తనరు చుండు
నూరు కుప్పము గ్రామ మొప్ప శూన్యగ్రామ
వాచకం బై యుండుఁ బా డనంగఁ

గీ బల్లె యనఁ బల్లి యగును వ్రేపల్లె యనిన
గొల్లపల్లె యనంగను ఘోష మగును
గూడె మని గోడె మని యనుకొందు రార్యు
లెల్లఁ బక్కణమునకు బాలేందుమౌళి 23

కలవడము కలాఁపి కలయంపి చానపి—ఇవి గొముఖమునకు (అలుకుటకు) పేర్లు

మ్రుగ్గు—ఇది రంగవల్లికి (అలికినపిమ్మట లతాద్యాకారము గా. ముత్యాలు మొద లగువానితో చేసెడియలంకరణమునకు)పేరు

మెల్ల—ఇది నికర్షణమునకు (వినోదార్థము జనులు చేరెడిగ్రామాదుల బయలి ప్రదేశమునకు)పేరు

లోఁగిలి—ఇది వాస్తువునకు (ఇల్లు మొద లగునవి కట్టుటకుఁ దగినస్థలమునకు నివేశనస్థలమునకు) పేరు

ఊరు కుప్పము—ఇవి గ్రామమునకు పేర్లు

పాడు—ఇది శూన్య మైన (కాఁపురములేని) గ్రామమునకు పేరు

పల్లె—ఇది పల్లికి (క్షుద్రగ్రామమునకు) పేరు

వ్రేపల్లె గొల్లపల్లె—ఇవి ఘోషమునకు పేర్లు

గూడెము గోడెము—ఇవి పక్కణమునకు (బోయపల్లెకు) పేర్లు

కలవడంబు — కలువడంబు కలాపి - (వావి పా)

కలాపి —దుమ్ము అడ గుటకై కస్తూరి చందనము మొద లగువానితో సుగంధివస్తువులఁ గలపి చల్లెడినీరు—అని (శ ర) (చూ కలయంపి)

మ్రుగ్గు —ముగ్గు(రూపాం) (శ ర)

మొగవాళము —మొగపాళము—(రూపాం) (చూ శ ర)

నికర్షణము — ఇల్లులో నగువాని వెనుకభాగము అని (శ ర)

క పొలిమే రన గడి యనఁగాఁ
బొలిమెర యన నెల్ల యనఁగఁ బోలును సీమా
స్థలనామధేయములు ని
శ్చలతరసుఖకృతి త్రిశీర్షశైలాధిపతీ 24

పొలిమేర గడి పొలిమెర ఎల్ల—ఇవి సీమాస్థలమునకు (అవధిదేశమునకు) పేర్లు

సీమాస్థలము —సీమ చతుర్విధ మైనది-[దేశసీమ గ్రామసీమ క్షేత్రసమ గృహసీమ-అని ఇది ఐదువిధము లైనచిహ్నములతో ఉండును- ధ్వజిని (వృక్షాదులు చిహ్నములు గాఁ గలది) 2 మత్స్యని-తటాకాదులు చిహ్నములు గా గలది 3 నైధాని-తుష అంగారము-మొద లగునిధులు చిహ్నములు గా గలది 4 భయవర్జిత-అర్థి ప్రత్యర్థి అభిజ్ఞానముకొలకు ఏర్పఱచుకొనినది 5 రాజశాసననీత—రాజు తన యిచ్ఛ చొప్పున నిర్ణయించిన చిహ్నము గలది (చూ ౪౨)]

తే అగడిత యగడ్త యనఁగ ఖేయంబు దనరు
మందుపట్టడ పేరు చె న్నొందు బాణ
శాల యనఁగను దర్జీవిజనము వెలయు
నిమితకాం డ్రనఁగా సుగంధికబరిశ 25

అగడిత అగడ్త—ఇవి ఖేయమునకు (పరిఖకు) పేర్లు

మందుపట్టడ—ఇది బాణశాలకు (బాణసంచు (వేడుకకు కాల్చెడిపువ్వత్తులు మొద లగునవి) చేసెడి సాలకు) పేరు

నిమితకాండ్రు—ఇది బాణశాలయందు జీవించుజనమునకు పేరు

[నిమితగాండ్లు —వావి అపముద్రి]

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గఁ బురవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్ర యీమాతృభూత 26

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68]

ఇది

పురవర్గము

---

# శైలవర్గము

క మె ట్టనఁ గొం డన మల యన
గ ట్టన గుబ్బలి యనంగఁ గరువ యనంగా
గుట్ట యనఁ దిప్ప యనఁ గ
న్పట్టును శైలాఖ్య లార్యభావితచర్యా 27

మెట్ట కొండ మల గట్టు గుబ్బలి కరువ గుట్ట తిప్ప —ఇవి శైలమునకు (పర్వతమునకు) పేర్లు

మల —(క మలె త మలై ) మలగొంగ మల్రదిమ్మరి మలయమ్మ-మొ దీనినుండి ఏర్పడినవే ఇలతాల్పు గట్టు గుబ్బలి కొండ మల తిప్ప యని శైలనామంబులు (స్థా ౧౯ ) అని సాంబ ఇలతాల్పు అనునది యొకటి ఆం భా కంటె విశేషము గా ఇచ్చుచు చున్నది దీని కేనిఘంటువు ప్ర యోగ మిచ్చుట లేదు ప్రామాణికప్రయోగము లేకయే ఆం భా వదలిన దేమో భూధరము అను సం నామమునుబట్టి ఏర్పడిన దిది

సీ చుట్టుఁగొం డన మేరగ ట్టనఁ జక్రవా
ళాచలసంజ్ఞ లై యలరుఁ దొడుపుఁ
గొం డనఁ దూరుపుఁగొండ నా నుదయాద్రి
యమరు నస్తాద్రి పడమటికొండ
క్రుంకు గొండ యన నగు న్మంచుఁగొండ నా
వలిమల యనంగ గుబ్బలిదొర యనఁ
బ్రాలేయశైలంబు పఁఁగుఁ గవ్వపు గొండ
తరిగట్టు నా గ మందరము వెలయు

గీ ద్రోణపర్వత మొప్పు మందుమల యనఁగఁ
దనరు మడికాసుగట్టు నాఁగను శివాద్రి

వింధ్యశైలాభిధాన మౌ వింజ మనఁగ
మాతృభూతేశ దుష్కృతమత్స్యదాశ 28

చుట్టుఁగొండ మేరగట్టు—ఇవి చక్రవాళపర్వతమునకు పేర్లు

తొడుపుఁగొండ తూరుపుఁగొండ—ఇవి ఉదయాద్రికి పేర్లు

పడమటికొండ క్రుంకుఁగొండ—ఇవి అస్తాద్రికి పేర్లు

మంచుఁగొండ వలిమల గుబ్బలిదొర—ఇవి ప్రాలేయశైలమునకు (హిమాద్రికి) పేర్లు

కవ్వపుఁగొండ తరిగట్టు—ఇవి మందరపర్వతమునకు (మంథాచలమునకు) పేర్లు

మందుమల—ఇది ద్రోణపర్వతమునకు పేరు

మడికాసుగట్టు—ఇది శివాద్రికి (కైలాసమునకు) పేరు

వింజము—ఇది వింధ్యశైలమునకు పేరు

గుబ్బలిదొర — పర్వతరాజు కాళిదాసు పర్వతాధిరాజు గా హిమవంతుని వర్ణించినాడు అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజ పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థిత పృథివ్యా ఇవ మానదణ్డ (కు సం ) సాగరామ్బరాదులవంటి యోగరూఢ మిది గుబ్బలితేనితాలిమి నగు న్నిజభూరివిభూతిసంపదన్ గిబ్బవయాళి జోదు నడకించు మురాంతకునంతవాడె పో నిబ్బరపుంగృప న్మతి ఫణిప్రభు గెల్వ గనోపు బాపురే గొబ్బురిజగ్గభూపతి (రామా 84 ) కనుకనే ఆంధ్రా గ్రహించినది ఆంధ్రా తరువాత సాంబ హిమవన్నామముల విట్లు వచించు చున్నది మంచు టిలతాల్పు వడ కుగుబ్బలి దుగ్గికిన్నయ్య గట్లరాయడు బేసికంటిమామ చలికొండ వలిమలపులుచూలితాత నా హిమగిరినామంబు లెసగు స్థా 55 ) ఇందు ఆంధ్రా గ్రహింపనివి యౌగికములు గా ఏర్పఱుప బడినవో ఆంధ్రా తరువాత వెలసినవో కావలయును

సీ. రాయి క ల్లనఁగ శిలాఖ్య యౌఁ జ ట్టన
క్ష్మమగ్నశిల యొప్పుఁ జాఁపఱాయి
చలుప యం చనఁగను జనుఁ బక్షహీనశి
లాఖ్య బం డన విశాలశిల యొప్పు,
వర్తులశిలపేరు వఱలు గుం డనఁగను
మొరప మనఁగను శర్కరం దనర్చుఁ
బలుఁగురా యనఁగను బాండుశిలాఖ్య యౌ
బలప మం చనఁగను జెలఁగు ఖటిక

గీ. యిటుక యిట్టుక యిట్టిక యిటిక యనఁగ
నిష్టకం బొప్పు మిడుగుఱాయి యన సూది
రాయి యనఁగను గరినశిలాఖ్య యెసఁగు
మూర్ధధృతగంగ శ్రీమాతృభూతలింగ 29

రాయి కల్లు—ఇవి శిలకు పేర్లు

చట్టు—ఇది క్ష్మమగ్నశిలకు (భూమియందు నెలకొనినఱాతికి) పేరు

చాఁపఱాయి చలుప—ఇవి పక్షహీనశిలకు (చాఁపవలె పలుచగను చదునుగను ఉండు నల్లఱాతికి) పేరు

బండ—ఇది విశాల మైనశిలకు (వెడలుపుఱాతికి) పేదు

గుండు—ఇది వర్తులశిలకు (గుండ్రని శిలకు) పేరు

మొరపము—ఇది శర్కరకు (గులకఱాతికి) పేరు

పలుఁగురాయి—ఇది పాండుశిలకు (పాలఱాతికి) పేరు

బలపము—ఇది ఖటికకు పేరు

ఇటుక ఇట్టుక ఇట్టిక ఇటిక—ఇవి ఇష్టకమునకు పేర్లు

మిడుగుఱాయి సూదిరాయి—ఇవి కరినశిలకు (అయస్కాంతమునకు సూదంటు ఱాతికి) పేర్లు

చట్టు—చాపఱాయి ఱాయి-అని శర చట్టుపై నైన రాజనమును జెఱకును గావింప గలమహాకర్షకులును (భోజ 2 47) చట్టుబొమ్మకు గిలిగింత పెట్టినట్టులు (పార్వ 3 57) (చూ సూ వి) చట్టునేల మొ వ్యవహారదృష్టములు

పక్షశిల—పక్షహీనము బలహీనము పలుచ నైనది-అని యర్థ మనిపించు చున్నది వైజ పక్ష శబ్దమునకు బలము అనునర్థము నొసగినది పక్షః పార్శ్వ గరుత్సాధ్య సహాయ బల భిత్తిషు పార్శ్వద్వారె విరోధే ఉర్ధమాసే చుల్లిబిలే ఉన్నికే (ద్వశ పుం)

సీ శిఖరాఖ్య యొప్పును సిగరము గుబ్బ పే
టనఁ జఱి జఱియ పడఁకు పణఁకన
నెగడుఁ బ్రపాతంబు నెత్తమం చనఁ బ్రస్థ
మలరును నెల యన నడరు నంబు
జన్మదేశాఖ్య యుత్సాఖ్య యౌ నూటన
బుగ్గ యం చనఁగను మెగ్గ యనఁగ
నుత్సవిశేష మై యొనరును దొన యన
ద్రోణవాచకము గాఁ దోఁచు చుండుఁ

గీ బాఱు డనఁగఁ బ్రవాహ మౌ వాఁక యనఁగ
వాఁ గనఁగ నెలయేఱు నా స్రవంత యనఁగ
నచలనది యొప్పుఁ గోన యం చనఁగ శైల
దీర్ఘకోణంబు విలసిల్లు దివ్యతేజ 30

సిగరము గుబ్బ పేటు—ఇవి పర్వతశిఖరమునకు పేర్లు

చఱి చఱియ పడఁకు పణఁకు—ఇవి ప్రపాతమునకు (తిరుగుటకు వీలు గాని పర్వతశిఖరము క్రిందిచోటికి భృగువునకు) పేరు

నెత్తము— ఇది ప్రస్థమునకు (విశాల మగు కొండమీఁది సమప్రదేశమునకు) పేరు

సెల—ఇది అంబుజన్మదేశమునకు (నదీమూలమునకు నది ఉద్భవించు ప్రదేశమునకు) పేరు

ఊట—ఇది ఉత్సమునకు (కొండయూటకు) పేరు

బుగ్గ మెగ్గ—ఇవి ఉత్సవిశేషమునకు (సంతతధార గా పై కుబికెడి యూట సీరికి) పేరు

దొన—ఇది ద్రోణమునకు (కొండమీఁద నీటితో కూడినపల్లమునకు) పేరు

పాఱుడు—ఇది ప్రవాహమునకు (వెల్లువకు) పేరు )

వాఁక వాఁగు సెలయేఱు స్రవంత—ఇవి అచలనదికి (కొండనుండి వచ్చెడి యేటికి) పేరు

కోన— ఇది పర్వతదీర్ఘకోణమునకు (నిడు పైన కొండమీఁదిమూలకు) పేరు

వాగు —(సాధారణ) నదీపర్యాయము గానే సాంబ వచించుచున్నది వాక యేఱు వంక వాఁగన బేరు లెసగు (స్థా 65 ) ఇందులకు ప్రయోగ మిట్లిచ్చుచున్నది- సూని మేఘమార్గ మెక్కి- మేరుశైలము దాటి మింటివాఁగు నొరసి మిగుల మెఱసి (తపతీ 3 20 ) ఇట మేరుపర్వతము దాఁటి దానినుండి ప్రవహించుచున్నమిన్నేటిని ఒరసి అనవచ్చును వాఁగు నదీపర్యాయ మనుట కిది సాధకము కాదు మఱియొక ప్రయోగ మిట్లున్నది- దిననాథప్రతిరూపు డాతఁడెలమిన్ దేశాంతరాసక్తిమై జనియాశ్చర్యకరంబు లౌపురములున్ శైలంబులున్ వాగులున్ వనమధ్యంబులు జూచుచుం దిరిగి (ద్వా 9 9 ) ఇచ్చట శైలములు అందుండి పాఱుచున్నవాఁగులు (సెలయేళ్లు) చూచుచు - అనుటయే సముచిత మనిపించుచున్నది వేఱుగా నది అర్థ మనవలసిన ప్రయోగము లున్న అర్థాంతరము దీనికది

స్రవంత —వరఁతకు (రూపాం ) అని శర ఏఱు అని అర్థ మిచ్చి అందులకై ప్రయోగ మిట్లిచ్చుచున్నది సూని అంతటఁ గోప మాఱక రయంబున గాళ్లనుబట్టి వాని

నత్యంతబలంబునఁ విసరి యంబరవీథికి పైచె పైచినఁ గ్రొంతుక క్రిందుగా నిచటి కొండపయిం బడెనా టనుండియుఁ గ్రంతలు గట్టి పాఱు రుధిరంబువినిస్రుతి గైరికా కృతిఁ (భోజరా 5 262) ఇచ్చటి గ్రంత సెలయేఱుగాని ఏఱుగాదు ఆం భా అచలనదికి ఇది చక్కనిలక్ష్యము (బనను) సూని ఇచ్చు చున్న (హరి ఉ 2 85) ప్రయోగమునుబట్టి దీనికి నది అర్థాంతర మున్న దనక తప్పదు

మెగ్గ —ఇది యేనిఘంటువులు గ్రహింప లేదు ఒకనిఘంటువు గ్రహించి బుగ్గ మెగ్గి భిన్నార్థకము లనుచు మెగ్గ అనుదానికి ఊట అనునర్థ మిచ్చి ఈ ఆం భా ప్రమాణ మను చున్నది ఇది యెట్లు సంగతమో

తే గొంది యనఁగను గిర్యల్పకోణ మొప్పు
లోయ యన లొద్ది యనఁగఁ బొ ల్పొందు చుండు
నచలమధ్యధరాఖ్య వాయ యని పల్క
శైలవిశ్లిష్టభూమి యోఁ జంద్రమౌళి 31

గొంది—ఇది గిర్యల్పకోణమునకు (కొండయొక్క చిన్నమూలకు మఱుఁగు చోటికి) పేరు

లోయ లొద్ది—ఇవి అచలమధ్యధరకు (కొండలమధ్య భాగమునకు) పేరు

వాయ—ఇది శైలవిశ్లిష్టభూమికి (కొండ సం దిచ్చిన నేలకు) పేరు

గొంది — కొండసం దిచ్చిననేల అని వాయ కు గూడ ఇదే అర్థ మను చున్నది శ ర ఇది యెట్లో ప్రయోగ మి ట్లున్నది- ఉదయార్కునిరాక నడంగె జీకటు ల్గొందుల సందులఁ గుహల గుట్టల జెట్టుల జాటుమాటులఁ (అని ౪ 85) చిన్నవీథి-మొ దీనినుండి లాక్షణికములు గా ఏర్పడినవి

వాయ —బ్రౌ ఆం భా పా ఇట్లే ఇచ్చు చున్నది శ ర ఇట్లే గ్రహించినది వ్యుత్పత్త్యర్థమునుబట్టి చూచిన పాయ అనిపించును పాయ-నద్యాదుల పాయవంటిది (శైలము నుండి వేఱుపడినది) అనవచ్చును పాయ కు వాయ (రూపాం) కావచ్చును

పాయ ఈయర్థమున అప్రయుక్త మగుఎవలన వాయ గ్రహింప బడిన దనిపించును ఇట్టివి కొన్ని ఆంధ్రాలో గానవచ్చు చున్నవి పరిశీలించి చూచిన

తే గని యనఁగ నాకరం బగు గైరికంబు
జేగు ఱంచన విలసిల్లుఁ జెలఁగును గుహ
గవి యనఁగ జాజు జాదు నాఁగను దనర్చు
ధాతునామంబు మాతృభూతాభిధాన 32

గని—ఇది ఆకరమునకు (ఖనికి బంగారము మున్నగునవి పుట్టుతావునకు) పేరు

జేగుఱు—ఇది గైరికమునకు (పర్వతమందలి యొకవిధ మగు ధాతువునకు శిలావికారమునకు ఎఱ్ఱని జాతికి) పేరు

గవి—ఇది గుహకు పేరు

జాజు జాదు—ఇది ధాతువునకు (గైరికాదిధాతువునకు) పేరు

గని —స్థానము ఉనికిపట్టు-అనునర్థము దీనినుండి యేర్పడినలాక్షణికార్థము- ( పచ్చని విలాస-నికి మామ చల్వగని పళ్యత్వాలజూటాగ్రమో హనరత్నంబు సుధాకరుండు (పారి 4 47 ) మొ

గవి —(క గవి త దెవి వా గవ్వి ). గవిలో జెబ్బులి దా గి గ్రుడ్లు మెఱమంగా గాంచి రా జేసె (మను చ )

గుహ — దేవఖాతబిలే గుహా అని (అమ ) అకృత్రిమస్య గిరిబిలస్య అని (సుధ )

జాజు — జూదాదులదాకు జకారంబు విభాష నగు (బాలవ్యా ప్రకి 2 ) చిన్నయసూరి జూదాది గణమందు జాదు పఠించు చున్నా డు ఎఱ్ఱనిది అనునది దీనినుండి వచ్చిన (అర్థాం )

తే శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు శాశ్వతము గ శైలవర్గ మిట్లు

గై కొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీ మాతృభూత 33

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68]

ఇది

శైలవర్గము

---

# వనౌషధివర్గము

న యనంగ నటవి యై తగును బే
ఁవి నాఁగను నరణ్యాని చెల గు
ఁం చనఁగను దోఁచు గృహారామ
ఁపవనసంజ్ఞ యై యుండుఁ దోఁపు
నాఁగను బ్రమదవనాభిధ యౌను సిం
గారపుఁదోఁ టన బారు బంతి
పదుపు చాల్ చాలుపు పౌఁజు సొరిది చాలు
నాఁగను బంక్తికి నామ మగును

గీ రేక యనఁగను రేఖ యై రీతిఁ గాంచు
గర యన గఁ దద్విశేష మై పరఁగు చుండు
దోర యన దొంతి యనఁగను దొంతర యనఁ
దనరు నుత్పంక్తి మాతృభూతాఖ్యలింగ 34

అడవి కాన—ఇవి అటవికి (కాననమునకు అరణ్యమునకు) పేర్లు

పేరడవి—ఇది అరణ్యానికి (మహారణ్యమునకు పెద్దయడవికి) పేరు

తోఁట—ఇది గృహారామమునకు (నిష్కుటమునకు ఇంటికి సమీపమునం దున్నతోఁటకు) పేరు

తోఁపు—ఇది ఉపవనమునకు (ఆరామమునకు కృత్రిమవనమునకు పెంచిన తోఁటకు) పేరు

17)



సింగారపుఁదోఁట— ఇది ప్రమదవనమునకు (అంతఃపురస్త్రీలుమాత్రము విహరించెడి తోఁటకు) పేరు

బారు బంతి పదుపు చాల్ చాలుపు పౌఁజు సొరిది చాలు—ఇవి పంక్తికి (వరుసకు) పేర్లు

రేక—ఇది రేఖకు (క్రిక్కిఱిసిన వరుసకు) పేరు

గర—ఇది రేఖావిశేషమునకు (ఒకవిధ మగువరుసకు) పేరు

దొర దొంతి దొంతర—ఇవి ఉత్పంక్తికి (ఒకటిమీఁద ఒకటి గా పైకి పేర్చినకుండలు మొద లగువానివరుసకు) పేర్లు

ప్రమదవనము —స్యా దేతదేవ ప్రమదవన మన్తః పురోచితమ్ అని అమ - (సుధాపాతము) ప్రమదావన అనునది (పారాం) రెండును సాధువులే జ్యాపో స్సంజ్ఞా ఛన్దసో ర్బహులమ్ (6 3 63) అని హ్రస్వవికల్ప మనుశాసించినది పాణినీయము ఏతదనుగుణములు గానే ప్రయోగము లున్నవి- ప్రమదవనోపకణ్ఠనలినీషు లతాభవనేషు భూయ (చూ గురు) జహాహ శోకస్థ వైదేహ ప్రీతయే దేహ మానసమ్ రావణో జహాహి ద్వేషం జహౌ ప్రమదావనమ్ భట్టి (20 0) మొ

సింగారపుఁదోఁట — సింగారపుతోపు గ్రహించి ఉపవనము అర్థము చున్నది బ్రౌ మహాటవీ త్వరణ్యానీ ప్రస్తారి స్తు తృణాటవీ కృత్రిమం వన మారామో ఉపవనోపవనే అపి తదేవ రాజ్ఞ ఉద్యాన మాక్రీడ శ్చాథ తస్య తత్ సాన్తః పురస్య ప్రమదావనం గేహస్య నిష్కుట పుష్పవాటీ త్వమాత్యాదే ర్త్రయీవాటీ ఫలాయ చేత్ అని (వైజ భూమి వనా) అమ కూడ వీనిని వేఱుపఱచినది- (ఆరామ స్స్యా దుపవనం కృత్రిమం వనమేవ తత్ అని ఆరంభించి) అం భా అని అనకపోయినను సింగారపుఁదోఁట వేఱుగా గ్రహింప కుండుటనుబట్టి ఇట బ్రౌ పా సింగారపుఁదోఁపు కావచ్చునని పించు చున్నది యయ్యా ప్రయోగ మొకటి ఇట్లున్నది- రంగగుతౌడవుల బ్రూఁతల నంగుగ గ్గైసేసి యందు నాడెడుతమిచే బొంగారెడు వేడుకతో సింగారపుఁదోఁట కరిగెఁ జెలులుం దానున్ (3 54) దీనిని బట్టి సింగారపుదోఁట యే ఇచ్చటి బ్రౌ పారమయి యుండు ననిపించు చున్నది శర్మిష్ఠాదులు కన్యాంతఃపురవాసు లగుటను

అంతఃపురస్త్రీలలో నివారే ప్రమదావన' మిది యనవచ్చును _ విశేషవివక్ష వదలి సాధారణము గా వచించినవి శర ఉద్యానవన' మవి, ౹బౌ ఉపవన' మవి వీని క్ష్రర్త ముల ననవచ్చును

సీ మొలక మొలవ మొక్క మోక మో సీరిక
మొటిక, నా నంకురం బొప్పు చుండు
నా అటం చనఁగను మీఱు వాప్యాంకురా
వలి కోడ యనఁగను బొలుచుఁ దద్వి
శేషనామంబు తసి యన సద యనంగఁ
దన్నిరంతరపంక్తి దనరు చుండు
ౘమాఁకు ౘమా ననఁగ ననోకహసంజ్ఞ యౌఁ
జె ట్టన నోషధి చెప్పఁబడును

గీ బండినది యన ఫలిత మౌ, వంధ్యసంజ్ఞ
యగును గొడ్డనఁ, బుష్పితం బగును బూచి
న దనఁ, గోరకితం బొప్పు ననిచిన, దనఁ,
జెలఁగుఁ బల్లవితము చిగిర్చిన దన, భవ ౩౫

మొలక మొలవ మొక్క మోక్ష మోసు, ఈరిక మొటిక——ఇవి అంకురము నకు పేర్లు

నాఱు——ఇది వాప్యాంకురావళికి (నాటుటకై విత్తనములు ఒత్తు గా స్థితివసతి గల (ప్రత్యేక)స్థలమున ఒత్తు గా చల్లి మొలపించిన మొలకలకు) పేరు

కోడ——తద్విశేషమునకు(ఒకవిధ మగునాఱునకు) పేరు.

తసి, సద——ఇవి వాని నిరంతరపంక్తికి (దట్ట మగునాఱువరుసకు) పేరు.

ౘమాఁకు, ౘమ్రాను——ఇవి వృక్షమునకు పేర్లు

చెట్టు——ఇది ఓషధికి (ఫలించినతోడనే నశించెడియరఁటి మొదలగువానికి) పేరు.

పండినది—ఇది ఫలితమునకు (ఫలించినచెట్టు లో నగుదానికి) పేరు

గొడ్డు—ఇది వంధ్యమునకు (ఫలింపనిచెట్టు మొద లగుదానికి) పేరు

పూచినది—ఇది పుష్పితమునకు (పూలు పూచినదానికి) పేరు

ననిచినది—ఇది కోరకితమునకు (మొగ్గ తొడిగినదానికి) పేరు

చిగిర్చినది—ఇది పల్లవితమునకు (చిగిరించినదానికి) పేరు

చెట్టు — నేరక తొడరితి గాల్కొన భూరుహములు లతలు చెట్లు బొద లేమియు శే
వారయ (భార కర్ణ 270) (చి వి పా) అవి (సూ వి)

సీ మోడు మో టన గ నొప్పును స్థాణునామంబు
గున్న యం చనఁగను క్షుపసమాఖ్య
పొద రీరము పొద నాఁ బొలుచు గుల్మాభిధ
తీగ తీవ యన లతిక దనర్చు
లతికావిశేషం బలసు నాఁగఁ జె న్నొందు
నొనరు లతాప్రతానినియు జొంప
మనఁగఁ బొడవు పొడ గనఁగ నుర్చ్ఛాయ మా
బో ల్ప్రకాండము మొద లొ్మ ద్దనఁగను

గీ ౹బగ్గ యన బంగ యనఁగను బరఁగు చుండు
స్కంధశాఖాఖ్య కొ మ్మనఁగాను శాఖ
వెలయు మండ యనంగను వితతశాఖ
పరఁగును సుగంధికుంతలాంబాసమేత 36

మోడు మోటు—ఇవి స్థాణువునకు (కొమ్మలు లేనిచెట్టునకు (మోడునకు)పేరు

గున్న—ఇది క్షుపమునకు (కుఱుచకొమ్మలు ఊడలు గలచెట్టునకు గుబురు గాఁ బెరిఁగిన గుజ్జుమ్రానికి) పేరు

పొదరు ఈరము పొద—ఇవి గుల్మమునకు (బోదె లేనితీగ తుప్ప మొదలగు వానికి) పేరు

తీగ తీవ—ఇవి లతికకు (లతకు తీగెకు) పేర్లు

అలసు—ఇది లతికావిశేషమునకు (అల్లుడుతీగకు) పేరు

జొంపము—ఇది లతాప్రతానినికి (తీగెలు మొదలగువానిగుంపునకు (పొదకు) పేరు

పొడవు పొడగు—ఇవి ఉచ్ఛ్రాయమునకు (ఔన్నత్యమునకు ఎత్తునకు) పేర్లు

ప్రగ్గ పంగ—ఇవి స్కంధశాఖకు (చెట్టుమొదటికొమ్మకు) పేర్లు

మొదలు మొద్దు—ఇవి ప్రకాండమునకు (చెట్టుబోదెకు) పేర్లు

కొమ్మ—ఇది శాఖకు పేరు

మండ—ఇది వితతశాఖకు (విరివి యైనకొమ్మకు) పేరు

స్థాణువు — లతా కా ఽపి తరు కో ఽపి కాశ్యా మాశ్చర్యదమ్పతీ సా చా పర్ణా చ స్థాణుః దదాతే వాఞ్ఛితం ఫలమ్ (కాశీసా) స్థాణు' శబ్దమున కైన శ్లేషయందలి చమత్కార మిఁట గమనింపఁ దగినది

క్షుపము — హ్రస్వశాఖా శిఫః క్షుప (అమ)

గుల్మము — అప్రకాణ్డే స్తమ్బగుల్మే (అమ)

అలసు — ఉలస -ఆకారాంతము గా ఇచ్చి నిఘంటువులు-సం వి ఆ స్త్రీ హంసపదీలత అల్లుడుతీఁగ-అను చున్నవి (చూ సూ ని శ ర) దానినుండి యేర్పడిన దిది యగును ఉలస అనియే ఇచ్చటిపాఠ మగునా? అని కూడ సందేహము కొన్ని ప్రా సమ ములు గా తెలు గునం దవతరించి సం తత్సమము లనునట్లు వెలయుట ఆం భా లోఁ గానవచ్చును భట్టికావ్యము త్రయోదశసర్గమున ఏకరూపము లగుసంస్కృతప్రాకృత ములఁ గొన్నిటిని ఉదాహరించినది- చారుసమీరణ రమణే హరిణ కిరణావలీ సవి లాస ఇచ్చట వ్యాఖ్య ఇట్లను చున్నది- ఆవలి రావ లీత్యుభయ మపి సంస్కృత ప్రాకృతయో ప్రయుజ్యతే (అని) ఇట్లే మఱియొకచో- సరసబహుపల్లవావిల కేసర

హాన్తాల బద్ధబహులచ్ఛాయమ్ ఐరావణ మదపదపరిమల గన్ధవహోబద్ధ దన్తి సంరమ్భ రసమ్ (భట్టి 3 33) ఇచ్చటివ్యాఖ్య ఇట్లున్నది- ఐరావణ ఐరావత ఇత్యు భయ మపి ప్రాకృతే సాధు (అని) ఇట్టిప్రాకృతసమములు గొన్ని తెలుఁగున వెలసి సంస్కృతసమములే యనునట్లు గానవచ్చును అట్టివి గొన్ని ఆం భా గ్రహించన దని పూర్వ ముదాహృతము లైనవి అట్టి దిది కావచ్చునేమో

లతాప్రతానిని — ఇచ్చట రెండువిధము లైన వ్యాఖ్యానముల నిచ్చినది (గురు) ఒకవ్యాఖ్యయం దివి భిన్నపదములు మఱియొకవ్యాఖ్యయం దిది యేకపదము సుధ యేక పదముఁ గానే వ్యాఖ్యానించినది ఆం భా సుధనే యనుసరించినది

పొదవు — ప్రొదవు-రూపము పొడగు-ఔన్నత్యము అని శ ర సూ ని - ఇట్లను చున్నది (పొదవు)- ఈ అన్మధ్యరూపమును శ ర గ్రహింప లేదు నిర్ధారక ప్రయోగమును జూపింప లేదు కాని ఆం-భాలోను పెక్కుగ్రంథములందును క్వాచిత్కము గా భారతమునందునుగూడఁ (అన్మధ్యము గా) గన్పట్టుచున్నది (అని)

ప్రగ్గ — ఎడము గా చా గినశాఖ- అని శ ర ప్రంగ- (రూపాం)- అని (సూ ని శ ర)

స్కన్ధశాఖ — స్కన్ధశాఖాశాలే ఆమ స్కన్ధాత్ప్రథమోత్పన్న శాఖాయాః అని ఇటి (సుధ)

మండ — తనకు నసము వెరు గ వెజ్జిమణ్డతో నఖండతతద్యుతిదీప మమర నిచ్చె విమల కమలనేత్రి (దా శా 007) వెండిమండ=వెండితో జేసిన పెద్దకొమ్మ (మండ-శాఖ-అని శ ర) అని (సూ ని)

పోల్ — పోలున్ -అనుదాని కైన (రూపాం) పోల్ కవిభల్లపై క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు (ఆం చి 60) అను సూత్రమున సాధు వనవలయును

[పంగ — బుంగ యన గను వావి అపపా]

[నలను లతాప్రతానినియు జొంప (వావి) (అపపా)]

సీ రెమ్మ రెబ్బ రివట రివ్వ సెలగ చివ్వ
చివక మల్లె జబర చివర సురిగ

బలుగు గోల బరగు నెల యన నుపశాఖ
చెలఁగు నూడ యనంగ శిఫ దనర్చుఁ,
దల కొన మొన యన నలరు నగ్రాభిధ
వే రన దుంప యన వెలయు మూల
మొనరుఁ జే గనఁ జేవ యనఁగ సారముపేరు,
తొడు, పట్ట తోలుక తోలు,చెక్క,
ఆ తొంట, చెక్కు, తడప యంట త్వగాఖ్య యౌ
త్వగవయవము దనరు బరడు, నాఁగఁ,
బరఁగు నార యనిన వల్కలసంజ్ఞ మై,
మాతృభూత లోకమాతృభూత

రెమ్మ రెబ్బ రివట రివ్వ నెలగ చివ్వ చివక మల్లె జబర చివర, సురిగ బలుగు కోల బరగు నెల—ఇవి ఉపశాఖకు (చిన్నకొమ్మకు) పేర్లు.

ఊడ—ఇది శిఫకు (మఱ్ఱి మొద లగుచెట్లనుండి క్రిందికి దిగువేరునకు) పేరు

తల కొన, మొన—ఇవి అగ్రమునకు పేర్లు

వేరు దుంప—ఇవి మూలమునకు పేర్లు

చేగ చేవ—ఇవి సారమునకు పేర్లు

తొడు పట్ట తోలుక, తోలు, చెక్క తొంట చెక్కు తడప అంట—ఇవి త్వక్కునకు (చెట్టుపట్టకు) పేర్లు

బరుడు—ఇది త్వగవయవమునకు (గఱు కైనచెట్టుపట్టలో నగుదానికి) పేరు

నార—ఇది వల్కలమునకు (చెట్ల తడపతో నేయఁబడిన వస్త్రమునకు) పేరు.

బరడు — బెరడు-చింతలు మొద లైనవాటి పై పెచ్చు' -అని బ్రౌ శ ం - బరడు అనియే అనినది -బెరడు అని (వ్య ) -)

నార — నారలు గట్టి కూర లశనంబు గ నుగ్రతపోవనంబులో (భార అర 2 3 24)

[ చివ్వ చివక — ఇట చువ్వ చువక అని కొందఱ (పా ) గా తోఁచు చున్నది ]

సీ ములు వసి యనఁగను జెల గుఁ గంటకసంజ్ఞ
తొడుగట్టు యీడిక సుడుము కంప
యనఁ దనర్చును గంటకాదిభారము గట్టి
కట్టియ నాఁగను గాష్ఠ మొప్పుఁ
దనరుఁ గొయ్య యనంగ దారుసమాఖ్య యై
దుంగ యనంగను స్థూలదారు
ఖండంబు వెలయుఁ జె క్కన గఁ దద్దారుభే
దంబు పే డన సూక్ష్మదారుభేద

గీ మగును, జిదు గన సమిదాఖ్య యలరుఁ దొట్టి
తొట్రు, తొట్టు తొజట యనఁ దోఁచుఁ గోట
రమ్ము గొల యనఁగాను వల్లరి యెసంగుఁ
బత్తి శా కనఁ బర్ణ మౌ బార్వతీశ 38

ములు వసి—ఇవి కంటకమునకు పేర్లు

తొడుగట్టు ఈడిక సుడుము కంప—ఇవి కంటకాదిభారమునకు (ముళ్లకంప మొద లగువాని మోపునకు) పేర్లు

కట్టె కట్టియ—ఇవి కాష్ఠమునకు పేర్లు

కొయ్య—ఇది దారువునకు పేరు

దుంగ—ఇది స్థూలదారుఖండమునకు (లా వైనకొయ్యముక్కకు మ్రాని మొద్దునకు) పేరు

చెక్క—ఇది స్థూలదారుభేదమునకు (లా వైనమ్రాని చెక్కకు) పేరు

పేడు—ఇది సూక్ష్మదారుభేదమునకు (సన్నని మ్రాని చెక్కకు) పేరు

చిదుగు—ఇది సమిధకు (హోమమున కైన సన్నని (యెండినపుల్లకు) పేరు

తొట్టి తొఱ్ఱు తొఱ్ఱ తొఱట— ఇవి కోటరమునకు (చెట్టునం దేర్పడినపెద్ద రంధ్రమునకు) పేర్లు

గొల—ఇది వల్లరికి (పూవులు మొదలగువానిగుత్తికి) పేరు

పత్తిరి ఆకు—ఇవి పర్ణమునకు పేర్లు

తొడుగట్టు —తొడుగఱ (రూపాం) తడి కంట నెపుడు దఱుఁగక కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి గాసిం బడమిం బడినఁ గనరాక మంచపు దొడుగఱ లైరట్టె ఱుజలతో నే మందున్ (మనుచ 3 3) (చూ సూ ని శర)

చెక్క — మ్రాను లో నగువానిపలుచనిఖండము'-అని (శర)

ములు —ముల్లు (రూపాం) ముల్లు దలకొనని నవకపుఁ బల్లవములతోడ ముక్తిభామవెవ్వ లకుం బల్లేరుఁబువ్వు లగుపువు లుల్లసిలునలర్కశాకి మొదుగఁగఁ గొనుచున్' (ఆము 4 195)

సీ ఛదరజస్సంజ్ఞ యౌ నద యనఁ జిగు రిగు
రు తలి రనంగ మీఱును గొసలయ
నామధేయము పై రనంగను బయిరు నా
నసి యనఁగాను సస్యము చెలంగుఁ
దొడిమ నా వృంతంబు దోఁచుఁ బం డనఁగ ఫ
లం బొప్పు చుండు శలాటు వగును
గా యనఁ బిందె నాఁగాను బాలశలాటు
వు చనుఁ బూఁబిందె నాఁ బూప యనఁగఁ

గీ బ్రబలు నత్యంతబాలశలాటుసంజ్ఞ
మనును శుష్కశలాటునామంబు వట్టు -

వరు గనంగను బీజాఖ్య పరఁగు విత్తు
విత్తనము గింజ గిజ రన వెలయ నీళ 39

సద—ఇది ఛదరజస్సునకు (ఆకుమీఁది నూఁగునకు) పేరు

చిగురు ఇగురు తలిరు—ఇవి కిసలయమునకు (చిగురుటాకునకు) పేరు

పైరు పయిరు ససి—ఇవి సస్యమునకు పేర్లు

తొడిమ—ఇది వృంతమునకు పేరు

పండు—ఇది ఫలమునకు పేరు

కాయ—ఇది శలాటువునకు (పచ్చికాయకు) పేరు

పిందె—ఇది బాలశలాటువునకు (లేఁతపచ్చికాయకు కాయ యగుటకు ముందటి దానికి) పేరు

పిందె — గా యన బిం దన గాను అని (వావి పా ) బ్రౌ పింద అనురూపమును గూడ ఇచ్చినది పిందె పిందియ లకు ప్రయోగము లున్నవి తల్లిదండ్రులయొద్దితన యులగతి నాకు మఱు గుపిందెలరీతి నెఱి వహించి (హరిశ్చ 2 2 ) (చూ సూ ని ) (పిందియ)- నాథ చివురులు రంజిల్లె ననలు మొలచె నలరె విరులెల్ల బూపలు తలలు సూపె బసిమి నిర వొందె బిందియల్ బలిసె నవశ లాటువులు సాంద్రరుచుల ఫలంబు లెస గె (వసు 34 ) (చూ శ ర ) పింద కు ప్రయోగము లేదు పిందె అనియే వ్యవహారము గూడ

కిసలయము — ఓగురు ఆకులతో గూడినకొమ్మపేరు - అని కొందఱు- అని గురు నవపత్త్రస్య అని సుధ

తొడిమి — తొడిమె వావి సా బ్రౌ తొడిమె గ్రహించి ప్రయోగ మిచ్చుచు తొడిమ అనియే అను చున్నది అప్రయోగ మిది- పర్వతుకయును వంకాయయు నదర సమూలంబు మధుర మందులలో గా దొడ మొదలు త్రొడిమ మొదలును గడువ ధురము కుందె వరపు గవిచౌడప్పా (చవుడప్పశతకము 6) వార్తాక్యాశ్చ వరాజ్ఞ్యాశ్చ సర్వాజ్గం

మధురాయతే తత్రా ఽపి చ విశేషే ఽస్తి వృన్తమూలోరుమూలయోః (చూ
(బ్రౌ) తొడిమె-అని (వ్య)

సీ పేసె మనంగను బేశ్యాఖ్య విలసిల్లుఁ
        బసురు పస రనంగ స్వరస మొప్పుఁ
బసరుమొగ్గ యనంగఁ బసిమొగ్గ యనఁగను
        క్షారకనామ మై మీఱును, నన
యనఁగను గోరకం బమరుఁ గు చ్చన గుత్తి,
        యన గుది, యనఁగ గుచ్ఛాఖ్య ధనరు,
మొ గ్గన మొగ డన ముకుళంబు దగు, నొప్పుఁ
        బూ పూవు పువ్వు పువు విరి యలరు

గీ నా సుమం బగుఁ బూఁదేనె నాఁగఁ బుష్ప
రసము, పుప్పొడి యనఁగఁ బరాగ మొప్పు,
నవితనిజదాస త్రిశిరఃపురాధివాస
మూర్ధధృతగంగ శ్రీమాతృభూతలింగ

పేసెము—ఇది పేశికి (చిక్కనిఫలరసమునకు గుజ్జునకు) పేరు

పసురు పసరు—ఇవి స్వరసమునకు (ఆకురసమునకు) పేరు

పసరుమొగ్గ పసిమొగ్గ—ఇవి క్షారకమునకు (పచ్చిమొగ్గకు) పేర్లు

నన—ఇది కోరకమునకు (ఇంచుకంత ప్రవృద్ధ మైనమొగ్గకు) పేరు

కుచ్చు గుత్తి గుది—ఇది గుచ్ఛమునకు (పువ్వులు మొద లగువానిగుత్తికి) పేరు

మొగ్గ మొగడ— ఇవి ముకుళమునకు (అప్పుడే వికసింపఁ గల పరు వైన మొగ్గకు) పేరు

పూ పూవు పువ్వు పువు విరి అలరు— ఇవి సుమమునకు (పుష్పమునకు) పేర్లు

పూఁదేనె—ఇది పుష్పరసమునకు (మకరందమునకు) పేరు

పుప్పొడి—ఇది పరాగమునకు పేరు

పేసము — (క బేసవు) బేసము (రూపాం) పాకివేలారంభపరిపాటిఁ దమయంత బగిలిన పనసక్రొంబండ్ల బేసము (పాండు 8)

నన —ప్రయోగ మి ట్లున్నది- గురివెంద జైత్రు దొందఁగఁ గరిమలుక న్నావి యపుడు గఱచిన నునువా తెఁమీ ద గాన నగుపలు వరుస యన న్ననలు పల్లవము పై మొన సెన్ (పారి 3 48) (చూ సూ ని) పుష్పము దీని కర్థ మను చున్నది సాంబ పూవులు ననలు విరులు పువ్వు లలరులు నా సుమంబు లగు (స్థా 08) నన దండ లో నగునవి ప్రమోగదృష్టములు ఆం ఖా వచించిన పుష్పపర్యాయములలో విది లేదు ఆం ఖా సుప్రసిద్ధార్థ మిది యని వదలిన దవిపించును

ముకుళము —కుట్మలో ముకుళో ౨త్రియామ్ (ఒమ) అప్పుడు వికసింపఁ గల పరు వైన మొగ్గపేళ్లు అవి గురు ఈషద్వికాసోన్ముఖకలికాయాః (అని సుధ)

కలిక — కలికా కోరకో ౨త్రియామ్ (అమ) ఇంచుకంత ప్రవృద్ధ మైన మొగ్గపేళ్లు అని గురు అవికసితకలికాయా అని సుధ

జారకము — జారకో జాలకం క్లీబే (అమ) నవకలికాబృన్దస్య అని సుధ పేసరు మొగ్గలకును గసుగాయలకును బేళ్లు పసరుమొగ్గలగుత్తికి బే ళ్లని కొందఱు అని (గురు)

[ బేసాఖ్య (విలసిల్లు) వావి అపముద్రి ]

[గుది — గువి యన గ వావి అపముద్రి.]

సీ మొల్లలు మల్లెలు మొద లైనశబ్దము
ల్బహుంతను దపుదు పుష్పములఁ దెలుపు

జొన్నలు రాగులు మున్నగు శబ్దము
    ల్బహుతను దమతమఫలము లగును
గంద పసుపు మొదల్గాఁ గలయవి యేక
    వచన మై నిజమూలవాచ్యము లగు
గంజాయి మొదలు గాఁ గలిగినయవి యెల్లఁ
    బత్త్రసమాఖ్య లై పరఁగు చుండు

గీ నంగు లగువృక్షములపేరు లంగములు గఁ
బత్త్ర ఫల పుష్పములయందుఁ బరఁగు చుండు
నవలఁ జెప్పెద వృక్షభేదాఖ్య లెల్ల
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ

మొల్లలు మల్లెలు - మొద లైనవి (బహువచనము లై) వానివాని పుష్పములకు పేర్లు

జొన్నలు రాగులు — మొద లైనవి (బహువచనము లై) వానివాని ఫలములకు (ధాన్యములకు) పేర్లు

కంద పసుపు — మొద లైనవి (ఏకవచనము లై) వానివాని మూలములకు (దుంపలకు) పేర్లు

గంజాయి — మొద లైనవి వానివాని పత్త్రములకు (ఆకులకు) పేర్లు

గంజాయి — మొద లైనవి అవయవివాచకము లై వృక్షములకు పేర్లు

అవయవాచకము లై (ఇవి) — పత్త్రములకు ఫలములకు పుష్పములకు పేర్లు

[వృక్షవిశేషముల కైన పేర్లు ముందు చెప్పఁబడును ]

సీ రావి యంచనఁ గుంజరాశన మగు గంగ
    రావి యంచనఁగను బ్రహ్మదారు.

వెలఁగ యం చనఁగఁ గపిత్థంబు చెలు వగు
నత్తి మేడి యనంగ నవు నుదుంబ
రంబు కాకోదుంబరంబు మీఱును గాకి
మేడి యం చన బొమ్మమేడి యనఁగఁ
గపురపుటనఁటి నాఁగాను నేడాకుల
యనఁటి నా సప్తపర్ణాఖ్య దనరు

గీ రేల యం చనఁ బరఁగు నారేవతంబు
నిమ్మ యం చనఁగా జంభలమ్ము దోఁచు
నదియె గొ ప్పైన గజనిమ్మ యనఁగఁ దగును
భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ! 42

రావి— ఇది కుంజరాశనమునకు (అశ్వత్థమునకు చలదళమునకు రాగిచెట్టునకు) పేరు

గంగరావి—ఇది బ్రహ్మదారువునకు పేరు.

వెలఁగ—ఇది కపిత్థమునకు పేరు

అత్తి, మేడి—ఇది ఉదుంబరమునకు పేర్లు

కాకిమేడి బొమ్మమేడి—ఇవి కాకోదుంబరమునకు పేర్లు

కపురపుటనఁటి నేడాకులయనఁటి—ఇవి సప్తపర్ణమునకు పేర్లు

రేల—ఇది ఆరేవతమునకు (ఆరగ్వధమునకు) పేరు

నిమ్మ—ఇది జంభలమునకు (జంభరమునకు జంబీరమునకు జంబిరమునకు) పేరు

గజనిమ్మ—ఇది పెద్ద నిమ్మకు (లకుచమునకు) పేరు

రేల — తెల . . ని శ రి మారేడు పంటికై మగువ కడుగో రెల చూర రాదే? యిప్ప
చెంత నదిగో రేల' (ఉ రా 66) (చూ సూ వి)

పేడి — విస్పార మగుభోజనమునకు పేడికాయభోజనము అని వ్యవహారము -వ్రతభో
గ మి ట్లున్నది- రాగంబు నొడిచి ముక్తి శ్రీ గౌరవ్రములకు పేక్ష చేయు మునులకున్
నాగేంద్రయాన యైహిక భోగం బది పేడికాయభోనము సుమ్మీ (వి ప్ర 280)
(చూ సూ వి)

సీ వరుణనామము లులిమిరి యన మొగలింగ
నాఁగ విసుకమ్రాను నాఁగఁ దనరుఁ
బొన్న యం చనఁగను బున్నాగ మౌ సుర
పున్నాగ మౌ సురపొన్న యనఁగ
వారిజ మం చన బారిజ మం చనఁ
బారిభద్రాఖ్య యై మీఱు నెమ్మి
యన నేమిసంజ్ఞ యౌ నంబాళ మనఁగను
నామ్రాతకాఖ్య యై యలరు నిప్ప

గీ యన మధూకంబు నీరిప్ప యన మధూత్థ
క మగుఁ దగు గోను గోఁగనఁగను సుపేలు
కందరాళము కొండగోఁ గనఁగఁ గొండ
గో నఁగఁ బరఁగుఁ ద్రిశిరఃకుధరనిలయ 43

ఉలిమిరి మొగలింగ ఇసుకమ్రాను—ఇవి వరుణమునకు పేర్లు

పొన్న—ఇది పున్నాగమునకు పేరు

సురపొన్న—ఇది సురపున్నాగమునకు పేరు

వారిజము బారిజము—ఇవి పారిభద్రమునకు పేరు

నెమ్మి—ఇది నేమికి పేరు

అంబాళము—ఇది ఆమ్రాతకమునకు పేర్లు

ఇప్ప—ఇది మధూకమునకు పేరు

నీరిప్ప—ఇది మధూలకమునకు పేరు

గోను గోఁగు—ఇవి సుపీలువునకు పేర్లు

కొండగోఁగు కొండగోను—ఇవి కందరాళమునకు పేర్లు

ఉలిమిరి —(క ఉలిమిరి) ఉలిమిడి (యాపాం) -అని శ ర ఉలిమిడి అని బ్రౌ పా (చూ ఽను) తిక్తశాకము అనికూడ దీని నను చున్నది- బ్రౌ)

నెమ్మి —(సం నేమి)- తినాస ఐంజాల వృక్షము (చూ సూ ని.) నెమ్మి యనఁగా వంజులవృక్షమ్మునకున్ బర్హికిని (ఆం సం నానా 9)

బారిజము —బారిదము-(రూపాం) అని (శ ర)

అంబాళము — దీనిపండు తియ్యగా ఉండును- నోరు అంబాళపు బండు చేయి బయిను ముల్లు అని సామెత తియ్యనిమాటలే కాని పెట్టుటకు చేయి రాదు -అని అర్థము (చూ సూ ని)

సీ. ఊడుగు నాఁగను నొప్పు నంకోలంబు
 నెగడుఁ గింశుకము మోదుగ యనంగఁ
బ్రబ్బ ప్రబ్బలి యనఁ బరఁగు వేతససంజ్ఞ
 శిగ్రువు మునగ నాఁ జెలఁగు చుండు
మధుశిగ్రునామ మై మను నెఱ్ఱమునగ తి
 య్యమునగ యనఁగఁ గారుమునగ యన
వనశిగ్రునామ మై తనరుఁ గుంకు డనంగ
 ఫేనిలసంజ్ఞ యా బిల్వసంజ్ఞ

గీ. పరఁగు మారే డనంగను బ్లక్షసంజ్ఞ
నివ్వటిలు జువ్వి యనఁ గలుజువ్వి యనఁగఁ
గూటపర్కటి యగును న్యగ్రోధ మగును
మఱ్ఱి యనఁగ జగన్నేత మాతృభూత

ఊడుగు—ఇది అంకోలమునకు పేరు

మోదుగ—ఇది కింశుకమునకు పేరు

ప్రబ్బ ప్రబ్బలి—ఇవి వేతసమునకు పేర్లు

మునగ—ఇది శిగ్రువునకు పేరు

ఎఱ్ఱమునగ తియ్యమునగ—ఇవి మధుశిగ్రువునకు పేర్లు

కారుమునగ—ఇది వనశిగ్రువునకు (అడవిమునగకు) పేరు

కుంకుడు—ఇది ఫేనిలమునకు పేరు

మారేడు—ఇది బిల్వమునకు (శ్రీఫలమునకు) పేరు.

జువ్వి—ఇది ప్లక్షమునకు పేరు

కలుజువ్వి—ఇది కూటపర్కటికి పేరు

మఱ్ఱి—ఇది న్యగ్రోధమునకు (వటమునకు) పేరు

అంకోలము —దీనిపండ్లు ఆణిముత్తెముల ట్లుండును. "వేణుజాతము లై నయాణిపూసల నెంతు రూడుగుపండ్లకు నీడు గాఁగ (కాళ 3 4) దీనివిత్తనములు రాలినవెంటనే చెట్టునకు బోయి అంటుకొను చుండును. ఆఙ్కోలం నిజబీజసన్తతి రయస్కాన్తోపలం సూచికా (శివా)

సీ లొద్దుగ నాఁగను లోధ్ర మౌ మామిడి
మావి యనంగ నామ్ర మగుఁ దియ్య
మామిడి యన నెలమావి యన్నను సహ
కారనామంబు గా మీఱు చుండు
గుగ్గిల మం చన గుగ్గులువు దనర్చు
విరిగి యం చనఁగను వెలయు శేలు

క్షుద్రశేల్వాఖ్య యగును నక్కవిరిగి నా
శ్రీపర్ణికాఖ్య యై చెలఁగు రే గ

గి నంగఁ గర్కంధువు దనచ్చు గంగరేఁ గ
నంగ లకుచాఖ్య కమ్మరే ననఁగ నక్క
రే ననఁగ వెలయును జుర్రిమాను వెలమ
నాఁగ ధవ మెప్పుచుండును నాగభూష 45

లొద్దుగ — ఇది లోధ్రమునకు పేరు

మామిడి మావి — ఇవి ఆమ్రమునకు (చూతమునకు) పేర్లు

తియ్యమామిడి ఎలమావి — ఇవి సహకారమునకు పేర్లు

గుగ్గిలము — ఇది గుగ్గులువునకు పేరు

విరిగి — ఇది శేలువునకు పేరు

నక్కవిరిగి — ఇది క్షుద్రశేలువునకు పేరు

రేఁగు — ఇది శ్రీపర్ణికకు పేరు

గంగరేగు — ఇది కర్కంధువునకు పేరు

కమ్మరేను నక్కరేను — ఇవి లకుచమునకు పేర్లు

చుర్రిమాను వెలమ — ఇవి ధవమునకు పేర్లు

గుగ్గులువు — కౌశికో గుగ్గులుః పుర (అమ) అదన్తముగా గూడ దీనిని గ్రహించినది (సూ ని) ఈ చెట్టుబంకయే గుగ్గిలము

శేలువు — దీనికే శ్లేష్మాతక మనునది మఱియొక పేరు శేలు శ్లేష్మాతక శ్శీత అని (అమ)

శ్రీపర్ణిక — దీనికి నేడు కానవచ్చు సం నిఘంటువులు రేగు అనునర్థ మిచ్చుచున్నట్లు (నాచూచినంతలో) కానరా లేదు సందర్భమునుబట్టి రేగు అనుటయే ఉచిత మనిపిం

చినది అం భా వేఱు గా రే గు నకు పే ర్లీయ లేదు. రేఁగు' నకు బదరి' అనెడి యర్థమే ప్రయోగములందుఁ గానవచ్చు చున్నది - సంగరకేళి నతం డీ భంగిని విహరింప గౌడపతిసేనయుఁ దా నుం గలఁగి పాఱె రే గులు దంగేళ్ల గఁ ద్రొక్కి కొనుచుఁ దద్దయు భీతిన్ (కలా 8 74) మొ సాంబ రేఁగు రే నన బదరికిఁ జెల్లు (స్థా ప ) అను చున్నది

లకుచము —ఇచ్చటిసందర్భమునుబట్టి బదరీవిశేషము' దీని కర్థము గా అగపడు చున్నది సం నిఘంటువులలో ఈయర్థము కానవచ్చుట లేదు (చూ సూ ని) కమ్మరేఁగు లకుచము-కమ్మరే గు (గజనిమ్మ)'- అని గురు బ్రౌ కూడ ఇట్లే అను చున్నది బ్రౌ కమ్మరేఁగు-లో అం భా కు అర్థము వచించుచు కమ్మరేఁగు' అనఁగా నక్కరేగు చరిమాను-అను చున్నది- (చూ ఆను) అన్వయమున ప్రమాదపడిన దనిపించును 'చరిమ్రాను పేఱు ధవము' తో అన్వయము దానికి కమ్మరేగు-కశేరుక' మని (శ ర) కశేరుకము నకు- ఒకజాతిగడ్డిదుంప అర్థము (చూ సూ. ని) ఇట్లు నిఘంటువు లన్నియు యథేచ్ఛము గా ఇట ప్రవర్తిల్లినవి వేంకనార్యుని నిఘంటుపాండిత్య మపారము అది శంకింపఁ దగినది కాదు ఒకచాటు వి ట్లున్నది- లకుచకుచాపరిరమ్భణతో లకుచకుచాపాదతాడనం శ్రేయః' అని ఇచ్చటి లకుచము' బదరీవిశేషమే ఎంతసముచితము గా ఇట అర్థము వేంకనార్యునిధర్మమా అని నేఁడు పరిపుష్టి చెందినదో రసజ్ఞశిరోమణుల కెఱుక

సీ ములువెలమ యనంగఁ జెలఁగును స్వాదుకం
టకనామధేయ మీఁద యినఁ బరఁగు
నై రావతాభిధ నారద బ్బనఁగ నా
రంగాభిధాన మై ప్రబలు చుండు
నేరే డనంగను నేరె డనంగను
జంబూసమాఖ్య లై చనును గాకి
నేరే డనఁగ నక్కనేరే డనఁగ నేల
నేరే డనఁగ జన్నె నా రహి గను

భూజంబునామంబు పొల్చుఁ దిందుకసంజ్ఞ
తుమికి యనంగను దుమ్మికి యనఁ

గీ. బ్రక్కి ప్రక్కె యనం బిచులంబు దనరు
గుమ్మ డనఁగను గుముదిక సమ్మతివడుఁ
గడిమి కడప యటం చన బడుఁ గదంబ
మడరు భల్లాతకియు జీడి యన మహేశ 46

ములువెలమ—ఇది స్వాదుకంటకమునకు (ఒకజాతిచరిమ్రానికి) పేరు
ఈడ—ఇది ఐరావతమునకు (ఒకజాతినారింజకు ఎఱ్ఱకిచ్చిలికి) పేరు
నారదబ్బ—ఇది నారంగమునకు (ఒక దినుసుదబ్బకు) పేరు
నేరేడు నేరెడు—ఇవి జంబువునకు పేర్లు
కాకినేరేడు నక్కనేరేడు నేలనేరేడు జన్న—ఇవి భూజంబువునకు పేర్లు
తుమికి తుమ్మికి—ఇవి తిందుకమునకు పేర్లు
ప్రక్కి ప్రక్కె—ఇవి పిచులమునకు(సన్నియాకులు గలపక్కిచెట్టునకు)పేర్లు
గుమ్మడు—ఇది కుముదికకు (బేకునకు) పేరు
కడిమి కడప—ఇవి కదంబమునకు పేర్లు
జీడి—ఇది భల్లాతకికి పేరు

తుమ్మికి —(సం తిన్దుకమ్ క తుమికి) తుమ్మిక (వావి బ్రౌ పా) కలివె పండులు దొడివెందపండ్లు దుమ్మికి పండ్లు జానపండులు గంగరేనుపండ్లు (కాళ 3 69) ఇట తుమ్మిక అనినను బాధ లేదు నిర్ధారకము గా లే దిది ఐనను తుమికి అనురూపముబట్టి- తుమ్మికి అను సూ ని పారమే గ్రహింప బడినది

సీ. చింత యనంగను జించ యొఁ దత్ఫలై
కాంశంబు గుడిసె యం చనఁగ వెలయుఁ

బిచ్చె యనంగఁ దద్బీజంబు విలసిల్లు
వేఁగి వేఁగిస యన వెలయుఁ బీత
సాలాఖ్య గా సాలసంజ్ఞ గాఁ దగు నిను
మద్దియ నా నల్లమద్ది యనఁగఁ
బాల యం చనఁగను బరఁగును క్షీరికా
హ్వయము గార యనంగ నలరు నింగు
గీ దియు, విరాజిలఁ బూరణి తేజరిల్లు
బూరు గం చనఁగను, గొండబూరుగ యనఁ
గాను బనుఁ గూటశాల్మలి కాను, గనఁగఁ
దనరును గరంజసంజ్ఞ యంధకవిరోధి 47

చింత—ఇది చించకు పేరు

గుడిసె—ఇది ఫలై కాంశమునకు (బరడుతో ఉండుచింతపండునకు చింతగుల్లకు) పేరు.

పిచ్చె—ఇది చింతపండులోనిగింజకు పేరు

వేఁగి వేగిస—ఇవి పీతసాలమునకు పేర్లు

ఇనుమద్దియ నల్లమద్ది—ఇవి సాలమునకు (మద్దికి) పేర్లు

పాల—ఇది క్షీరికకు పేరు

గార — ఇది ఇంగుదికి (తాపసవృక్షమునకు) పేరు

బూరుగ—ఇది పూరణికి (శాల్మలికి) పేరు

కొండబూరుగ—ఇది కూటశాల్మలికి పేరు

కానుగు—ఇది కరంజమునకు పేరు

గుడిసె —ఒకవిత్తు చింతపండు-అని (శ ర )

ఇనుపమద్ది —(ఇనుము + మద్ది) నల్లమద్ది

పిచ్చె — పిచ్చు-ఒని శ ర బ్రౌ లు-ఒని సూ ని (చూ పిచ్చె)

పూఁణి — పిచ్ఛిలా పూఁణీ మోచా స్థిరాయు శ్శాల్మలి ర్ద్వయోః అని (అమ)

సీ నెమలియడుగుమ్రాను నెమిలి యం చనఁగను
 బూతికరంజంబు బొల్చుఁ జంద్ర
యన ఖదిరం బొప్పు నరిమేద మలరును
 దుమ్మ యం చనఁ దెల్లతుమ్మ యనఁగ
విట్ఖదిరాఖ్య యై వెలయును గదర మౌ
 నుంద్రస యనఁగను నుంద్ర యన గ
నేరండనామ మై మీఱు నాముద మన
 జమ్మి యం చనఁగను శమి దనర్చు

గీ షంగ యనఁగను మదననామంబు చెలఁగు
దేవదారి యనం జను దేవదారు
పాటలి పొసంగుఁ గలిగొట్టు పాదిరి యన
భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ 48

నెమలియడుగుమ్రాను నెమిలి—ఇవి పూతికరంజమునకు పేర్లు

చంద్ర—ఇది ఖదిరమునకు పేరు

తుమ్మ—ఇది అరిమేదమునకు (కంటకికి ముండ్లు గల చండ్రకు) పేరు

తెల్లతుమ్మ—ఇది విట్ఖదిరమునకు (దుర్గంధము గలచండ్రకు) పేరు

ఉంద్రస ఉంద్ర—ఇవి కదరమునకు (వెలిచండ్రకు) పేర్లు

ఆముదము—ఇది ఏరండమునకు పేరు

జమ్మి—ఇది శమికి (అగ్నిగర్భకు) పేరు

మంగ—ఇది మదనమునకు పేరు

దేవదారి—ఇది దేవదారువునకు పేరు

కలిగొట్టు పాదిరి—ఇవి పాటలికి పేర్లు

పూతికరంజంబు — ఇది సూ ని పా శ ర - పూతికరజము అనియే (పదము) గ్రహించినది ప్రకీర్య పూతికరజః పూతికః కలిమారక అని అమ కలిజే పూతికరజ అని వై జ (మొ) ఈ నిఘంటువులనుబట్టి పూతికరజంబు అనవలయు ననిపించు చున్నది పూతికరంజము - అనియే బ్రౌ పా (చూ అను) పూతికరజము నకు (రూపాం) పూతికరంజము అనవలయును

అరిమేదము — అరిమేదో విట్ఖదిరె అని విట్ఖదిర మనియే వ్యవహరించినది (అమ) దీనిని వై జ కూడ నిట్లే - విట్ఖదిరో ఉప్యరిమో ఉప్యరిమేదక కణ్డకే (చాప్యథైరణ్డ) (అని) విట్ఖదిరము- అరిమేదము భిన్నము లనుచు- ఆం భా సుగంధిపాల మ్మొ వానియం దట్లే యిచ్చటను అమరముతో వేఱుపడినది ఇచ్చటి ఆం భా ను సూ ని గాని శ ర గాని సరిగా విశదపఱుపక వదలినట్లు కానవచ్చు చున్నది అరిమేద ము-విట్ఖదిరము వెలితుమ్మ- అని సూ ని (తుమ్మ దగ్గఱ) (సూ ని) ముండ్లు గలయొకానొకచెట్టు (తెల్లతుమ్మ నల్లతుమ్మ కంపుతుమ్మ కస్తూరితుమ్మ- మొద లగునవి దీనిభేదములు అని బ్రౌ) అని- (నీలా- 2- 76) ప్రయోగ ముదాహరించి ఈ ఆం భా నే ఉదాహరించినది గాయత్రీ బాలతనయః ఖదిరో దన్తధావన అరిమేదో విట్ఖదిరే కదిర ఖదిరే సితే అని ఈ సందర్భమునందలి అమరము ఇట-గురు అరిమే దో విట్ఖదిరె అనుదానిని దుర్గంధము గలచంద్రచెట్టుపే ళ్లని వ్యాఖ్యానించి వెలితుమ్మ పే ళ్లని కొందఱు-అనినది

పాదిరి —పాదిలి (రూపాం) అని (శ ర సూ ని)

నెమలి మ్రాను — నెమిలియడుగు- అని శ ర నెమలి అని వాడు చున్నారుగాని దానికి నిర్ధారకప్రయోగము గన బడలేదు - అనియు శర నెమలియడుగుమ్రాను అనియే బ్రౌ పా (చూ అను) ఇట్లే (వావి పా) (సూ ని) నెమలి గ్రహించినది (క నెమలి త ఖమలి)

సీ. గచ్చ గ్రగచ్చనఁ జెల్వు గాంచు గాచస్థాలి
ప్రేంకడ మనఁగను బ్రేంకణ మనఁ
దోఁచుఁ బ్రియంగువు దుండిల మన గను
దుండిక మనఁ దగు దుండుకంబుఁ
బెద్దమ్రా నన గను బెనుమ్రా నన న్మహా
నింబనామములు గా నెగడు చుండు
శింశుపానామ మై చెలఁగు నిరుగు డనఁ
దిరిసెము గిరిసెము దిరిసెన మనఁ
జనును శిరీషాఖ్య సంపంగి సంపెఁగ
యనఁ జంపకాహ్వయ మౌను బొగడ

యనఁగ వకుళంబు దనరును నమృత మీాఱు
నుసిరిక యటంచ నన్నెలయుసిరిక యన
నలరు ధాత్రి తా డి యనన్ వితీత
కంబు విలసిల్లు చుండును సాంబమూర్తి 49

గచ్చ గ్రగచ్చ—ఇవి కాచస్థాలికి పేర్లు
ప్రేంకడము ప్రేంకణము—ఇవి ప్రియంగువునకు పేర్లు
దుండిలము దుండికము—ఇవి దుండుకమునకు(దుందుగకు శ్యోనాకమునకు)పేర్లు
పెద్దమ్రాను పెనుమ్రాను—ఇవి మహానింబమునకు (పెదవేఁపకు) పేర్లు
ఇరుగుడు—ఇది శింశుపకు (అగురువృక్షమునకు) పేరు
దిరిసెము గిరిసెనము దిరిసెనము—ఇవి శిరీషమునకు పేర్లు
సంపంగి సంపెఁగ—ఇవి చంపకమునకు పేర్లు
పొగడ—ఇవి వకుళమునకు పేరు

ఉసిరిక—ఇది అమృతకు పేరు

నేలయుసిరిక—ఇది భూధాత్రికి పేరు

తాఁడి—ఇది విభీతకమునకు (తాండ్రకు) పేరు

శింశుప —( పిచ్ఛిలా ఉగురు శింశుపా అని (అమ )శింశప (రూపాం ) రోచన శ్శింశ పాయూం తు అని (వైజ భూమి వనా )

సంపంగి —సంపఁగె సంపఁగియ (రూపాం ) (సంపఁగె) పసిఁడిగిన్నియలోవినంపంగె నూనె వనజముఖి యొత్తు తల యంటె మనుజపతికి' (రపి - 1 ) (సంఫఁగియ) సింగారపు దోఁటకుఁ జని చెంగల్వలకొలనిపొంత జిన్నలకడ సం పంగియలనడిమి యన టుల చెంగటిలేమావిదండ చేమంతులలోఁ (యయా 5 97 ) (చూ శ ర )

కాచస్థాలి —కలిగొట్టుచెట్టు పాటలి-అని సం నిఘంటువులు కాచస్థాల్యాం కుబేరాక్షీ కృష్ణవృన్తా ఫలేరుహా అమోఘా పాటలి ర్న క్లీ (వైజ భూమి వనా ) కాచస్థాలీ ఫలేరుహా (అమ ) (కాకాస్థాలీ- పాఠాం )

గచ్ఛ — కచ్ఛ గ్రచ్ఛన - అని (వావి ) (అపపా )

దుండికము —దుండిగము (రూపాం ) దుండిగము దుండిక మన గ దుండుకంబు అ పదా (అచర 77 ) (దుండగమ-అపముద్రి ) (చూ సూ. ని )

దుండిలము — దుందిల (వావి ) (అపముద్రి )

పెద్దమ్రాను —పెద్దమ్రాను= దుండుకమ- అని శ ర (చూ పెద్ద ) బ్రౌ కూడ-పెను మాను దుండిగపుమాను-కట్వంగము- అనురీతిని వచించు చున్నది- (చూ పెద్దమాను ) మహానింబము పెద్దమ్రాను పెదవేము (వాచ ) అని సూ ని

సీ కరక యం చనఁగను బరఁగు హారీతకి
    యశది యం చనఁగను హాశది యనఁగ
సరళంబు చనుఁ బనస యన్నంగఁ బణస మా
    వే మన నింబ మై వెలయు చుండు

గఱివేము నాఁగ నమరు గృష్ణనింబము
నేలవే మనఁగ భూనింబ మొప్పు
దాడింబ యనఁగను దాడిమం బలరును
దర్కారి యొప్పును దక్కలి యన
గీ దక్కె డనఁ దక్కెల యనంగఁ దక్కె యనఁగ
నెల్లి యన నగ్నిమంథము నెగడుఁ గొడస
కొడిసె యనఁ గుటజం బగుఁ గొడిసెపాల
నాఁగ నింద్రయవము దోఁచు నాగభూష 50

కరక—ఇది హరీతకికి పేరు

అళది హళది—ఇవి సరళమునకు పేర్లు

పనస—ఇది పణసమునకు పేరు

కఱివేము—ఇది కృష్ణనింబమునకు పేరు

దాడింబ—ఇది దాడిమమునకు పేరు

తక్కలి తక్కెడు తక్కెల తక్కె—ఇవి తర్కారికి పేర్లు

నెల్లి—ఇది అగ్నిమంథమునకు (ఒకవిధ మైనకూరాకుచెట్టునకు కూరనెల్లికి) పేరు

కొడస కొడిసె—ఇవి కుటజమునకు (కొండమల్లెకు)పేర్లు

కొడిసెపాల—ఇది ఇంద్రయవమునకు (కొడిసెవిత్తులకు) పేరు

పణసము — ఇది ఇట్లనుటయుక్త మనిపించినది దీనికి వికృతి పనస - పనసః కణ్టకి ఫలః అనునమరమును వ్యాఖ్యానించుచు సుధాకారుడు తనవ్యాఖ్యలో పణస ఇత్యపి పాఠః- అనినాడు శ ర ఇట్లను చున్నది- (పనస) దీనిని గొందఱు వైకృతము గా వాడి యున్నారు కనుక సంస్కృతమున పణస అనియే పాఠ ముండు నని తో చెడి

(అని) (చూ పనస-శ ర) గురు గూఢ (పా పణసః) అనినది పనసము
ఉనుపారమున పల్లకి శబ్దము లో నగువానివంటి దిదియు ననవలయును

దాడింబ —దాడినిమ్మ దాడిమ్మ దానిమ్మ- (రూపాం) (దాడిమ (సం) దాడింబె-క)
అని (సూ ని) దాడిమ్బ శబ్దము సంస్కృతము గాఁ గానవచ్చు చున్నది దాడి
మ్బోఽపి- దాడిమ్బసార పిణ్డీరస్వాద్వామ్ల శుకవల్లభా-ఇతి రభసాత్ అని సుధ (చూ
సమా కరకదాడిమౌ వ్యా) కనుక ఇట దాడిమ్మ అనియో దాళిమ్మ అనియో
ఉండుట న్యాయ్య మనిపించు చున్నది సాంబ దాళిమ్మ దానిమ్మ యన దాడిమియు
అనినది (స్థావ 57)

కొడిసెపాల — ఏత స్యైవ కళిఙ్గేన్ద్రయవభద్రయవం ఫలే కొడిసెపండు-అని గురు
ఇన్ద్రయవస్య కుటజబీజస్య అని సుధ పూర్వము వృక్షవిశేషముల వచింతు ననినది
అం భా ఐనను ఆనుషంగికము గా బీజాదుల వచించుట దొనగు కాదు సంగ
తమే

తక్కిలి —తక్కిలి తక్కెడ తక్కెడు తక్కెడు తక్కెల- (రూపాం)-అని (సూ ని)
తక్కెడుచెట్టు బుడ్డబుడుసర (చి ని ఒకజాతినెల్లిచెట్టు- అని వైద్యనిఘంటువు) అని
(సూ ని)

సీ. పాలకొడిసె యనఁబడు శ్వేతకుటజంబు
కలివె నాఁ గృష్ణపాకఫల మమరుఁ
జీకటిమ్రా ననఁ జెలఁగుఁ దమాలంబు
వావిలి యన సిందువార మలరు
బండెడ యనఁ దెల్లవావిలి యన శ్వేత
సురసాభిధాన మై పరఁగు చుండు
దావరడంగి నా దేవతాడ నన నేర
వకడ యం చనఁగను వఱలు దేవ

గీ. తాళనామంబు మల్లె నాఁ దనరు మల్లి
యడవిమల్లె నా నాస్ఫోట యగును బొండు

మల్లె యనఁగ మహామల్లి మనును నిత్తె
మల్లె నా నిత్యమల్లి యౌ మాతృభూత

పాలకొడిసె—ఇది శ్వేతకుటజమునకు పేరు

కలివె—ఇది కృష్ణపాకఫలమునకు (ఓఁకచెట్టుకు)పేరు ( వాకకాయ వాకపండు అని దీనికే లోకవ్యవహారము)

చీకటిమ్రాను—ఇది తమాలమునకు పేరు

వావిలి—ఇది సిందువారమునకు పేరు

బందెడ తెల్లవావిలి—ఇవి శ్వేతసురసకు పేర్లు

దావరడంగి దేవతాడి ఏరవకడ—ఇవి దేవతాళమునకు పేర్లు

మల్లె—ఇది మల్లికి పేరు

అడవిమల్లె—ఇది ఆస్ఫోటకు పేరు

బొండుమల్లె—ఇది మహామల్లికి పేరు

నిత్తెమల్లె—ఇది నిత్యమల్లికి పేరు

పాలకొడిసె — వృక్షవిశేషము --ని క్రిందిప్రయోగ మిచ్చు చున్నది సూ ని కడప కొడిసె పాలకొడి సెట్టులొద్దుగు (హంస 4 )

ఆస్ఫోట —ఆస్ఫోత- (రూపాం ) సైవా ఽఽస్ఫోతా వనోద్భవా అను అమరము ను వ్యాఖ్యానించుచు సుధ- స్ఫుటిర్-వికసనే (భ్వా ప సే ) పచాద్యచ్ పృషోదరాది త్వాత్ (6- - 09 ) టస్య తో వా అనినది గురు- ఆస్ఫోటా అని గ్రహించి ఆస్ఫోతా పాఠాన్తర మనినది

దావరడంగి —డావరడంగి (రూపాం ) దక్కు- లో నగువానిదాకు డకారంబు విభాష నగు అని బాలవ్యా (ప్రకీ 4 )

సీ నాగమల్లె యనంగ నాగమల్లిక మీఱు
శ్రీహస్తినీసంజ్ఞ చెలఁగు గురుగు

నాఁగ మొల్ల యనఁ గుందము చెలంగును యూధి
క యమరు నడవిమొల్ల యన గురిజ
గురివెంద నాఁగను గుంజాఖ్య విలసిల్లుఁ
దగును మాధవియు బండిగురువిం ద
నంగఁ గుబ్జంబు గొజ్జంగి గొజ్జెంగ నాఁ
జను జాజి యనఁగను జాతి వెలయు

గీ మనును విరవాది యన నవమల్లికాఖ్య
వఱలుఁ జేమంతి యనఁగ సేవంతి మంకె
న యన బంధూక మగు దాసనం బటన్న
జపకుఁ బేరై తనర్చును జంద్రమౌళి 52

నాగమల్లె—ఇది నాగమల్లికకు (ఒకదినుసుమల్లెకు, అష్టపత్రికకు) పేరు

గురుగు—ఇది శ్రీహస్తినికి (ఘూరుండికి) పేరు

మొల్ల—ఇది కుందమునకు పేరు

యూధిక—ఇది అడవిమొల్లకు పేరు

గురిజ గురివింద—ఇవి గుంజకు పేర్లు

బండిగురువింద—ఇది మాధవికి పేరు

గొజ్జంగి గొజ్జెంగ—ఇవి కుబ్జమునకు (మిక్కిలి పరిమలము గలపువ్వులతోఁ గూడిన చిన్నవృక్షవిశేషమునకు గులాబికి) పేర్లు

జాజి—ఇది జాతికి (మాలతికి జాదికి) పేరు

విరవాది—ఇది నవమల్లికకు (ఒకజాతిజాజికి) పేరు

చేమంతి—ఇది సేవంతికి (సేమంతికి) పేరు

మంకెన—ఇది బంధూకమునకు పేరు

దాసనము—ఇది జపకు పేరు

గొజ్జంగి —(సం కుబ్జకః ప్రా కుబ్జగో క గొజ్జగె) సేవంతికావిశేషము జేకుల చేమంతి- చి ని పచ్చపువ్వుల మొగలి ఆఁడుమొగలి- ప్రౌ అవి (సూ ని) గొజ్జఁగనీరు-పన్నీరు- దేవకి యొసంగఁగా వసుదేవు డపుడు చంద్రికాంతపుగిండి గొజ్జంగనీటఁ బసి డిపళ్లెములోఁ బదాబ్జములు గడిగి (విజ వి 3 0) (చూ సూ ని)

చేమంతి —చామంతి అని యొకకవి ప్రయోగించినాఁడు- చామంతులు చెంగలువలు జాజులును దగన్ (రాధా మా 4- 54)- (చూ సూ ని)

విరవాది —విరవాజి విరజాజి- (రూపాం) (చూ సూ ని)

నవమల్లికా — నవమాలికా -అనియు దీనికి నామాంతరము సప్తలా నవమాలికా' అని (అమ)

గురివెంద — గురిగింజ నాఁగను — (వావి అపపా)

సీ మైద గోరంట నా మనుఁ గురంటకసంజ్ఞ
కొరవి నాఁ గ్రోవి నాఁ గ్రొమ్మి నాఁగఁ
గురవకనామ మొఁ గరవీర మలరును
గన్నేరనంగను గన్నెరనఁగ
వెణుతురు నాఁగను వెలయుఁ గరీరంబు
మాదిఫలం బన మాతులుంగ
మొప్పు నుమ్మెత్తన నున్మత్త మలరును
బైఁడి యుమ్మెత్త నాఁ బరఁగుఁ గాంచ

గీ నాహ్వయము మర్లుమాతంగి నాఁగను మరు
లుమ్మెత్త యనంగ మదనాఖ్య యొనరు గగ్గ
ర యనఁ జెన్నారును గరింజరాభిధాన
మర్క మలరును జిల్లేడటన్న నభవ?

మైద గోరంట—ఇవి కురంటకమునకు పేర్లు

కొరవి క్రోవి క్రొమ్మి—ఇవి కురవకమునకు (ఎఱ్ఱగోరంటకు) పేర్లు

గన్నేరు గన్నెరు—ఇవి కరవీరమునకు పేర్లు

వెణుతురు—ఇది కరీరమునకు పేరు

మాదిఫలము—ఇది (మాతులుంగమునకు) పేరు

ఉమ్మెత్త—ఇది ఉన్మత్తమునకు పేరు

పైఁడియుమ్మెత్త—ఇది కాంచనాహ్వయమునకు (నాగకేసరమునకు పుష్ప ప్రధాన మైనయొక మొక్కకు) పేరు

మర్లుమాతంగి మరులుమ్మెత్త—ఇవి మదనమునకు (త్రొక్కఁగానే మరులు పుట్టించెడి యొకయోషధికి భూతకేశికి) పేర్లు

గగ్గెర—ఇది కరింజరమునకు (నల్లగగ్గెరకు) పేరు

జిల్లేడు—ఇది అర్కమునకు పేరు

మాదిఫలము — మాదిఫలము అని శ ర గ్రహించి మిశ్ర వి అనినది యయా చ ప్రయోగమునఁగూడ మావులు జిన్నలు మాదిఫలంబులు' అనియే పాఠ మను చున్నది జటునేగాక మును చేరితిమి మగువ మాదిఫలంబు కావలసెనేని గొను కాన్క మాదిఫ లంబు (ఉ రా 6 6 ) అను చోఁగూడ మాదిఫలంబు' అనియే పాఠ మిచ్చు చున్నది సూ ని యయా లోను ఆం భా లోను మిశ్రగ్రామ్యములు ప్రయుక్తములు గానందున మాదిపల మనుటయే న్యాయ్య మనుచున్నది ఆం భా 'పాండవబీడు బాలసంగ డము వంటివానినిఁ గా దనుట లేదు అట్టిదే యిది

గగ్గెర —బిల్వాదులట్లు పూజ కుపకరించునది యిది- 'దవనమును గగ్గెరయు బిల్వదళము లాది యైనపూజార్హవస్తువు లపుడు తెచ్చి (ఉ రా 3 20 ) (చూ సూ ని ) కరింజ రమ' నకు తులసి' అను- అర్థము కలదు కాని ఆం భా తులసి ని వేఱుగా చెప్పినది (చూ 2 65 ) ప్రౌ కగ్గెర గా గ్రహించి- కరంజకము ఆం భా క్రానుగు -అను

చున్నది ప్రమాదము ఆం ధా కానుగు ను వేఱుగా చెప్పి యున్నది- కాను గన గ
దనరును గఁరంజసంజ్ఞ (2-47) [కరింజరము నల్లగగ్గెర-అని శ ర సూ వి ]

సీ బదనిక వదనిక బవనిక యన వంద
        చనుఁ దిప్పదీగె నాఁగను గుడూచి
చెల గును మూర్వాఖ్య యలరును జా గన
        విసబొద్ది యనఁగను వెలయు బార
దూలగొండి యనంగ దురదగొండి యనఁగఁ
        దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ
గండూర కచ్ఛురాఖ్య గ విరాజిల్లు దీఁట
        కసివింద యన నెలుకచెవి యన గ

గీ నెలుకజీడి యనంగను నెస గుఁ జిత్ర
యొప్పు చుండు నపామార్గ ముత్తరే న
నంగ బారంగి గంటుబారంగియుఁ జెలు
తేఁ ఖనఁగ భార్గి వెలయును ద్రిపురవైరి 54

బదనిక వదనిక బవనిక—ఇవి వందకు (చెట్టుమీఁద మొలచెడి యోషధివిశేష మునకు) పేర్లు

తిప్పదీగె—ఇది గుడూచికి పేరు

నాఁగు—ఇది మూర్వకు పేరు

విసబొద్ది—ఇది పాఠకు పేరు

దూలగొండి దురదగొండి తీ టకోవెల—ఇవి కండూరకు పేర్లు

తీఁటకసివింద—ఇది కచ్ఛురకు (రేగడిదూలకు) పేరు

ఎలుకచెవి ఎలుకజీడి—ఇవి చిత్రకు (ఎలుకచెవివంటి యాకులు గలమూషపర్ణికి) పేర్లు

ఉత్తరేను—ఇది అపామార్గమునకు పేరు

బారంగి గంటుబారంగి చిఱుతేఁకు—ఇవిభార్గికి (ఓషధివిశేషమునకు) పేర్లు

మూర్వాఖ్య —(మోర్వాఖ్య-పావి అపముద్రి)
తీటకసింద — తీటసివెంద (రూపాం) అని (శర)
గుహూచి —గుడూచి (రూపాం) (దళయో రభేద)
చిఱుతేఁకు —చిఱుతే కు (రూపాం) (చూ సూ ని)

భార్గి — భార్గి అనియే అమరాదులు దీని వచించి వ్యాఖ్యానించినవి బృహన్నిఘంటురత్నాకరము భార్గి' అని దిని ననినది శర సూ ని (బృ ని ర నే) అనుసరించి నవి)

సీ కోలపొన్న యనంగఁ గొమరారుఁ బృశ్నిప
ర్ణియుఁ గ్రోష్టువిన్నయు నేలపొన్న
నా నక్కతోఁకపొ న్ననఁ బొర్లుగాడి నా
రోఁకటిబండ నా మూధి కెక్కుఁ
గారుగ చ్చనఁగను గ్రాలు వాకూచియుఁ
బల్లే రన శ్వదంష్ట్ర పరఁగు చుండుఁ
జిఱుపాల యనఁగను క్షీరావి చె న్నొందుఁ
బిల్లపీఁచర యనఁ బీఁచర యనఁ

గీ బ్రబలును శతావరి పసపు పసు పనంగ
వఱలును హరిద్ర వస యన వజ యనం.
వచకుఁ బేరు చెలఁగు నతివస యనంగ
నతివిషాభిధ విలసిల్లు నంగజారి 55

కోలపొన్న—ఇది పృశ్నిపర్ణికి (కోలాకుపొన్నకు చెట్టుమొదట్టినుండి ఆకులు గల అంఘ్రిపర్ణికి) పేరు

నేలపొన్న నక్కతోఁకపొన్న పొర్లుగాడి రోఁకటిబండ—ఇవి క్రోష్టువిన్నకు (నక్కతోఁకయ ట్లుండు తృణవిశేషమునకు) పేర్లు

కారుగచ్చ—ఇది వాకూచికి (బావంజికి) పేరు

పల్లేరు—ఇది శ్వదంష్ట్రకు పేరు

చిఱుపాల—ఇది క్షీరావికి పేరు

పిల్లపీఁచర పీఁచర—ఇవి శతావరికి పేర్లు

వస వజ—ఇవి వచకు పేర్లు

అతివస—ఇది అతివిషకు (మహౌషధమునకు ఒక మూలికకు) పేరు

పొర్లుగాడి — కోలపొన్న పొర్లుగాడి-ఉనిశర (చూ క్రోష్టుపుచ్ఛి) పృశ్నిపర్ణీ పృథక్పర్ణీ చిత్రపర్ణ్యఙ్ఘ్రిపర్ణికా క్రోష్టువిన్నా సింహపుచ్ఛీ కలశీ ధావనీ గుహా అని (అమ) క్రోష్టువిన్న పృశ్నిపర్ణి-భిన్నములు (చూ గురు) (సుధ- తొమ్మిదింటిని ఏకార్థములగానే వ్యాఖ్యానించినది) ఆం భా గురు వ్యాఖ్యనే అనుసరించిన దిట

క్రోష్టువిన్న — క్రోష్టుపుచ్ఛ (వావి పా) రోకటబండ దగ్గఱ ఈపారమునే సూని ఇచ్చినది పైనాపారమునకై (చూ సూని కోలపొన్న) క్రోష్టుపుచ్ఛిక కోలపొన్న క్రోష్టువిన్న నక్కతోక పొన్న (చూ సూనిశర)

వాకూచి — గ్రాలు వాకుచియును అని (సూని పా పారాం) కాలమేషీ కృష్ణఫలా వాకూచీ పూతిఫల్యపి అని (గురు పా) వాకుచీ పూతిఫల్యపి అని (సుధాపా) (గురు పారము ననుసరించి) ఇట వాకూచ అనినది (వావి ఆం భా)

అతివస — (సం అతివిషా ప్రా అతివిసా క అతిబిస అతిబజే త అదివిడయం) (చూ సూని)

శ్వదంష్ట్ర — అశ్వదంష్ట్ర అనుదానిని గూడ (సూని) పల్లేరు' అనుదానికి పర్యాయముఁగా ఇచ్చినది

సీ అడ్డసర మనంగ నటరూషనామ మొ
గింజెన యనఁగను డింజెన యన

గిరికర్ణి చెలు వొందు క్షీరము విరాజిల్లు
గొబ్బి యనంగను గొలిమిడి యనఁ,
గోకిలాక్షము ములుగొలిమిడి నా మీఱు
నలరు సదాప యం చన మధురిక
చెము డని జెము డనఁ జెలఁగు సింహాండము
ముత్తవ యం చనఁ బోలును బల,

గీ నూనెముంత యనంగను నొప్పు గుచ్ఛ
బలయు జీబులు కన నాగబల చెలంగుఁ
దడ యనఁగ ధన్వ మగు గూబతడ సులితడ
యన మహాబల దనరు వృషాధిరూఢ 56

అడ్డసరము—ఇది అటరూషకు (ఒకానొకయోషధికి) పేరు

గింటెన తింటెన—ఇవి గిరికర్ణికి పేర్లు

గొబ్బి గొలిమిడి—ఇవి క్షీరమునకు (పచ్చని పూవులు గల గొబ్బికి) పేర్లు

ములుగొలిమిడి—ఇది కొకిలాక్షమునకు పేరు

సదాప—ఇది మధురికకు పేరు

చెముడు జెముడు—ఇవి సింహాండమునకు పేర్లు

ముత్తవ—ఇది బలకు (చిట్టాముదపుఁజెట్టునకు) పేరు

నూనెముంత—ఇది గుచ్ఛబలకు పేరు

జీబులుక—ఇది నాగబలకు (ఒకదినుసుబీరకు) పేరు

తడ—ఇది ధన్వమునకు (ధనుర్వృక్షమునకు) పేరు

గూబతడ సులితడ—ఇవి మహాబలకు పేర్లు

కోకిలాక్షము —అమ వై జ- ఇక్షుగన్ధా తు కాణ్డేక్షుకోకిలాక్షేక్షురక్షురా (అమ) కోకిలాక్షస్తు కాణ్డేక్షు రిక్షురః క్షురకః క్షురః (వై జ) అనురీతిని కోకిలాక్ష క్షుర శబ్దములు సమానార్థకము లని వచించు చున్నవి ఆం ఛా గొలిమిడి (క్షురము) ములుగొలిమిడి (కోకిలాక్షము)-అని భేద మేర్పఱచినది ముల్లు ఉండుట లేకపోవుట వీనివిశేషభేద మన వచ్చునేమో గోంట ములుగోరట- అనువానియట్లు తెలుగువారి వ్యవహారమునుబట్టి ఆం ఛా వేఱుపఱచిన విట్టివి కొన్ని యుం దున్నవి ములుగొలిమిడి దగ్గఱ ఒకజాతి గొబ్బి అని సూ ని [గొబ్బి ముఱగొబ్బి సమానార్థకము లను చున్నది శ ర ఇది యెట్లో] విశ్వము- క్షురశబ్దము నకు నానార్థముల ని ట్లిచ్చు చున్నది- క్షురస్స్యా చ్ఛేదనద్రవ్యే కోకిలాక్షే చ గోక్షురె (అని) (గోక్షురము- ఏను గుపల్లేరు)

చెముడు —జెము డన జముడన జెల గు సంహుండము అని బ్రౌ వ్రాత వ్రాతప్రతుల పాఠము (చూ సూ ని చెముడు) (చెముడు-అనునది శ ర చి ని పా) శ ర ఇట్లను చున్న దిట- వాడుకయందు సరళాది గా నుండినను ఇట్లు పరుషాది గా కొన్నిపుస్తకములందు వ్రాయ బడి యున్నది (అని)

ముత్తవ — ముత్తవపులగము' అని (బ్రౌ శ ర)

తడ — ధనుర్వృక్షము దీనియాకులు విస్తళ్లకును కఱ్ఱ విండ్లు చేయుటకును ఉపయోగించును (తడాకులు తడవిండ్లు-అని బ్రౌ) - (మా సూ ని)

జీబులుక — జిబిలిక (జీబిలికకు రూపాం) అని శ ర జీబులుక- వ్రాతప్రాంతప్రతి పాఠములు జీబిలిక ముద్రి పా జిబులుక బ్రౌ పా జిబిలిక చి ని పా (చూ సూ ని జీబులుక)

సీ గిలగిలచెట్టు నా గిలిగింతచెట్టు నా
గిలిగిచ్చచె ట్టన గిలకచె ట్ట
టన్న ఘంటారవ యౌను దా కన ద్రాక్ష
యగుఁ బ్రిపుట వెలయుఁ దెగడ యనిన
నెగడు విదార్యాఖ్య నేలగుమ్మడి యన
నోమ మం చన దీప్య మొప్పు చుండు

నీరుపిప్పలి యం చనిన బొక్కెన యనంగఁ
దోయపిప్పలి సంజ్ఞ దోఁచు చుండుఁ

గీ జనుఁ గురాసానియోమ మం చన యవాని
కాభిధ సుగంధిపాల యం చనిన దూడ
పాల యన గోపికాఖ్య యై పరఁగు మామె
న యన నుత్పలశారిబాహ్వయ మగు భవ 57

గిలగిలచెట్టు గిలిగింతచెట్టు గిలిగిచ్చచెట్టు గిలకచెట్టు—ఇవి ఘంటారవకు పేర్లు

దాక—ఇది ద్రాక్షకు పేరు

తెగడ—ఇది త్రిపుటకు పేరు

నేలగుమ్మడి—ఇది విదారికి పేరు

ఓమము—ఇది దీప్యమునకు పేరు

నీరుపిప్పలి బొక్కెన—ఇవి తోయపిప్పలికి పేర్లు

కురాసానియోమము—ఇది యవానికకు (కురాసానిదేశమందు పుట్టు-ఓమమునకు) పేరు

సుగంధిపాల దూడపాల—ఇవి గోపికకు (శారిబకు) పేర్లు

మామెన—ఇది ఉత్పలశారిబకు (నల్లసుగంధిపాలకు) పేరు

విదారీ —తెల్లనేలగుమ్మడి (అని శ ర ) నల్లనేలగుమ్ముడు-అని గురు విదార్యాం భూమి కూశ్మాణ్డ స్యా తు కృష్ణా పలాశికా క్రోష్టికా క్షీరశు క్లేక్షుగన్ధి కేక్షువిదారికా శ్వేతా క్షీరవిదారీ సా మహాశ్వే తర్షగన్ధికా అని (వై జ భూమి వనా )

ఉత్పలశారిబ — నుత్పల్లశారిబా —(వావి అప పా ) గోపీ శ్యామా శారిబా స్యా చ్చన్ద నోత్పలశారిబా అని (అమ ) గోపి-ఉత్పలశారిబ' సమానార్థకము లనిన దిది

మామెన — మామెన - దూడపాల శారిబ అని భేదము లేకుండఁగనే అర్థమొసగినది (శ ర) సుగంధిపాల గ్రహింపలేదు శ ర సుగంధిమూల గ్రహించి మావలి అని అర్థమొసగినది బ్రౌ సుగంధపాల గ్రహించి శారిబ అర్థమనినను సుగంధిపాల - అం భా పాఠముగా ఇచ్చి గోపిక అర్థమనినది (చూ అను)

సుగంధిపాల —ఇది (మిశ్ర గ్రా) ఇట్టివి కొన్ని గ్రహించినది అం భా అని పూర్వముక్తము సుగంధపాల ఇది అయినప్పుడు సుగంధం పాలయతి అను వ్యుత్పత్తితో సం శబ్దము గానే యిది సాధువు కావచ్చును అం భా పా సుగంధపాల అనుచో అప్పుడు మిశ్ర గ్రా అనియో సుగంధిమూల కైన (వికృ) అనియో అనక తప్పదు

సీ అరఁటి యరంటి యనఁటి యనంటి నాఁ
గదళికాహ్వయములై పొదలుచుండుఁ
దత్ఫలగుచ్ఛంబు దనరు నత్త మనంగఁ
జనును జీపనఁ దదంశాఖ్యగాను
బొందె యనఁ జనఁగను బొల్చును గదళీత్వ
గంతర్గతశ్వేతకాండసంజ్ఞ
తత్కేసరాగ్రవృత్తాంశంబు గోరనఁ
దత్కేసరాంతర్గతాచ్ఛసూచి

గీ కానిభాంశంబు క్రముచ్చనఁగా జెలంగు
బిల్లపెస రనఁగాఁ గాకిపెస రనఁ దగుఁ
గాకిముద్గాఖ్య తప్పెట కారుకొల్లి
మాడి యన గ వనకుళత్థ మగు మహేశ 58

అరఁటి అరంటి అంటి అనఁటి అనంటి—ఇవి కదళికకు పేర్లు

అత్తము—ఇది తత్ఫలగుచ్ఛమునకు (అరఁటిపండ్లగుత్తికి) పేరు

చీపు—ఇది తదంశమునకు (అత్తమునందలి యొకగుత్తికి) పేరు

బొందె—ఇది కదళీత్వగంతర్గతశ్వేతకాండమునకు (అరఁటి ఊఁచకు) పేరు

గోరు—ఇది తత్కేసరాగ్రవృత్తాంశమునకు (అరఁటిపువ్వులలో కేసరములపైని గుండ్రముగా నుండు-ఉల్లిపొరవంటి పదార్థమునకు) పేరు.

ముఞ్చచ్ఛ— ఇది తత్కేసరాంతర్గతాచ్ఛ సూచికాని భాంశమునకు (అరఁటిపువ్వులోని కేసరములలోపలి తెల్లనిసూదివంటి వస్తువిశేషమునకు) పేరు

పిల్లపెసర కాకిపెసర—ఇవి కాకముద్గమునకు పేర్లు

తప్పెట కారుకొల్లి మాడి—ఇవి వనకుళత్థమునకు (అడవియులవలకు) పేర్లు

పిల్లపెసర —పిల్లిపెసర-(వావి ఆపపా) (పిల్లిపెసర అని వ్యవ) బ్రౌ 'పిల్లిపెసర' గూడ గ్రహించినది (బ్రౌ ఆం భా పా పిల్లపెసర అనియే)

సీ వంగ యనంగను వార్తాక మై యొప్పు
నీరెత్తువంగ నా నీరువంగ
యనఁగను వృంతాక మలరుఁ గత్తెరవంగ
యనఁగఁ గర్తారిక దనరు చుండుఁ,
దచ్ఛలాటువుఁ బల్కుఁ దగును వంకా యనఁ
గంటకి చను ములుక యన నేఁబు
వంగ నా బృహతి యౌ వాఁకుడు నాఁ జిన్న
ములక నాఁగను నేలములక యనఁగ

గీ రాములక నాఁగ సర్పాక్షి ప్రబలు నల్ల
తెగడ నాఁగఁ ద్రిపర్ణాఖ్య తెలియఁబడుచు
నుండు ముయ్యాకుపొన్నన నొప్పుఁ ద్రత్తి
యనఁగఁ గారాపి రజతగిర్యగ్రవాసి 59

వంగ—ఇది వార్తాకమునకు పేరు

నీరెత్తువంగ నీరువంగ—ఇవి వృంతాకమునకు (ఒకవిధ మగువంగకు) పేర్లు.

కత్తెరవంగ— ఇది కర్తారికకు(పెద్దవంగకు)పేరు.

వంకాయ—ఇది వంగకాయకు పేరు

ములక ఎఱువంగ—ఇవి కంటకికి (ముండ్లవంగకు) పేర్లు

వాఁకుడు పిన్నములక నేలములక రాములక—ఇవి బృహతికి (కంటకారికకు) పేర్లు

నల్లతెగడ—ఇది సర్పాక్షికి (కాలమేషికకు ఓషధివిశేషమునకు) పేరు

ముయ్యాకుపొన్న—ఇది త్రిపర్ణికి (సాలపర్ణికి) పేరు

ప్రత్తి—ఇది కార్పాసికి (ప్రత్తిచెట్టునకు) పేరు

ములక — శ ర ములక గ్రహించి వార్తాకి అనునర్థ మిచ్చె— ఇది త్రివిధము కప్రములక తెల్లములక పెద్దములక అనినది (వాచం ములక చూ సూ ని)

సర్పాక్షి — ఇది దొరకిన నిఘంటువులలో గన రాలేదు నల్లతెగడకు కాలమేష అను నర్థము శ ర ఇచ్చినది శ్యామా కాలమేషికా అని అమ సర్పాక్షి- పుట్ట గొడుగు-అనునర్థము గలది అర్థాంతరము గలదైయిది కాలమేషికకు పర్యాయము గా ఉండనోపు

ముయ్యాకు పొన్న — ముయ్యాకు బొన్న అని (శ ర) ఉధర్వణుడు అమిశ్రే శ్రీసమా తేక్వచి ప్రయోగ శ్శరణం కవే అనినాడు అహోబలపతి దీనిని వ్యాఖ్యానించుచు కేచి దిత్యుక్తే ఋను గుతావి కున్దనపుచాయ ఇత్యాదీని రూపాణీతి సిద్ధమ్ అని సుగాగమము పుంపులకడ వికల్ప మనినాడు చేటుకాలము (శాంతి 4 436) మొ ప్రయోగముల బట్టి నిర్ధారక ప్రయోగము లున్నప్పుడే సుమాగమమునకు నిత్యత అనవలయును

సీ బీకర బీఱ నా వెలయుఁ గోశాతకి
నేతిబీఱ యనంగ నెగడు చుండు
దద్భేదనామంబు ధామార్గవం బొప్పు
నడవిబీఱ యనంగ నావడ యనఁ
జే తిబీఱ యనంగ జెలఁగుఁ బటోలము
పొట్ల యం చన గను బొళ్ల యన గ

జేఁతిపొట్ల యన భాసిలును దిక్తపటోల
మలరును దొండ యం చన గఁ దుండి

గీ కాకి దొండ యనం జనుఁ గాకబింబ
తుర్యతుండి చెలఁగుఁ బిండిదొండ యనఁగ
నారుదొండ యనం బడు నార్తగళము
భూషిత భుజంగ శ్రీమాతృభూతలింగ 69

బీకర, బీఱ—ఇవి కోశాతకికి పేర్లు
నేతిబీఱ—ఇది కోశాతకీవిశేషమునకు పేరు
అడవిబీఱ ఆవడ చేఁతిబీఱ—ఇవి ధామార్గవమునకు (చేఁదు గలబీరకు) పేర్లు
పొట్ల ప్రాళ్ల—ఇవి పటోలమునకు పేర్లు.
చేఁతిపొట్ల—ఇది తిక్తపటోలమునకు (చేఁదు గల పొట్లకు) పేరు
దొండ—ఇది తుండికి పేరు
కాకిదొండ—ఇది కాకబింబకు పేరు
తుర్యతుండి— ఇది పిండిదొండకు (ఒక విధ మైనయోషధికి) పేరు
ఆరుదొండ—ఇది ఆర్తగళమునకు పేరు

ఆరుదొండ — ఆ దొండ (వి) తుజాలకము అడవిదొండ' అని (సూ ని)
ధామార్గవము — తెల్లపూవులు గల ఆవడ చెట్టుకు పేరు అని (గురు)

సీ చెప్పుత ట్టనఁగను జెలఁగు గోధాపది
నేలతాడి యనంగ నెసఁగు ముసలి
దుట్టుపు దుట్టువు, జుట్టు పనంగను
ద్వంద్వఫలాఖ్య మై తనరు చుండు

నెద్దునాలిక యయి యిక వొందు గొజిహ్వ
తాంబూలవల్లిక తమలపాకు
తీగె నా జెన్నొందు దెలియంగఁ దగును నూ
దోస రేణుకలు కూఁతురుబుడ మన

గీ వాలుక మ్మగు హ్రీబేర వాచకము గఁ
బొ సఁగు గురువే రనంగ రాపూ వనంగ
నశ్మపుష్పంబు వెలయును నందు గన గ
మురు మన గ హ్రాదినీసంజ్ఞ పర గు నభవ 6

చెప్పుతట్ట—ఇది గోధాపదికి (హంసపదిచెట్టునకు) పేరు

నేలతాడి — ఇది ముసలికి (అర్శోఘ్ని యగుతాలమూలికకు) పేరు

దుట్టుపు దుట్టువు జుట్టుపు—ఇవి ద్వంద్వఫలకు(అజశృంగికి దుట్టుపాకు తీగెకు) పేర్లు

ఎద్దు నాలిక—ఇది గోజిహ్వకు (ఒకజాతి చెట్టునకు) పేరు

తమలపాకుతీగె—ఇది తాంబూలవల్లికకు పేరు

నూదోస రేణుకలు కూఁతురుబుడమ— ఇవి వాలుకమునకు (ఒకజాతిదోసకు నూ గుదోసకు) పేర్లు

కురువేరు—ఇది హ్రీబేరమునకు (ఒకానొకవేరునకు) పేరు

రాపూవు—ఇది అశ్మపుష్పమునకు (ఒకానొక గంధద్రవ్యమునకు) పేరు

అందుగు మురుము—ఇవి హ్రాదినికి (గజభక్ష్య యగు సల్లకికి) పేర్లు

జుట్టుపు - జట్టుగు (రూపాం) శుక్లార్కమూలంబు జుట్టుగువేరును నెలమి పీడెముతో
నియ్యవలయు (చి కి చి ని) (చూ సూ ని)

దుట్టువు — చుట్టుగు (రూపాం) దుట్టుగు ద్రా కుడు దుండిలం బగ్నియు గాంధారి మిరి
యపు గాంద్ర నీలి (చికి చి ని) (చూ సూ ని) (దుస్టుపు తీగె అని వ్య)

గోజిహ్వ —ఎద్దునాలిః బెండ—ఉనియే ఇట శరసూని మొ వచించినవి అం భా బెండ ను వేఱు గా వచించు చున్నది (మూ 2 64) బెండ కా డిది వైజ ఒకచో గోజిహ్వ జ్యోతిష్మతి పర్యాయము లను చున్నది జ్యోతిష్మతీ సులవణా గోజిహ్వా భక్షిణీ శివా (భూమి వైశ్యా) (ఉని) (ధాన్య విశేషమున కివి పర్యాయము లని (వైజ టీక) వైశ్యాధ్యాయ మిది వనాధ్యాయము కాదు టీకవ్రాసినది యుక్తమే గురు జ్యోతిష్మతి అనుదానికి ఎక్కుడుదీగ-మానేరుతీగ- మెఱుఁగుదీగ- అని అర్థ మిచ్చి నది (అమ) వ్యాఖ్యానించుచు జ్యోతిష్మతి' వేఱు గా వచింప బడినది అం భా చే (చూ. 27) ఇది యేదియు అం భా కిట అర్థ మనఁగాదు అందులకే ఇది నా చే వేఱు గా వ్యాఖ్యాత మైనది

సీ. ఆరెపు వ్వనఁగను నారె లనంగను
ధాతకీకుసుమంబు దనరు చుండు
నేలకి యం చన నేలాభిధానము
రాక్షసి చను బలురక్కసి యనఁ
బులిగోరు చె ట్టన వెలయు వ్యాఘ్రనఖంబు
బెత్త మంచనఁగను వేత్ర మలరుఁ,
బే మటం చనఁగఁ దద్భేదంబు విలసిల్లుఁ
జెలఁగు శంఖిని కట్లచె ట్టనంగఁ

గీ దొవరిమ్రా ననఁ దువరిక దోఁపఁబడును
గ్రంథిపర్ణంబు పొల్పగు గండివనము
నాఁగ నాగిని నావురు నాఁగు రనఁగఁ
గేరుఁ, దలపోట యగును దంగే డన, భవ 62

ఆరెపువ్వు ఆరెలు—ఇవి ధాతకీకుసుమమునకు (ఎఱుజాజికి) పేళ్లు

ఏలకి—ఇది ఎలకు (ఒకానొకలతకు) పేరు

బలురక్కసి—ఇది రాక్షసికి (బృహచ్ఛదమునకు) పేరు

పులిగోరుచెట్టు—ఇది వ్యాఘ్రనఖమునకు పేరు

బెత్తము—ఇది వేత్రమునకు (బెత్తపుచెట్టునకు పేమునకు) పేరు

పేము—ఇది వేత్రవిశేషమునకు (ఒక జాతిపేమునకు) పేరు

కట్లచెట్టు— ఇది శంఖినికి (రాత్రియందు వికసించెడి యొకచెట్టునకు) పేరు

తొవరిమ్రాను—ఇది తువరికకు (తొగరుచెట్టునకు) పేరు

గండివనము—ఇది గ్రంథిపర్ణమునకు (పచ్చాకుమాచిపత్రికి) పేరు

నావురు నాఁగురు—ఇవి నాగినికి (ఒక జాతి చెట్టునకు) పేర్లు

తలపోటము—ఇది తంగేటికి (పచ్చనిపూలు గలగుల్మవిశేషమునకు) పేరు

ధాతకి — అగ్నిజ్వాలా సుభిక్షా తు ధాతకీ ధాతుపుష్పికా అని (అమ) ఇట— ధాతకీ కుసుమ మనెడి గంధద్రవ్యము- అని (గురు)

బలుఁక్కసు — బలురక్కసి అని (శ ర) (చి ని)- బలురక్కెస (నాఁగ జెముడు) అని కొన్ని మండలములవ్యవహారము

రాక్షసి — నల్లకచోరముపేళ్లు బలరక్కసి పేళ్లని కొందఱు - అని (గురు)

శంఖిని — కడిలచెట్టు పద్మపు తీగె-అని కొందఱు అని(గురు) కట్లతీఁగ 2 పద్మపు తీగ అని (శ ర)

నాగిని — ఈ పదము సం నిఘలలో కన్పడ వేదు అని (సూ ని) నాగపుష్పా శ్వేతపుష్పా నాగినీ రామదూతికా అని బృహన్నిఘంటురత్నాకరము చూచితిరా వేంకనార్యుని నిఘంటుపాండిత్యము సర్వజ్ఞు డీత డు గొల్లజిడ్డుచెట్టు అనునది అర్థాంతరము నాగినికి (చూ ఆం భా 2 66)

కట్లచెట్టు —ఒకానొకతీగ-ఖట్వ-అని (శ ర) కట్లైతీగ అని బ్రౌ కట్టుమామిడి మొ దృష్టములు ఇది కట్టుచెట్టు అగునేమో సూ ని కూడ ఇట్లే అభిప్రాయపడుచున్నది

నావురు — కమ్మతావులు కలనావురాకులు వఱచి అని (మనుచ 4 60) (ఉా సూ ని)

ఆరెపూవు —సూ ని మొ నిఘంటువు లేవియు గ్రహింప లేదు బ్రౌ ఆరెకూర ఆరె

చెట్టు - గ్రహించి దీని స్వరూపమును వివరించినది దీనియాకులు కూర గా ఉపయోగింతురు కోసుకూర (క్యాబేజి) వంటిపువ్వు- ఇది' అని (బ్రౌ వివ)
ఆరెలు —బహువచననిర్దేశ మవివక్షితము- బలుసు ముల్ మోదుగు పచ్చారె యారె వలిచంద్ర ములుచంద్ర వాడగన్నేరు (ద్వి శ సా 2 661పం) (చూ సూ ని)

సీ పెన్నే ఱనంగను బెన్నె రనంగను
దొమ్మడో లనఁగను దోఁచు నశ్వ
గంధ బలుసు కారు కసివెంద యన నొప్పుఁ
గాసమర్దం బిందుగ యనఁ జిల్ల
యనఁ గతకం బగు నారుకాభిధ మాఱు
నారు నాఁ దగు నుప్పి యనఁగ లవణి.
సురిగి యం చనఁగ శిఖరిణికిఁ బే రౌను
జెలఁగు నషోశము చిలిమిడి యన

గీ నుచ్చిఁత యనంగ ఖండిక యొప్పు ముల్లు
ముస్తె ముల్లుచిఁత యనఁగఁ బో లలర్క
మలరు గొల్లె యనంగ ఘొంటాభిధాన
మురువృజిన భంగ శ్రీ మాతృభూతలింగ 63

పెన్నేరు పెన్నెరు దొమ్మడోలు—ఇవి అశ్వగంధకు పేర్లు

బలుసు కార, కసివెంద— ఇవి కాసమర్దమునకు (ముండ్లు గలయొకజాతి చిన్న చెట్టునకు) పేర్లు

ఇందుగ చిల్ల—ఇవి కతకమునకు (బురదనీరు తేర్చెడిగింజలు గలయొకచెట్టునకు) పేర్లు

ఆరు— ఇది ఆరుకకు (చలువ నిచ్చుగుణములు గలిగి హిమాలయమునం దుండెడి యొక యోషధికి) పేరు

ఉప్పి—ఇది లవణికి పేరు

సురిగి—ఇది శిఖరిణికి (ఒకజాతిమల్లెతీగకు) పేరు

చలిమిడి—ఇది అక్షోళమునకు పేరు

ఉచ్చింత—ఇది కుండికకు (ఉస్తెకు) పేరు

ముల్లుముస్తె ముల్లుచింత—ఇవి అలర్కమునకు పేర్లు

గొౘ్లె—ఇది ఘోంటకు (రేగుచెట్టువంటి యాకారము గలిగి అడవియందుండెడి ఒకచెట్టునకు) పేరు

బలుసు — ఇది ఎర్షాకాలమున ఫలించును పచ్చనిపండ్లు గిలిగి యుండును దీనికూర శ్రాద్ధమునకు చాల ప్రశస్తమైనది బలుసుకూర లేని తద్దినము బుఱుసువారు లేని యజ్ఞము లేదు -అని లోకోక్తి

ఉప్పి —దీని భేదములను హంస ఇట్లు తెలిపినది (తెల్లకాంచనము తుండిల మెట్టకాంచన) ముప్పి తెల్లుప్పి నీరుప్పి (4- ) (అని) కుండలి అనినవి దీనిని (సూ ని శ ర)

సురిగి — ఒకానొకచెట్టు అని (శ ర)

అశ్వగంధ — అశ్వగంధి అని తెలుగువారివ్యవహారము అశ్వకన్ద స్త్వశ్వగన్ధి అని (వైజ భూమి వనా)

అక్షోళము — సంస్కృతనిఘంటువులలో లేదు అని (సూ ని) అక్షోటము అక్షోడము శ ర ఇచ్చి కొండగోగు (పర్వతపలువు)అర్థమను చన్నది ఈశబ్దమే దళయో రభేద అని అక్షోళము కావచ్చును కాని దీనికి కొండగోగు అర్థమనుటమాత్రము పొసంగదు కొండగోఁగును వేఱుగా వచించినది ఆం భా (చూ 2 43) అన్వార్థిక మిది

అలర్కము —ఇది జ్ఞానప్రదమగునొకకూరాకుచెట్టు వ్యసనియై రాజభోగముల ననుభవించు యామునాచార్యునిని జ్ఞానవంతుని గా జేయుటకు శ్రీరామమిశ్రుడు దీనియాకు కూరగా వండించి అతని దినిపించెను ఆసందర్భమున ఆముక్తమాల్యదయందు దీనిస్వరూపస్వభావము లిట్లు వర్ణింప బడినవి ముల్లుదలకొనవినవకిపుఁ బల్లవములతోడ ముక్తిభామచెవులకుం బల్లేరు బువ్వ లగుపువు లుల్లసిలునలర్కశాక మొదుగు గ గొనుచున్ (4 95)

గొౘ్లె —ఇది ఘోంటాభిధానము అవి (బ్రౌ పా) ఘంటాభిధానము అని (వావి పా) గొౘ్లె ఘోంట బదరి రేగుచెట్టు అని బ్రౌ వివరణము (చూ అను) గొౘ్లె-

రేఁగుచెట్టు అనియే శర గూడ అర్థ మిచ్చినది ఘోంటా శబ్దమునకు రేఁగు పోఁక అను రెండర్థములను గలవు కిర్కాన్డు ర్బదరీ కోలీ ఘోణ్టా (చూ గురు ) ఘోణ్టాతు పూగః క్రముకః అనియు(అమ ) అంటా రేఁగు పోఁక అనువానిని ఇంకొకచో వచించినది వేఱు గా- (చూ 2 4౦ 8 ) ఇట బ్రౌ. పారమే పరిగ్రాహ్య మైనను అర్థము బ్రౌ శర లు వచించినది కాదు ఈ ఘోంటా నుగూర్చి ఒక ప్రామాణికవివరణ మి ట్లున్నది- బదరీసదృశాకారో వృక్ష స్సూక్ష్మఫలో భవేత్ అటవ్యా మేవ సా ఘోణ్టా గోపఘ ణ్టేతి చోచ్యతే (చూ సుధ ) (సూక్ష్మఫలములు గలిగి రేఁగు చెట్టువంటి యాకారముతో అడవియందే ఉండు-ఒకచెట్టు ఘోంట గోపఘంట అనియు దీని నందురు (అని ) ఈయర్థమే ఇట వక్తవ్య మనిపించినది ఘోంటాభిధానము అను బ్రౌ పారమే కవిహృదయంగమ మని తోఁచినది ఇఁక రెండవపారము ( ఘంటాభిధానము అను వావి పా ) (పారాం ) గోలీఢా రూటలో ఘణ్టా పాటలి ర్మోక్ష ముష్కకా' అని (అమ ) ఇట సుధ-ఘణ్టా పాటలిః అని (ఏకపదముఁ గా) దీనిని గ్రహించి లోధ్ర విశేషస్య' అని వ్యాఖ్యానించినది స్వామీ తు ఘణ్టా పాటలిః ఇతి నామద్వయ మాహ అని మతాంతరోపన్యాస మొనర్చినది గురు - ఇట స్పష్టము గా రెండుపదములే ఇవి యని మొక్కపుచెట్టు (ఘంట) అని వ్యాఖ్యానించినది ఘంట కు గురు చెప్పినయర్థముకాని లేక గోపఘంటయే నామైకదేశన్యాయమమున ఘంట' ఐన దని ఘోంట పర్యాయమే ఇది యనికాని వచింపవచ్చును అందులకే (వావి పా పారాం ) ఐనది

సీ వాలు డనంగను వాతారి విలసిల్లు
గురు గటం బన్నను గురి యటన్న
ముల కటం బన్న నర్బుదఫలి మను చుండు
నగిసె యటం బన్న నలరు నతసి
యెసఁగంగ క్షుమ యొప్పు నెట్టిగిసె యనంగ,
బర్బూర మలరు బొబ్బలి యనంగఁ
బొనిక యం బనఁ దగు ముంజము కుమ్మర
పొనిక, నాఁగను గృష్ణముంజ మొప్పు

గీ జీలు గనఁగను దీర్ఘయష్టిక దనర్చు
వనతువరి దోచుఁ గారుకం దనఁగ బెండ
యన గ గోజిహ్వ దగు ముండి యలరు బోద
తర మనంగను గైలాసపురనివాస 64

వాలుడు—ఇది వాతారికి (మందు కుపయోగపడుచెక్క తైలము గలయొకచెట్టునకు) పేరు

గురుగు గురి ములక—ఇవి అర్బుదఫలికి (ఒకవిధ మగువాఁకుడువంటి చిన్నచెట్టునకు) పేర్లు

అగిసె—ఇది అతసికి (అవిసెచెట్టునకు)పేరు

ఎఱ్ఱగిసె—ఇది క్షుమకు పేరు

బొబ్బలి—ఇది బర్బరమునకు (వృక్షవిశేషమునకు) పేరు

ఔనిక—ఇది ముంజమునకు (ముంజిగడ్డికి) పేరు

కుమ్మరపౌనిక—ఇది కృష్ణముంజమునకు (నల్లముంజిగడ్డికి) పేరు

జీలుగు—ఇది దీర్ఘయష్టికకు (బొందుబెండునకు జీలుగుబెండునకు)పేరు

కారుకంది—ఇది వనతువరికకు (అడవికందికి) పేరు

బెండ—ఇది గోజిహ్వకు పేరు

బోదతరము—ఇది ముండికి (ఒకానొకచెట్టునకు) పేరు

ములక — ములు గటం చన్న (వావి పా) ములక-వార్తాకి (ఇది త్రివిధము- క్రమము లక తెల్లములక పెద్దములక-అని శ ర) ములక-బృహతి-కంటకారిక-వాఁకుడుచెట్టు- అని బ్రౌ నేలములక తెల్లములక అనునవి దీనిభేదములు- అనియు (బ్రౌ)

గురుగు — ప్రొద్దుతిరుగుడు చెట్టు -అని (బ్రౌ)

అర్బుదఫలి —ఇది సంస్కృతనిఘంటువులలో లేదు (చూ సూ వి)

క్షుమ — నల్లయగిసె - అని (గురు) నూనెయవిసె' అని (శర) (అం భాను అనుసరించి) ఎఱ్ఱగిసె అని (బ్రౌ) (అతసీ స్యా దుమా క్షుమా' అనుచో) సాధారణము గా అవిసె అన్నిటికినిఁ బే రని (సుధ)

సీ. గువ్వగుత్తిక యన గువ్వగుత్తి యనంగఁ
జనుఁ గపోతాంఘ్రి దూసర, యనంగ
దూయుతీగె యనంగ దుస్సర యనఁగ సు
దర్శనలతపేరు దనరు చుండు
శరపుంఖినామ మై పరఁగు వెంపలి యనఁ
దులసీసమాఖ్య యోఁ దొలసి యనఁగఁ,
గొండపిండి యనంగఁ బిండికొండ యనంగ
నగభేదిసంజ్ఞ గా నలరు చుండుఁ

గీ. బొదలుఁ బిండీతకమ్ము గాడిదగడపర,
చాగరాడి వెలికి యటం చనఁ గుమారి
పరఁగుఁ గలుబంద యనఁగఁ బర్పాటకంబు
మనును బిచ్చకకాలు నా, మాతృభూత 65

గువ్వగుత్తిక గువ్వగుత్తి—ఇవి కపోతాంఘ్రికి (నళి అనుగంధద్రవ్యమునకు) పేర్లు.

దూసర దూయుతీగె దుస్సర—ఇవి సుదర్శనలతకు పేర్లు

వెంపలి—ఇది శరపుంఖికి (చాలచిన్న దైనయొకానొకచెట్టునకు)పేరు

తొలసి—ఇది తులసికి పేరు

కొండపిండి పిండికొండ—ఇవి నగభేదికి (తాలను బ్రద్దలుచేయు -ఆకులు గల యొకచెట్టునకు) పేర్లు

గాడిదగడపర చాగరాడి వెలికి—ఇవి పిండీతకమునకు (ఒకానొకచిన్న మొక్కకు ఓషధివిశేషమునకు) పేర్లు

కలుబంద—ఇది కుమారికి (ఒకానొకమందుమొక్కకు ఘృతకుమారికి) పేరు

పిచ్చుకకాలు—ఇది పర్పాటకమునకు(పర్పటమునకు తృణవిశేషమునకు) పేరు

గువ్వగుత్తిక — గువ్వగుత్తిగడ్డి-అని బ్రౌ (మా బ్రౌ వివరణమునకు) [ గవ్వగుత్తిక యన గవ్వగుత్తి యనంగ (వావి అపపా) ]

దూసర —వత్సాదని- (తిప్పతీగ) అని (శ ర) ఇది దీనికి రెండవయర్థము గా సూ ని ఇచ్చినది

వెంపలి —(బ వెంపళ్ల) వచ్చు మనకు మద్దులు మునింగి పాఱ వెంపళ్ల తమ కెంత బంటి యనుట (ఉ హరి 4 24)

కలుబందము — కలుబంద — వావి పా (చి ని పా) కలుమందము గ్రహించి కలబందము ఆం భా అను చున్నది (బ్రౌ) (చూ అను)
[ నగభేదసంజ్ఞ -(వావి అపముద్రి) ]

సీ. పులుగు డనంగను బులిసరి యనఁగను
బాలకినీసంజ్ఞ పరఁగు చుండు
సిద్ధకనామంబు చెలఁగుఁ జి ల్లనఁగను
దీంద్ర యం చనఁగ నుద్వేజన మగు
వెలమసంది చివికివెల మనఁగాఁ గాక
జంఘాభిధానంబు చనును జిలుక
ముక్కు నా శుకనాస పొలుపుఁ గాంచును గుక్క
పా లన వటపత్త్ర పరఁగు చుండుఁ

గీ దేలు మొనచె ట్టనంగను దేలుకొండి
నాఁగ మను వృశ్చికాళ్యాఖ్య నాగిని యగు
గొల్లజి డ్డనఁ గుందేటికొ మ్మనంగఁ
బరఁగు శశశృంగనామంబు గంశకంర 86

పులుగుడు పులిసరి—ఇవి పాలకినికి (వాతఘ్నికి)పేర్లు

చిల్ల—ఇది సిద్ధకమునకు (ఒకానొకవృక్షమునకు) పేరు

తీంద్ర—ఇది ఉద్వేజనమునకు (లతారూపమున ఉండునొకానొక ఓషధికి) పేరు

వెలమసంది చివికివెలమ—ఇవి కాకజంఘకు (ఒకవిధ మగునేలవేమునకు) పేర్లు

చిలుకముక్కు—ఇది శుకనాసకు (చిలుకముక్కువంటిపూలు గలపూలమొక్కకు) పేరు

కుక్కపాల—ఇది వటపత్రకు (ఒకవిధ మగు- అడవితీగకు పాలతీగను బోలి యుండుదానికి) పేరు

తేలుమొనచెట్టు తేలుకొండి—ఇవి వృశ్చికాళికి పేర్లు

గొల్లజిడ్డు—ఇది నాగినికి పేరు

కుందేటికొమ్ము—ఇది శశశృంగమునకు (ఒకచెట్టునకు)పేరు

పాలకిని — బాలకిని ఇది అని ఇంకను విచార్య మనినది (సూ ని) (చూ పులిసరి) బ్రౌ శరలు పులుగుడునకు వాతఘ్ని అర్థ మనినవి- అథ పాలఙ్క్యాం ముకున్దం కున్దకున్దురూ (అమ) ఇట పాలక ఇతి ఖ్యాతశాకభేదస్య అని (సుధ) పాలఙ్క శ్శల్లకే శాకభేదయోః అని (విశ్వ) ఈ పాలఙ్కమే పాలంకిని అనఁబడిన దనిపించినది ఇట- పాలిని ఆం భా అనుచున్నది (బ్రౌ)

చివికివెలమ —చివికివెలమ వెలమసంది-అనువానికి బ్రౌ కాకజంబువు అర్థ మని ఆం భా ఒని వ్రాసినది దీనిని బట్టి ఇచ్చటి బ్రౌ పా కాకజంబ్వభిధానంబు అయి యుండు ననిపించు చున్నది (కాకజంబువు- కాకినేరేడు ... కాకినేరేడు -అనువాని ... కు ముందు వచించినది ఆం భా (చూ 24..) (బ్రౌ పా) సరి గాదు



వృశ్చికాళి — తేలుమణి తేలు౦డి - వృశ్చికాళిని జెప్పు నని(శ ర) తేలుమణి అను దానికి బ్రౌ - తేలుమణి అన గా దక్షిణావర్త ధూమ్రపువృక్షము అన గా- చెంచలి తీగ అను చున్నది (చూ బ్రౌ తేలుమణి)

గొల్లజిడ్డు — గొల్లకిడు -అని బ్రౌ గొల్లజిడ్డు- శూలిని అని శ ర నాగిని-గొల్లజిడ్డు -అనియు శ ర శూలిని నాగిని పర్యాయము లను చున్న దిది నాగిని అర్థాంతరము కలది(చూ 2 62) [గొల్లజిడ్డు-గొల్లజీడె- కుందెనగొమ్మ-అన గా శశశృంగనామము- అం భా (హంస4 3)- అని బ్రౌ (చూ అను) అన్వయమున బ్రమాదపడిన దనిఎంచును ]

సిధ్రకము — శీధ్రకనామంబు - (వావి పా) సిధ్రకా సారికా వాక్కా- ప్రాచి కోలాక- పిఎలికా అని (అమ) ఎధ ఇతి ప్రసద్ధో వృక్షభేద అని (సుధ) సిధ్రకము నకు (రూపాం) శీధ్రక మనవలెను

సీ. ఆకు పువ్వును గాయ యాది గా నివి యెల్లఁ
        గూర యం చనఁగను మీఱు చుండుఁ
    బుట్టకొ క్కనఁగను భూస్ఫోటసంజ్ఞ యొఁ
        దనరఁ జిట్టి యనంగఁ దండులీయ
    మగు నీరుచిట్టి నా నప్తండులీయంబు
        చెలిమిడి యనఁ దద్విశేష మొప్పు
    శంఖపుష్పికిఁ బేరు చను మిత్తి యం చన
        వాయింట యనఁగఁ బర్బర చెలంగుఁ

గీ. గుక్కవాయింట నాఁగ బెం పెక్కు శ్వాన
    బర్బరాభిధ మత్స్యాక్షి పరఁగు చుండుఁ
    బొన్నగంటి యనంగను బొద్ది యనఁగ
    వృద్ధదారక మలరును వృద్ధ వంద్య 67

కూర—ఇది భోజ్యము లైన ఆకు పువ్వు కాయ వేరు కాడ పండు విత్తనము మొలక తొక్కు- మొద లైనవానికి పేరు

పుట్టకొక్కు—ఇది భూస్ఫోటకు (తెల్లగా మొగ్గయట్లు భూమియందు మొలచెడి మెత్తని మొలకకు) పేరు

చిట్టి—ఇది తండులీయమునకు (ఒక విధ మైన కూరాకుమొక్కకు) పేరు

నీరుచిట్టి—ఇది అప్తండులీయమునకు (ఒక దినుసుచిట్టికి) పేరు

చెలిమిడి—ఇది అప్తండులీయవిశేషమునకు (ఒకవిధ మైన నీరుచిట్టికి) పేరు

మిత్తి—ఇది శంఖపుష్పికి (ఒకజాతితీగకు) పేరు

వాయింట—ఇది బర్బరకు (ఒకదినుసుకూరాకుమొక్కకు) పేరు

కుక్కవాయింట—ఇది శ్వానబర్బరకు (ఒక విధ మైన వాయింటకు) పేరు

పొన్నగంటి—ఇది మత్స్యాక్షికి పేరు

బొద్ది—ఇది వృద్ధదారకమునకు (ఒకజాతి కూరాకుచెట్టునకు) పేరు

పుట్టకొక్కు —పుట్టగొడుగు కుక్కగొడుగు- అనునవి దీనికే పర్యాయములు
మిత్తి —మిత్త—(వావి అపముద్రి )
వాయింట —వాయంట—(వావి అపముద్రి )
కూర —మూల పత్ర కరీ రాగ్ర ఫల కా ణ్డాధిరూఢకమ్ త్వ క్పుష్పం కవచం(కం?)చేతి శాకం దశవిధం స్మృతమ్ అత్ర మకుటః- మూలమ్- మూలకాదేః పత్త్రమ్- వాస్తుకాదేః కరీరమ్- వంశాఙ్కురమ్ (వంశాదే రఙ్కురమ్) అగ్రమ్- వేత్రాదేః ఫలమ్- కూష్మాణ్డాదేః కాణ్డమ్- ఉత్పలాదేః నాలమ్ త్వక్- మాతులుఙ్గాదేః పుష్పమ్- తిన్త్రిడీ కోవిదారాదేః కవకమ్- ఛత్త్రాకమ్ ఇతి అధి రూఢకమ్-తాల బీజాఙ్కురాస్థిమజ్జాది' అని (సుధ టిప్పణి )

సీ తనరు విశల్య యై తరిగొఱ్ఱి చెన్నచె
ఱుకు పొత్తి, నాఁగఁ గారుమిను మనఁగఁ
జను మాషపర్ణి చెంచలి యనఁగను విష
ఘ్న మలరు సునిషణ్ణకాఖ్యఁ దగును

బులిచింత యనఁగను బులిచెంచలి యనంగ
నామ్లవేతససంజ్ఞ యలరు జుక్క-
పుల్లప్రబ్బ యనంగ ముణుఁగుదామర నా మొ
గడుదామ రన నమస్కారి చెల గు

గీ సంబరే నఁ జర్మకసంజ్ఞ యొప్పు
బరఁగు మనువాల యనఁ బిన్నపాల యం చ
టన్న జీవంతికయు దంతె యనఁగ దంతి
మనును దాసీకృతవిధాత మాతృభూత 68

తరిగొట్టు చెన్నచెఱుకు బొత్తి—ఇవి విశల్యకు (పాలగొట్టెకు మందు గా ఉపయోగపడెడియొకదినుసుకూరాకుచెట్టునకు లాంగలికి) పేర్లు

కారుమినుము—ఇది మాషపర్ణికకు పేరు

చెంచలి—ఇది విషఘ్నమునకు (ఒకదినుసుకూరాకుచెట్టునకు కుణుంజమునకు చక్రవర్తికూరకు) పేరు

పులిచింత పులిచెంచలి—ఇవి సునిషణ్ణకమునకు (నేలపై ప్రాఁకెడియొకజాతియోషధికి పుల్లనియాకులు గలదానికి) పేర్లు

చుక్క పుల్లప్రబ్బ—ఇవి అమ్లవేతసమునకు (చుక్కకూరాకుమొక్కకు శతవేధికి) పేర్లు

ముణుగుదామర మొగడుదామర— ఇవి నమస్కారికి (సో కుడుముడుఁగు అనునొకయోషధికి లజ్జాలువునకు) పేర్లు

సంబరేను—ఇది చర్మకమునకు (చర్మకషకు) పేరు

మనుపాల పిన్నపాల—ఇవి జీవంతికకు (పాలకూరచెట్టునకు) పేర్లు

దంతె — ఇది దంతికి (ఉదుంబరంపర్ణికి నేపాళమునకు) పేరు

కారుమినుము — కాంభోజి రాజమాషము-అని (బ్రౌ)

చెంచలి — తేలుమణిచెట్టు' అని (బ్రౌ)

వులిచింత — గాంగేరి అని (బ్రౌ) నీరుచెంచలి' అని (గురు)

మొగడుదామర — మొగుడుదామర ముగుడుదా మర నమస్కారి' అని శ ర మొగడు దామర' కైన (రూపాం) ఇది అసవలయును

నమస్కారి — లజ్జాలు స్తు నమస్కారీ ఖద ర్యఞ్జలికారికా గణ్డకాలీ' అని (వైజ భూమి. వనా) (వి ద్రభంగిచెట్టు'- ఒని ఇచ్చటితెలుగుటీక)

చర్మకము — చర్మకం బలయను సంబరే ననఁగ' (ఆంధ్ర ప ఆచల. 97) (చూ సూ ని)

సంబరేను — సంబరేణి సంబరేణుచెట్టు' అని బ్రౌ

చెన్నచెఱుకు — చెన్నచెఱకు - అని సూ ని ఆం భా పా (యతిభంగము గమనించుకొనలేదు) శ ర గూడ చెన్నచెఱకు-అనియే అను చున్నది చెన్నచెఱకు (రూపాం) అనఁ దగినది. [ (విష) ఘ్న మలయను సునిషణ్ణకాఖ్యఁ దగును వావి (అపపా) ]

సునిషణ్ణకము — నీరుచెంచలి' అని (శ ర) (గురు)

సీ స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడి
తామర యనఁ బచ్చతామర యన
నేలతామర యన నెగడు దద్రుఘ్నంబు
తగిరిస యనఁగను దనరు నెట్ట
యుల్లియం చనఁగ నీరుల్లి నాఁగఁ బలాండు
వొప్పు లశునము వెల్లుల్లి యనఁగ
గలిజె రనంగను గలిజే రనంగఁ బు
నర్నవసంజ్ఞ గా నమరి యుండు

గీ. సోమగంధాఖ్య వెలయును సోమెద యన
 గుంటగలిజేరు కలగర గుంటకలగ
 ర యనఁ జెన్నొందు నౌ భృంగరాజసంజ్ఞ
 భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ 69

మెట్టతామర పైడితామర పచ్చతామర నేలతామర—ఇవి స్థలపద్మమునకు (మెట్టతమ్మికి) పేర్లు

తగిరిస—ఇది దద్రుఘ్నమునకు (ప్రపున్నాడమునకు చక్రమర్దమునకు తంటెపుఁజెట్టునకు) పేరు

ఎఱ్ఱయుల్లి నీరుల్లి—ఇవి పలాండువునకు పేర్లు

వెల్లుల్లి—ఇది లశునమునకు (తెల్లయుల్లికి) పేరు

గలిజెరు గలిజేరు—ఇవి పునర్నవకు పేర్లు

సోమెద—ఇది సోమగంధకు (సోమలతకు) పేరు

గుంటగలిజేరు కలగర గుంటకలగర—ఇవి భృంగరాజమునకు పేర్లు

తగిరస — తగిర్స -(రూపాం) గురు గెఱబొద్ది చెంచలియు గుచ్చలి చిత్తి తగిర్స (హంస 4 32) (చూ సూ ని) [తరిగిసె—వావి అపపా]

లశునము — లశునం దీర్ఘపత్రశ్చ పిచ్ఛగన్ధో మహౌషధమ్ ఫరణశ్చ పలాణ్డుశ్చ లతార్కశ్చాపరాజితా గృఞ్జనం యవనేష్టశ్చ పలాణ్డోర్దశజాతయ అని సుశ్రుతము పలాణ్డుభేదముల బేర్కొనినది వైజ కొంతపారభేదముతో ఇట్లే (చూ భూమి వనా) పలాణ్డువునకు-లశునమునకు (గృంజమునకు) భేదమిట్లు వివరింపఁబడినది- గన్ధాకృతిరసైస్తుల్యో గృఞ్జనస్తు పలాణ్డునా దీర్ఘనాలాగ్రపత్రత్వాత్ భిద్యతే ఽసౌ పలాణ్డుత అని ఇవి జాతిదూషితములు— లశునం గృఞ్జనం చైవ పలాణ్డు కవకాని చ వృన్తాకారాలికాలాబుజాతీయా జాతిదూషితమ్ ఇతి- (చూ అమరసుధ లశునము) లశునము గృఞ్జనము పర్యాయము లని (అమ)

సోమెద — సోమిద సోమిదె- గ్రహించినది బ్రౌ సోమిదమ్మ సోమిపాని సోమి

దేవమ్క మొ వీనినుండి యేర్పడినవియే సోమింద గూడ ప్రయుక్తమైనది- విరిగి సోమింద గున్నంగి దిరిసెనంబు (హంస 4 1) సోమెద శరసూని గ్రహించి సోమవల్లరి- అను నర్థమును ఇచ్చినవి దానికి (రూపాం) సోమిద' సోమింద అనవచ్చును

పునర్నవ — క్షుభ్నాదిషు చ (8 4 39) అని ణత్వనిషేధము బునర్ణవసంజ్ఞ గావి (అపపా)

కలగర —గలగర- అని బ్రౌచిని గుంటగలగర అనియే (బ్రౌచివి శర)

సీ జ్యోతిష్మతీసంజ్ఞ యొప్పు నెక్కుడుదీగె
యనఁగ వారాహి పాఁ చనఁగఁ బరఁగు
వజ్రవల్ల్యాఖ్య యై వరలు నల్లే రనఁ
గాచి యనం దగుఁ గాకమాచి
సీకాయచె ట్టన సిగ యన సిక యగు,
సీకాయ యనఁ దగు సికఫలంబు,
సారణి గొంతెమగోరు లంజెసవర
మన నగుఁ గోరింద యన జతూక

గీ వెలయుఁ గాఁకర యనఁ గారవేల్ల మెసఁగు
నడరు నాఁగాఁకర యనంగ నడవికాఁక
ర యనఁ గర్కోటకియుఁ గాసర యనఁ గాఁచ
ర యనఁ గాశాదనీసమాహ్వయ మగు భవ 70

ఎక్కుడు దీగె—ఇది జ్యోతిష్మతికి (మానేరు తీగెకు మెఱపుతీగకు) పేరు.

పాఁచి—ఇది వారాహికి (బదరకు) మజ్జిగ చిక్కనచేయు నొకానొక తీగెకు) పేరు

నల్లేరు — ఇది వజ్రవల్లికి పేరు

కాఁచి—ఇది కాక మాచికి (వాయసికి ఒకయోషధికి) పేరు

సీకాయచెట్టు సిగ— ఇవి సికకు పేర్లు

సీకాయ—ఇది సికఫలమునకు పేరు

గొంతెమగోరు లంజెసవరము—ఇవి సారణికి (ప్రసారిణికి ఒకమందాకుచెట్టు నకు) పేర్లు

కోరింద—ఇది జతూకకు (లక్క కలిగెడి యొకానొకతీగెకు) పేరు

కాఁకర—ఇది కారవేల్లమునకు (కాఁకరచెట్టునకు) పేరు

ఆఁగా కర అడవికాఁకర—ఇవి (పనసపిందెలవలె గూర కుపయోగపడెడునొకా నొక కా కరకు) పేర్లు

కాసర కాఁచర—ఇవి కాశాదనికి పేర్లు

వారాహా — వరాహకన్దే వారాహా అని వైజ (భూమి వనా) వరాహకన్ద అనునర్థము వారాహా కి కల దను చున్నది

నల్లేరు — నల్లెరు (రూపాం) చిఱుచెట్లలో దీని నుదాహరించినది-హంప నల్లేరు నులిజెము డాకుజెముడు నేలతీ ట కసందెయు గోలజెముడు మొదలు గా గలుగునట్టి చిఱుచెట్ల (4 0) (చూ సూ ని)

కా కర —దీనిభేదములు - అడవికా కర కొమ్ముకా కర గొడ్డు గా కర పొట్టికాఁకర- అనునవి బ్రౌ మెట్టకా కర బుడ్డకా కర వెఱ్ఱికా కర అని మఱికొన్ని భేదముల గూడ వచించినది

ఆ గాకర — (ఆకు- కా కర)దీనికి విశేషము గా ఆకు లుండును అని శ ర అడవికా కర అను చున్నది దీనిని (సూ ని)

సీ గుమ్మడి యనఁగను గూశ్మాండ మగు బెద్ద
దోస నాఁ ద్రపుసము దోఁచు నక్క

దోస యనంగ క్షుద్రోర్వారుకము మీఱు
    ములుదోస నాఁగను వెలయుఁ గంట
కోర్వారుకమ్ము తిక్తోర్వారుకాభిధ
    చేఁతిదోస యనంగఁ జెలఁగు చుండు
బుడమ నాఁ దద్భేద మొప్పు నానుగ మన
    సొఱ నా నలాబువు పరఁగు వదరు

గీ. చేఁతిసొఱ యనఁ దిక్తాలాంబు ఖ్యాతిఁ గాంచు
వారుణి దనర్చుఁ బిన్నపాఁప రన నింద్ర
వారుణి చెలంగుఁ బెద్దపాఁపర యనంగఁ
గంద యన సూరణాఖ్య యౌ. గరళకంఠ 71

గుమ్మడి—కూశ్మాండమునకు (కూష్మాండమునకు) పేరు

పెద్దదోస—ఇది త్రపుసమునకు (రాజకర్కాటికి) పేరు

నక్కదోస—ఇది క్షుద్రోర్వారుకమునకు (చిన్నదోసకు చిర్భటకమునకు) పేరు

ములుదోస—ఇది కంటకోర్వారుకమునకు (రోమశికి ముండ్లు గలదోసకు) పేరు

చేఁతిదోస—ఇది తిక్తోర్వారుకమునకు (చేఁదు గలదోసకు) పేరు

బుడమ —ఇది ఒకవిధ మగుచేఁతిదోసకు పేరు

అనుగము సొఱ—ఇవి అలాబువునకు పేర్లు

వదరు చేఁతిసొఱ—ఇవి తిక్తాలాంబువునకు (కటుతుంబికి చేఁదు గలసొఱకు) పేర్లు

పిన్నపాఁపర—ఇది వారుణికి (గోతుంబకు) పేరు

పెద్దపాఁపర—ఇది ఇంద్రవారుణికి పేరు

కంద—ఇది సూరణమునకు (కందగడ్డచెట్టునకు) పేరు

కూశ్మాండము — ఈ కూశ్మాండభేదమే- బూడిదగుమ్మడి (పెండ్లిగుమ్మడి) పెద్దగుమ్మడి - అనునదిగూడ బూడిదగుమ్మడి నే చెప్పు నని (శ ర) మంచిగుమ్మడి పెద్దగుమ్మడి అని రామగుమ్మడి దీని భేద మని (వ్య)

త్రపుసము — త్రపుస-చే దు గలదోస (కల్ప) (అని సూ ని)

అనుగము — శ్రాద్ధకర్మంబునందు వర్జ్యములు వినుము పెండలంబును దోస పలాండు వుల్లి యానుగ మ్మింగు ఎలసందియలు విదారి సార ప్రత్యక్ష లవణ మసూరములును (మార్క 3-203) (చూ సూ ని) అనుగు- (యాపాం) చి ని బ్రౌ శ ర (చూ సూ ని) అనపకాయ అని గోదావరీమండల (వ్య)

వదరు — (వరద వావి అపపా) వరదు దైనయీశువరమున నిది యొక్క వదరు పుట్టె నెట్టివరమొ యనుచు దాని జాలపైన గా నున్న (భార అర 3ఆ 04) (చూ- బ్రౌ వదరు)

వారుణి — వారుణి గోతుమ్మ పర్యాయము లని శ ర అభిప్రాయపడు చున్న దనవచ్చును గోతుంబ అని పిన్నపా పరకు-అర్థ మిచ్చినది వైజ రేవత్యాం రామమూర్తి స్యాద్వారుణీ నాగద న్త్యపి అని వేఱు గా వ్యవహరించినది దీనిని పిన్నపాఁపర పా పర- పర్యాయము లని సూ ని శ ర లు బ్రౌ -పా పర-అనుదానికి ఇంద్రవారుణి విశాల అనునర్థ మిచ్చి పెద్దపా పర యే పా పర కు అర్థ మనినది పాఁపర నుగూర్చి వేమన ఇట్లు వచించినాడు- పాలు పంచదార పా పరపండ్లలో జాలిఁబోసి వండ జవికి రావు కుటిలమానవునకు గుణ మేల కలుగు రా (అని) దీనిని బట్టి దీనిపండ్లు చాలచే దు గలవి-అని మన మెఱు గవచ్చును [పా పర- నిరనుస్వార మని (చి వి) (చూ సూ ని)]

సీ చిరుగడం బన గను జెలఁగును మధురకం
దంబు గండీలంబు దనరుఁ బెండ
ల మ్మన శింబి యొఁ జమ్మ తంబ యనంగ
వల్మీకశింబి యై వఱలుఁ బుట్ట
చంబ యటం చనఁ జనుఁ జిక్కు డన క్షుద్ర
శింబి పుచ్చ యన భాసిలుఁ గళింగ

మల్లుబచ్చలి యటం చనఁ దీగెబచ్చలి
యనఁగఁ గలంబ్యాఖ్య యలరు దుంప

గీ. బచ్చలి యన నుపోదకి పరఁగు చుండుఁ
బొలుచు నామ్లకలంబ్యాఖ్య పుల్లబచ్చ
లి యన ముల్లంగి నాఁగను రీతిఁ గాంచు
మూలకాభిధ శ్రీమాతృభూతలింగ 72

చిరుగడము—ఇదిమధురకందమునకు (తియ్యకందకు) పేరు.

గండీలము—ఇది పెండలమునకు (పిండాల్మునకు ఒకదినుసుకూరగడ్డకు) పేరు

చమ్మ తంబ—ఇవి శింబికి (కూర కుపయోగించుకాయలుగల) తమ్మచెట్టునకు పేర్లు

పుట్టచంబ—ఇది వల్మీకశింబికి (ఒకజాతితమ్మతీగెకు) పేరు

పుచ్చ—ఇది కళింగమునకు (కర్కారుకమునకు) పేరు

అల్లుబచ్చలి తీగెబచ్చలి—ఇవి కలంబికి పేర్లు

దుంపబచ్చలి—ఇది ఉపోదకికి (బొలముబచ్చలికి) పేరు

పుల్లబచ్చలి—ఇది ఆమ్లకలంబికి పేరు.

ముల్లంగి—ఇది మూలకమునకు (ఒకజాతిదుంపకు) పేరు

చిరుగడము — మధుంకందము' అని దీని నను చున్నది (అం భా) శ ర -తియ్య కంద' అని అర్థ మిచ్చినది ౹బౌ అచ్చము గెనుసుగడ్డవలె ఉండు- ఒకజాతి దుంప అని దీనిని వివరించినది సూ ని కూడ ఒకజాతిదుంప మధురకందము అవి నది ౹బౌ మధురకందము' అనుదానికి తియ్యనివేరు కలది అనువ్యుత్పత్తినిఁగూడ సూచించిన దనవచ్చును (౹బౌ ౹వాఁతలను బట్టి) చిరువడము- దీనికి(రూపాం ) అని శ ర (సూ ని ) శ ర చిరువడమునకు' ప్రమాణము గా క్రింది ప్రయోగ

మిచ్చినది- అరుదుగ నపుడొకొక్కచోట మరకతమణిపాత్ర గగనమండల మయ్యెం జిరువడముల పాకము శశధరుఁడయ్యెం జుక్కలయ్యె ద్రాక్షఫలంబుల్ (నై 6 23) ఇచ్చట చిరువడముల పాసెమ అని (వేద పా) వేద వ్యా దీనికి చిరువడము లనెడిభక్ష్యవిశేషముతో కూడిన పాయసము అని అర్థము వచించినది శ్రీనాథుడు భీమఖండమున కాశీఖండమునఁగూడ చిరుగడమును ప్రయోగించినాఁడు- రాజనలతోడ శృంగబేరములతోడ జిరుగడవుఁ బెండలముతోడ జేమతోడ నొప్పు నాలుగు పొలములం దుపవనములు (భీమ 2 66) ' బిసకిసలయములపెరుఁగులుఁ జిఱుగడములుఁ బడిదెములు (కాశీ 7 85) రుక్మాంగదలోఁగూడ నిది యిట్లున్నది- చమురుకావళ్ల రాజనపుబియ్యంబులు చెఱకుకోలలు కంద చిరుగడములు గసగసలు చారపప్పు ద్రాక్షాఫలములు గొనుచుఁ బ్రజ లేగిరి వనీకుకొలువునకును (3 6) కాండదు బ్రౌ ప్రమాణ మిచ్చి చిఱుగడ్డ గెనుసుగడ్డయే అని వచించు చున్నారు బ్రౌ గెనుసుగడ్డ ఇది యనుట లేదు గెనుసుగడ్డవంటి-ఒక జాతిదుంప' అను చున్నది ఈబ్రౌణ్యమును వీరే ఉదాహరించుకొనినారు ఇఁక శాలిగ్రామనిఘంటుభూషణ మను హిందీసంస్కృతకోశ మొకటి యిట్లు వీ రుదాహరించినారు- పిండాలుః- స్వాదుకందః హిం శకర్‌కంద్ తెలుగు చిరగడ (అని) ఇది దీనికి గెనుసుగడ్డ అర్థ మనుట లేదు తియ్యకంద అర్థ మనుటనే వచించు చున్నది పిండాలువు-చాఱకంద అని శ ర (పిండాలుకము వేఱు పిండాలువు వేఱు (చూ సూ ని) చాఱకంద -అనుదానికి మీద చాఱలు గల-ఒక దినుసు కంద పిండాలువు-అని శ ర ఇది కందలోని భేదము స్వాదుకందము మధురకందము పర్యాయములు. ఈచాఱకందయే- తియ్యకంద అదియే చిరువడ మని (ఈశాలి భూ) అనుచున్న దనవచ్చును ఇది వీరికి ప్రమాణ మగుట యెట్లో ఇఁక (శృం నై) ప్రయోగ మొకటి శ ర ఇచ్చినది అట గెనుసుగడ్డలతోఁ జేసినభక్ష్యము చిరువడపాకము న కర్థ మని వీ రను చున్నారు శ ర తియ్యకందతోఁ జేసినభక్ష్య మిది యని యర్థము చెప్పినది త ప్పేమి? శ ర అర్థమే సముచితము ఆం భా ఇట్లను చున్నది కంద సూరణకొఖ్య యా (గరలకంఠ) అని (వెనువెంటనే) చిఱుగడంబన గను జెల గును మధురకందంబు గండీలంబు దనరుఁ బెండల మ్మన (2 72 73) (అని) ఈ ఆం భా వచనధోరణిని బట్టి పరిశీలించిన కందలోని భేదముఁ గానే దీనిని ఆం భా చెప్పినదనుట స్పష్టము పెండలమును వేఱు గా వచించు చున్నది

ఆం భా ఏతజ్జాతీయము గెనుసు గా దనుటయు విదితము ఏతజ్జాతీయమే యైన తద్భేద మని వచించెడి దిది ఇక చిరుగడపు బెండలముతోడ అను భీమఖండ ప్రయోగ మొకటి యున్నది ఇట గెనుసుగడ్డ పెండలముజాతిలోని దని వీ రను చున్నారు చిరుగడమే చిరుగడపు బెండల మన బడిన దని వీ రీప్రయోగమును సమ న్వయించు చున్నారు (చూ సాహిత్యసమీక్ష ) పెండలము జాతిలోనిది గెనుసుగడ్డ అనుట యుచితము కాదు ఈ ప్రయోగసమన్వయముకొఱకే వీ రి ట్లను చున్నా రని పించును ఇక దీని సమన్వయ మి ట్లనిపించు చున్నది చిరువడ మిది కాదు చిఱు గడ మిది ఇది శకటరెఫయుతము అది లఘురేఫయుతము కఱ్ఱపెండలము అనునది పెండలము లోని యొకభేదము దీనిని కాల్చి తిందురు గెనుసుగడ్డయట్లె చెఱకుగడ- లోనగువానికడ గడ శబ్దము కోల - దండము -అను నర్థము గలది పై పెండ లము చెఱకు లో నగువానియంతటి విడు పైనదిగాక సన్ననై చిఱుత ద్దగుటవలన చిఱుగడ యన బడిన దనిపించును చిఱుగడ కైన(రూపాం ) చిఱుగడము చిఱు గడపు బెండలము కఱ్ఱపెండల మని యిచ్చటయర్థ మనిపించినది ఇక (శబ్దం నై ) (శ ర పా ) వీ రనినట్లే చాల సముచితము ఆం భా పూర్వాపరముల సరిగా జూచు కొనక సూ ని ప్రౌణ్యమును అనుసరించి పొరవడిన దనిపించును ఆం దీపికాదులు నిట్లె ఆం భా సమన్వయమున వీనియన్నిటికంటె శ ర చాల జాగరూకత వహించిన దనిపించినది నాకు అందులకే యిట ఎవ రె మన్నను దానినే నే ననుసరించితిని

గండీలము —నిఘంటువులు గండీరము ను గ్రహించినవి దానికి ఈ యర్థము నీయ లేదు (ఎండాలు శబ్దము సంస్కృతమున పెండలము ను వచించు చున్నది దానికే ఈ గండీలము పర్యాయము కా దగి యున్నది

ముల్లంగి —దుంపలలో దీనిని హంస ఇట్లు పేర్కొనినది- చేమ కంద గెనుసు చిఱిగోరు పెండ్లము పొన గు దెల్లగెనును బూతగెనుసు లల్ల ముల్లి పసపు ముల్లంగి వెల్లుల్లి గాజరయును మొదలు గాఁగ గలవు (4 3 ) (చూ సూ ని )

చిక్కుడు —దీనిభేదములను ప్రౌ ఇ ట్లుదాహరించినది- ఎఱ్ఱచిక్కుడు తెల్లచిక్కుడు గోరుచిక్కుడు ఆనపచిక్కుడు ఏనుఁగుచిక్కుడు కోడిచిక్కుడు తొండచిక్కుడు ఉలవచిక్కుడు సొనచిక్కు డు (అని )

సీ. గంజాయి యం చన గాంధారి చె న్నొందు
గాఁజర యం చనఁగాఁ గళంజ
మగుఁ జిల్క యం చన నౌ హిలమోచిక
బాష్పశాకాఖ్య మై పరఁగుఁ గోయ
దోఁటకూ రనియెడిమాట పెఱుకుతోఁట
కూర పెరుఁగుతోఁటకూర యనఁగఁ
జనును మహాబాష్పసంజ్ఞ దొగ్గలి యన
రక్తబాష్పాఖ్య మై ప్రబలు చుండుఁ

గీ. దుమ్మి యం చనఁ దనరును ద్రోణసంజ్ఞ
గురు గనంగను జెలఁగును గురుకటాఖ్య
మొహాళ మనఁగను సవ రగు మోహాళంబు
వన్నెవెదు రన మను వృత్తపత్త్ర మభవ 73

గంజాయి—ఇది గాంధారికి (కైపు పుట్టించెడి- ఆఁకుమొక్కకు) పేరు

గాఁజర—ఇది కళంజమునకు (పొగాకునకు) పేరు

చిల్క—ఇది హిలమోచికకు (చిలుకతోఁటకూరమొక్కకు) పేరు

కోయదోఁటకూర—ఇది బాష్పశాకమునకు పేరు

పెఱుకుతోఁటకూర పెరుఁగుతోఁటకూర—ఇవి మహాబాష్పకు పేర్లు

దొగ్గలి—ఇది రక్తబాష్పకు (ఒకవిధ మగుతోఁటకూరకు) పేరు

తుమ్మి—ఇది ద్రోణకు (తుంబికి ఈశ్వరునకు ప్రీతి గలిగించుపూలు గలయొక జాతికూరాకుమొక్కకు) పేరు

గురుగు—ఇది గురుకటకమునకు (ఒకజాతికూరాకుమొక్కకు) పేరు

మొహాళము—ఇది మోహాళమునకు (ఒకదినుసుకూరాకుమొక్కకు) పేరు

వన్నెవెదురు—ఇది వృత్తపత్త్రమునకు (ఒకవిధ మైనకూరాకుచెట్టునకు) పేరు

కోయదోటకూర — కొయిగూర- (కోయి-కూర) కోయ దగిన నల్లతోటకూర (అని) శ ర [కొయ్య- కూర- ఒకవిధ మగుతోటకూర- అని బ్రౌ (చూ సూ ని)] ఉపారమున- కొయ్యకు కోయ (రూపాం) కల దనవలయును కొయ్యతోఁట కూర ఇది ఆయుం సముచిత మనిపించును కొయగూర కొయ్యగూర (రూపాం) పెసమంబ పేమిటి కని కసరు నెయి గొన దు పండుగను గొయగూరే కొసరుం బలుచనిచల్లయె మొసరుం గన దతనిలోభమున కే మందుఁ (బహు ం 8) పెఱుకుతోటకూర — తోటకూరకోనిభేదములను సూ ని ఇట్లు వివరించినది-ఎఱ్ఱతోటకూర నల్లతోటకూర ముండ్లతోటకూర పెరుగుతోటకూర కొయ్యతోఁటకూర చిలుకతోటకూర- మొ (అని) మొలకూ్కర అని (బ్రౌ)

దొగ్గలి —దీనిని దొగ్గలితోటకూర అని ఒకజాతితోటకూర గా బ్రౌ వచించినది (చూ తోటకూర)

గురుంటకము — సం నిఘంటువులలో ఇది కానరాదు- అని (సూ ని) (చూ గురుగు)

గంజాయి —కళంజము- అని శ ర కళంజము- పొగాకు అని (సూ ని) కలంజ సంవేష్టనధూమపానాత్స్య ద్దన్తశుద్ధిర్ముఖరోగహాని కఫఘ్న మామజ్వరహానికృచ్చ గాన్ధర్వవిద్యాప్రవణైకసేవ్యమ్ (కల్ప) (చూ సూ ని)

[బాష్పశాఖాఖ్య వావి అంము]

సీ కుచ్చలి యం చనఁ గుచ్చెలి యనఁగను
గోళి యటన్నను ఘోలి యొప్పుఁ
బావిలి యం చనఁ బరఁగుఁ దదేభేదంబు
గరిమిడి గణికి నాఁగఁ జను దూర్వ
తుంగ యనంగఁ జెలంగు ముస్తాభిధ
వేణునామం బగు వెదు రనంగఁ

21)

గీచకసంజ్ఞ యై తోఁచు బొం గనఁ గన్ను
కనుపు గంటు గను పం చనఁగఁ బర్వ

గీ. మమరుఁ గంతి కణిఁతి బోటు ముడి గుబ్బ
బుడిపి ముడుత యనంగను బొసఁగు గ్రంథి
యించు చెఱ కనఁ దనరును నిక్షుసంజ్ఞ
చనును రసదాడి యనఁగ రసాల మభవ 74

కుచ్చలి కుచ్చెలి గోళి— ఇవి ఘోలికి పేర్లు

పావిలి—ఒకవిధ మగుఘోలికి (చిన్నజాతి గోళికూరమొక్కకు విచిల్లికకు) పేరు

గరిమిడి గఱికి—ఇవి దూర్వకు (తృణవిశేషమునకు) పేర్లు

తుంగ—ఇది ముస్తకు (ముస్తెకు తుంగగడ్డికి) పేరు

వెదురు—ఇది వేణువునకు (గట్టివెదురునకు) పేరు

బొంగు—ఇది కీచకమునకు (బొంగువెదురునకు లావు గలిగి బోలు గా ఉండు వెదురునకు) పేరు

కన్ను కనుపు గంటు గనుపు—ఇవి పర్వమునకు (వెదురు లో నగువానియందు ఉండు (గనుపునకు) పేర్లు

కంతి కణిఁతి బోటు ముడి గుబ్బ బుడిపి ముడుత—ఇవి గ్రంధికి (వృక్షాదుల బుడిపెకు) పేర్లు

ఇంచు చెఱకు—ఇవి ఇక్షువునకు పేర్లు

రసదాడి—ఇది రసాలమునకు (ఒకజాతి చెఱకునకు) పేరు

[ఘోలి — గోలి (వావి అపపా)]

పావిలి — పావలి - (వావి పా) బ్రౌ పావలి పావిలి- రెండురూపముల నిచ్చినది -
దీనిభేదములను ఇట్లు వివరించినది బుడ్డపావిలి గొడ్డుపావిలి ఫుల్లపావిలి పెద్దపావిలి

సన్నపావిలి కుక్కపావిలి బొడ్డుపావిలి (అని) సూ ని పావిలి అనియే గ్రహించి ప్రయోగము నిట్లు చూపినది- మిరియమును వెన్నయును దిన మేలి మైన తిలజమును లక్కపొడియును మలయజంబు స్వీకరింపంగ నూనె పావిలిరసంబు బుచ్చుకొనఁ బోవు బ్రదరము లోపిడిమి గను (చికి 2) (చి ని) (అని) పావలి అవియే (శ ర)

బొంగు —దీనినుండి పుట్టుముత్యములు తారకోజ్జ్వలములు (నక్షత్రప్రకాశము గలవి) విదితము గ బొంగువెదురున నొదవినమౌక్తికము తారకోజ్జ్వలము (రత్న 36) (చూ సూ ని బొంగువెదురు)

రసదాడి — (సం) రసదాలిక పుండ్రేక్షువు-అని వాచ (చూ సూ ని) ఇక్షుభేదము లను సుధ ఇట్లు పేర్కొనినది- ఇక్షుః కర్కటకో వంశః కాన్తారో వేణునిస్సృత ఇక్షు రన్యః పౌండ్రక శ్చ రసాల స్సుకుమారకః అని పుండ్రేక్షువునుగూర్చి యిట్ల నినది- పుణ్డ్రేక్షౌ పుణ్డ్రక స్స్యాత్ పౌణ్డ్రకో ఽతిరసో మధుః (అని)

రసాలము — రసాల ఇక్షు అని (అమ) అం భా రసాల శబ్దమును సముదాయావ యవన్యాయము న ఇక్షువిశేషమునం దుపయోగించిన దన వలయును

సీ ఇక్ష్వాదికాండాఖ్య యెసఁగును గడ యన
వాడె దవ యన నిక్షువగ్ర మొప్పు
గనె గండ్ర గండ్రిక గనియ యటం చన
నిక్ష్వాదిఖండము లెన్నఁ దగును
గాకిచెఱ కనంగఁ గను మన శర మగుఁ
గాశము ఱెల్లు నాఁగను దనర్చుఁ
గిక్కస యనఁగఁ బెం పెక్కును నలసంజ్ఞ
బొద యన బల్బజం బొనరు చుండ

గీ వీరణాభిధ యొరు నా వెలయు వట్టి
వేరు నాఁగ నుశీరంబు మీఱు చుండుఁ

గస వనంగను దనరుఁ గిక్కస మొదలు గఁ
గొాస్సె ద బ్బన దర్భ లగు న్మహేశ 75

గడ—ఇది ఇక్ష్వాదికాండమునకు (చెఱకు మొద లగువాని నిడు పైన కోలకు-కఱ్ఱకు) పేరు

వాడె దవ—ఇవి ఇక్ష్వగ్రమునకు (చెఱకు లో నగువానికొనకు) పేర్లు

గనె గండ్ర గండ్రిక గనియ—ఇవి ఇక్ష్వాదిఖండమునకు (ఇక్ష్వాదులముక్కకు) పేర్లు

కాకిచెఱకు కనుము—ఇవి శరమునకు (చెఱకువలె ఉండెడితృణవిశేషమునకు) పేర్లు

తెల్లు—ఇది కాశమునకు (కుందతెల్లునకు) పేరు

కిక్కస—ఇది నలమునకు (క్రోవివంటి తృణవిశేషమునకు) పేరు

బొద—ఇది బల్బజమునకు ( మెదవ అను-ఒకజాతి తృణమునకు) పేరు

బొరు—ఇది వీరణకు (అవురుగడ్డికి విడవలికి ఇంటికి కప్పెడి-ఒకజాతి గడ్డికి) పేరు

వట్టివేరు—ఇది ఉశీరమునకు పేరు

కసవు—ఇది కిక్కస మొద లగు గడ్డికి (కిక్కస-మొదలుకొని ఇట చెప్పఁబడిన తృణములకు) పేరు

కొాసె దబ్బ—ఇవి దర్భకు పేర్లు

వాడె దవ — ఇది ఒకేపద మని ఇక్ష్వగ్రము అను నర్థము నిచ్చినవి బ్రౌ శ ర లు ఇతరనిఘంటువులు వీనిని భిన్నపదముల గా గ్రహించినవి తనరు దవ యనంగఁ దల వాడె నా గ ద దగ్రమున కభిఖ్య లగు గిరీశ (ఆం సం స్థా 9) వఱు నిక్ష్వగ్ర మిల దవ వాడె యన గ (ఆంధ్ర ప అచర 66) ప్రయోగమును ఇ

ట్లున్నది  ముదురు దీవల బిగి యార మోపు గట్టి వాడెపట్టులు విఱిచి చేవలఁతి యెత్తిఁ గి  (హం  20 ) మొ  వాడె కు వాఢ' (రూపాం ) అని (వేంక )- తియ్య్రమాను కన్నులు గల్రమాను చెఱ కనంగ  దల వా దనంగ దదగ్ర మలరు (వేంక స్థా  82 )  తల కూడ పితత్పర్యాయ మగు చున్నవి పై (వేంక  ఆం సం ) శ ర సూ ని  బ్రౌ ఈ యర్థమునందు దీనిని గ్రహింప లేదు అగ్రాభిధాయక మగు తల ఒకటి ఉన్నది  ఆం  భా  ఈవర్గమునందే దానిని వచించినది (2 37 )  దానిచే ఇది గతార్థము కావచ్చును  యోగరూఢ  మనవలసినంతయావశ్యకత గల్ప్రయోగము లుండి యుండవేమో

కాశము — కాశ స్తృణే రోగభేదే అని (హైమ )  తృణవిశేషముగూడ దీని కర్థము- కాశ  స్తృణవిశేషే నా  అని (నానా )  ఈ తృణ విశేషమే ఱెల్లు

ఔరు — అవురు (రూపాం )  అవురు దర్భ యగునె? యబ్ధిలో ముంచిన (2 78 ) అని వేమన (చూ సూ ని )

కసవు —కిక్కిస మొదలు గా ఇందు వచింపఁబడినవి- నల బల్వజ వీర ణోశీరము లు ఇవి దీని కర్థ మనిపించు చున్నవి  ఇతరనిఘంటువులు తృణవిశేష వాచకము గా సామాన్యవాచకము గాఁ గూడ దీని నుదాహరించు చున్నవి-  పిల్లు  పూరి చిగిరింత యేట్రింత పౌను గు గడ్డి గఱిక పచ్చిక వెఱుతురు కసవు తుంగ  విడవలి యనఁగఁ దృణాఖ్యలు వెలయు (సాంబ స్థా  6 )  ఇట్లే (వేంక స్థా  84 )  పౌనఁగుఁ దృణాఖ్యఱు పులు నాఁ గస వనఁగాఁ బూరి యనఁగ గడ్డి యనంగా (ఆం సం స్థా 4 ) (మొ )  సాంబ కోని  తృణ  శబ్దముచే తృణవిశేషములు వచింపఁబడు చున్నవి ఆం  భా  కూడ తృణసామాన్యవాచక మిది యని పైపద్యమున (2 76 లో) వచించు చున్నది

సీ  క్షౌరతృణం బగుఁ గారె నాఁ గామంచి
కావంచి యనఁ దగుఁ గత్తృణంబు
నెంద్ర యం చన ఛత్త్ర నెగడును జివ్వర
చిప్ప నా భూస్తృణ మొప్పు రక్త

తృణము చెంగలి యన గణుతి కెక్కును గడ్డి
గాదము గవతము కసవు కవను
పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ
నలి యన నలుసన నలరు శుష్క-

గీ తృణము దుబ్బనఁగా మూల మెసఁగుఁ బుల్ల
పుడుక యనఁగను దృణకాండము చను జొప్ప
యనఁగఁ దనరును యావనాళాదిసదళ
దండనామంబు మేరుకోదండహస్త 76

కారె—ఇది క్షారతృణమునకు (ఉప్పుగడ్డికి ఒకవిధ మగుతృణమునకు) పేరు
కామంచి కావంచి—ఇవి కత్తృణమునకు (నిమ్మగడ్డికి) పేర్లు
ఎంట్ర—ఇది ఛత్త్రకు (గ్రుడ్డికామంచికి) పేరు
చిప్పర చిప్ప—ఇవి భూస్తృణమునకు (మాలాతృణమునకు సువాసన గల యొకజాతిగడ్డికి) పేర్లు
చెంగలి—ఇది రక్తతృణమునకు (ఈ పేరు గలయొకజాతిగడ్డికి) పేరు
గడ్డి గాదము గవతము కసవు కవను పుల్లు పూరి—ఇవి తృణసామాన్యమునకు (అన్నితృణములకు) పేర్లు
నలి నలుసు—ఇవి శుష్కతృణమునకు (ఎండుగడ్డికి) పేర్లు
దుబ్బ—ఇది మూలమునకు (తృణమూలమునకు గడ్డిదుబ్బునకు) పేరు
పుల్ల పుడుక—ఇవి తృణకాండమునకు (పూరిపుడుకకు) పేర్లు
చొప్ప—ఇది యావనాళాదిసదళదండమునకు (ఆకులతో కూడినజొన్నదంటు మొద లగువానికి) పేరు

క్షారతృణము—ఉప్పుగడ్డి తృణవిశేషముల వచించుచ తొప్ప ఒంట్రింత సాలువ

యుప్పుగడ్డి పరకి ముల్లూచి మొదయము బైటితుంగ మొదళు గా బూరి రవణింపఁ బొదలు వెడలు అనినది ప్రబంధ (20 ) (చూ సూ ని అంత్రింత )

పుడుకి —పుడకి (వావి పా ) శ ర పుడుక గ్రహించి పుడక అని వాడుక అని వ్రాసినది సూ ని ఎుడుక గా ఆం భా పార మిచ్చి ఇట్లను చున్నది ఆం భా లోను కొన్ని ముద్రిత ప్రతులలోను ఈపదము ఉన్మధ్యము గా నున్నను వ్యుత్పత్తినిఁబట్టియు చి ని శ ర ల మతముల బట్టియు ఉన్మధ్య మగుట యుక్తము నిర్ధారకప్రయోగములు గాన రాలేదు (అని ) నిర్ధారకప్రయోగములు దేనికిని లే వను చున్నది (సూ ని ) కమక (వావి పా పారాం ) అనవచ్చును ప్రయోగవిరుద్ధము కానప్పుడు వ్యవహారమును ా దనదు (ఆం భా ) శైలి

[సదళ — సదన (వావి అపముద్రి )]

సీ యావనాళాదిదండాఖ్య దంటన మీఱుఁ
 బచ్చిక యనఁ జను బాలతృణము
వామి యటంచన వఱలును దృణతతి
 తోంట యనంగఁ దద్ముఖము దనరు
వంద వదియ వందె వదె యంచనఁ దృణ
 తతివిశేషం బొప్పుఁ దా దనంగఁ
దాళాఖ్య యగు బాలతాళాఖ్య బొంద నాఁ
 బరఁగుఁ గ మ్మనఁ దాళపర్ణ మెసఁగుఁ

గీ దత్పుటం బౌను బోట యనఁ దాళపు టనఁ
బత్త్రవృంతంబు మట్ట నా వఱలు మోవు
నాఁగఁ దాళాగ్రతరుణపర్ణంబు చెలఁగుఁ
దాళపేశంబు గుం జనఁ బోలు నభవ 77

దంటు—ఇది యావనాళాదిదండమునకు (జొన్న మొద లగువానికాడకు) పేరు
పచ్చిక—ఇది బాలతృణమునకు (పచ్చికసవునకు శాదమునకు) పేరు

వామి—ఇది తృణతతికి (గడ్డిమేటికి) పేరు

తొంట—ఇది వామియొక్క మొదలికి పేరు

వంద వదియ వందె వదె —ఇవి తృణతతివిశేషమునకు(ఒకవిధ మైనగడ్డి పోవు నకు ఒకవిధ మైనవామికి) పేర్లు

తాడు—ఇది తాళమునకు (తాటిచెట్టునకు) పేరు

బొంద—ఇది బాలతాళమునకు (లేఁతతాటిచెట్టునకు) పేరు

కమ్మ—ఇది తాళపర్ణమునకు (తాటియాకునకు) పేరు

బొట తాళపుటి—ఇవి తాళపత్త్రపుటమునకు (తాటియాకుదొప్పకు) పేర్లు

మట్ట—ఇది పత్త్రవృంతమునకు (ఆకుతొడిమకు) పేరు

మోపు— ఇది తాళాగ్రగతరుణపర్ణమునకు (ముడుత వీడనితాటియాకుమొలకకు) పేరు

గుంజు—ఇది తాళపేశమునకు (తాటిమోవికి అడుగున మెత్తగా పిండివలె ఉం డెడిదానికి) పేరు.

తాడు — (సం తాళ ప్రా తాలు ) (బ తాడులు తాటిలు తాళ్లు ) తాడి (రూపాం ) తా దనంగను దాడి నాఁ దాళభూరు హంబునకు నాఖ్య లై యొప్పు' (అం సం స్థా 6 ) తాడి ద న్నెడువానిం దల దన్నువా డు గల డన్వేషింప నం చెంచితిఁగా' (కలా 2 87 ) (చూ సూ ని )

తాళపుటి — శ ర సూ ని గ్రహింప లేదు పుట్టికి (రూపాం ) పుటి అన వచ్చును బుట్ట పుట్టిక పుట్టి పుటిక యన గఁ దనరుచు బిటకంబు అని (ఆం భా 2 240 ) ( పుటి వంటిది-దొప్ప )(తాళము- పుటి ) (లేదా) పాండవబీడు లో నగు వానివంటి దిది తాళపుట' అనియే గ్రహించినది బ్రౌ (చూ అను )

మట్ట — కొబ్బరిచెట్టు తాటిచెట్టు లో నగువానికొమ్మ అనునది (అర్థాం ) నారికేళంపుమట్ట నెన్నడిమిచాయ దళములందునుబొలె సంతతముఁ బాఱు వేణికాసారణులయందు విస్మ

యము గ జగతి నెక్కుడి వేలెటిసాటినదులు (భీమ 2 53) (మా సూ ని)
ప్రయోగజుష్టము లైనను సుప్రసిద్ధార్థముల నుపేక్షించి అం ఖా కర్త విశేషార్థములనే సంగ్రహించు ననుట కిది యొకనిదర్శనము ఇచ్చట శ రి - మట్ట- తాటిచెట్టు మొదలగువానికొమ్మ లని అర్థము చెప్పి ఇందులకు ప్రమాణము గా మట్ట గీసెడికత్తిఁ బట్టుబెబ్బులిచేత బిసుకఁ జేసెర దీవిబిగువుగుబ్బలు (సురా 59) అనుదాని నుదాహరించినది చెట్టును గీయుదురుగాని (కల్లనకై) కొమ్మను గీయరు ఇట చెట్టే అర్థమనవలసి యున్నది ఉందులకే కావలయును సూ ని మట్ట - తాడి మొదలగుచెట్టు చిన్నచెట్టు అనునర్థము చెప్ప అందులకు ఇది ప్రమాణ మను చున్నది శబ్దార్థనిర్ణయమున ఇట్టిప్రమాదము లచ్చటచ్చట శ ర లోఁ గానవచ్చు చున్నవి
మోవు — మొవ్వు మొవు (రూపాం) (భాను 2 68) - (కవిక 6 209) అని (సూ ని)

సీ. తాళాదికళలాటు తనరు బొండ్లమనంగఁ
గెంగటం చనఁగఁ జెలంగుఁ దాళ
బీజాభిధానంబు రాజిలు నారికె
డంబు టెంకాయచె ట్టనఁగ నాళి
కేరనామం బెళనీ రటం చనఁ జనుఁ
దచ్ఛలాటుజలము తత్ఫలంబు
టెంకాయ యనఁగ రూఢి గనుఁ గొబ్బె రనఁ గొ
బ్బెరం యటం చనఁగ దత్ఫ్రళ మెసఁగుఁ

గీ బోఁక యనఁ బోఁకప్రమా ననఁ బూగ మొనరుఁ
బోఁక యనఁగను వెలయును బూగఫలము
ఖండితము లైనయవియు వక్క లనఁ దగును
నలరు హింతాళ మీఁదా డనంగ నభవ 78

బొండ్లము—ఇది తాళాదికళలాటువునకు (తాటి కొబ్బెరలకాయకు) పేరు

తెంగట—ఇది తాళబీజమునకు (తాటిటెంకకు) పేరు

నారికెడము టెంకాయచెట్టు—ఇవి నాళికేరమునకు (కొబ్బెరచెట్టునకు) పేర్లు

ఎళనీరు—ఇది కొబ్బెరకాయనీటికి పేరు

టెంకాయ—ఇది నాళికేరఫలమునకు (కొబ్బెరపండునకు కొబ్బెరకాయకు) పేరు

కొబ్బెర కొప్పెర—ఇవి నారికేళపేశమునకు (కొబ్బెరలోనిభోజ్యపదార్థమునకు) పేర్లు

పోఁక పోఁకమ్రాను—ఇవి పూగమునకు (క్రముకమునకు పోఁకచెట్టునకు) పేర్లు

పోఁక—ఇది పూగఫలమునకు (పోఁకపండునకు) పేరు

వక్కలు—ఖండితములైనపూగఫలములకు (పోఁకచెక్కలకు) పేరు

ఈఁదాడు—ఇది హింతాళమునకు (గిఱకతాటిచెట్టునకు) పేరు

టెంకాయ—దీనికి కొబ్బెరపండు అని వ్యవహారము గూడ గవులలోఁ గలదు- ప్రొయికు - లొనర్తు చక్కెర కొబ్బెరపండు లుంగ్రడముల్ మెక్కెడు పాఁపజం దెములమేటికి (నీలా 7)

బొండ్లము — బొండము బొండలము బొంతాము-(రూపాం) శ ౨ ఎళనీటి బొండలంబు లువోలె మెద డెల్ల జుట్టి వైచిన-త్తెగములు (ఆము 6 7) ఇచ్చి ఎడనీటి బొండ్లాల వడువున ఒని యిట మఱియొకపాఠ మున్నదని బొండ్లాము కూడ ప్రమాణ మనినది బొండలము- టెంకాయమీ దిబొసికి అని అర్థ మని ఈ ప్రయోగము ౨చ్చినది (శ ర) శ ర తన యర్థముఁకై ఇచ్చిన పైపాఠముకద ఎళనీటిబొండలములు-లేఁత బొండ్లాపుకాయలు- అనియే టీక వ్రాసినది ట్రొ (మా ట్రొ బొండము) ఈ ట్రొటీకయే ఇట యుక్త మనిపించు చున్నది మెద డంతయు జుట్టి వైపఁ గా బరువు లేని పై కొబ్బెర పట్టని తియ్యని నీరు మాత్ర మున్న లేతటెంకాయలట్లు బరువు లేని పై పుఱ్ఱెలు గాలికి ఊరక దొర్లు చున్నవి- అని ఇట సమన్వయము వేద వ్యా ఇ ట్లను చున్నది- ఎలనీటి బొండములు వోలెఁ- లేఁతనీ రుండిన పై ఒలువకయే తల గొట్టినలేత టెంకాయల వలె- (అని) ఏ మైనను (బొండ్లము- టెంకాయ

మీ ది టొసికి (తోలు) లన నక్కలు లే దనిఎంచు చున్నది మఱియొక విశేషము శర ఎడనీరు అనుదానికి రెండవయర్థము గా ఎడనీటికాయ అర్థమిచ్చి ఎడనీరటం చన దగు దప్పలాటువు (ఆం భా ద్వి వ ) అను చున్నది ఈ యర్థమున కింతకంటె మఱి ప్రమాణము లేదు బ్రౌ కూడ ఎడనీరు- నారికేళశలాటు లేతటెంకాయ లనినది ఈ బ్రౌ లధారము గా గొనియే శర పై విధమున వ్రాసిన దనిపించును బ్రౌ ఆం భా పా ఇచ్చట ఎట్టిదో వారిసమన్వయ మేరీతి దో యెఱు గ రాదు ఇట్టిపాఠములవలనను సరి గా పూర్వాపరములు సమన్వయింప మిని ఆం భా చాల వాఱుమారై దుర్గ్రహ మైనది

ఉ కేరును గేతకి న్మొగలి గేదఁగి యం చనుపేరు లొప్పు ఖ
ర్జూరము గజ్జురం బన గ శోభిలు నీఁ దన నీఁత నాఁగ ఖ
ర్జూరిక తాడి మున్నగుతరు ల్పులుప్రమాఁకు లనంగఁ బోలు నీ
హారగిరీంద్రజాహృదయహర్మ్యగతీ త్రిశిరఃపురీపతీ 79

మొగలి గేదఁగి—ఇవి కేతకికి పేర్లు

కజ్జురము—ఇది ఖర్జూరమునకు (పేరీఁదునకు కజ్జురపుఁజెట్టునకు) పేరు

ఈఁదు ఈఁత—ఇవి ఖర్జూరికకు (ఈఁతచెట్టునకు) పేర్లు

[ తాడి మున్నగుతరుల్ పులుప్రమాఁకులు — తాటిచెట్టు మొదలు గాఁ గలవి- (తాడి కొబ్బెర పోఁక ఈఁదాడు మొగలి కజ్జూరము ఈఁత- అనునవి తృణవృక్షములు తృణజాతికి చెందినచెట్లు అమర మీసందర్భమున ఇట్లనినది (నాళికేరము పూగము- ముందు చెప్పి) ఏతే హిన్తాలసహితా స్త్రయః ఖర్జూరః కేతకీ తాలీ ఖర్జూరీ చ తృణద్రుమాః (అని) ఇవి యొక్కొక్కటి తృణద్రుమభేదమునకు చెందినవి ఆం భా గూడ అమరము తృణద్రుమము లనినవానినే పైరీతిని పులుప్రమా కు లనినది ]

గీ శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగును వనౌషధీనామవర్గ మిట్లు

గైకొనుము దీని భక్తసంఘాభిమాని
మాతృభూత జగత్త్రయీమాతృభూత 80

[వ్యాఖ్యకై చూ స్వర్గ 68 ]

ఇది

వనౌషధివర్గము

---

